Regd. No. A. 136.

# ఆంధ్రప్రదేశ్

: 7 సంచిక : 5

మార్చి, 1963

ఫాల్గుణ - చైత్ర

1884 - 85 శకం

అనుబంధితమైన

విద్యాసంచికతో సహా



*శిక్షణ పొందిన దళపతులు :* విశాఖపట్నం జిల్లా కణితి బ్లాకు కార్యాస్థానంలో 1963 జనవరి 19 వ తేదీనుంచి 24 వ తేదీవరకు గ్రామీణ స్వచ్ఛంద దళం దళపతులకు శిక్షణ ఇచ్చారు.



**పోలీసు అధికారులకు అవార్డులు :** యీ సంవత్సరం సికింద్రాబాదులో జరిగిన రిపబ్లిక్ దినోత్సవ విన్యాససందర్భంలో ఆంధ్రప్రదేశ్ గవర్నరు, మన రాష్ట్రానికి చెందిన 7 గురు పోలీసు అధికారులకు పతకాలను బహూకరించారు.

'ఆంధ్రప్రదేశ్' పాఠకులకు

ఈ సంచికనుంచి నూతనాకర్షణలు!

★ విశేషాలు - వ్యాఖ్యలు

★ అనువాద భారతి

★ ఏరిన ముత్యాలు

★ లలనావనం

త్వరలోనే

మరికొన్ని కొత్త శీర్షికలకై

యెదురు చూడండి!

# విషయసూచిక



ముఖ చిత్రం : తింటూ ఆట.

అట్ట వెనుక చిత్రం : తారలతో ఒకరాత్రి : సుప్రసిద్ధ సినీతారలు జాతీయ రక్షణనిధి సహాయార్థమై హైద్రాబాదులో 1953 ఫిబ్రవరి17వ తేదీన యిచ్చిన ఒక బ్రహ్మాండమైన ప్రదర్శనలో తమ సంగీత, నృత్య, గాన, హాస్యనటనలతో అసంఖ్యాక ప్రేక్షకులను ముగ్ధులనుచేశారు.



# అజాత శత్రువు, అకలంకుడు, రాజర్షి డాక్టర్ రాజేంద్ర

స్వాతంత్ర్య సమర యోధుడు, అచంచల అకలంక దేశభక్తుడు, అజాత శత్రువు, మహాత్మాగాంధీ ప్రథమ ప్రముఖశిష్యుడు, మహామేధావి, పరమ కారుణికుడు, మహారచయిత, భారత ప్రథమరాష్ట్రపతి, భారత రత్న, రాజర్షి డాక్టర్ రాజేంద్ర ప్రసాద్ పాట్నాలోని సదాకత్ ఆశ్రమంలో అకస్మికంగా నిమోనియా వ్యాధిసోకి ఫిబ్రవరి 28వ తేదీ రాత్రి గం॥ 10-15 నిమిషాలకు నిర్యాణం చెందారు. లక్షలాది ప్రజలు సజలనయనాలతో తిలకించగా మార్చి 1వ తేదీ ఉదయం గంగా తీరంలో సమస్త అధికార లాంఛనాలతోనూ, అంత్యక్రియలు జరిగాయి.

## రాష్ట్రపతి సంతాపం

"డాక్టర్ రాజేంద్రప్రసాద్ ఆకస్మికంగా గతించారన్న సంగతి నాకూ దేశానికీ కూడా పిడుగుపాటుగా తెలియ వచ్చింది. మొన్న యీమధ్యనే యీ నగరం వారికి అనురాగ పూర్వకమైన వీడ్కోలు చెప్పివున్నది. దేశభక్తులలో అగ్రగణ్యుడు స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొన్న నిస్వార్థ సేవకుడు అయిన ఆమహనీయుడు నాకుఆప్తమిత్రుడు, ఆయన మృతికి జాతి యావత్తూ రోదసిల్లుతున్నది. ఆయన త్యాగపూరితమైన సేవను దేశం కలకాలం జ్ఞాపకం వుంచుకుంటుంది. ఆయన జీవితం మనకు మార్గదర్శకం కావాలి" అని డా. రాజేంద్ర ప్రసాద్ నిర్యాణం చెందారన్న వార్త వినగానే రాష్ట్రపతి డా. సర్వేపల్లి రాధాకృష్ణ శ్రీ రాజేంద్రప్రసాద్ కుమారుడు మృత్యుంజయ ప్రసాద్ కు సంతాప సందేశం పంపారు.

## ప్రధాని అనుతాపం

ప్రధానమంత్రి నెహ్రూ తమ సందేశంలో రాజెన్‌బాబుకు ఈ విధంగా జోహారు లర్పించారు. "బాబూ రాజేంద్రప్రసాద్ కాలధర్మం చెందారని విని చాలా విచారించాను. త్వరలోనే ఒకసారి వెళ్ళి వారి దర్శనం చేసుకొని వద్దామని అనుకొంటూ వుండగా ఈవార్త అశనిపాతంవలెవచ్చింది. వారి మృతితో గాంధిజీకి అత్యంత సన్నిహితుడైన మన మహానాయకులలో ఒకరు మనకు దూరమై పోయారు. స్వాతంత్ర్య సమరంలో వారు వహించిన ప్రముఖపాత్ర మన చరిత్రలో ఒకఉజ్వలమైన అధ్యాయం. ఆ తరువాత వారు రాజ్యాంగ పరిషత్తుకు అధ్యక్షులైనారు. అందుకు వారి కంటే అర్హులు లేరు. దరిమిలాను మహోన్నతమైన రాష్ట్రపతి పదవి నధిష్ఠించి గణ్యత గడించారు. గతంతో కల బంధాలు క్రమంగా అంతరించి పోతాయి. మిగిలి వున్నవారు భారాన్ని భరించటం అగత్యం.

పరిపూర్ణమైన వివేకంతో, సాధు స్వభావంతో ఇన్నేండ్లూ మనకు సాహసోపేతమైన నాయకత్వం సమకూర్చిన రాజేంద్రబాబు మనకు చిరస్మరణీయులు. వారి కివే నా జోహారులు."

కేంద్ర రాష్ట్ర ప్రభుత్వ కార్యాలయాలన్నిటికీ మార్చి 1వ తేదీన సెలవు ప్రకటించి 7 రోజులు సంతాప దినాలుగా ప్రకటించారు.

## జీవిత చరిత్ర

నిండైన విగ్రహం. గుబురు మీసాలు నిరాడంబరత్వం, అత్యున్నత మానవతా దృష్టి వుట్టిపడే నేత్రయుగ్మం-రాజెన్‌బాబును చూడగానే ఎవరికైనా పూజ్య భావం కలుగుతుంది.

ఆయన బీహార్ రాష్ట్రంలోని సారన్ జిల్లాలోగల జీరాదేయి అనే గ్రామంలో 1884 డిసెంబరు మూడవ తేదీన-జాతీయ కాంగ్రెసు జననానికి సంవత్సరం పూర్వం జన్మించారు.

విద్యార్థిగాకూడా రాజెన్‌బాబు విశేషమైన ప్రతిభావిశేషాలు ప్రదర్శించారు. చిన్నప్పటి నుంచి ఆయన సచ్ఛీలం, మానవతాదృష్టి నిరాడంబరత్వం మున్నగు సద్గుణాలకే ప్రాధాన్య మిచ్చారు. అందువల్లనే ఆయన భావి భారతంలో ప్రముఖ వ్యక్తి కాగలరని ఆయన ఉపాధ్యాయులు భావించారు. ఆశించారు. ఆ ఆశను ఆయన ఫలింప జేశారు.

రాజెన్‌బాబు కలకత్తా విశ్వవిద్యాలయంలో ఎం. ఎ. ఎం. ఎల్. పట్టాన్ని స్వీకరించారు. అప్పట్లో బీహార్ బెంగాల్‌లో భాగంగా వుండేది.

అప్పట్లో రాజేంద్రప్రసాద్ అభిప్రాయం ఇంగ్లండ్ వెళ్ళి ఐ. సి. యస్. చదివి రావాలని, అయితే, కుటుంబం అందుకు వ్యతిరేకించడంతో ఆయన ఆ అభిప్రాయాన్ని విరమించుకొన్నారు.

చిన్నప్పుడే కన్నతండ్రిని కోల్పోయి నందున రాజెన్‌బాబు అన్నగారి ఆదుపులో పెరిగారు. అందువల్ల ఆయనపై అన్నగారి ప్రభావం అధికం. తన తమ్ముడు కలకత్తా హైకోర్టు జడ్జి కావాలని అన్నగారి ఆశ.

# దేశభక్తుడు, ప్రథమ రాష్ట్రపతి ప్రసాద్ నిర్యాణం

ఈ విధంగా హైకోర్టు జడ్జి కాగలరని అనుకొన్న రాజెన్‌బాబు గాంధీజీ అనుచర వర్గంలో అగ్రేసరుడైనాడు.

రాజెన్‌బాబు కొంతకాలం న్యాయశాస్త్రాధ్యాపకుడుగా పనిచేశారు. అందువల్లనే, ఆయనలో విషయవివరణా నైపుణ్యం, ఓరిమి, ఇతరులు చెప్పేది సానుభూతితో వినే సహనం వున్నాయి.

## న్యాయవాదిగా రాజెన్‌బాబు

రాజెన్‌బాబు 1911లో న్యాయవాదవృత్తిలో ప్రవేశించారు. ప్రఖ్యాత ముస్లింన్యాయవాది ఖాన్ బహదూరు హుడా వద్ద ఆయన తన వృత్తిని ప్రారంభించారు. కోర్టులో రాజెన్‌బాబు ప్రథమ ప్రవేశం జడ్జి సర్ అసుతోష్ ముఖర్జీని ముగ్ధులను చేసింది.

దానితో ఆయన ప్రముఖ న్యాయవాదిగా పేరొందారు. 1911 నుంచి 1916 వరకు కలకత్తా హైకోర్టులోను, 1916 నుంచి 1920 వరకు పాట్నాలోను ప్రాక్టీసుచేశారు. న్యాయవాదిగా రాజెన్‌బాబు కలకత్తా, పాట్నాలలో పేరు ప్రఖ్యాతులు సంపాదించారు.

## ప్రముఖ సత్యాగ్రహి

బీహార్‌లోని చాంపరాన్ రైతులు జరిపిన నీలిమందు సత్యాగ్రహంలో రాజెన్‌బాబు ప్రముఖపాత్ర నిర్వహించారు. రైతుల తరఫున రాజెన్‌బాబు నడిపిన పోరాటం యావద్భారతాన్ని ఆకర్షించింది. అక్కడితో ఆయన గాంధీజీకి ఆంతరంగికులలో ఒకరైనారు.

తదాది ఆయన గాంధీజీ నిర్మాణ కార్యక్రమాలలో నిమగ్నులై తన జీవితాన్ని కాంగ్రెసు సంస్థకే అంకితం చేశారు.

పాట్నా పురపాలక సంఘాధ్యక్షులుగా ఆయన స్థానిక సంస్థలు ఆదర్శంగా ఎలా నిర్వహించబడాలో నిరూపించారు.

1934లో వచ్చిన బీహార్ భూకంపం సందర్భంలో ఆయన బాధితులకు ఎనలేని సేవ చేశారు.

బీహార్ రాష్ట్ర కాంగ్రెస్ అధ్యక్షులుగాను, అఖిల భారత కాంగ్రెస్ కార్యదర్శిగాను ఆయన కాంగ్రెస్ సంస్థకు చేసిన సేవ అనల్పం.

## కాంగ్రెసు కార్యకర్త

తిరిగి 1911లో మహాసభ కలకత్తాలో జరిగినపుడు రా జె న్ బా బు లాంఛనంగా కాంగ్రెస్‌లో చేరారు. అప్పుడే ఎ.ఐ.సి.సి. సభ్యునిగా ఎన్నికయ్యారు.

కాంగ్రెసు సంస్థకు ఆయన చేసిన సేవలకు పరిగణనగా 1934లో బొంబాయిలో జరిగిన కాంగ్రెసు మహాసభకు ఆయనను అధ్యక్షులుగా ఎన్నుకొన్నారు. కాంగ్రెసు అధ్యక్షులుగా ఆయన దేశమంతటా పర్యటించి కాంగ్రెసు సందేశాన్ని ఊరూరా వినిపించారు.

ఆ తర్వాత కాంగ్రెసు అధ్యక్ష పదవిలో ఎప్పుడు ఖాళీ వచ్చినా అజాతశత్రువైన రాజెన్‌బాబు తాత్కాలికంగా ఆ బాధ్యతను స్వీకరించేవారు. ఆయన కాంగ్రెసుకు ఆపద్ధర్మపు అధ్యక్షులు.

1939లో శ్రీ సు బా స్ చం ద్ర బో స్, 1947లో ఆచార్య కృపలానీ కాంగ్రెసు అధ్యక్ష పదవికి రాజీనామా చేసినప్పుడు రాజెన్‌బాబే ఆ పదవిని స్వీకరించి జయప్రదంగా నిర్వహించారు.

గాంధీజీ నాయకత్వాన కాంగ్రెసు నడిపిన వివిధ ఉద్యమాలలోనుపాల్గొని, రాజెన్‌బాబు అనేకసార్లు జెయిలుకువెళ్ళి, పెక్కు సంవత్సరాలు కారాగారవాస శిక్షలు అనుభవించారు.

## జాతీయ రాజ్యాంగ నిర్మాత

1946 సెప్టెంబరు రెండవ తేదీన శ్రీ జవహర్‌లాల్ నెహ్రూ నాయకత్వాన ఏర్పడిన తాత్కాలిక జాతీయ ప్రభుత్వంలో డా॥ రాజేంద్రప్రసాద్ ఆహారశాఖ సభ్యుడుగా నియమింప బడ్డారు.

1946 డిసెంబరులో రాజ్యాంగ పరిషత్తు అధ్యక్షులుగా ఎన్నుకోబడి, ఆ పదవిని అత్యంత ప్రతిభావంతంగాను, దక్షతతోను నిర్వహించి, స్వతంత్ర భారత రాజ్యాంగ రచనలో రాజన్‌బాబు ప్రముఖపాత్రవహించి ఈ దేశ చరిత్రలో శాశ్వతమైన స్థానాన్ని సంపాదించుకొన్నారు.

1950 జనవరి 26వ తేదీన ఇండియా రిపబ్లిక్‌గా అవతరించింది. రాజెన్‌బాబే రిపబ్లిక్ అధ్యక్ష పదవిని అధిష్ఠించాలని కాంగ్రెస్ అధిష్ఠానవర్గం నిర్ణయించింది. ఈ నిర్ణయానికి భారతీయులేగాక యావత్ప్రపంచ పౌరులూ హర్షించారు.

తదాదిగా 12 సంవత్సరాలపాటు భారత రిపబ్లిక్ ప్రథమ అధ్యక్షులుగా, స్వతంత్ర భారత రాజ్యాంగాధినేతగా చిరస్మరణీయమైనసేవ చేశారు.

ఇండోనీసియా, సోవియట్ రష్యా మున్నగు విదేశాలలో పర్యటించారు. సర్వోదయ సిద్ధాంతాలపట్ల రాజెన్‌బాబుకు అపారమైన అభిమానం. 1961లో ఉంగుటూరులో జరిగిన సర్వోదయ సమ్మేళనంలో ఆయన పాల్గొన్నారు.

1950, 52, 57 సంవత్సరాలలో వరుసగా మూడు సారులు ఆయన రాష్ట్రపతి పదవిని అలంకరించారు. రాజెన్‌బాబు ఎంత గొప్ప వక్తయో, అంత చక్కని రచయిత కూడా. గాంధీజాన్ని గురించి ఆయన పెక్కు గ్రంథాలు రచించారు.

అర్ధ శతాబ్దికి పైగా వివిధ రంగాలలో దేశసేవ చేసిన రాజెన్‌బాబు గత ఏడాది రాష్ట్రపతి పదవి నుంచి విరమించిన సమయంలో కొత్తరాష్ట్రపతి ఆయనను "భారత రత్న" బిరుదుతో సత్కరించారు.

"అజాత శత్రువు" అయిన రాజెన్‌బాబు అక్షరాలా "భారత రత్నమే".

## ముఖ్యమంత్రి లేఖ

ప్రియమైన చదువరీ!

మన రాష్ట్రంలో కొంతకాలంగా భారీ విద్యుత్పరికరాల ఫ్యాక్టరీ నిర్మాణాన్ని ఉపసంహరించుకుంటున్నారని బయలుదేరిన వార్తకు సంబంధించిన రగడ సమసిపోవడం మనం చూశాం. యీ ఫ్యాక్టరీ నిర్మాణం యథాతథంగా కొనసాగుతుందని నేనిప్పుడు మీకు చెప్పడానికి సంతోషిస్తున్నాను. ఉపసంహరించుకుంటున్నారనే వార్త, ఫ్యాక్టరీని సవరిస్తున్నారనిగా మార్పు చెందింది. దీనివల్ల కొంత కాలహరణం మాత్రం జరగవచ్చు. పెద్ద తరహాకు చెందిన ఇటువంటి కర్మాగారాల విషయంలో అసలు ప్రణాళిక, దాని అంచనాలు ఎప్పుడూ తుదివిగా ఉండవు. ప్రతి దశలోనూ నిపుణులు వీటిని పరిశీలిస్తూ అవసరమైన మార్పులు, చేర్పులు చేస్తూ ఉంటారు. యీ కర్మాగారం విషయంలో కూడా 25 (మొదటిదశ) నుంచి 60 (రెండవదశ) మెగావాట్లటర్బన్లను తయారుచేయాలనే అసలు పథకాన్ని నిపుణులు 60 మెగావాట్లకు పెంచారు. ఆ తర్వాత మళ్ళీ 100 మెగావాట్ల టర్బన్లను తయారుచేయాలని ఉద్దేశించారు. దీనివల్ల సాంకేతిక సమస్య తలెత్తి కర్మాగారానికి సంబంధించిన రిపోర్టులో రెండు సవరణలు చేయవలసి వచ్చింది. దీనికి ఎక్కువ ఖర్చు, ఇతోధికంగా విదేశీ సహాయం అవసరం కావచ్చు. యీ కర్మాగారం నిర్మాణంలో సహాయ సహకారాలను అందజేస్తున్న చెకొస్లొవేకియా వారితో యీ విషయంలో సంప్రదింపులు జరుగుతున్నాయి. రెండవ దశలో 100 మెగావాట్లటర్బన్లను తయారుచేయడానికి వారు అంగీకరించారు. మొదటి దశలో 60 మెగావాట్లటర్బన్లను తయారుచేయడం జరుగుతుంది. యీ ఫ్యాక్టరీ నిర్మాణానికి ఏ విధమైన భంగమూ వాటిల్లదనీ, ఆందోళనకు యే విధమైన ఆస్కారం లేదనీ ప్రధానమంత్రీ, దీనికి సంబంధించిన కేంద్ర మంత్రీ మనకు హామీలు ఇచ్చారు.

నదీ జలాలకు సంబంధించిన వివాదం తిరిగి మరోసారి తలయెత్తింది. మన చరిత్రలో ఏర్పడిన ఇటువంటి సమయంలో ఆంతరంగిక వివాదాలకు మనం ఏవిధంగానూ స్థానం కల్పించలేము. మన కనీస అవసరాలను గురించీ, ఒప్పందాల పవిత్రతను గురించీ, భారత ప్రభుత్వానికి మనం తెలియజేశాము. శ్రీశైలం, పోచంపాడు, నాగార్జునసాగర్ ప్రాజెక్టుల నిర్మాణాలకు ఆలస్యం జరగనివిధంగా యీ విషయాలను పరిశీలించి చేసే నిర్ణయం మనకు అంగీకారయోగ్యం కావచ్చు. శ్రీశైలం, పోచంపాడు, నాగార్జునసాగర్ ప్రాజెక్టులు మన కనీస అవసరాలు. అవి మనకు అతి ముఖ్యమైనవి, మన అధికార పరిధిలోనివి అన్న విషయాలను అందరూ అంగీకరించారు.

ఢిల్లీలోని మన నిపుణులు, నాయకులు సముచితమైన పరిష్కార మార్గాన్ని కనుగొంటారనే నా నమ్మకం.

లోగడ అనేకసార్లు చెప్పినట్లుగా మన పారిశ్రామిక అభివృద్ధికి సంబంధించిన లఘుపథకాల అమలుకు – ఆ మాటకొస్తే ప్రణాళికలో నిర్దేశించిన మన ఇతర ముఖ్యమైన అభివృద్ధి పథకాల అమలుకు ఆత్యయిక పరిస్థితివల్ల భంగంకలుగరాదు. యీ బాధ్యతల నన్నింటినీ సక్రమంగా నెరవేర్చడానికి సాధ్యమైన అన్ని మార్గాలనుంచి మనం డబ్బు సేకరించవలసిన అవసరం ఎంతైనా ఉన్నది. దేశం మొత్తంలో దీనికై చేస్తున్న ప్రయత్నాలు మీ కందరకూ తెలిసినవే. మనదేశానికి అవసరమైన దీర్ఘకాలిక ప్రయోజనాల దృష్ట్యా ప్రజల స్వచ్ఛంద ప్రయత్నాలకుతోడు ఉత్తరోత్తరా ఎక్కువ విరాళాలు ఇవ్వడానికి మనం సిద్ధంగా ఉండాలి.

ఉదాహరణకు, మన రాష్ట్రంలోని విద్యుచ్ఛక్తి అధిక రేట్లను గురించి ఒకరు నన్ను అడిగారు. ఎక్కువ విద్యుచ్ఛక్తి కావాలనీ, నమ్మకంగా సరఫరా చేయాలనీ నేడు అడుగుతున్నారు. ఉత్పాదక శక్తిని పెంచడంద్వారానూ, ఆధునిక జనరేటర్ల నిర్వహణద్వారానూ, యీ అవసరాలను మనం తీర్చుకోవచ్చు. దీనిని అందరూ హర్షించినప్పుడు, విద్యుచ్ఛక్తి బోర్డు క్రొత్తగా రేట్లను పెంచినందుకు ఎవ్వరూ ఆక్షేపణ తెల్పరనే నా విశ్వాసం. ఈ రేట్లు మన పొరుగు రాష్ట్రాల్లో ఉన్న రేట్లకు సమానంగానే ఉన్నాయి.

ఈ ప్రాథమిక సౌకర్యాన్ని ఎక్కువ మంది ప్రజలకు విస్తరింపచేయడానికి యీ చర్య ఎంతో అవసరం. వాస్తవంగా మన మొత్తం ప్రణాళికల ముఖ్య ఉద్దేశ్యం కూడా

ఇదే. మంచి గృహవసతి, విద్యుచ్ఛక్తి, నీటి సరఫరా, ఆరోగ్యం, పారిశుద్ధ్యం — ప్రజల సుఖ సంతోషాలకు అవసరమైన అన్ని వస్తువులనూ లభింపజేయాలి. ఇది ప్రభుత్వం, ప్రజల సమిష్టికృషి. ఎక్కువ వేతనాలనూ, ఎక్కువ ఆదాయాన్నీ పొందుతున్న అన్ని స్థాయిలలోని గ్రామీణ, పట్టణ ప్రజలూ యీ కృషిలో వారి పాత్రను సక్రమంగా నిర్వహించాలి. నగరంలో ఇటీవలే ఒక కాలనీని ప్రారంభించే అవకాశం నాకు కల్గింది. అక్కడ ఒక విషయాన్ని నేను నొక్కి చెప్పడానికి ప్రయత్నించాను. హౌసింగ్ కాలనీలలో నివసించే ప్రజలలో, అధికారులు బలవంతంగానైనాసరే పారిశుద్ధ్యాన్ని అమలు జరపాలని నేను చెప్పాను. ప్రజలు తాము నివసించే క్వార్టర్లనూ, పరిసర ప్రాంతాలనూ పరిశుభ్రంగా ఉంచే బాధ్యతను గుర్తించేట్లు చేయాలనే నా భావం. యీ విధంగా చేయడంద్వారా నగరంలో ప్రజారోగ్యానికి ఏర్పడే ప్రమాదాన్ని నివారించాలి. ఇతరులు జాగ్రత్తగా ఉండే విధంగా ఇటువంటి కాలనీలలో తమ ఆవరణలను మురికిగా ఉంచే క్రొత్త కిరాయిదార్లను అధికారులు తొలిగించాలి. అయితే అటువంటి కఠినచర్య అన్ని చోట్లా సాధ్యంకాదు. మనకు సంబంధించినంతవరకు మన రాష్ట్రంలో హైద్రాబాదులోనేకాక అన్ని పట్టణాలలోనూ, పల్లెలలోనూ సైతం మురికి వాడలను నిర్మూలించి ఉత్తమ గృహాలను నిర్మించేందుకై తగిన కృషి చేయాలి. ఈ విధంగా చేస్తున్నప్పుడు గృహనిర్మాణాలను పూర్తిగా వినియోగించుకోడానికి వీలుగా ప్రజలుకూడా పరిశుద్ధతనుఆరోగ్యకరమైన అలవాట్లను పెంపొందించుకొని సహాయపడాలి.

నేను రాష్ట్రంలో పర్యటిస్తున్నప్పుడు, స్థానికంగా అత్యవసరంగా కావలసిన ఓవర్ బ్రిడ్జీలు, రోడ్లు, గ్రంథాలయ భవనాలు మొదలైన వాటికై అనేక విజ్ఞాపనలు చేయడం జరుగుతున్నది. పంచాయితీరాజ్ అమలు తర్వాత స్వచ్ఛంద కృషిద్వారా యీ అవసరాలను ప్రజలు కొంత వరకు తీర్చుకుంటున్నారు. కాని పట్టణాలు త్వరితగతిని పెరిగిపోతున్నాయి. అతి త్వరగా ఆధునిక సౌకర్యాలు కావాలంటున్నారు. అదే సమయంలో యీ అవసరాలను తీర్చడానికి ప్రభుత్వశక్తికి కొన్ని ఆర్థిక పరిమితులు ఉన్నాయి. ఇటువంటి సందర్భాలలో కేవలం ప్రజాబాహుళ్యం చేసే కృషి మాత్రమే త్వరితగతిని ఫలితాలు ఇవ్వగలుగుతుంది. యీ కృషి రెండు పద్ధతులలో ఉండాలి– సాధ్యమైనచోట్ల గరిష్ఠమైన పొదుపుచేయడం, లభ్యమైన వనరులను సక్రమంగా వినియోగించడం – యీ ఆత్యయిక పరిస్థితి ప్రతివారికీ అత్యధికమైన పొదుపు అవసరాన్ని విధించింది. సాధారణ చర్యలద్వారానేకాక సంస్థలు మొదలైనవాటిని సాధ్యమైనంతవరకు పునర్వ్యవస్థీకరించి తద్వారా పొదుపు చేయడానికి ప్రభుత్వం కూడా నూతన మార్గాలను అన్వేషిస్తున్నది. అన్ని ఉపకరణాలతో ఉన్న పంచాయితీ సమితులను రెండు అంతకంటే ఎక్కువగా ఉన్నవాటిని యేవిధంగా వీలుంటే ఆవిధంగా కలిపివేసి పంచాయితీ సమితుల సంఖ్యను తగ్గించాలనే ఆలోచన కూడా ఒకటి వున్నది. యీ విధంగా అధికారుల సంఖ్యను తగ్గించి సమర్థతకు భంగం కలుగని విధంగా కొంత పొదుపుచేయవచ్చు.

మన ప్రజలు జాతీయరక్షణనిధికి ఇతోధికంగా విరాళాలు ఇవ్వడానికి ముందుకు రావడం సంతృప్తికరమైన విషయం. మన రాష్ట్రం నాలుగుకోట్ల రూపాయలు విరాళంగా సేకరించింది. మనం మన ముందు ఉంచుకున్న లక్ష్యాన్ని అధిగమించాం. అయితే ఇది ప్రథమ సోపానం మాత్రమే. చైనాతో ఉన్న మన సరిహద్దులలో ఏ క్షణంలో యేంజరుగుతుందో మనం ఊహించలేమనే విషయం ఇప్పుడు మీకందరకూ తెలిసిందే. ఏంజరిగినాసరే మన రక్షణ ఏర్పాట్లను పటిష్ఠం చేసుకుని, సర్వదా అప్రమత్తులమై ఉండాలి. చాలా కాలంవరకూ ఇదే మన ప్రథమ కర్తవ్యమై ఉంటుంది —— ఆర్థిక త్యాగాలేకాక ఇటీవల ప్రవేశపెట్టబడిన వివిధ స్వచ్ఛంద దళాలలో చేరడంద్వారా రక్షణ ఏర్పాట్లకై మనకు సాధ్యమైన కృషిని మనం చేయాలి. స్వాతంత్ర్య ఉద్యమంలోవలెనే దేశభక్తియుతమైన యీ కృషిలో కూడా మన రాష్ట్రం ఎల్లప్పుడూ అగ్రగామిగా ఉంటుందనే నా విశ్వాసం.

జై హింద్ !

భవదీయుడు

నీలం సంజీవరెడ్డి

# విశేషాలు-వ్యాఖ్యలు

పి.వి.నరసింహారావు

## చైనా చేసిన మోసం

కొలంబో రాజ్యాల ప్రతిపాదనలను చైనా సుముఖంగా చూడడం కేవలం మోసకారితనమని తెలిసిపోయింది. చైనా పాలకులు చేప్పేది ఒకటీ, చేసేది మరొకటి. ఇది వారికి అలవాటయిపోయింది. కొలంబో ప్రతిపాదనలను "సూత్రపాయం" గా అంగీకరించినట్లుగా చైనావారు ఇంతవరకూ చెప్పుతూ వచ్చారు. అంతే కాక ఉభయుల సంప్రదింపులను వాంఛిస్తున్నామన్నారు. అయితే వాస్తవంలో వారు మొదట్లో చేసిన "యుద్ధవిరమణ ప్రతిపాదనల" మోసపు ఆంతర్యాన్ని కొనసాగించడానికి ఒక సాకుగా దీనిని ఉపయోగించుకోవడమే వారి ఉద్దేశ్యం. కొలంబో ప్రతిపాదనలు, ప్రతిపాదనకర్తలు ఇచ్చిన వివరణలతో సహా మాత్రమే సంప్రదింపులు ప్రారంభించడానికి ఆచరణ యోగ్యమైన ప్రాతిపదిక కాగలుగుతాయి. ఈ ప్రతిపాదనలు మన వాదనను యథాతథంగా అంగీకరించలేదు. అయితే మన వాదనలలోని సారాంశాన్ని అవి బలపరిచాయి.

పశ్చిమరంగంలో ప్రత్యక్ష అధీన రేఖనుంచి చైనావారు తమ దళాలను 20 కిలో మీటర్లు వెనక్కు ఉపసంహరించుకోవాలని యీ ప్రతిపాదనలు సూచించాయి. ఈ రంగంలో భారత దేశం తన సైనిక బలలాను యథాస్థితిలో ఉంచాలని సూచించడంజరిగింది. మధ్యరంగంలో యథాస్థితిని కొనసాగించాలని ప్రతిపాదించబడింది. పోతే, తూర్పు రంగంలో భారత సైనిక దళాలు మెక్‌మోహన్ రేఖ వరకూ వెళ్లవచ్చు. చైనావారు ఈ రేఖకు ఉత్తరం వరకూ వెళ్లవచ్చు. వివాదగ్రస్తమైన తాగ్లా, లాంగ్జూ ప్రాంతాలకు ఉభయులూ వెళ్ల కూడదు.

భారతదేశం యీ ప్రతిపాదనలను అంగీకరించింది. అయితే చైనాకూడా వీటిని పూర్తిగా ఆమోదించితేనే సంప్రదింపులు ప్రారంభిస్తామని సహేతుకంగానే పట్టుబట్టింది. యీ ప్రతిపాదనలను అంగీకరించకపోవడమేకాక ఉభయ దేశాల మధ్య సంప్రదింపులకు అవి అవరోధంగా ఉన్నాయని చైనా ప్రకటించింది. ఆసియాలో ప్రతివారూ తన ఆధిపత్యానికి తలొగ్గాలనే భావంతో ఉన్నంతకాలం సంప్రదింపులకై సహృదయత్వంతో చేసే ఏ ప్రయత్నాన్నయినా చైనా ఇదే దృష్టితో చూస్తుంది. సామ్రాజ్యవాదం గురించి కలలు కనే రోజులు ఏనాడో గతించాయని గుర్తించకుండా చైనా అంధత్వంలోపడి కొట్టుకుంటున్నది.

## భారత్‌కు మద్దతు

గతనెలలో భారతదేశానికి గ్రీకురాజు పాల్, కంబోడియా రాజ్యాధినేత ప్రిన్స్ నరోదం సింహానోక్, మొదలైన అనేక మంది ప్రముఖులు వచ్చారు. చైనా భారత వివాదంలో వారు భారతదేశాన్ని సమర్ధించారు.

టాంగానీకాలోని మోషీలో ఇటీవల జరిగిన ఆసియా - ఆఫ్రికా సమైక్యతా సంఘ సమావేశం కొలంబో ప్రతిపాదనలను బలపర్చడమేకాక ఏదేశమైనా ఇతర దేశాలతో ఉన్న వివాదాలను సైనిక దురాక్రమణతో పరిష్కరించుకోవడాన్ని ప్రతిఘటించింది. ప్రపంచ దేశాలు, చైనా-భారత వివాదంలోని

*కొద్దికాలం క్రిందటనే "ముఖ్యమంత్రిలేఖ" అన్న శీర్షికను ప్రారంభించాము. ఈ సంచికనుంచి "విశేషాలు—వ్యాఖ్యలు" అన్న మరో కొత్త శీర్షికను ప్రవేశ పెడుతున్నందుకు సంతోషిస్తున్నాము. న్యాయ - సమాచార శాఖల మంత్రి శ్రీ. పి. వి. నరసింహారావుగారు యీ శీర్షిక క్రింద ప్రతినెలా వ్రాసే వ్యాసాల్లో ప్రజాబాహుళ్యానికి సంబంధించిన యిటీవలి సంఘటనలను గురించి సంగ్రహంగా చర్చించడం జరుగుతుంది. ప్రతినెలా 20 వ తేదీన యీ వ్యాసాన్ని వ్రాయడం జరుగుతుంది. – ఎడిటర్*

వాస్తవికతను గుర్తించి భారతదేశం వాదనను సమర్థించడం ద్వారా తమ స్నేహభావాన్నీ, న్యాయదృష్టినీ విస్పష్టంగా ప్రదర్శించాయి.

చైనా ఏకాకి అయి విమర్శలకు గురయిందా? ఇటీవల చరిత్రలో చైనా ఇంతటి విమర్శకు ఎన్నడూ గురికాలేదు.

## ఐరోపా సమిష్టి మార్కెటు సమస్య

ఐరోపా సమిష్టి మార్కెటులో సభ్య దేశంగా చేర్చుకోవాలని బ్రిటన్ చేసిన అభ్యర్థనను గురించి బ్రసెల్స్‌లో సుదీర్ఘంగా జరిగిన చర్చలు చివరకు విఫలమయ్యాయి.

ఆరు రాజ్యాల ఐరోపా సమిష్టి మార్కెటులో "అసోసియేట్ సభ్యత్వం" స్థాయికన్నా మించిన స్థానం బ్రిటన్‌కు ఇవ్వడానికి జనరల్ డిగాల్ నిరాకరించారు. ఈసమస్యపై రాజీకోసం పశ్చిమ జర్మనీ చేసిన ప్రయత్నాలను కూడా ఆయన కొనసాగనివ్వలేదు. యీ విషయంలో అమెరికా ఆగ్రహానికి గురికావడానికి కూడా ఆయన సంసిద్ధుడయ్యాడు. యీచర్య బ్రిటిష్ పౌరుల నిశిత విమర్శకు గురి అయింది. ఐరోపా సమిష్టి మార్కెటులో చేరడంగురించి బ్రిటన్‌లోనూ బయటా, విభిన్నాభిప్రాయాలు ఉన్నా ఆ దేశ ఆర్థిక ప్రయోజనాలకు ఇది అతి ముఖ్యమైనది.

ఐరోపా సమిష్టి మార్కెటులో బెల్జియం, ఫ్రాన్స్, ఫెడరల్ జర్మనీ, ఇటలీ, లక్జంబర్గ్, నెదర్‌లాండ్స్ అనే ఆరు రాజ్యాలు ఉన్నాయి.

1957 మార్చి 25వ తేదీన రోమ్‌లో జరిగిన ఒప్పందం ప్రకారంగా 1958 జనవరి 15వ తేదీన ఐరోపా సమిష్టి మార్కెటు ఏర్పడింది. 12 నుండి 15 సంవత్సరాల ఈ వరకు ఉండే మార్పు కాలంలో ఈ ఆరు రాజ్యాల ఆర్థిక పరిస్థితులను సమన్వయపరచడమే దీని ముఖ్య ఉద్దేశ్యం. ఆర్థికఐక్యతనే గాక రాజకీయ సమైక్యతను సాధించడంకూడా దీని లక్ష్యం. తదనుగుణంగా విదేశాంగ విధానాలపైనా, రక్షణకు సంబంధించిన విధానాలపైనా పరస్పరం సంప్రదించుకోవాలని సభ్యులు అంగీకరించారు.

## ఇరాక్‌లో విప్లవం

మధ్యప్రాచ్యంలో ఎన్నో విప్లవాలు జరిగాయి. ఇటీవల ఇరాక్‌లో ఒక తిరుగుబాటు జరిగింది. ఫిబ్రవరి 8వ తేదీన ఇరాక్ సైన్యం జనరల్ కాసిం ప్రభుత్వాన్ని కూలద్రోసింది. ఒకప్పుడు ఆయనకు కుడిభుజంగా ఉన్న కల్నల్ ఆరిఫ్ ఇరాక్ ప్రెసిడెంట్ అయ్యాడు. అలీనవిధానం, సోషలిజం తమ లక్ష్యాలని 'విప్లవ మండలి' ప్రకటించింది. విదేశీయులందరికీ రక్షణ కల్పిస్తామని హామీ ఇచ్చింది. దేశంలో ఐకమత్యాన్ని నెలకొల్పడానికై కాసిం ప్రభుత్వానికి వ్యతిరేకంగా తిరుగుబాటు చేసిన కుర్దులతో విప్లవమండలి సంప్రదింపులు ప్రారంభించింది. భారత దేశంతో సహా అనేక ఇతరదేశాలు యీ కొత్త ప్రభుత్వాన్ని గుర్తించాయి.

1958వ సంవత్సరంలో ఫజల్‌రాజు ప్రభుత్వాన్ని కూలద్రోసి కాసిం అధికారంలోకి వచ్చాడు.

సైనిక తిరుగుబాటు ద్వారా ప్రభుత్వాలను వశం చేసుకునే ప్రాంతాలలో ప్రజాభిప్రాయం వీటి విషయంలో ఏ విధంగా ఉంటుందో చెప్పడం చాలా కష్టం.

## భారత-పాకిస్తాన్ చర్చలు

కాశ్మీరు, తదితర సమస్యలపై ఉభయ ప్రభుత్వాల మధ్య అనేక విభిన్నాభిప్రాయాలు ఉన్నాయని భారత, పాకిస్తాన్‌ల మధ్య మంత్రులస్థాయిలో మూడు పర్యాయాలు జరిగిన చర్చలలో వెల్లడయింది. కలకత్తాలో నాల్గవసారిగా జరిగే చర్చలలో ఉభయులు సమ్మతించే విధానాన్ని కనుగొనడం జరుగుతుందని భావించబడుతుంది.

ఉభయులు సహృదయతా భావాన్ని కలిగి ఉన్నంతవరకూ ప్రయత్నాలు కొనసాగించడంలో నిరాశపడనవసరం లేదు. ఒక్కరాత్రిలో కాశ్మీరు సమస్యను పరిష్కరించుకోవచ్చునియెవరూ భావించలేదు.

ఇంతవరకూ తెగకుండా ఉన్న యీ సమస్యను హృదయపూర్వకంగా ప్రయత్నిస్తే ఇప్పుడైనా పరిష్కారం లభించవచ్చు. ఒకరిఆపదను తమస్వంతలాభానికి ఉపయోగించుకోవాలనే అనుచితమైన దృక్పథంలో ఉన్న కారణంగా ఎన్నో సమస్యలు పరిష్కార సాధ్యం కాకుండా పోయాయి. పాకిస్తాన్ ఇటువంటి తత్వాన్ని విడిచిపెడితే అన్ని సమస్యలను అవలీలగా పరిష్కరించుకోవచ్చు.

ఈ లోపల పాకిస్తాన్ తను అక్రమంగా ఆక్రమించుకున్న కాశ్మీరు ప్రాంతాల సరిహద్దులపై చైనాతో ఒప్పందాన్ని చేసుకుంటున్నది. అయితే ఇటువంటి ఒప్పందాలకు భారత దేశం కట్టుబడి ఉండదు. భారతదేశాన్ని సరిహద్దు వివాదంపై రెచ్చగొట్టడమే ఇటువంటి ఒప్పందాల లక్ష్యమై వుండవచ్చు.

## బంగారం కంట్రోలు

ఇటీవల అమలులోకి వచ్చిన బంగారం కంట్రోలు నిబంధనలు ప్రజా బాహుళ్యంలో బాగా వ్యాప్తి చెందాయి.

ఈ కంట్రోలు ప్రస్తుతం ప్రజలలో వెల్లివిరిసిన త్యాగ భావాలకు అనుగుణంగా ఉండడమేకాక యీ విప్లవ చర్యవల్ల కలిగే ఆర్థిక, సాంఘిక ఫలితాలకు కూడా సామాన్య ప్రజలుహర్షం ప్రకటించారు. కుటుంబ జీవితంలోనూ, కార్యకలాపములలోనూ బంగారం వాడకాన్ని తగ్గిస్తున్నారు. బంగారం పనివారల సమస్యను పరిష్కరించవలసి ఉన్నది. వారికి క్రొత్త ఉపాధులు కల్పించే నిమిత్తమై కొన్ని శిక్షణ తరగతులు మొదలైన వాటిని ప్రారంభించాలని బంగారం కంట్రోలు బోర్డు యోచిస్తున్నది. [బంగారం కంట్రోలుకు సంబంధించిన పూర్తి వివరాలను యీ సంచికలోనే వేరేచోట ప్రకటించడం జరిగింది. చూ. 31 పేజీ -ఎడిటర్].

## ఆంధ్రప్రదేశ్ లక్ష్యం

ఆంధ్రప్రదేశ్‌లో జాతీయ రక్షణనిధికి విరాళాల సేకరణ జనవరి నెలలో ఉధృతంగా కొనసాగి, ఫిబ్రవరి నెలలో రూ. 3½ కోట్ల లక్ష్యాన్ని అధిగమించడం జరిగింది. యుద్ధరంగానికి సుదూరంలో వున్న దక్షిణ రాష్ట్రాలలో ప్రజలు సమధికోత్సాహంతో ముందుకు రావడానికి కొంత కాలం పట్టింది. ఒక్క నెలలోనే లక్ష్యాన్ని సాధించిన ఆంధ్రప్రదేశ్ ప్రజలు అభినందనీయులు. వివిధ స్థాయిలలో ఏర్పాటైన రక్షణ సంఘాలు అహోరాత్రులు కృషిచేసి రక్షణ కృషి సమీకరణ విషయంలో ఆంధ్రప్రదేశ్‌కు గౌరవనీయమైన స్థానాన్ని సంపాదించి పెట్టాయి. ఇప్పుడు ప్రజల ఉత్సాహోద్రేకాలు అత్యున్నత స్థాయిలో వున్నాయి. ఆత్యయికపరిస్థితి ఉండేంత వరకూ యీ జనతా కార్యదీక్ష నిస్సందేహంగా కొనసాగుతూ ఉంటుంది.

## ప్రాగాటూల్సు

శ్రీ సి. సుబ్రహ్మణ్యం ప్రాగాటూల్సు కార్పొరేషన్ పరిస్థితిని గురించి గత మాసంలో నిశితంగా విమర్శించారు. ఇది 17 ఏళ్ళ క్రిందట స్థాపించబడింది. అయినా ఇది ఆధునిక యంత్రపరికరాల పరిశ్రమగా మారడానికి తగు విధంగా అభివృద్ధిచెందలేదు. "ఇక్కడియంత్రాలు అతి పురాతనమైనవి కాకపోయినా, పాతవే"నని కేంద్రమంత్రి అన్నారు.

ఇందుకు ఇతర కారణాలు వుండవచ్చు. ఈ ఫ్యాక్టరీలో ఉత్పత్తిని హెచ్చించవలసిన అవసరం ఎంతైనా వుంది. ప్రభుత్వ రంగంలోని పరిశ్రమలలో కార్మికులకూ, యజమానులకూ మధ్య సత్సంబంధాలుండాలని కేంద్ర మంత్రి నొక్కి వక్కాణించారు.

కేంద్ర ప్రభుత్వం ఈ ఫ్యాక్టరీని 1957 జూలై 4వ తేదీన తన యాజమాన్యం క్రిందికి తీసుకొన్నది. ఇక్కడ ఉత్పత్తిని అధికం చేయడానికి ఒకకోటిరూపాయలు ఖర్చు కాగల పథకం తయారు చేయబడింది.

## రసాయనిక ఎరువుల ఫ్యాక్టరీలు

కేంద్ర ప్రభుత్వ భారీ పరిశ్రమల శాఖామంత్రి హైద్రాబాదు సమీపంలో ఉన్న హైద్రాబాదు కెమికల్స్, ఫర్టిలైజర్సుకు చెందిన సల్ఫ్యూరిక్ ఆసిడ్, సూపర్ ఫాస్ఫేటు యంత్రానికి ఇటీవల ప్రారంభోత్సవం జరిపారు. ఈ సందర్భంలో మాట్లాడుతూ దేశంలో ఆహార ధాన్యాల కొరతను తీర్చడానికి, అధికాహారోత్పత్తిని సాధించే నిమిత్తమై స్థానికంగా వుపయోగించబడే రసాయనిక ఎరువులు, రసాయనిక పదార్థాలను వుత్పత్తిచేసే వ్యావసాయిక పరిశ్రమలను రాష్ట్ర ప్రభుత్వం ఎక్కువగా ప్రోత్సహించాలి అని సలహా ఇచ్చారు. ఆంధ్ర ప్రదేశ్‌లో, భారీ పరిశ్రమలను నెలకొల్పాలని పారిశ్రామిక వేత్తలకు నచ్చజెప్పడానికై తగిన పరిస్థితులను కల్పిస్తానని ఆయన వాగ్దానం చేశారు.

రాష్ట్రంలో కొత్తగూడెం, విశాఖపట్నాలలోని ఫ్యాక్టరీలతోపాటు ఇతర రసాయనిక ఎరువులు ఫ్యాక్టరీలు పూర్తిగా వుత్పత్తిని ఆరంభించిన తరువాత రాష్ట్రంలో రసాయనిక ఎరువుల కొరత తీరగలదని ఆశింపబడుతున్నది.

## ప్రాంతీయ అసమానత్వం

వివిధ రాష్ట్రాలలో క్రొత్తగా పరిశ్రమలను నెలకొల్పే విషయంలో ప్రాంతీయ అసమానత్వాలను తొలగించే ఉద్దేశం తనకు వుందని కేంద్ర భారీ పరిశ్రమల మంత్రి చెప్పారు. ఇది చాలా శుభ సూచకమైన విషయం. గతకొద్దికాలంగా ఆంధ్రప్రదేశ్ వంటి రాష్ట్రాలలో ఇవి పారిశ్రామికంగా వెనుకబడివున్నాయనే భావం ప్రబలివుంది. ఏదో ఒక కారణాన దేశంలోని కొన్నిప్రాంతాలలోమాత్రమే పరిశ్రములు కేంద్రీకృతమై వున్నాయనీ ఇతర ప్రాంతాలపట్ల తగిన శ్రద్ధ చూప

(మిగతా 84వ పేజీలో)

# సోదరి! సోదరా!

రాయప్రోలు సుబ్బారావు

పాడవే సోదరి! వేడి వేడి పదాలు
వాడ వాడల పడుచు కోడెలను కవ్వింప    పాడవే....

కొట్టరా సోదరా! గట్టిగా రణభేరి
చుట్టాలు పక్కాలు శూరులై మేలుకొన    పాడరా....

పెట్టవే బిడ్డలకు గొట్టు కారపు ఉగ్గు
కట్టింపవే వీరకాశె మగవారలకు    పాడవే....

హరియింపలే దెపుడు ఇరుగు పొరుగులసొత్తు
పరదేశములమీద పరుగెత్త మేనాడు    పాడరా....

ఈసుతో కుమిలి దురాశతో దగ్ధమయి
త్రోసుకొని వచ్చాడు దొంగ చీనావాడు    పాడవే...

జనము హతమగునటంచు జంకు జాలీ లేదు
తనకాడి దున్నలై తట్టాడ మంటాడు    పాడరా....

హింసయని గొంకితే నపుంసకుల మంటాడు
ధ్వంసమే సకలార్థ ధర్మపథమంటాడు    పాడవే...

చీనా వినాయకుల చేటు సిద్ధాంతమిది
జానిసెల గురువులను పట్టి బంధించాలె    పాడరా...

ఉన్నదే లోకాన ఉన్మాదులకు మందు
వెన్ను విరుగనిపాము విడుచునే తలపగలు    పాడవే....

క్రూరులై రిపుల కక్రూరులై ఆప్తులకు
ధీరులై నడపాలె నీ రాజ్య తంత్రమును    పాడరా...

ఇది నా స్వదేశంబు — ఇది నాస్వరాజ్యంబు
గదిమినా-అదిమినా-కరవాల మిదెయంచు    పాడవే...



# రాష్ట్ర బడ్జెట్*

కె. బ్రహ్మానందరెడ్డి

## 1963-64 బడ్జెట్ అంచనాలు

1963_64 రివిన్యూ, ఖర్చు అంచనాల ప్రకారం, మొత్తం రివిన్యూ రూ. 118.36 కోట్లు ఉంటుంది - ప్రస్తుత సంవత్సరపు సవరించిన అంచనాల రూ. 116.43 కోట్లు.

ఇక ఖర్చు విషయం_1963_64 బడ్జెట్ అంచనాల ప్రకారం వినియోగం రూ. 118.26 కోట్లు.

1963_64 సంవత్సరపుఖర్చు బడ్జెట్‌లో ఈ క్రింది పద్దులకు వర్తించే ప్రత్యేక అదనపు గ్రాంట్లు చేర్చబడినై :_

| | రు. లక్షలు |
|---|---|
| రాష్ట్ర ప్రధాన రోడ్ల నిర్వహణ | 75.00 |
| ప్రాథమిక, సెకండరీవిద్యకుగాను జిల్లాపరిషత్తులకు, పంచాయతీ సమితులకు ఇచ్చే గ్రాంట్లు | 84.50 |
| మోటారు బండ్లపై పన్ను, టోల్సు విషయంలో కలిగిన ఆదాయ నష్టానికి పురపాలక సంస్థలకు నష్టపరిహారం | 3.00 |
| రోగులకై ఆహారపు ఖర్చు, మందుల కొనుగోలు | 7.60 |
| ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు | 9.00 |
| పంచదార చెరకు ప్రాంతాలలో రోడ్ల నిర్మాణం | 10.00 |

## పెట్టుబడి వినియోగం (ప్రణాళికేతర పథకాలు)

పెట్టుబడి ఖర్చుకు చెందిన భారీ పథకాలన్నీ ప్రణాళికలో చేర్చబడినవి. అయినా నీటిసాగు, రోడ్లు, కట్టడాలు, ప్రజారోగ్యం పారిశ్రామిక అభివృద్ధి, జమీందార్లకు నష్టపరిహారం వగైరా విషయాలకు చెందిన కొన్ని అంశాలు ఉన్నవి. వాటికి ప్రణాళికలో చోటులేదు. కాబట్టి వాటిని ప్రణాళికేతర పెట్టుబడి వినియోగంలో కొనసాగించవలసి వస్తుంది. ఈ అంశాలకుగాను వచ్చే ఏడాది బడ్జెట్‌లో చేసిన మొత్తం కేటాయింపు రు. 470.13 లక్షలు.

| వివరాలు :_ | రు. లక్షలు |
|---|---|
| జమీందార్లకు నష్టపరిహారం | 142.41 |
| పారిశ్రామిక అభివృద్ధిపై పెట్టుబడి వినియోగం | 67.96 |
| నీటి సాగు, పడవలకు సౌకర్యాలు వగైరా పథకాలు | 37.93 |
| కట్టడాలు, రోడ్లను గురించిన పెట్టుబడి వినియోగం | 146.61 |
| ప్రభుత్వ వ్యాపార పథకాలకు సంబంధించిన పెట్టుబడి వినియోగం | 48.57 |
| మిగతా పద్దులు | 26.65 |
| మొత్తం | 470.13 |

## ఋణాలు, అడ్వాన్సులు ప్రణాళిక కాక

రైతుల నుంచి ఋణాలు, మిగతా బకాయీలను వసూలు చేసేందుకై 1962_63 సవరించిన అంచనాలలో రు. 5.06 కోట్లు తీసుకోబడినై. ఇందులో బకాయీల కింద రు. 2 కోట్లు, మామూలు వసూళ్ళకు గాను మిగతాది. తక్కావీ, తదితర ఋణాల బకాయీల కింద రు. 1.50 కోట్లు వసూలు కాగలవని 1963_64 బడ్జెట్‌లో అంచనా వేయబడింది.

## ప్రజాఋణం

వచ్చే సంవత్సరం ప్రణాళికా పథకాలకు, మిగతా వ్యవహారాలకు, సుమారు రు. 48.25 కోట్ల కేంద్ర సహాయం లభించగలదనే ఉద్దేశ్యంతో 1963_64 బడ్జెట్ అంచనాలు తయారు చేయబడినై. కేంద్ర ప్రభుత్వం నుంచి తీసుకొన్న వివిధ ఋణాలను తిరిగి చెల్లించటానికిగాను చేసిన కేటాయింపు రు. 27.50 కోట్లు. వచ్చే ఏడాదిలో ఈ చెల్లింపులు చేయవలసి వస్తుంది. ఇందు మూలంగా 1964 మార్చి నెలాఖరుకు ప్రజాఋణం రు. 311.84 కోట్లు ఉండవచ్చు. అంటే 1963 మార్చి ఆఖరు కన్న నికరంగా రు. 20.75 కోట్ల పెరుగుదల అన్నమాట.

*20-2-1963 తేదీన రాష్ట్ర అసెంబ్లీలో చేసిన బడ్జెట్ ఉపన్యాసంనుంచి _

కాగా, ఈ సందర్భంలో గుర్తుంచుకోవలసిన మరొక విషయం-వచ్చే ఏడాది రాష్ట్ర ప్రభుత్వాలేవీ ప్రజల నుంచి ఋణాలను సేకరించవు. కేంద్ర ప్రభుత్వమే కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలకు ఋణాన్ని సేకరించి, రాష్ట్రాలన్నిటికి తగు మొత్తాలను సమకూరుస్తుంది. ఆ విధంగా కేంద్రం నుంచి ఆంధ్రప్రదేశ్‌కు రూ. 11 కోట్ల ప్రత్యేక ఋణం లభించవచ్చు. అయితే 1963-64 లో తన స్వంత కార్యక్రమాలకై రాష్ట్రవిద్యుచ్ఛక్తి సంస్థ మాత్రం రూ. 5 కోట్ల దాకా ఋణం సేకరించు కొనటానికి అనుమతింపబడుతుంది.

### ప్రణాళిక వసతులు, 1963-64

1963–64 రాష్ట్రప్రణాళిక మొత్తం వినియోగం రూ. 55.27 కోట్లు. కేంద్ర సహాయం రూ. 34.40 కోట్లు ఉండవచ్చు. మిగతా రూ. 20.87 కోట్లను రాష్ట్ర ప్రభుత్వం సమకూర్చుకోవలసి వుంటుంది. ఇప్పుడు పూర్వ సంవత్సరాల్లోలాగకాదు. పాత ఋణాలను పెద్ద మొత్తాలలో వచ్చే ఏడాది మనం చెల్లించుకోవాలి. అందుకు రూ 27.50 కోట్ల దాకా కావాలి. అంటే, కేంద్ర ప్రభుత్వం ప్రజా ఋణం ద్వారా మనకు సమకూర్చే రూ. 11 కోట్ల ప్రత్యేక ఋణం 1963–64 ప్రణాళికా పథకాలకు ఉపకరించదు. ఎందుకంటే ఆ మొత్తం పాత ఋణాల చెల్లింపుకే అవసరం అవుతుంది. రాష్ట్ర ప్రభుత్వం సమకూర్చుకునే రూ. 20.87 కోటలో రు. 5.87 కోట్లు ప్రస్తుతం రివిన్యూ మిగుళ్ల వలన, ఋణాలు, డిపాజిట్లు వగైరాలకింద వచ్చే నికర వసూళ్ళ వలన సమకూరవచ్చు. మరొక రూ. 5 కోట్లను రాష్ట్ర విద్యుచ్ఛక్తి సంస్థ ప్రజా ఋణాల ద్వారాను రూ. 40 లక్షలు తన డిప్రిసియేషన్ నిధిలోనించి సేకరించవచ్చు. ఇక రూ. 9.60 కోట్ల కొరదలా మొత్తాన్ని కొత్త పన్నుల ద్వారానూ, ఖర్చులో సాధించుకొనగల పొదుపుల ద్వారానూ, తదితర మార్గాల ద్వారానూ సమీకరించుకోవాలి.

### పన్నులు

శాసనసభ మొదట ఆమోదించిన భూమి పన్ను చట్టాన్ని మళ్ళీ ప్రభుత్వం గౌరవ సభ్యుల అభిమతం ప్రకారం కొన్ని ఇబ్బందులను తొలగించేందుకై సవరణ బిల్లు ద్వారా పునః పరిశీలించి వీలయినంత వరకు యిబ్బందులు తొలగింప బడినవి. ఇందువలన మొదట్లో అనుకొన్న దానికన్న పన్నువల్లవచ్చే ఆదాయం బాగానే తగ్గింది. అయినప్పటికి రాష్ట్ర ఆర్థిక పరిస్థితులను కుదుటబరచి ప్రణాళికా లక్ష్యాలను నెరవేర్చటంలో ఇది చాలా వరకు ఉపయోగపడుతుంది. ఈ సందర్భంలో సహాయ సహకారాలను సమకూర్చి నందుకు, గౌరవ సభ్యులకు నా ధన్యవాదాలను సమర్పిస్తున్నాను.

మోటారుబండ్ల పన్నుల పెరుగుదలకని చేసిన ప్రతిపాదనలను శాసనసభ ఆమోదించినది. తగిన చట్టాన్ని స్టాట్యూట్ బుక్‌లో చేర్చటమైంది కూడా. ఇందుమూలంగా ఆర్థిక పరిస్థితి ఇంకొంత అభివృద్ధి చెందుతుంది.

1962–63 బడ్జెటునుసమర్పిస్తూ రాష్ట్రంలోని అమ్మకపు పన్ను ఎలా పనిచేస్తూందీ పరిశీలించి, వ్యాపారానికి ప్రతికూలంగా వుండని పద్ధతిని, అభివృద్ధులను సాధించే సిఫార్సులను సూచించ వలసిందిగా అప్లయిడ్ ఎకనామిక్ రిసర్చ్ నేషనల్ కౌన్సిలును కోరటమైందని, శాసన సభకు తెలిపాను. ఈ కౌన్సిల్ డైరెక్టర్–జనరల్, డాక్టర్ పి.యస్. లోకనాథంగారు, పన్నుల విధానం సక్రమం చేయుట విషయంలోను, దాని నిర్వహణ విషయంలోను, తమ సిఫార్సులను కొద్ది రోజుల క్రితం అందజేశారు. వారికి నా కృతజ్ఞతాపూర్వక ధన్యవాదాలు. వారి రిపోర్టు యిప్పుడు ప్రభుత్వం పరిశీలనలోవుంది. తగు మార్పులతో ఒక బిల్లును ఈ సమావేశంలో ప్రవేశపెట్టాలని అనుకుంటున్నాను.

మోటారుబండ్ల పన్ను మార్పులతో సహా వీటి వలన వచ్చే ఏడాది సుమారు రూ. 2 కోట్లు అదనపు రివిన్యూ రాగలదని అనుకుంటున్నాం.

1963–64 సంవత్సరంలో మరి నాల్గుకోట్ల రూపాయలు యితర విధానాలవల్ల సమకూర్చుకోవలసి వుంటుంది. అందులో ఒకవిధానం-నీరా షాపుల అమ్మకము విషయములో కొన్ని మార్పులతో కట్టుదిట్టాలు చేయడం. పట్టణాలలోని వ్యవసాయేతర భూములపైన తగిన పన్ను విధించటం కూడా మరియొక విధానం.

### సాధనా సదుపాయాలు

గడచిన కొలది సంవత్సరాలుగా రాష్ట్ర ప్రభుత్వపు సాధనా సదుపాయాల పరిస్థితి ఏమంత తృప్తికరంగా లేదు. అందుకు ప్రధాన కారణం – అభివృద్ధి కార్యక్రమాల వేగం హెచ్చటం. పన్నులు, ఋణాలు వగైరాలను వసూలు చేయటం కన్న, ఎక్కువ వేగంగా హెచ్చు మొత్తాలను అభివృద్ధి కార్యక్రమాలపై ఖర్చుపెట్టవలసి వస్తూవుంటుంది. అంటే రాబడికన్న ఖర్చు వేగం ఎక్కువ. ఇందుమూలంగా మధ్యమధ్య రాష్ట్ర ప్రభుత్వం రిజర్వు బ్యాంకు నుంచి పెద్దపెట్టున ఓవర్‌డ్రాఫ్టులను చేకూర్చుకోవలసి వస్తుంది. అయితే అలాంటి సందర్భాలు వచ్చినప్పుడల్లా, కేంద్రప్రభుత్వం, రిజర్వు బ్యాంకు చేస్తున్న సహాయం మూలంగా, మనం ఇబ్బందుల్లోంచి బైటపడగలుగుతున్నాం. 1962-63 సంవత్సరం రూ. 18.03 లక్షలు

మాత్రమే తరుగు నిల్వతో ముగియగలదని మనం ఇప్పుడు ఆశించవచ్చు.

దేశ రక్షణ భారం గురుతరంగా ఉన్న ఈ తరుణంలో, కేంద్ర ప్రభుత్వం పూర్వంలోవలె, ఋణాలిచ్చి, సాధనా సదుపాయాల విషయమై అన్వాన్సులు, వగైరా లిచ్చి రాష్ట్ర ప్రభుత్వానికి సహాయపడగలదని మనం అనుకొన కూడదు. కాబట్టి ప్రణాళికకు, తదితర అవసరాలకు కావలసిన వనతులను సమీకరించుకొనటంలో మనం మన స్వశక్తిపైనే ఆధారపడ గలగాలి.

## పరిశ్రమలు

ప్రస్తుత పరిస్థితిలో పరిశ్రమల అభివృద్ధికి మరింత ప్రాముఖ్యం వచ్చింది. ఈ విషయాన్నీ, పారిశ్రామిక అధికోత్పత్తి అవసరమనే విషయాన్నీ, అందరూ గుర్తించారు. ఇదెంతో ముదావహమైన విషయం.

రెండవ ప్రణాళిక ముగింపు నాటికి ఉత్పత్తి అవుతున్న 30 లక్షల టన్నుల నుండి బొగ్గును మూడవ ప్రణాళిక ముగింపు నాటికి 60 లక్షల టన్నుల దాకా ఉత్పత్తి చేయాలని సింగరేణి బొగ్గుగనుల కంపెనీ తలపెట్టింది.

మూడవ పంచవర్ష ప్రణాళికలోని విస్తరణ పథకానికి ఈ కంపెనీకి రు. 25.83 కోట్లు కావలసి వుంటుంది. ఈ మొత్తము ఈ క్రింది విధంగా సమకూర్చబడుతుంది:—

మూలధనం, పెంపుదల: రూ. 6 కోట్లు రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వపు వాటాలు యిందులో 3:2 నిష్పత్తిలో వుంటాయ్.

ఋణాల ద్వారా కంపెనీ సేకరించేది రూ. 2.5 కోట్లు;

మిగిలించి కేంద్ర ప్రభుత్వం నుంచి అప్పు.

కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలకు కంపెనీ రూ. 2.40 కోట్లు, రూ. 3.60 కోట్ల విలువగల ఈక్విటి షేర్లను జారీచేస్తుంది. రాష్ట్ర ప్రభుత్వము కంపెనీషేర్ల క్రింద యివ్వవలసిన రూ. 3.60 కోట్ల మొత్తములో రూ. 54 లక్షలు కంపెనీ నుండి రావలసిన అప్పును జమకట్టు కోగా మిగిలిన రూ. 3.06 కోట్లు, నగదుగా యివ్వవలసి యుంటుంది. దీని కొరకు కేంద్ర ప్రభుత్వానికి రూ. 3.06 కోట్లుఅప్పుగా యిచ్చుటకు అంగీకరించినది. దీని వలన రాష్ట్ర ప్రభుత్వమునకు యీ కంపెనీ నిర్వహణలో తన ఆదేశాన్ని అమలు జరిపే అధికారం యధాతథంగా వుంటుంది.

నిజాం పంచదార ఫ్యాక్టరీ కూడా ఉత్పత్తిని బాగానే పెంచింది.

క్రితం సంవత్సరపు రు. 68 లక్షల ఉత్పత్తికి ప్రతిగా, ప్రస్తుత సంవత్సరం రు. 85 లక్షల ఉత్పత్తిని ప్రాగాటూల్స్ కార్పొరేషన్ సాధించగలదని అనుకుంటున్నాం. ఈ కంపెనీ తన ప్రస్తుత యూనిట్లను విస్తరణ చేసుకొంటూనే, కూకుట్లపల్లిలో కొత్త యూనిట్లను స్థాపించుటకు భూమినికూడా సేకరించింది. ఇంతవరకు కలిగిన అడ్డంకులు త్వరలోనే తొలగిపోగలవని కంపెనీకి కావలసిన డబ్బు, విదేశ మారకము లభించగలవని ఆశించవచ్చు.

ఆల్విన్ మెటల్ వర్క్స్ తన మూలధనాన్ని ఇటీవల రు. 86 లక్షలతో పెంచి అధిక ఉత్పత్తి కార్యక్రమానికి పూనుకుంటోంది.

దేశంలోని చాలా బట్టల మిల్లులాగానే అజింజాహి మిల్స్ కూడ ప్రత్తి మార్కెట్ లోని అనిశ్చిత పరిస్థితుల వలన ఏర్పడిన ఇబ్బందులను ఎదుర్కొంటోంది

రాష్ట్రములోని రెండు ఎరువుల ఫ్యాక్టరీల విషయంలోను కొంత అభివృద్ధి జరిగింది. కొత్తగూడెం ఎరువుల ఫ్యాక్టరీని నిర్వహించే 'ఆంధ్ర షుగర్స్ లిమిటెడ్' సంస్థ విదేశ సహకారం పొందటానికి కేంద్ర ప్రభుత్వపు అనుమతికూడా పొందింది. యీ ఫ్యాక్టరీ నిర్మాణమునకు కావలసిన స్థలము సేకరింప బడుతోంది. యీ ప్రాజెక్టుకు కావలసిన నీటి సరఫరా నిమిత్తం రాష్ట్ర ప్రభుత్వం కిన్నెరసాని నదిపై ఒక ఆనకట్టను కూడా నిర్మిస్తోంది. యీ ఫ్యాక్టరీ పూర్తి అయిన తర్వాత నెలసరికి 16,000 మెట్రిక్ టన్నుల యూరియాను వుత్పత్తి చేయగలదు.

విశాఖ పట్నంలో నిర్మించబడే రెండవ ప్రాజెక్టులో ప్రతి సంవత్సరము 3.65లక్షల మెట్రిక్ టన్నుల అమ్మోనియం ఫాస్ఫేటూ 16,500 మెట్రిక్ టన్నుల ప్రిల్డ్ యూరియా తయారు కాగలవు. ఒకసమగ్రమైన ప్రాజెక్టు రిపోర్టు కేంద్ర ప్రభుత్వానికి సమర్పించ బడింది. ఈ ప్రాజెక్టుకు అవసరమైన స్థలమును కొలుకు తీసుకొనే విషయం విశాఖపట్నం పోర్టు అధికారులతో ప్రాథమిక సంప్రదింపులు జరిగాయి. విదేశీయ సాంకేతిక సహాయ విషయాల్లో కూడా సంప్రదింపులు జరుగుచున్నాయి.

రాష్ట్ర ప్రభుత్యపు సిఫార్సుపై యీ సంవత్సరము 18 కొత్త స్పినింగు మిల్లుల యూనిట్లకు కేంద్ర ప్రభుత్వంచే లైసెన్సులు యివ్వబడినవి. చాలమటుకు లైసెన్సుదార్లు యీ మిల్లుల నిర్మాణమునకు ప్రాథమిక చర్యలు అప్పుడే తీసుకుంటూ న్నట్లు తెలుస్తోంది. నిర్ణీత కాలములో అవసరమైన పనులను వారు పూర్తిచేయ గలరని ఆశించబడుచున్నది. లేనిచో వారికిచ్చిన లైసెన్సులు రద్దు కావచ్చు.

చీరాలలోని సహకార స్పిన్నింగుమిల్లు ఉత్పత్తి అప్పుడే ప్రారంభించింది.

యంత్రసామగ్రి సమాకూర్చుకొనుటలో ఎన్నో యిబ్బందులు కలిగినా సహకార పంచదార మిల్లులు వాటి కార్యక్రమములు సాగిస్తూనే వున్నాయి. కొన్ని అప్పుడే యీ సంవత్సరము ఉత్పత్తి ప్రారంభించాయి. మిగతావి వచ్చే సంవత్సరములో వుత్పత్తి ప్రారంభిస్తాయని ఆశించవచ్చు.

రాష్ట్రంలోని పరిశ్రమలను పెంపొం

దించి, అభివృద్ధి పరచేందుకై రెండేళ్ళ క్రితం ఏర్పాటు చేయబడిన పరిశ్రమల అభివృద్ధి కార్పొరేషన్ ఎన్నో పారిశ్రామిక ప్రాజెక్టుల కోసం లైసెన్సులకై కేంద్ర ప్రభుత్వానికి దరఖాస్తులు పెట్టుకుంది. హైటెన్షన్ లోటెన్షన్ ఇన్సులేటర్ ప్రాజెక్టు విషయంలో కేంద్ర ప్రభుత్వం అప్పుడే లైసెన్సును మంజూరు చేసింది. బాల్, రోలర్, టేపర్, జనరల్ బేరింగ్సు విషయంలో ఒక లెటర్ ఆఫ్ ఇంటెంట్‌ను జారీచేసింది. సమగ్ర గ్లాస్ ప్రాజెక్టు విషయంలోనూ కేంద్రప్రభుత్వ ఆమోదం త్వరలోనేలభించ గలదని అనుకుంటున్నాం. ఈ ప్రాజక్టులకు సంబంధించిన సాంకేతిక సహాయం కోసం, ఈ కార్పొరేషన్ జెకోస్లోవేకియా, జపాన్, హంగరీలోని సంస్థలతో సంప్రదింపులు జరుపుతోంది. ఆంధ్రప్రదేశ్‌లో దుక్క-ఇనుము ప్రాజెక్టును ఏర్పాటుచేయాలనే ప్రతిపాదన కొంత కాలంగా ప్రభుత్వ పరిశీలనలో వుంది. రాష్ట్రంలోని ముడి పదార్థాల నుంచి తగిన దుక్క ఇనుము ఫౌండ్రీ రకాలను ఉత్పత్తిచేసే విషయమై జంషడ్పూర్, నేషనల్ మెటలర్జికల్ లెబోరేటరీ తయారు చేసిన నివేదికను పరిశీలించేందుకై కేంద్రప్రభుత్వం ఒక సాంకేతిక సంఘాన్ని నియమించింది. ఈ సంఘం ఈ ప్రతిపాదన అనుసరించదగినదిగానే వుందని భావించి. ఉత్పత్తికి సంబంధించిన ఆర్థిక విషయాలను ఇంకెక్కువ వివరంగా పరిశీలించ వలసిందిగా రాష్ట్ర ప్రభుత్వానికి సలహా యిచ్చింది. తదనుగుణంగా ఏడాదికి లక్ష టన్నుల దుక్క-ఇనుము తయారికిగాను పారిశ్రామిక అభివృద్ధి కార్పొరేషన్ లైసెన్సుకోసం దరఖాస్తు దాఖలుచేసింది. ప్రాజెక్టు మొత్తం ఖర్చు ఏడెనిమిది కోట్ల రూపాయలదాకా ఉంచవచ్చని అంచనా వేయబడింది.

రాష్ట్రంలోని వివిధ ఖనిజాల సంపత్తిని వినియోగంలోకి తెచ్చేందుకు- ప్రైవేటు రంగంతో సహకరించి, ఖనిజ-పరిశ్రమలను పెంపొందించేందుకు ఏర్పాటు చేయబడిన ఆంధ్రప్రదేశ్ మైనింగ్ కార్పొరేషన్ పూర్తిగా ప్రభుత్వ యాజమాన్యపు సంస్థ. ఈ సంస్థ ప్రస్తుతం కృష్ణా, కర్నూలు జిల్లాలలోని ముడి ఇనుమును, ఖమ్మంజిల్లాలోని బేరైట్సును వినియోగంలోకి తెచ్చేందుకై కృషి చేస్తుంది. కేంద్ర ప్రభుత్వ ట్రేడింగ్ కార్పొరేషన్ ద్వారా ముడి ఇనుము ఎగుమతి చేయబడుతోంది. ఖమ్మంలోని బేరైట్సును కొత్తగూడెం, బేరియమ్ కెమికల్స్ లిమిటెడ్‌కు సప్లయి చేయటం జరుగుతోంది. ఈ మైనింగ్ కార్పొరేషన్ కర్నూలు జిల్లాలోని మేలురకం సున్నపు రాళ్ళ వినియోగం విషయమై కృషిచేస్తుంది. ఇంకా ఇతర ముడి ఇనుము డిపాజిట్లు మేంగనీస్, పాలరాయి, ఒండుమట్టి, సున్నపురాయి, తదితర ఖనిజాల వినియోగానికై కూడా కార్పొరేషన్ కొన్ని పథకాలను రూపొందించింది. ఆస్‌బెస్టాస్, రాగి, గ్రాఫైట్ వగైరా విలువగల ఖనిజాల పరిశోధనకు సంబంధించిన పథకాలు కూడా ఉన్నయ్. రెండు లక్షల టన్నుల ఉత్పత్తి శక్తిగల సిమెంట్ పరిశ్రమకు కార్పొరేషన్‌లైసెన్సును మంజూరుచేసింది. ఈ పరిశ్రమ ఖమ్మం జిల్లాలో ఏర్పాటవుతుంది. కాగా, సున్నపురాయి, ఒండుమట్టి, పాలరాయి, గ్రాఫైట్, మైకా, ఇటుకరాయి ఖనిజాలపై ఆధారపడే మిగతా మధ్యరకం పరిశ్రమలు, వీటిని ఏర్పాటుచేసే పథకాలను గురించికూడా కార్పొరేషన్ ఆలోచిస్తుంది.

సింథెటిక్ డ్రగ్ ప్రాజక్టుపని అనుకున్న విధంగా సాగిపోతోంది.

రామచంద్రపురంలోని భారీ విద్యుచ్ఛక్తి పరికరాల ప్రాజెక్టు కొన్ని సాంకేతిక యిబ్బందులవల్ల పూర్తిగా మానివేయబడుట కాని, కాల పరిమితి లేకుండ వాయిదా వేయబడుటకాని జరుగవచ్చునని ప్రజలకు, ప్రభుత్వానికీ మొన్నటివరకు చాలా ఆందోళన కలిగించింది. కాని ముఖ్యమంత్రి ప్రధాన మంత్రికి వ్రాసిన మీదట వారిచ్చిన హామీని బట్టి, కొన్ని రోజుల క్రితం కేంద్ర భారీ పరిశ్రమల మంత్రి హైద్రాబాదు వచ్చినప్పుడు వారుకూడ యిచ్చిన హామీని బట్టి, యీ ప్రాజెక్టుకు కలుగుతాయనుకున్న ఇబ్బందులు తొలిగిపోయి అనుకున్నవిధంగా ప్రాజెక్టు సాగి, అనుకూల పారిశ్రామిక వాతావరణం ఏర్పడుతుందని గాఢంగా విశ్వసిస్తున్నాము. వారికి ధన్యవాదాలు.

## నీటి పారుదల.

పెద్దరకం, మధ్యరకం నీటిసాగు ప్రాజెక్టుల పని తృప్తికరంగా సాగుతోంది. దురదృష్టవశాత్తు కొన్నిరాష్ట్రాలు నదీజలాల విషయమై వివాదాలను లేవదీశాయి. మన రాష్ట్ర ప్రభుత్వం మన ప్రధాన దృక్పథాన్ని పునరుద్ఘాటిస్తూ, సాధ్యమైనంత వెంటనే శ్రీశైలం, పోచంపాడు ప్రాజెక్టులకు అనుమతి నివ్వవలసిందిగా కేంద్రప్రభుత్వాన్ని కోరుతోంది. ఎందుకంటే. ఎలాంటి పరిస్థితుల్లో కూడా వీటినింకా వాయిదా వేస్తూవుండటానికి మాత్రం వీల్లేదు.

## విద్యుచ్ఛక్తి పథకాలు.

పారిశ్రామిక అభివృద్ధికోసం ప్రభుత్వమూ, వివిధ కార్పొరేషన్లు, కంపెనీలు శాయశక్తులా కృషిచేస్తున్నమాట నిజమే. అయినా ఇంకెక్కువగా పురోగమించాలంటే, అందుకు విద్యుచ్ఛక్తి చాలా అవసరం. విదేశీమారక ద్రవ్యం, దిగుమతులు, వగైరా ఇబ్బందుల మూలంగా విద్యుచ్ఛక్తి పథకాలు కొంచెం దెబ్బతిన్నయ్. అయితే స్వల్పకాలపు, దీర్ఘకాలపు విద్యుచ్ఛక్తి అవసరాల విషయంలో అభివృద్ధిని సాధించేందుకై ప్రభుత్వం వివిధ కార్యక్రమాలను అప్పుడే అమలు జరుపుతోంది. త్వరలోనే పరిస్థితి అభివృద్ధి చెందగలదని ఆశిద్దాం.

తుంగభద్ర జల - విద్యుచ్ఛక్తి పథకం కింద, తుంగభద్ర-నెల్లూరు హైడ్రో-థర్మల్ పథకం కింద, ఒక్కొక్కదానికి 9 మెగావాట్ల శక్తి ఉన్న 8 యూనిట్ల స్థాపన జరుగుతుంది. ఇందులో నాలుగు యూనిట్లు రెండవ ప్రణాళిక కాలంలో ఏర్పాటు చేయబడినై. మిగతా 4 యూనిట్లకు సంబంధించిన పని

జరుగుతోంది. ఇవి 1963-64 లో వినియోగం లోకి రావచ్చు. కాగా, నెల్లూరులో 30 మెగావాట్ల శక్తిగల థర్మల్ కేంద్రాన్ని ఏర్పాటు చేయాలని వుంది. యంత్రాలు వగైరాల్లో అధిక భాగం అప్పుడే లభించింది. వచ్చే ఏడాది స్థాపన కార్యక్రమం ప్రారంభం కావచ్చు. 1964 ఏప్రిల్ నాటికి వినియోగం లోకి రావచ్చు.

ఎగువ సీలేరు జల-విద్యుచ్ఛక్తి పథకపు పనికూడా చురుగ్గా కొనసాగుతోంది. గుంటవాడవద్దఒక 'వైర్'నిర్మించబడుతుంది. ఒక్కొక్క దానికి 60 మెగావాట్ల శక్తివున్న రెండు సెట్లుండే జల-విద్యుచ్ఛక్తి కేంద్రం ఒకటి నిర్మించ బడుతుంది. యంత్రాలు వగైరాలకు స్విట్జర్లండు దేశపు పరపతి సహాయంతో ఆర్డర్లను పెట్టటమైంది. సివిల్ పనులు కొనసాగుతున్నయ్.

కొత్తగూడెం థర్మల్ పథకం కింద, కొత్తగూడెంలో 60 మెగావాట్ల శక్తిగల రెండు సెట్లతో ఒక థర్మల్ కేంద్రం ఏర్పాటు చేయబడుతుంది. ఈ పథకానికి ఆర్థికంగా సహాయ పడుతున్న ప్రపంచ బ్యాంకు తుది ఆమోదం ఇంకా అందలేదు. ఈ లోపు సివిల్ పనులకు ఉపక్రమించట మైంది. వచ్చే ఆర్థిక సంవత్సరం యంత్రాలు వగైరాలకు ఆర్డర్లు పెట్టవచ్చు.

అలాగే రామగుండం థర్మల్ విస్తరణ పథకానికై టర్బో-ఆల్టర్నేటర్‌కుకూడా ఇది వరకే ఆర్డరు పెట్టబడినవి. బాయిలర్స్, తదితర సామగ్రి ఆర్డర్లను 1963-64 లో పెట్టటం జరగవచ్చు.

వినియోగం అత్యధికంగా వుండే సమయంలో విద్యుచ్ఛక్తి కొరతను కొంత వరకైనా తగ్గించటానికైనా హైదరాబాదులో 10 మెగావాట్ల గ్యాస్ టర్బో సెట్లను ఏర్పాటు చేయాలని వుంది. ఈ సెట్లకు అప్పుడే ఆర్డర్లను పెట్టటమైంది. 1963-64 లో ఈ సెట్లు వినియోగంలోకి రావచ్చు.

ఒరిస్సా ప్రభుత్వంతో చేసుకొన్న ఒడంబడిక ప్రకారం, బలిమెల వద్ద ఆనకట్టను ఒరిస్సా నిర్మిస్తోంది. ఇది ఉభయ ప్రభుత్వాల సంయుక్త ప్రయత్నం. ఇందుకు కావలసిన ధనాన్ని సవరించిన అంచనాల్లోనూ, వచ్చే ఏడాది బడ్జెట్‌లోనూ కేటాయించడం జరిగింది మన ప్రభుత్వ వాటా కింద.

## వార్ధక్యపు పింఛనులు

వార్ధక్యపు పింఛన్లకై వచ్చే దరఖాస్తులను త్వరగా పరిష్కరించేందుకై, ప్రభుత్వం జిల్లా కలెక్టర్లు పాటించవలసిన మంజూరు నిబంధనలను సవరించింది. పౌరుల జాతీయ రిజిస్టరులోగాని లేదా ఓటర్ల జాబితాలోగాని, పేర్కొన్న విషయాల ప్రకారం ప్రస్తుతం వయస్సుకు సంబంధించిన సర్టిఫికెటును సమర్పించాలి. కాని కొన్ని విషయాల్లో అలాంటి రిజిస్టర్లలో కావలసిన సమాచారం లభించటంలేదు. అట్టి సందర్భాల్లో, తగిన దరఖాస్తుల విషయంలో దరఖాస్తుదారుని వయస్సుని నమోదుచేసే వైద్యాధికారి సర్టిఫికెటు వుంటే చాలునా అని ప్రభుత్వం యొక్క ఆలోచనలో వుంది.

ఈ పథకమునకు, మరియు క్రిందటి నా బడ్జెట్ ప్రసంగములో సూచించిన మంచి ప్రతిభగల బాలబాలికల ఉన్నత విద్యాభివృద్ధి పథకానికి, అవసరమగు కేటాయింపులు చేయబడినై.

అత్యవసర పరిస్థితిని ప్రకటించగానే, రాష్ట్ర ప్రజా రక్షణ సంఘాన్ని నెలకొల్పాం. ఆ సంఘము, దాని ఉప-సంఘాలు వాటి వాటి వివిధ బాధ్యతలను శ్రద్ధాసక్తులతో నెరవేరుస్తున్నయి-విరాళాల వసూళ్ళు, వ్యవసాయ, పరిశ్రమల రంగాల్లో అధికోత్పత్తిని సాధించటం, ధరలను అదుపులో పెట్టడం. సాయుధ దళాలవారికి, వారి కుటుంబాలకు సౌకర్యాలను సమకూర్చటం వగైరా కార్యక్రమాలను గురించి కృషి జరుగుతోంది. ఇదేమాదిరిగా సంఘాలను జిల్లా, మ్యునిసిపల్, బ్లాకు స్థాయిలలోకూడాఏర్పాటుచేయడం జరిగింది. ఇందు మూలంగా రాష్ట్రంలోని యావత్తు ప్రజానీకం దేశరక్షణ కృషిలో పాల్గొనటానికి వీలవుతుంది.

దేశ రక్షణనిధికి మనం మొదట్లో సంకల్పించుకొన్న 3½ కోట్ల ధనాన్ని ఇంత స్వల్ప వ్యవధిలో సమకూర్చిన మన ప్రజలందరికీ ముఖ్యంగా మనరైతాంగానికి నా ధన్యవాదాలు. వారి హృదయపూర్వక సమర్పణ అది. మన ముఖ్యమంత్రి, ఆయన అనుచరులు రాష్ట్రమంతా పర్యటించి, ప్రజలకు ప్రస్తుత పరిస్థితిని గురించి ప్రబోధించి, వారి సహకార, సహాయాలను పొందారు. ఈ సందర్భంలో ఎనలేని కృషిచేసిన జిల్లా కలెక్టర్లకు, యితర అధికారులకు, శాసన సభ్యులకు, జిల్లా పరిషత్తుల, పంచాయతీ సమితుల అధ్యక్షులకు, ప్రజా ప్రతినిధులకు, సాంఘిక కార్యకర్తలకు నా కృతజ్ఞతను తెలుపుతున్నాను. ఈ అత్యవసర పరిస్థితిలో పారిశ్రామిక రంగంలో శాంతిని పెంపొందించి, ఉత్పత్తి నధికంచేసి, ఆ విధంగా దేశ రక్షణకృషికి తోడ్పడుతూ, దేశ రక్షణనిధికి ధారాళంగా విరాళాలనిస్తూ, తమ దేశభక్తిని ప్రకటిస్తున్న శ్రామిక వర్గాల వారందరికీ నా అభినందనలు.



*గమనిక :* 33 వ పేజీ 3 వ కాలం 21 వ పంక్తిలో "కార్ప్స్" అని ఉన్నదానిని ''కోర్''గా చదువుకొనవలెను.

# వెలుగు బాటలు

కె. వి. భాస్కర రావు.

బస్సు ప్రయాణం చేయడమంటే సోషలిజాన్ని ఆచరించడమే నంటాడు నా మిత్రు డొకడు. బాగా ఆలోచిస్తే ఈ విషయం కొంతవరకు నిజమేమో ననిపిస్తుంది. బస్సులో వున్నంతసేపూ ధనికులు, పేదలు అనే తారతమ్యంలేదు. ఉన్నత పదవిలోవున్న వ్యక్తి ఐనా సాధారణవ్యక్తి ఐనా సమానమే. హోదాలతో, నిమిత్తంలేకుండా ఒకరి ప్రక్కన మరొకరు కూర్చోవచ్చు. అంటే వ్యక్తులందరికీ వీలైనంతవరకూ సమానావ కాశాలు వుంటాయన్నమాట. ఇలాంటి ప్రయాణంలో మరోలాభంకూడా వుంది. జీవితపు విలువలు, కష్టసుఖాలు తెలిసికొనే టందుకు ఇదొక అవకాశం.

ప్రజా సామ్యంలో ప్రజల అభిప్రాయాలకు, అభిరుచులకు ఎంతో విలువ వుంది. వాటిని వ్యక్తం చేసేటందుకు అనేక సాధనాలు వున్నాయి. దేశ స్థాయిలో ప్రజావాణికి ప్రతిబింబం పార్లమెంటు. రాష్ట్రాలలో శాసన సభలు, శాసన మండలులు ఈ పనిని నిర్వహిస్తాయి. ప్రజలచే ఎన్నికైన ప్రతి నిధులు పరిపాలనా విధానాలను రూపొంది స్తారు. ప్రభుత్వం వాటిని ఆచరణలో పెడు తుంది. అంటే ప్రజలు తమ భవిష్యత్తును తామే నిర్ణయించుకొంటారు.

స్వాతంత్ర్యం వచ్చాక మన ప్రజాసామ్యపు పునాదులు క్రమంగా బలపడ్డాయి. కేంద్రం నుండి మారుమూలనున్న గ్రామంవరకూ ప్రజా స్వామ్యం విస్తరింప బడింది. ప్రతి దశలోను ప్రజలు తమ అభిప్రాయాన్ని వెలిబుచ్చే టందుకు అవకాశం లభించింది. జిల్లా సాయిలో జిల్లా పరిషత్తు, బ్లాకుస్థాయిలో పంచాయతీ సమితి, గ్రామ స్థాయిలో పంచాయతీ ఈనాడు ప్రజలకు ప్రాతినిధ్యం వహిస్తున్నాయి. స్థానిక ప్రజలు తమ అవసరాల కనుగుణంగా కార్యక్రమాలను నిర్వహిస్తు న్నారు. తమ అభిప్రాయాలను ప్రభుత్వానికి తెలియ జేస్తున్నారు.

పరిపాలనా సౌలభ్యానికి ఇవన్నీ చట్ట బద్ధంగా ఏర్పడిన సంస్థలు – నిత్య జీవితంలో మరికాస్త లోతుకుపోతే అనేక విధాల ప్రజాభిప్రాయం ప్రతిబింబిస్తుంది. రైలు, బస్సు ప్రయాణాలలోను, కాఫీహోటళ్ళలోను రచ్చ బండలదగ్గరా దైనందిన జీవితంలోని అనేక సమస్యలు చర్చకువస్తుంటాయి. అనేక ప్రాంతాలవారు కాకతాళీయంగా ఇలాంటిచోట్ల కలుసుంటారు. ఇంతకు పూర్వం ఒకరినొకరు తెలియకపోయినా తమ అభిప్రాయాలను నిర్మొహమాటంగా ప్రకటిస్తారు. సాధారణంగా వీరు చర్చించని విషయమంటూ వుండదు. అణ్వస్త్రాల నిషేధం నుండి, అమ్మాయిల పెళ్ళిళ్ళవరకూ ప్రతి విషయాన్నీ వీరు సమీక్షించ వలసిందే. ప్రయాణాలలో కొన్ని సంభాషణలువింటుంటే మన పార్లమెంటు, శాసన సభలకుకూడా ఇంత స్వాతంత్ర్యం లేదేమోననిపిస్తుంది.

ఇటీవల జరిగిన సంఘటనేయిది. రాజ ధానినుండి మరోవూరికి బస్సులో ప్రయాణం చేయవలసి వచ్చింది. బస్సులో ఖాళీలేకుండా ప్రయాణీకులు కూర్చున్నారు. వివిధ ప్రాంతాలకు చెందిన వివిధ వృత్తులవారు అందులో వున్నారు. బయలుదేరవలసిన టైము కావడంతో డ్రైవరు చక్రాన్ని చేపట్టాడు. 40 మంది ప్రయాణీకుల ప్రాణాలకు తానే బాధ్యుడ నన్నట్లు జాగ్రత్తగా నడుపుతున్నాడు. కండక్టరు తన సమస్యలో తాను నిమగ్ను డయ్యాడు. ప్రతి ప్రయాణికుని దగ్గరా చార్జి వసూలు చేయడం, అవసరమైనచోట చిల్లర ఇవ్వడంతో అతనికి తీరిక లేకుండావుంది. క్రమంగా బస్సు పట్టణందాటి వేగం పెరుగుతూ పోతోంది. లోపలి ప్రయాణీకులు ఒకరినొకరు పరిచయంచేసి కొంటున్నారు. 'పొగత్రాగరాదు' అని వ్రాసి వున్నప్పటికీ కొందరు సిగరెట్లు వెలిగించారు. నేను ఒక ప్రక్కన కూర్చొని వున్నాను. కొంత సేపటికి ఇద్దరు ప్రయాణికులు లోకాభిరామాయణం ప్రారంభించారు. ఈ సంవత్సరం పంటలు రాలుబడి సగానికి సగమే నన్నాడు మొదటి వ్యక్తి. దానికి తోడు ధరలుకూడా అంతగిటు బాటు గాలేవు అన్నాడు రెండవవ్యక్తి. ఏదైనా వ్యాపారంచేస్తే బాగుండేటట్టు కన్పిస్తోంది అన్నాడు మళ్ళీ మొదటి మనిషి. అవును మావూరి మల్లయ్య క్రిందటేడు లారీ ఒకటికొన్నాడు. అప్పుడే లారీ ఖర్చు రావడమేగాక ఎంతోలాభంవచ్చిందిఅన్నాడు రెండో ఆయన. కలిసివచ్చే రోజువస్తే పట్టింది బంగారమౌతుంది ... ఇలా సాగిపోతోంది. వారి సంభాషణ. బస్సు మరో పదిమైళ్ళు పోయేలోపుగా ఎన్నో విషయాలు మాట్లాడారు. చివరకు మొదటివ్యక్తి అడిగాడు :—

'చైనా వ్యవహారం ఏమైందంటారు ?'

'ఏమయ్యేదేముంది ? తోక ముడుచుకొని వెనక్కు పోయారుగా !'

'ఇకముందు కెక్కడికి వస్తారు వాళ్ళ మొహం' అన్నాడు రెండోవ్యక్తి వివాదం ఇంతటితో తీరి పోయిందన్నట్లు.

ఈ సంభాషణంతా వింటున్నాడు ప్రక్కనే వున్న మరొక ప్రయాణికుడు. అప్పటివరకూ మౌనంగా వున్నవాడల్లా వెంటనే అందు కొన్నాడు.

'ఒకసారి మోసపోయాక చైనావాళ్ళ నెలా నమ్ముతామండీ? వాళ్ళంతట వాళ్ళే వెనక్కు పోతామన్నారు, పోయారు. ఐనా మన భూభాగాన్ని చాలా ఆక్రమించుకొని కూర్చున్నారు. నమ్మక ద్రోహం చేసినవాళ్ళు ముందెలాంటి అఘాయిత్యానికైనా తల పడవచ్చు!

ఈ సమాధానం మొదటివ్యక్తికి బాగా నచ్చింది. 'అలాంటి వాళ్ళను నమ్మడంచాలా కష్టం సుమండీ! ఎలాంటి ప్రమాదాన్ని ఎదుర్కొడానికైనా మనం సిద్ధంగావుండాలి. అందుచేతే మన రక్షణకృషి చురుకుగాసాగు తోంది' అన్నాడు.

ఇలా ఎవరి అభిప్రాయాలను వారు వెల్ల డించి ప్రక్కవూరు రాగానే దిగిపోయారు. చెప్పవచ్చేదేమంటే మన ప్రజలు స్వాతంత్ర్య రక్షణకు ఎంతటి త్యాగం చేయడానికైనా ఎల్లప్పుడూ సిద్ధమే. అంతేగాదు. ఈ సంఘ టనవల్ల అతి సామాన్యమైన ప్రజానీకంలో కూడ మన స్వాతంత్ర్యంపట్ల, దేశ రక్షణ పట్ల ఎంతటి దృఢమైన అభిప్రాయాలు, శ్రద్ధాసక్తులు, అభినివేశం వున్నాయో తెలు స్తుంది. ఇది నిజంగా గర్వింపదగ్గ విషయం. అంగబలం, అర్థబలానికితోడు ప్రజలనైతిక బలంకూడ ఒక విధంగా జాతీయ సంపదగా పేర్కొనవచ్చు. చైనా దురాక్రమణను ఎదు ర్కొనడంలో మన సైనికులేగాక పౌరులు కూడ క్రమ శిక్షణతో కూడిన, ధైర్య స్థైర్యా లను ప్రదర్శించారు. వదంతులకు లోనుగాక దేశంలో నైతిక స్థాయిని సమర్థవంతంగా నిలబెట్టారు. అంతేగాదు. వివిధ దశలలోను రక్షణ కృషిని పటిష్ఠం చేసేటందుకు ప్రజలు నడుంకడుతున్నారు. ఇటీవల ప్రారంభింప బడిన గ్రామీణ స్వచ్ఛంద సేవాదళ కార్య క్రమం మన గ్రామాల్లోని మానవ సంపదను సమీకరించి సద్వినియోగ పరచడానికి ఉపక రిస్తుంది. బ్లాకులనుండి వస్తున్న నివేదికలను బట్టి ఈ కార్యక్రమంపట్ల ప్రజలుబాగా ఉత్సా హం చూపుతున్నట్లు తెలుస్తోంది. శిక్షణ పొందిన దళపతులు గ్రామంలోని ఇతర యువకులలో ఆసక్తిని పెంపొందిస్తున్నారు ఈ కార్యక్రమాన్ని శాంతి కాలంలోకూడ గ్రామ సంరక్షణ, అగ్ని ప్రమాద నివారణ, అధికోత్పత్తి మొదలైన సామూహిక ప్రయో జనాలకు వినియోగించవచ్చు. ప్రపంచంలో మానవ సంపద విస్తారంగా గల దేశాలలో భారతదేశం ఒకటి. ఈ సంపదను సంఘ ప్రయోజనాలకు, రక్షణావసరాలకు వినియో గించ గల్గితే గ్రామాలలోని అనేక సమస్య లను ప్రజలు తామంతటతామే పరిష్కరించు కోగలరు. స్వాతంత్ర్యానంతరం పరిపాలనలో అనేక కార్యక్రమాలను దిగ్విజయంగా నిర్వ హించిన మన ప్రజలకు యిదేమంత కష్టం గాదు.

ఏ దేశ చరిత్రచూచినా కేవలం సైనిక శక్తితోనే రక్షణకృషి సరిపోదని ఋజువౌ తున్నది. ఆదేశ ప్రజల నైతికబలం, సైనికు లకు వారిచ్చే ప్రోత్సాహం, వివిధ రంగాలలో వారు సాధించే ఉత్పత్తి ఇవన్నీ మాతృదేశ రక్షణకు ఉపకరిస్తాయి. ప్రణాళికా బద్ధంగా అన్ని రంగాలలోను పురోభివృద్ధిని సాగించే టందుకు మనం కృషి చేస్తూనేవున్నాం. నేడే ర్పడిన జాతీయ అత్యవసర పరిస్థితి దృష్ట్యా ఈ కృషి మరింత వేగంకావాలి. వ్యవసా యంతోసహా సత్వరంగా అన్ని పరిశ్ర మలూ అభివృద్ధి చెందాలి. ఎన్నో కష్టాలకు, త్యాగాలకులోనై బానిసత్వంనుండి బయట పడిన మనకు స్వాతంత్ర్యపు విలువ తెలుసు. దాని పరిరక్షణకు ఎంతత్యాగంచేసినా స్వల్పమే. అందువల్లనే నేడు మన ప్రజలు ఏ వృత్తికి చెందినా, ఎక్కడ పనిచేస్తున్నా ఒకే లక్ష్యంతో వున్నారు. వారందరిదీ ఒకే మాట. ఒకే బాట. అదే మన స్వాతంత్ర్యానికి వెలుగుబాట.



# కమ్యూనిటీ రేడియో సెట్లు

1962 డిసెంబరు నెలలో దిగువ గ్రామాలలో కమ్యూనిటీ రేడియో సెట్లను నెలకొల్పడం జరిగింది :

బోధన్ మునిసిపాలిటీ (నిజామాబాదు జిల్లా), పౌన్నూరి పంచాయితీ (ఆదిలాబాదు జిల్లా), కొంకపాక (వరంగల్లుజిల్లా), పంతేరి (వరంగల్లుజిల్లా), అంబరీపురం (విశాఖపట్నం జిల్లా), రాజేశ్వరపురం (ఖమ్మం జిల్లా), కోయచిలుక (ఖమ్మంజిల్లా), భానాపురిని (ఉేకులపల్లి) (ఖమ్మంజిల్లా), గూడపూర్ (నల్లగొండ జిల్లా), దిగువంశపల్లి (చిత్తూరు జల్లా) వేల్పుమడుగు (అనంతపురం జిల్లా), నలింగపురం (మహబూబునగర్ జిల్లా), ఆవంచ (పాతశాల) (మహబూబునగర్ జిల్లా), ఉరుకొండ (మహబూబునగర్ జిల్లా), గోకారం (మహబూబునగర్ జిల్లా), జూపల్లి (మహబూబునగర్ జిల్లా), గణపురం, (మహబూబునగర్ జిల్లా), కంసానిపల్లి (మహబూబునగర్ జిల్లా), నిజామాబాదు (మహబూబునగర్ జిల్లా), చట్టూతం (మహబూబునగర్ జిల్లా), వట్టిపల్లి (మహబూబునగర్ జిల్లా), చట్టునెల్లికుదురు (మహబూబునగర్ జిల్లా), తాళ్లపల్లి, (మహబూబునగర్ జిల్లా), ధమగన్‌పూర్ (మహబూబునగర్ జిల్లా)



# సైనికుని ఉత్తరం

"కరుణశ్రీ"

ఓ నా దేశ ప్రజలారా !
ఉభయ కుశలోపరి.
ఉత్తరం వ్రాస్తున్నా
ఉత్తరం ఇదిగో మరి.

కరాళ మృత్యు దంష్ట్రాగ్రం
కురాల చాటు నుంచి
గంగా యమునా బ్రహ్మపుత్రలు
జన్మించిన చోటు నుంచి
ఉత్తరం వ్రాస్తున్నా
ఉత్తరం ఇదిగో మరి.

అత్యంతం అమూల్యమైన మానవత్వాన్ని
ఆ మూలాగ్రం నాశనం చెయ్యాలని
ప్రత్యేకం పని కట్టుకున్నారు పాతకులు
సత్యాన్నీ ప్రేమనీ శ్రద్ధనీ
హత్య చేస్తున్నారు కిరాతకులు.

ఇద్దరి నడుమ సరిహద్దుల కోసం
గ్రుద్దులాట కానే కాదిది
సమస్త విశ్వ శాంతిని
సవాలు చేసే జటిల సమస్య ఇది.

కుక్కల్లా లెక్కకు రాని
దిక్కులేని చావు చావటమో
జయించి జీవిత పరమార్థాన్ని
మహిమాన్వితం చేయటమో

రణం కాదు రణం కాదిది
రామ కార్య నిర్వహణం.
బ్రతుకో చావో పవిత్ర జాహ్నవీ తీరం
స్వామి కార్య నిర్వహణం - క్షణభంగురం శరీరం.

దేనికిలే పేరు తమ్ముడూ
నే నొక సైనిక వీరుణ్ణి —
దీను రాలైన ఒకా నొక
వితంతువు కుమారుణ్ణి —
బ్రతుకు గతుకుల్లో
ప్రాణాలు బిగ బట్టుకొని —
అమ్మ పెంచింది నన్ను
అర చేతుల్లో పెట్టుకొని -
కరిగి నీరైన కన్నతల్లి
నిండు గుండెల కన్నీళ్లతో -
పెరిగి పెద్దయి నాను
చిరిగిన నిరాశ పొత్తిళ్ళలో.

గ్రామం పేరు ఏమంటున్నావా భాయీ !
భారత భూమిలోని గ్రామాలన్నీ
ఒకేలా నాకు కన్పిస్తాయి.
సన్నని సందులు సావిళ్లు
తిన్నని ఎద్దు బండ్లు
కన్నుల విందు చేసే
చిన్న చిన్న పూరిండ్లు —

పైరు పొలాలు, పంట కుచ్చెలలు
పసిడి కంకుల కళ కళలు -
పడుచు లంగా కలంకారీ
అలంకారాల తళ తళలు -

సంధ్యారుణ కాంతుల్లో స్నానంచేస్తూ
'అంభా' అని అరుస్తూ
కోడె దూడను నాకుతున్న
గోమాత కన్నుల మిల మిలలు -

ఈ కందకంలో పడి వుండి
ఈ రోజుకు మూడు రోజులు
రగిలే పొగలు, పగిలే బాంబులు
మండే మంటలు, మృత్యుదేవత
నీలి నీడలు పారాడే గుంటలు.

జాము సేపునుంచీ వాతావరణం
కొంచెం శాంతంగానే వున్నది
సైనికుల భాషలో శాంతికి
'మరే' సరైన అర్థం ఏమున్నది ?

ఎవరివో ఆర్త ధ్వనులు
చెవులు బ్రద్దలు చేస్తున్నవి
దొంగ తోడేళ్ళ రంగు గడ్డాల
బర బరలు వినవస్తున్నవి

ఎముకలు కొరుక్కు తినే చలిలో
కాళ్లు చేతులు కొంగర్లు పోతున్నవి
రక్తం గడ్డ కట్టింది
దృష్టి స్తంభించి పోయింది.

ఎదలో వెచ్చ వెచ్చగా
మెదలుతూ పదే పదే గుర్తుకు వస్తున్నవి
దూరాన వున్న కన్నతల్లి
చల్లని మమతా -
అనురాగ మయి అర్థాంగి
తియ్యని అమాయికతా -

పిట్టల కిచ కిచలలో
కిల కిల నవ్వే పాలబుగ్గల
చిట్టి బాబు చిన్నారి పెదవుల జతా -
ఎదలో వెచ్చ వెచ్చగా
మెదలుతూ పదే పదే గుర్తుకు వస్తున్నవి.

కనిపిస్తున్నవి అవిగో
అమ్మ కనికరపు కళ్లు
జలజల కారుతున్నవి
నులి వెచ్చని కన్నీళ్ళు
పొర్లి పోతున్నవి గుండెలు
తడిసి ముద్దైనవి చెక్కిళ్లు.

ప్రక్కనున్న పంచాయితీ రేడియో
ఒక్కటే ఆమెకు తోడు
అక్కడే కుక్కి మంచంలో
అమ్మ పడుకున్నది నేడు

మింటి ముంగిట్లో మిల మిల మెరుస్తున్న
ఒకే ఒక నక్షత్రం వైపు
అదే పనిగా పరుగిడు తున్నది
అమ్మ చూపు —

ఏవరైనా చెప్పండి అమ్మకు
ధైర్యంగా వుండమని
నా శిరస్సుపై ఆమె
ఆశీస్సులు కురుస్తుండమని.

అమ్మా ! నీవు నిబ్బరంగా వుండు
నీ పేరు తలుచుకుంటూ నేను
ముందుకు నడుస్తున్నాను.
నరుల కండలు కొరుక్కు తినే
రక్కసి గ్రద్దల డొక్కలు చించుతున్నాను.
బండల మీద బాది
ముక్కలు ప్రక్కలు చేస్తున్నాను.

ధన్యమైన నీ స్తన్యం మీద ఒట్టు పెట్టుకొని
గట్టిగా చెపుతున్నాను తల్లీ !
'వీరమాత' అనే బిరుదం
నీ మెడలో హారంగా అలంకరిస్తాను.

రణరంగం నుంచి తిరిగి
ఇంటికి రాగలిగితే —

నీ కాళ్లు కళ్ల కద్దుకొని
నీ చేతులు ముద్దుగొని
నీ పాద ధూళి మౌళిపై
పులుముకొని పులకించి పోతాను.

లేదా తల్లీ!
కన్న తల్లి గౌరవానికి మాత్రం
కళంకం తీసుకురాను.

ఎవరు నీవు?
అమ్మ ప్రక్క నిలుచుండి
అశ్రువులు రాలుస్తున్నావు?
ఎందుకలా వెక్కి వెక్కి ఏడుస్తావు?

క్షణ క్షణం కరిగి పోతూ
జ్వలించే మైనపు వత్తిలా —
ఝంఝా మారుతానికి
చలించే రావాకుల గుత్తిలా —

దురంత దుర్దినం దురా
క్రమణలో నిరాశ చెందకు
నిరంత నిస్పృహతో కుందకు.
నిబ్బరం గోల్పోకు
చింతాక్రాంతురాలివి కాకు.

మంగళ మయమైన ఈ సమయంలో
అమంగళంగా అశ్రు తరంగాలు
పొంగి పొరల నీకు.
ఇది పూజా సమయం — వేళయింది

జగజ్జనని కాళికాదేవి
ఆలయం తలుపు తెరువబడింది
అగరు ధూపం అక్షతలూ తీసుకురా —
అసృక్ బిందుల చిందులతో తడిసి వికసించిన
అరుణ కమలాలు కోసుకురా —

కాదిది ఒకరిద్దరి సంగతి
యావద్దేశానికి సంభవించింది విపరీత విపత్కర పరిస్థితి

వందలు వేలు వీరసైనికులు నావంటివారు
పందెం వేసుకొని ముందుకువచ్చి పడుతున్నారు.

పవిత్ర కర్తవ్య మహా యజ్ఞంలో
ప్రాణాలు ఆహుతి చెయ్య బోతున్నారు
పరమోత్కృష్టమైన ఇటువంటి అదృష్టం
బ్రతుకులో ప్రాప్తించటం ఎంతోకష్టం

అదేదో ఆవేదన గుబ గుబ
లాడుతున్నది గుండెల సందున —
ప్రాణం పోయే ముందు
ఒక్కమాటు నిన్ను చూడాలి —
పసుపు కుంకుమల బంగారు కాంతి
కెరటాలలో స్నానమాడాలి —
ఆలోచనకు సమయంలేదు
ఆత్మార్పణానికి వేళయింది.
విశాల భారత విమోచన
వీర దుందుభి మ్రోగింది
విజయోత్సవం సాగింది.

ఏమాత్రం నీకు నామీద ప్రేమవున్నా
ఈ మాత్రం తప్పకుండా చెయ్యాలి

మన బిడ్డల మనస్సులో దిక్కులేని వారమనే
దీనభావం తీసెయ్యాలి
వాళ్ళకు ఆత్మ గౌరవం నూరిపొయ్యాలి
వాళ్లు పెద్ద వాళ్ళయి సగర్వంగా తలెత్తుకు తిరగాలి.
వాళ్ళ నాన్న పేరు తలుచుకొని
వాళ్ళ దేహాలు నిలువునా పులకించాలి.

కరుణామయీ! కన్నీళ్లు తుడుచుకో
దుఃఖం దిగమ్రింగు
కర్తవ్య నిర్వహణం — ఇది కఠోర పరీక్షా క్షణం
ఇంకేమీ అనుమానం లేదు.

నారీజీవనం నాటికీ నేటికీ
ఇలాగే నడిచి పోతున్నది —

గుండెల్లో మండే దుఃఖ
జ్వాలలు భరించుతూ -
పెదవులపై చిరునవ్వులు చిందించుతూ -

పౌరుష పూర్ణమైన నా
ప్రతిజ్ఞకు హారతి పట్టు -
పరువు నిలబెట్టు - భారత
వీర గౌరవానికి జేకొట్టు -

నీ కన్న బిడ్డలకు నిప్పుతో
చెలగాటం నేర్పు -
భావి భారత సంతానానికి మనం
పంచి యిచ్చే బహుమానం -
త్రివేణియై ప్రవహించే
శౌర్యం ధైర్యం బలిదానం.

వస్తాను - వస్తాను
తప్పకుండా - వచ్చేస్తాను
మువ్వన్నెల విజయ పతాకంలా
నవ్వుతూ ఎగిరి వస్తాను.

గాండీవ ధరుని నరుని ప్రతిజ్ఞ
తాండ విస్తున్నది నా జిహ్వాగ్రాన
ఇక లేదు తిరోగమనం
సాగింది పురోగమనం.

తెస్తాను - తెస్తాను
ముమ్మాటికీ తెస్తాను
విలువైన విజయోపహారం
తీసుకు వస్తాను.

దురాక్రమితమైన దేశ గౌరవానికి
విముక్తి గీతం ఆలపిస్తాను.

ఇదిగో ఇప్పుడు జ్వలించి పోతున్నాను
హిమాచ్ఛాదిత శిఖరాల మీద
దేదీప్య మానంగా ప్రజ్వలించు తున్నాను
క్రమ్మిన అమావాస్య
చిమ్మ చీకట్లను చీల్చి వేస్తున్నాను

అచంచల సౌభాగ్యవతి
అమర భారతి అఖండ జ్యోతికి
వేడి నెత్తురు - అక్షయ మైన
ఆజ్యంగా, అమోఘమైన
అర్ఘ్యంగా అర్పిస్తున్నాను.

హిందీమూలం : శ్రీ శివమంగళ సింహ 'సుమన్'

[ఆలిండియా రేడియోవారి సౌజన్యంతో]

# ఆదివాసులు; వారి పుట్టుపూర్వోత్తరాలు

వెన్నెలకంటి రాఘవయ్య

## 1. సృష్టి

సూర్యుని పరిభ్రమణ వేగంలో చిట్లిన భాగమే భూమి అని, 200 కోట్ల సంవత్సరాల క్రితం ఇది జరిగి యుండునని, అప్పటికి ప్రపంచంలో ఒకే బ్రహ్మాండమైన తేజోరాశియైన సూర్యబింబము ఉండినదని, అది బ్రద్దలై భూమి, చంద్రుడు, అంగారకుడు శుక్రుడు, శని, బుధుడు మొదలగు ఉపగ్రహములు ఏర్పడినవని భూమి మొదట ఆవిరి రూపంలో ఉండి, పిమ్మట ద్రవముగా మారి, అతి వేగముగ తిరుగుచుండినందున ఘనీభవించి నేటి స్వరూపాన్ని క్రమేణ పొందినదని శాస్త్రజ్ఞుల అభిప్రాయము. ప్రాణము గలిగిన సృష్టి జరిగి 20 లక్షల సంవత్సరాలైనదని కొందరి అభిప్రాయము. ఇదే నిజమైనచో మానవ సృష్టి 10 లక్షల సంవత్సరాలకు పూర్వమే జరిగి యుండవలెను. నేటి మానవరూపాన్ని కలిగిన మొదటి మానవుని ముఖము యొక్క ఎముకలు ఎవరికీ దొరకనందున కోతి తలకు మానవుని ఉత్పత్తికి మధ్య మరియొక మెట్టుకు చెందిన జంతువు జీవించి యుండవలెనని ఊహింపబడుచున్నది. హిందూదేశము యొక్క ఇప్పటి స్వరూపము ఎన్నడు ఏర్పడినదో తెలియదుగాని డాక్టరు సి. జి. ఈగ్‌లరుగారు గత డిసెంబరు మాసము వరకు (1962) జరిపిన పరిశోధనలవల్ల ఈ పర్వత రాజము ఆల్ప్స్ పర్వతాలకు వెనుకటిదని, 1½ కోటి సంవత్సరాల వయస్సు దీనికి ఉండవచ్చునని నిర్ణయించారు. జలమయమైన భూమిలో పాచి పుట్టి, క్రమేణ క్రిములు కీటకములు, ఆపైన చిన్న చిన్న జంతురాశి, ఆ తరువాత పెద్ద మృగములు, పుట్టినవని, సృష్టి యొక్క చరిత్రలో ఇవి భిన్న భిన్న ప్రకరణములని, ఒక మెట్టుకు తరువాత అంతస్థుకు ఎంతో సంబంధమున్నదని ఛార్లెస్ డార్విన్ (1809–1882) వంటి శాస్త్రకారుల వాదము. ఇట్లు ఉత్పన్నమైన సృష్టిలోని అనేక జంతువులు, పక్షులు, చీనా దేశములో ప్రసిద్ధికెక్కిన డ్రేగన్ అనే సర్పజాతి మృగము, హిందూదేశములోని ప్రాచీన గ్రంథములలో వర్ణింపబడిన హంస, గండభేరుండపక్షి వంటివి, నేడు అసలే లేకుండ పోయినవి. ఇట్లు నశించిన, ఇంకను నశించుచున్న జంతువులలో కర్కోటకులైన వేటగాండ్ల దారుణచర్యలవల్ల హతమైపోయిన సింహములు, ఖడ్గమృగములు, చిరుతలు, సుందరమైన పిట్టలు కూడ కలవు.

## 2. మొదటి మానవులు

మొదటి మానవుల జనన కాలము ముప్పది లక్షల సంవత్సరాల క్రితం ఉండవచ్చునని కొందరు మానుష శాస్త్రవేత్తల అంచనా. చీనా యొక్క రాజధానియైన పెకింగ్ నగరానికి 10 మైళ్ళ దూరములో ఉన్న చౌకీటీన్ గ్రామములోని గుహలో 1927–1939 మధ్య కనుపడిన మానవుల, జంతువుల శల్యముల పరీక్షవలన ఇంత వరకు కనుపడిన మొదటి మానవుడు పది లక్షల ఏండ్ల క్రింద జీవించియుండినట్లు ఏర్పడినది. ఇట్లే దక్షిణాఫ్రికాలోని టాంగ్స్ నగరము సమీపాన గనిలో 1924 లో దొరికిన మానవ శిరస్సు, జావాలోని ట్రినిల్‌రో 1936–39 మధ్య లభ్యపడిన తల ఎముకలు మొదటి మానవుల స్వరూపాలను తెలుపగలిగినవి. పెకింగు సమీపాన నివశించిన మనిషి పురుషుడు. చాల బలిష్ఠుడు. ఎత్తు 5 అడుగుల 4 అంగుళాలు. చెకుముకిని అంతగా ప్రయోగించినట్లులేదు. ఆయుధములు ఎముకలతో చేయబడినవే. బహుశ పచ్చిమాంసాన్నే భక్షించి యుండవలెను. అతడు చంపి తినిన జంతువుల శల్యములు గుహలో నుండినవి. ఒకటి రెండు రాతి పనిముట్లు గుహను త్రవ్వి కనుగొనిన అమెరికా పరిశోధకునికి కనుపించినవి. రసాయన శాస్త్రపరిశోధనలవల్ల తేలినది. హిమాలయముల పశ్చిమోత్తర పర్వత శ్రేణిలో చేరిన శివాలిక్ పర్వతములలో లభ్యమైన మానుషదట్టముల పరీక్షవలన హిందూదేశమే మానవ రూపానికి మొదటి ఉయ్యాల అని మరి కొందరి అభిప్రాయము. మానవ రూపానికి ఎత్తులోను ఆకారంలోను నడకలోను ఇంచుమించు చాల వరకు పోల్చదగిన చింపాన్జీ కోతి ఆఫ్రికా అడవులలో

నివశించుచున్నందువల్ల ఆదిభారతము అచ్చటనే ఉదయించినదనేవారు కూడ కలరు.

## 3. దేశ ద్రిమ్మర జాతులు

భారతదేశ మందున్నట్లే ప్రపంచ మంతట ఆదిమజాతుల వారు ఒక్కొక చోట ఒక్కొక విధముగా జీవించుచున్నారు. అమెరికా, ఆఫ్రికాలలో నీగ్రోలు, ఉత్తర దక్షిణ అమెరికాలలో ఎర్ర ఇండియనులు, ఆస్ట్రేలియాలోని అరుంటాలు వేలకొలది సంవత్సరాలనుండి నివశించుచు, యూరపు నుండి తమకన్న బలిష్ఠులు, తెలివి గల వారునైన శ్వేతజాతుల వారు ఆయా దేశ ములకు వలసవచ్చి తమ్ము బానిసలుగా మార్చకముందు ఆ దేశాలు తమవిగానే భావించుకొని సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని అడ్డు ఆపులేకుండ అనుభవించుచుండిరి. జిప్సీలనే దేశద్రిమ్మరి జాతులు 13 వ శతాబ్దాంతంలో ఏషియా నుండి యూరోపుకు పోయి గంత బొంత గుడ్డాలపైన, బండ్లలోను వేసుకొని, ఎండకు వానకు లేశమైనా కందకుండ, ఇప్పటికీ తిరుగని దేశమేలేదు యూరపు ఖండములో.

దేశద్రిమ్మరులు క్రీస్తు పుట్టుకకు 800 సంవత్సరముల ముందునుండి తూర్పు రషియాలోని చెట్టుచేమలేని స్టెప్స్ పచ్చిక బీళ్ళలో పశువులను మేపుకుంటూ వందల కొలది మైళ్ళు తిరుగుతుండే వారు. అట్లే మాల్దేవియా రాజు అలెగ్జాండరు 1478 సం॥ లోను ఇంగ్లీషు రాజు 8 వ హెన్రీ 1517 లోను, ద్రిమ్మరులకు అనుకూలమైనచట్టాలను చేసి పుణ్యం కట్టుకొన్నారు. కాని హంగరీ లోని ద్రిమ్మరులు నరమాంస భక్షకులనే నేరానికి గురియై 1782 లో ఉరితీయబడిరి. 1879 లో ఉత్తర ప్రదేశములోని సీరాడ్ అఘోరీలు శంకర రామదాసును చంపి భక్షించారనే నేరానికి శిరచ్ఛేదన కావింప బడిరి. జర్మనీలో 1907 లో జిప్సీలను అదుపులో పెట్టే చట్టాలు చేయబడెను. అర్జెంటైనా, బ్రెజిల్, చిలీ, కొలంబియా, ఈక్వెడార్, కెనడా, అమెరికా సంయుక్త రాష్ట్రాలు, రషియా, దేశాలలో గత 10 సంవత్సరాలలో ద్రిమ్మరులకు విద్యవైద్య వసతులు కల్పించుటకు, పరపతి సంఘాల ద్వారా చేతి వృత్తులు నేర్పుటకు, ఆయా ప్రభుత్వాలు ప్రశంసనీయమైన కృషి చేసినవి. ఇండియాలో కూడ వీరి సమస్యలు ప్రభుత్వాలను ఆకర్షింపక పోలేదు. టిప్పు సుల్తాను వేలకొలది ఎరుకల వారిని వేగుల వారినిగా నియమించి పోషించు చుండెను. రాజస్థాన్, పంజాబు ప్రాంతాలలోను తెలంగాణాలోను బండ్లలో గుంపులు గుంపులుగా ఊరూరు తిరుగుచు ఇనుప వ్యవసాయ పనిముట్లను అవలీలగా చేసి రైతులకు విక్ర యించి కొనుచుండు గాడియాలోహారులు, సిక్లీగర్లు, ఆడు పెత్తనానికి లోబడి తండాలు తండాలుగా భిక్షాటన వృత్తిలో ఉత్తర హిందూస్థానంలో తిరుగు కార్వాలులు, నేరస్థ జాతులుగా పరిగణింపబడి పశ్చిమ ఇండి యాలో గ్రుమ్మరుచుండు కంజర్లు, శార్సీలు, బావురీలు, తెలుగు దేశపు దొమ్మరులు, (ద్రిమ్మరులు) బండలు, బుడబుక్కలు, జోగర్లు, పాముల వారు, ఎరుకలవారు మలబారులోని మలపండారులు ఇంకా అనేక మంది దేశద్రిమ్మరులు వండపొయ్యి పంచ పంచలేకుండ ఇంటికి, ఇల్లాలికి నోచుకో కుండ నిరంతరం "ఇవ్వాళ ఇక్కడ, రేపు ఎక్కడో'' అంటూ దేశాటనం చేస్తూ తిట్టే నోరు, తిరిగే కాలు ఊరకుండదనే సామెతను సార్థకపరుస్తుంటారు. ఈ ద్రిమ్మరి తనానికి రంగు, జాతి, మత, కులభేదాలు అంటూ ఉండవు. మండల, రాష్ట్ర, దేశాభిమాన, దురభిమానాలు వీరిని అంటవు. ఇక స్వామి, మండల, రాష్ట్ర, దేశభక్తులనేవి ఎటు వంటివో వీరు ఎరుగనే ఎరుగరు. వీరి పొలిమేరలు అంతర్జాతీయములు. వీరిలో ఆశాజ్యోతి వెలుగనే వెలుగదు. గ్రామాల తోను పట్టణాలతోను వీరికి పనేలేదు. పలుక రించినా వీరు పలుకరు; వీరిని పలుకరించే వారు కూడ కనపడరు. సంఘం వీరిని వెలి వేసింది; వీరుకూడ సంఘాన్ని వెలివేశారు. ఎండ వాన అనక, రాజబాటలను సమీపించక, సాంప్రదాయాలను సన్మానించక, దారి తప్పిన వారివలె కాలిదార్లను అంటుకొని గ్రుమ్మరుచు, బయలుదేరే ప్రదేశం, గమ్యస్థానం అంటూ లేక ఎక్కడికో, ఎందులకో, ఎప్పుడో అను ప్రశ్నలకు సమాధానాలు చెప్పుకోలేక దిన ప్రయాణాలు పాదయాత్రలు సాగించే జనం భారత దేశంలో కనీసం 50 లక్షలు, ఆంధ్ర ప్రదేశంలో 3 లక్షలు అయినా ఉంటారు. దేశద్రిమ్మరి తనం ఈనాటి కాదు; ఇంత త్వరలో ముగిసి పోబోదు; 30 లక్షల సంవత్సరాల మానవ జీవిత సౌధానికి ఇది బహుశ మొదటి మెట్టేమో !

## 4. ఇతర ఆదిమ జాతులు

భారత దేశంలోని అనాది జాతుల జన సంఖ్య 2 కోట్లకు తగ్గదు. వీరు ప్రతి రాష్ట్రం లోనుఉన్నారు. సంఖ్యనుబట్టి గోండులు (35 లక్షలు), భిల్లులు (26 లక్షలు), సంతా లులు (30 లక్షలు), వర్లీలు (20 లక్షలు), ఓరాన్లు (16 లక్షలు), ముండాలు (10 లక్షలు). భారతీయ ఆదివాసులలో ముఖ్యు లైనప్పటికి, విశిష్టతనుబట్టి, పురాతనాన్ని బట్టి పాండవపద్ధతిన బహుభర్తృత్వాన్ని పాటించే ఉత్తర, హిమాచల ప్రదేశాల కోల్టాలు, దక్షిణాది తోడాలు, చెట్లపైన

సంసారాలు గడిపే అరవదేశపు కాడర్లు, నీరు నిప్పు లభించకున్నా జన్మస్థానాలైన 'పెంటల'ను వదలలేక ఆకులు అలములు ఆరగిస్తూ కందమూలాలతోను జుంటితేనెలతోను పొట్ట నింపుకుంటూ, యముడికి శివుడికి వెరవకుండా ఒంటరిపాటున అడవి మృగాలమధ్య నివశించు సత్యసంధులైన చెంచులు, కిన్నెర కంఠాలతో పాడుకుంటూ నిరపరాధులై, ఆనందమయ జీవితాన్ని గడుపుకొను అనాదులు, అప్సరసలను మించిన అందచందాలనుగల లంబాడీలు, మామూలు జీవితంలో అమాయకులైన శాంతిప్రియులైనప్పటికీ ఆత్మగౌరవానికి ఆపద సంభవించినపుడు బ్రిటిషుప్రభుత్వాన్ని సహితము సరకుచేయక శ్రీ ఆల్లూరి శీతారామరాజువంటి మహనీయుని నాయకత్వమున మూడు సంవత్సరాల కాలము తీరని పోరు సల్పిన కోయలు, కోతులను భక్షించు బిర్‌హోరులు, 15 మొదలు 18 వేల అడుగులవరకు కొండకోనల కెగబ్రాకు గుజ్జర్ బకర్‌వాలా, కాశ్మీరు గొర్రెల కాపరులు, స్త్రీవారసత్వాన్నే అవలంబించు అస్సాంలోని అభోరులు, మిష్మీలు, కచారీలు, ఖాసీలు, హిమాలయపు అపతానీలు, నెరికోరవలు, గదబలు, బోండోలు, ఇరుళలు, విల్లియన్లు పనియన్లు త్రోసివేయ తగినవారు కారు.

## 5. భారతీయ ఆదివాసుల ఉనికిపట్లు

ఆసేతు హిమాచల పర్యంతం వేలకొలది సంవత్సరాలనుండి పారంపర్యముగ చెక్కు చెదరకుండ, తండ్రి తాతలనుండి కొడుకు మనుమండ్లకు పిత్రార్జితమైన ఆస్థిపాస్తులు సంక్రమించినట్లే,దిగివచ్చు సంస్కృతితోను, ఆచార వ్యవహారాలతోను తనివినియ్యగల సంతసాన్ని అనుభవించుచు, ఒకరి జోలికి పోక, ఒకరిని తమజోలికి రానీయక, జీవయాత్ర సలుపు గౌరవవంతులైన జాతులనేకము లున్నవి. ఈ ప్రజలందరు సౌఖ్యవంతము, సారవంతమునైన సమ ప్రదేశాలలో నిలువక, నిర్భరమైన చలిబాధకులోనైన కొండచెరియలలోను, శిఖరాగ్రముల చుట్టును, అభేద్యమైన కీకారణ్యముల గర్భములలోను, గ్రామాధికారుల, ప్రభుత్వ ఉద్యోగస్థుల, ధనవంతుల, దౌర్జన్యపరుల వికట విలాసాలకు దూరంగా దినపస్థులు మాడుతునైన కాపురాలు చేస్తుంటారుకాని నగరాలలోకి, గ్రామాలలోకి తొంగియైన చూడరు. ఒకవేళ బలీయమైన కారణాలవల్ల వీరు పల్లపు ప్రదేశాలకు దిగబారినప్పటికి గ్రామకంఠాల వెలుపల, ఎండిపోయిన చెరువుతట్లలోను, పాడుబడ్డ సత్రములందు, రహదారులపొంతన, నాలుగుదినాలు కండ్లు మూసుకొని కాలం గడిపి మరల స్వస్థానాలు చేరుకుంటారు. ఇంతటి బిడియానికి ముఖ్యకారణము అనాది వైరుధ్యమే యని పరిశోధకుల ఊహ. మాలవారిచే అపజయాన్ని పొందిన మాదిగలవలెనే, ఆస్ట్రేలియా, ఆఫ్రికా, అమెరికాలలో తెల్లవారిచేత పరాజితులైన నల్లవారివలెనే, వీరు కూడ వెలిపడ్డవారివలె నడుచుకొనుచుండవచ్చు.

## 6. బానిసలు

ఓడినవారిని బానిసలుగా పట్టుకోవడం ప్రపంచమంతటే కాక వేదభూమియైన ఆది భారతంలోకూడ అనాది ఆచారమని చాణక్యుని అర్థశాస్త్రమువలన తెలియనగును. మురిగిపోయిన ప్రభుత్వ విక్రేతమైన మద్యాన్ని పశువులుకూడ త్రాగుటకు నిరాకరించినపుడు బానిసలకు ఉచితముగ ఇయ్యవచ్చునని 2400సంవత్సరాలక్రిందటి ప్రభుత్వ నిబంధన. 1927 వరకు, నేపాలు దేశములో పౌరాణికమైన "దాసదాసీజనంబులు" బజారులలో అమ్మబడుచుండేవారు. రాచపీనుగులతోపాటు బ్రతికియున్న బానిసలనుకూడ మర్గమధ్యపు సేవలకొరకై పాతిపెట్టుచుండే అలవాటు పూర్వం మన దేశంలోను, ప్రస్తుతము ఆస్ట్రేలియా, న్యూగినీ మొదలగు దేశాలలోను అమలులో నున్నది. 1819 లో మలబారు జిల్లాకలెక్టరు శిస్తుబాకీలవసూలుకై రైతుయొక్క చెరుమన్ ఆదిమజాతి బానిసలను చరాస్థిక్రింద జప్తీ చేసి వేలం వేయగా, తూర్పు ఇండియా కంపెనీ ఇంగ్లండు డైరెక్టర్లు మొదట అసమ్మతిని చూపినప్పటికి వెంటనే అనుమతించిరి. 1841 లో ఇ. బి. థామస్ అనే తెల్లజడ్జీచే వేయబడిన వేలం విక్రయములో 10 సంవత్సరాల లోపలి వయస్సుగల బాలునికి రు. 3-8-0, పది నెలల పసికూనకు రు. 1-10-6 వంతున పాట తెగినదని నిర్ణయింపబడి విక్రయ ధనము ఖజానాకు జమకట్ట బడినది. 5 లేక 10 రూపాయలకు వారి తల్లి తండ్రులు అమ్ముడు పోయిరి. 1842 జనాభాను బట్టి మలబారు జిల్లాలోని బానిసల సంఖ్య 159000 మంది. 1855 వరకు ఈ వ్యాపారం సాగుచుండినది. మహబూబ్‌నగర్ జిల్లాలోని లింగాల మాజీ క్రిమినల్ శెటిల్ మెంటులో గడిచిన 5 సంవత్సరాలనుండి 42 ఎరుకల లంబాడీ యువతులను వేయి మొదలు మూడు వేల రూపాయల వరకు పెరిగిన ఖరీదులకు పంజాబు వారు కొనుగోలు చేసి తీసుకొని పోయిన నేరం ఆంధ్రప్రభుత్వ ఆదిమ జాతి విచారణ కమిటీ వారి ఫిర్యాదుపై విచారణ జరుగుచున్నది. కాంగోలోని బెల్జియనులవలె, హిట్లరు చేజిక్కిన యుద్ధఖైదీలవలె, తుపాకి గుండ్లకు గురికాకుండ దయతో చూడబడుచు చక్కగా పోషింపబడు చుండడమే భారతీయ బానిస వ్యాపారము యొక్క ప్రధానలక్షణము.

నీతి బాటలను జవదాటుటలో పురాతనులు నవీనులను ముందుకు మించి యుండలేదు. నేఫా ప్రాంతపు అపతానీ జాతిలో అప్పులను తీర్చలేని వారినికూడ బానిసలుగా అమ్ముకొన వచ్చు. ఇప్పటికీ తెలంగాణాలోని మామూలు జనంలో వినయ విధేయతలను కనుపరుచుటకు మాటి మాటికీ "మీ బానిసత్ను" అని అంటుంటారు.

## 7. ఆదివాసులు ఎక్కడివారు ?

భారతీయ ఆదివాసులలో మూడు నాలుగు వందల తెగలవారున్నారు. వీరు ఎక్కడ నుండి ఇక్కడికి వచ్చారో నిశ్చయంగా తేల్చలేము. బెంగాలు, అస్సాం, ఒరిస్సా ప్రాంతపు ప్రజల ముఖ వీక్షణములను బట్టి చీనా పొరుగు దేశమైన మంగోలియా నుండి సంతాలు, నాగా మొదలగు జాతుల వారు వచ్చియుండ వచ్చునని ఒక ఊహ. ద్రవిడులు, ఆర్యులు వచ్చినట్లే పశ్చిమోత్తర ఇండియా వైపునుండి ఖైబరు, కారకోరం కొండ మార్గాలగుండ మధ్యధర-కాస్పియన్ సముద్రాల ప్రాంతాలనుండి ద్రవిడుల కన్న ఎన్నో వేల సంవత్సరాలకు పూర్వమే ఆదిమ జాతులు ఇండియాకు వచ్చియుండ వచ్చునని మరియొక ఊహ. దక్షిణాఫ్రికా తూర్పు తీరము, మన మలబారు సముద్రతీరము ఒకే విధమైన కొండల, వృక్షముల, జంతువుల పోలికలను కలిగియున్నందున, పౌరాణిక కాలంలో రెండు దేశాలమధ్య ఒకప్పుడు ఉండిన లెమూరియా ఖండముగుండ ఆదివాసులు నడిచి వచ్చారనేది మూడవ ఊహ. ఆఫ్రికా నీగ్రోలకు ఆస్ట్రేలియా, సిలోను వెద్దాలకు, అండమాను దీవుల ఓంజీలకు మన దక్షిణ ప్రాంతపు ఇరుళలు యానాదులు దక్షిణాది కనికర్లు మైసూరు ప్రాంతపు కురుంబర్లకు నీగ్రో పోలికలున్నవని ప్రసిద్ధమానుష శాస్త్రవేత్త, ప్రస్తుతము అస్సాం ప్రభుత్వానికి ఆదివాసుల సలహాదారు అయిన డాక్టరు, పద్మశ్రీ వెరియర్ ఎల్విన్‌గారి అభిప్రాయము. వాన్ బారన్ హైమెన్ డార్ఫ్ (ఇదివరలో నైజాము ప్రభుత్వంలో ఆదివాసుల సలహదారు "అదిలాబాదు గోండులు" "చెంచులు," "కొండరెడ్లు" "దిగంబర నాగాలు" మొదలగు ప్రసిద్ధ గ్రంథముల కర్త) గారు, కూడ ఈ అభిప్రాయానికి సుముఖులే. ఆదివాసులకు ఇతర పౌరులకు రూపభేదాలున్నాయని ఆదివాసులలో కూడ ఒక జాతికి మరొక జాతికి రూపరేఖ విలాసాలలో ఎంతో తారతమ్యమున్నదని అందరూ అంగీకరించవలసినదే. కాని ఈ భేదాలకు ముఖ్యకారణములు ఆయా తెగలవారు నివశించు ప్రదేశముల యొక్క నైసర్గిక స్వరూపము, వారు తిను ఆహారము, అట్టి ఆహారాన్ని సంపాదించుకొనుటకు వారు ప్రయోగించు మార్గములు, పరిసర ప్రదేశాల నడవడులు, నివాసాలను అంటుకొని యుండు వ్యాధులు, పీడలు ఈతిబాధలు, సంఘకట్టుబాటులు, ఆచారాలు, పాలనా విధానాలు మొదలగునవి. ఏదో ఒక మానవుని యందుగాని, ఒక మానవ సమూహము నందుగాని ఉన్న వైపరీత్యాలను వారి తల్లిదండ్రులకు, పితరులకు అంటగట్ట వచ్చును కాని జాతుల విశిష్ఠ లక్షణాలను ప్రాంతీయ లక్షణములకే ముడిపెట్టవలసి యుంటుంది. ఆంధ్రప్రదేశము నందు కూడ ఒక మండలము వారికి మరొక మండలము వారికి కావలసినంత రూపభేదమున్నది. నాగార్జునుని శిల్పపండితులు మలిచిన ప్రతిమలు గుంటూరు జిల్లా వారినే ముక్కు, పెదవులు, గడ్డము, లందు పోలియుండును. అట్లే తిరుపతి వెంకటేశ్వర స్వామి విగ్రహ ముఖచిహ్నములు కాళహస్తి తిరుపతి ప్రాంతీయుల నొసట చెక్కినట్లు కనుపడగలవు.

ఇక వానర (వన నర,-అనగా అడవులలో నివశించు మానవుడు) లక్షణాలు కొందరు మానవుల కున్నంత మాత్రాన కోతిని మానవుని పితరునిగా చేయనవసరము లేదు. చింపాంజి వృక్షాగ్రమునుండిదిగువకు దుమికి మానవుడైనాడని చెప్ప సాహసించే వారు సర్వశక్తిమయుడైన సర్వేశ్వరుని ఉనికిని శక్తిని శంకించిన వారుగా నుండవలెను. వాల్మీకి మహాఋషి వానరుడికి తోకను తగిలించినాడో లేదో మనము నిర్ణయించలేము కాని, ఆ మహా కవి వర్ణించిన ప్రకారం హనుమంతుడు గొప్ప సంస్కృత పండితుడు, గాయకుడు, శాస్త్రవేత్త, సుగుణరాశి, మహాబలి, సుగ్రీవుని సైన్యాధిపది. వాలి సుగ్రీవులను కోతి గుంపులని జాంబవంతుని ఎలుగుబంటు అని అనుకొనుట అనుచితము. అనాసులని (చట్టిముక్కుల వారు) నిశాచరులని రామాయణములో వర్ణింపబడిన "రాక్షసులు" కూడ ఆదిమానవులే యని గ్రహించుట సబబుగా నుండగలదు. చంద్రగుప్తచక్రవర్తి యొక్క ముఖ్యమంత్రి పేరు రాక్షసుడు. (ముద్రా రాక్షసము)

## 8. అనాదుల వైపరీత్యములు

జోన్‌సార్ బావార్ (సిమ్లా చుట్టుప్రక్కల) ఆదివాసులలో పెద్దన్న భార్య తమ్ముల కందరికి ఉమ్మడి ఇల్లాలు. నాగాలలో ఎన్ని తలలు నరికితే అంత మర్యాద. సిక్కిం లేప్చాలు చట్ట సమ్మతంగా 45 మంది దగ్గిర బంధువులతో వ్యభిచరించవచ్చు. హిందువు లైనప్పటికి కోయలు గోండులు ఆవులను తింటారు. అస్సాం ఆదివాసులలో స్త్రీ వారసత్వమే చెలామణి. చిర్ హోరులకు (బీహారు) కు,

కోయ బాలింతలకు కొండముచ్చు మాంసము అతిప్రియము. యానాదులలో వివాహాలకన్న కలుసుకోవడాలే ఎక్కువ అలవాటు. ఎరుకల వారిలో నిర్దోషినని రుజువు చేసుకొనడానికి నిప్పులలో నడవడం సలసల కాగే నూనెలో చేతులు ముంచడం, కాలే గడ్డపారలను లేవనెత్తడం, ఇప్పటికీ రివాజు. బండవాండ్లు కాకులను తింటారు. కాడర్లు పులులను భుజిస్తారు. జోగరవాండ్లు పిల్లులను ఆరగిస్తారు. గోండులు, సంతాలులు, యానాదులు ఎలుకలను భక్షిస్తారు. దిగంబర నాగా ప్రజలకు బట్టలు సర్వత్ర వర్జనీయములు. బస్తరు మురియాలలో పెండ్లికాని యువకులు, యువతులు ప్రతి రాత్రి ఇల్లు వదలిపెట్టి ఉమ్మడి వసారాలలో (గోతుల్) గోపికా కృష్ణులవలె తెల్లవారే వరకు ప్రక్కప్రక్కన పరుండవలెను. హిమాలయ ప్రాంతపు జాతులు కొన్నిటిలో (పూర్వం వేదకాలపు ఋషులు చేసినట్లు) అతిథి పూజగా అవివాహితయైన పెద్ద కుమార్తెనో, లేనపుడు భార్యనో (ఆస్ట్రేలియా న్యూగినీ జాతులవలె) సమర్పించవలెను (జాబాలి - సత్య కామకథ) పైన వివరించిన వికారాలు ఆదివాసులను తృణీకరించుటకు అవమానించుటకు కారణము కాకూడదు. మన పూర్వీకులలో కొందరి ఆచారాలనే ఆదివాసులు అనుసరించుచున్న విషయము మనము మరువరాదు.

## 9. ఆది భారతము

భారత ప్రభుత్వము ఆదివాసుల ఉద్ధరణకై ఎన్నో ప్రత్యేక నియోజక వర్గాలను ఉద్యోగ దామాషాలను ఇతర వసతులను శాసనరీత్యా కలిగించి కోట్లకొలది ధనాన్ని ఏటేట గృహవైద్య, విద్యా వసతులకు వెచ్చించుచున్నది. సంవత్సరానికి నాలుగైదు మాసాలు మంచు దుప్పట్లతో కప్పబడుచు శ్వేతాంబర శోభితమైన కాశ్మీరు కొండలలో పశువుల మేపుకుంటూ జీవించు గుజ్జురులకు కూడ సంచార వైద్య విద్యా వసతులను కూడ కల్పించుచున్నది. అట్లే ఆటవిక జీవితానికి అలవాటుపడ్డ కోయలు, సుగాలీలు, కొత్తగూడెం, సింగరేణి బొగ్గుగనుల పనులకు క్రమేణ అలవాటు పడుచున్నారు.

మానవ జనాభా తగ్గియుండి అరణ్యము హెచ్చుగానుండి, సేద్యము నామమాత్రమై యుండినపుడు, వేటవలని జీవనము, ఆటవిక ఫలసాయము ప్రతి మానవునికి అందుబాటులో నుండినవి. వేకువనే లేచి, చీకటి గంజిత్రాగి, రాతి గొడ్డలిని బుజాన పెట్టుకొని వెదురు విల్లంబులను చేత బట్టుకొని, నిబిడమైన మహారణ్యములో కిలకిల పొద్దుపొడుచునపుడు సావిత్రి సత్యవంతులవలె ప్రవేశించిన చెంచు దంపతులకు కనుపడ్డదంతా కమనీయముగానే ఉండినది. వేసిన మృగాన్ని వేసినట్లే కాల్చుకొని, కంద మూలాల నారగించి, పుట్టతేనెను కడుపునిండ గ్రోలి, దట్టమైన చెట్లనీడల్లో నిదురించి, సాయంత్రానికి కనుచీకటిలో ఇల్లుచేరు ఆటవికునికి ఉండిన వసతులు ప్రభుత్వ పారెస్టుశాఖ ఏర్పడిన అనంతరం కరువయ్యెను. కదిలినా మెదిలినా కంటపడుచుండు అడివి అధికారుల బాధలు ఎక్కువై చెంచు 'దొర'లను దొంగలుగా మార్చివేసెను. ఇష్టాన్ని అనుసరించు కష్టానికి మాత్రమే అలవాటుపడ్డ కొండ జనానికి గంటల ననుసరించిన బత్తెపు జీతములు సరిపడక పోయెను. ఈ క్రొత్త ప్రాత సందున పురాతనమునకు నవీనమునకు కలిగిన సంఘర్షణ, మితమునకు అమితమునకు ఏర్పడిన వైరుధ్యము, తృప్తికి ఆశకు మధ్య జనించిన అశాంతి, నమ్మకమునకు వంచనకు కల తారతమ్యము, వ్యక్తికి సంఘానికి ఏర్పడిన పోరాటము, మొదటి మానవులను చీకాకుపరిచి, బుద్ధి సూక్ష్మతగల నగర గ్రామవాసులకు లక్షలాది ఆదివాసులను బానిసలుగా చేసినవి. ఇరువురికి గల భేదభావములను కాలము, చట్టము, ఆచారము, జనవాక్యము, మతము చాలవరకు తగ్గించినను మొదలంట నశింపు చేయలేక పోయినవి.

ప్రాచీన అడివి జాతులకు నవీన నాగరికులకు హెచ్చుచుండు సంఘర్షణ రెంటికి ఒకేవరలో తావులేదని స్పష్టపరిచినది. ఇనుము (యుగము) రాతి (యుగము) ని చూచి పరిహసించినది. నాణ్యమైన నిప్పుపెట్టెలు చెకుముకిని చూచి ఎగతాళి చేసినవి. శాసనసభలు, వ్యక్తి ఓటు రాజరికములను గేలిచేసినవి. నేటి ప్రపంచము నాటి ప్రకృతిని చూచి నవ్వినది. ఖడ్గానికన్న కలమే మానవకోటి వినాశానికి కారణభూతమైనది. ప్రతిభ కోట బురుజులనుండి తాళ గ్రంథములనుండి దిగజారి, వరిమళ్లలో దూరి వికసించినది. పట్టరాని పరాభవానికి ప్రకృతి తలవంచినది. ఇట్టి పరిస్థితులలో ఆదివాసుల నుద్ధరించుటకు పూనుకొన్న ప్రజలు, ప్రభుత్వాలు తొందరపాటును వదిలి మెలకువతోను, సుహృద్భావముతోను ఆదివాస సమస్యలను పరిశీలించి పరిష్కరించుట ముఖ్య కర్తవ్యము.

మనదేశం మొదటినుండి చైనా పట్ల మైత్రి సుహృద్భావములతో వ్యవహరిస్తూ, పంచశీల సూత్రాలకు పూర్తిగా కట్టుబడి వున్నప్పటికీ, చైనా యీ సూత్రాలకు విరుద్ధంగా వ్యవహరించి, మన సరిహద్దులపై పెద్ద సైన్యములతో ప్రబలంగా దండయాత్ర జరిపిన సంగతి అందరికీ తెలిసినదే. ఈ సంఘటన ఆసియా ఖండపు చరిత్రలోనే కాకుండా, ప్రపంచ చరిత్రలోనే ఒక కొత్త మలుపు తెచ్చి పెట్టింది.

భారత చైనా సరిహద్దు, సుమారు 2500 మైళ్ళకు పైగా నిడివిగల్గి, కాశ్మీరు నుండి నేఫా వరకు వ్యాపించి ఉంది. పై సరిహద్దు రేఖను ఆనుకొని ఉన్న మన దేశములోని 50,000 చదరపు మైళ్ళ భూభాగమును, చైనా తనదిగా చెపుతుంది. ఇది, అంతర్జాతీయ న్యాయశాస్త్ర దృష్ట్యా, ఎంతవరకు సమ్మతం అనే విషయాన్ని పరిశీలిద్దాము.

భారత, చైనా సరిహద్దు, లాంఛన ప్రాయంగా ఎప్పుడూ నిర్ణయింప బడలేదనీ, చైనా వాదన. ఇది పూర్తిగా అసత్యం. మన చరిత్ర రూపేణా, అసంభవం. ఈ యావత్తు సరిహద్దు, ఉభయదేశాల మధ్యగల ఒప్పందాల ద్వారాను, ఆచార వ్యవహారముల ద్వారాను, స్పష్టంగా నిర్ణయించబడే ఉంది. ఈ సరిహద్దు వరకు గల భారత ప్రభుత్వ అధికారమును, దాని చెలాయింపును, చైనా ఎన్నడునూ అభ్యంతరం పెట్టలేదు.

ఈ సరిహద్దును, పశ్చిమ, మధ్య తూర్పు ఖండములుగా విడదీసి, ఒక్కొక్క దానిని గురించి విడి విడిగా తెలుసుకుందాం. కాశ్మీరు టిబెట్టుల మధ్య సరిహద్దు పశ్చిమ ఖండం. అచటి నుండి నేపాల్ వరకు గల సరిహద్దు, మధ్య ఖండం. భూటానునుంచి భారత చైనా బర్మా దేశముల సంధి వరకూగల సరిహద్దు తూర్పు ఖండం.

## పశ్చిమ ఖండం

వివాదగ్రస్తమైన భారత చైనా సరిహద్దులలోని పశ్చిమ ఖండం, సాంప్రదాయ సిద్ధంగా గుర్తింపబడింది. ఈ విషయాన్ని సుప్రసిద్ధ చరిత్ర పండితులైన ఫ్రాంక్, పెటాక్



కె. కృష్ణారావు

మొదలగు వారు ధ్రువపరిచారు. అనేక ఒప్పందములలో కూడా, చైనా టిబెట్టు దేశములు యిది ఒప్పుకోటం జరిగింది. ఉదాహరణకు 1684, 1842, 1852 సంవత్సరములలో జరిగిన ఒప్పందములు.

అయితే 1942 సంవత్సరపు ఒప్పందమునకు, తాను సంతకం పెట్టలేదని చైనా నేడు వాదిస్తుంది. ఇది అసత్యం. చైనా కూడా పార్టీ అని ఆ ఒడంబడికలోనే వ్రాసి ఉంది. చైనా ఎప్పుడునూ ఆ ఒప్పందం అములునకు అభ్యంతరం పెట్టలేదు. దీనిని బట్టి అంతర్జాతీయ న్యాయశాస్త్ర దృష్ట్యా, చైనా ఆ ఒప్పందమునకు పార్టీ అని ఒప్పుకొన్నట్లే అవుతుంది.

మరొక విషయం. చిరకాలంగా భారత ప్రభుత్వాధికారం, యీ సరిహద్దు వరకు చెలాయింపబడుతూనేవుంది. 19వ శతాబ్దము నుండి నేటి వరకూ గల భూమి పన్ను కాగితాలే అందుకు సాక్ష్యాధారాలు. వర్తక వ్యాపారాల కొరకు మన ప్రభుత్వం పై ప్రాంత మంతటా రహదారులను వేయడం జరిగింది. 1960 వ సంవత్సరంలో జరిగిన భారత – చైనా ప్రభుత్వముల అధికారుల సమావేశములో మనవాళ్లు యింకా ఎన్నో సాక్ష్యాధారాలు చూపారు. అంతదాక ఎందుకు, చైనా–టిబెట్టు దేశములు మొన్న మొన్నటి వరకు పై విషయాలన్నీ అంగీకరిస్తూనే ఉన్నాయి.

## మధ్య ఖండం

మన దేశములోని పంజాబు, హిమాచల ప్రదేశ్, ఉత్తర ప్రదేశ్ రాష్ట్రములకు టిబెట్ నకు మధ్య గల సరిహద్దును మధ్య ఖండంగా తీసుకున్నాం. ఇది అచట ప్రవహించే సట్లేజ్, గంగానదుల జలాల ఏర్పడి, సాంప్రదాయ సిద్ధంగా గుర్తింపబడి ఉన్నది. మన వద్దగల పాత మ్యాపులు రెవిన్యూ రికార్డులు కూడా పై సరిహద్దును ధ్రువపర్చుతున్నవి. చైనా వారికి, యి ప్రాంతాన్ని గురించి ఏమీ తెలియదని 1958 లో జరిగిన మంతనాలలో వ్యక్తమైంది

అయినప్పటికీ స్పితి, నిలాంగ్ — జధాంగ్, బారాహోటి, సాంగ్చ మల్లా అఫ్తాల్ మొదలగు ప్రాంతములు తమ దేశభాగములని చైనా వారు నేడు వాదస్తున్నారు. ఈ వాదన పూర్తిగా నిరాధారమైనది. 1954 వ సంవత్సరములో జరిగిన భారత, చైనా ఒప్పందములలోని నాలుగవ సూత్రం చూస్తే తెలుస్తుంది,

## తూర్పు ఖండం

తూర్పు ఖండాన్ని మెక్ మోహన్ రేఖ అని అంటారు. ఇది హిమాలయములోని జలదారులచే ఏర్పడిన ప్రకృతి సిద్ధమైన సరిహద్దు, సాంప్రదాయ సిద్ధమైంది. ఒప్పందముల ద్వారా ధ్రువపర్చ బడింది. పద్ధెనిమిదవ శతాబ్దములో చైనా చక్రవర్తి కాంగ్ హిచే ప్రకటించబడిన దేశ పఠమునందును, తదుపరి పెకింగ్ విశ్వ విద్యాలయము వారిచే 1925 వ సంవత్సరమున ప్రచురితమైన దేశ పఠమునందు స్పష్టంగా గుర్తింపబడినది. ఈ రేఖకు గల ప్రాంతము, అనాది నుంచి భారత ప్రభుత్వ పరిపాలనాధికారముల క్రింద నున్నట్లు తెలియజేసే రెవిన్యూ రికార్డులు, సర్వే రికార్డులు మొదలగునవి ఎన్నో ఉన్నాయి.

1914 వ సంవత్సరంలో సిమ్లాయందు, భారత చైనా, టిబెట్టు దేశముల ప్రతినిధులు సమావేశమయ్యారు. అప్పుడు భారత — టిబెట్టుల మధ్య కుదిరిన ఒడంబడిక యందు మెక్ మోహన్ రేఖను లాంఛన ప్రాయంగా గుర్తించటము జరిగింది. ఒడంబడిక కుదుర్చుకొనుటకు టిబెట్టుకు ఆనాడు ఎట్టి అధికారము లేదని, అందుచే ఆ ఒడంబడిక చెల్లదని, నేడు చైనా విపరీత వాదన చేస్తున్నది. ఇది న్యాయసమ్మతము కాదు. సిమ్లా సమావేశమునకు హాజరయిన ముగ్గురు ప్రతినిధులు, సమాన ప్రతిపత్తి కలిగి యుండిరి. ఆ సమావేశములో పాల్గొని, ఒడంబడికలను కుదుర్చుకొనుటకు టిబెట్టు ప్రతినిధికి గల అధికారమును, చైనా గుర్తించి ఒప్పుకొంది. కనుక టిబెట్టు ప్రతినిధికి ఆనాడు అధికారము లేదని వాదించటం, చైనా వితండవాదనకు తార్కాణం తప్ప మరేమీ కాదు. సిమ్లా సమావేశ సరిహద్దు ఒడంబడికను, అప్పటి భారత ప్రభుత్వము అధికార రీత్యా ప్రకటించింది. కాని చైనా ప్రభుత్వము ఎన్నడునూ, ఏట్టి అభ్యంతరమును పెట్టలేదు. పైగా చైనా టిబెట్టులు మెక్ మోహన్ రేఖను 1944, 1953, 1955 వ సంవత్సరములలో ధ్రువ పర్చటము కూడా జరిగింది.

మన ప్రధాన మంత్రి శ్రీ నెహ్రూ, పలుసార్లు, మెక్ మోహన్ రేఖ భారత చైనా సరిహద్దని చెప్పారు.

చైనా అభ్యంతర పెట్టలేదు. తరువాత మెక్ మోహన్ రేఖకు దక్షిణంగా, కొన్ని వేల మైళ్ళ వరకు తమ భూభాగముగా చూపిస్తూ, చైనాలో మ్యాపులు ప్రకటించ బడ్డాయి. ఈ విషయమై మన ప్రధాని, చైనా ప్రధానితో 1954, 1956 వ సంవత్సరములలో ప్రస్తావించారు. తాము ప్రకటించిన మ్యాపులు తప్పుడు మ్యాపులని, సరి అయిన మ్యాపులు త్వరలోనే ప్రకటిస్తామని చైనా వారు చెప్పటం జరిగింది. వాస్తవానికి మెక్ మోహన్ రేఖ సరి అయినదే నని, 1956 లో చైనా ప్రధాని చెప్పటం కూడా జరిగింది. ఆ తర్వాత కొద్ది కాలానికే మెక్ మోహన్ రేఖ అక్రమమైనదని చైనావారు బుకాయించారు. ఈ విధంగా ఒకసారి అవునన్న దానిని మరొకసారి కాదనటము అంతర్జాతీయ న్యాయశాస్త్ర విరుద్ధమని ఈష్టరన్ గ్రీన్‌లాండ్, ప్రియ విహారా మొదలగు కేసులలో ప్రపంచ న్యాయస్థానము చెప్పింది.

మరొక విషయము: బర్మాతో గూడా చైనాకు సరిహద్దు తగాదా ఉండేది. ఆ సందర్భములో చైనా మెక్ మోహన్ రేఖను గుర్తించటం జరిగింది. బర్మా విషయంలో మెక్ మోహన్ రేఖ సరి అయినదే. ఇండియా విషయంలో అది ఎందుకు వర్తించదో, చైనా వారికే తెలియాలి. ఏది, ఏమయినప్పటికీ, ఒక విషయం గుర్తించాలి. చిరకాలం నుంచి ఒప్పుకొన్న మెక్ మోహన్ రేఖను యీనాడు చైనా కాదనటానికి న్యాయశాస్త్రం ఒప్పుకోదు.

కనుక ఏవిధంగా చూచినా చైనావారి వాదం దౌర్జన్య వాదం తప్ప మరేమీ కాదని తెలుస్తుంది. ఈ సరిహద్దు వివాద సందర్భములో చైనావారు కొన్ని న్యాయ సూత్రాలను పేర్కొనటం జరిగింది. వాటిలోని కొన్ని విశేషాలను ఇక్కడ చెబుతాను. వారు చెప్పే న్యాయ సూత్రాలు, అంతర్జాతీయ న్యాయశాస్త్రంలో ఎక్కడా కనబడవు. వాటిని ఎక్కడనుంచి సృష్టించారో చైనావారికే తెలియాలి. ఆ చెప్పిన సూత్రాలను గూడా, అన్ని సందర్భాలలో వారు పాటించరు. ఇష్టమున్న చోట పాటించటం, యిష్టంలేని చోట తిరస్కరించటం, ఈ విధంగా చేయటం అంతర్జాతీయ న్యాయశాస్త్రం ఒప్పుకోదు; అని ప్రపంచ న్యాయ

స్థానపు న్యాయమూర్తులలో ఒకరయిన అల్ఫాలో, ప్రియవిహార్ అనే కేసులో చెప్పారు.

సాంప్రదాయ సిద్ధంగా వస్తున్న సరిహద్దు స్పష్టంగానే ఉంటుంది గనుక దానిని లాంఛన ప్రాయంగా నిర్ణయించవలసిన పని లేదని చైనా ఒకసారి వాదించింది. మరొక సందర్భములో యింతవరకు పూర్తిగా వ్యతిరేకంగా చైనా వాదించటము జరిగింది. వాడుకలో సందర్భశుద్ధి ఉండాలనీ, పరస్పర విరుద్ధ అంశాలు వుండరాదనీ, లౌకిక జ్ఞానము చెపుతుంది.

మరొక విషయం చూద్దాం. 1914 లో జరిగిన సిమ్లా సమావేశంలో, మెక్ మోహన్ రేఖ సరిహద్దు విషయంలో జరిగిన ఒప్పందంపై సంతకం చేయటానికి టిబెట్‌కు హక్కు లేదని, అలా చేసేముందు టిబెట్ తన సమ్మతాన్ని పొంది ఉండాల్సిందని చైనా వాదించింది. అయితే భారత చైనా సరిహద్దులలో కొంత భాగానికి సంబంధించి నంతవరకు 1924 – 1925 లో భారత దేశంతో టిబెట్ స్వంతంగా నిర్వహించిన సంప్రదింపులు, చర్చలను ప్రాతిపదికగా తీసుకొని, సాక్ష్యాధారాలను చైనా సమకూర్చ ప్రయత్నించింది. ఈ విధమైన అవకతవకలు చైనా వాదనలో ఏన్నో ఉన్నాయి.

నీతి నిబంధనలు, అంతర్జాతీయ న్యాయసూత్రాలు, వేటి ప్రకారం చూచినప్పటికీ చైనా వారి వాదనలో సత్యమేమాత్రమూ లేదు. దేశ గౌరవమును, సమైక్యతను కాపాడుకొనుటకు భారత దేశం ప్రతిజ్ఞ తీసుకొంది. ధర్మం, న్యాయం, తప్పక జయిస్తాయి.

---

## మీ కృతజ్ఞతకు చిహ్నాలు

హిమాలయ సరిహద్దులలో అత్యున్నత శిఖరాలపై తమ విధిని తాము నిర్వహిస్తున్న సాహసికులైన మన సైనికులు ఆహార పదార్థాలు, ఇతర సౌకర్యాల కానుకులకు సహృదయంతో స్వాగతమిస్తారు.

ఈ క్రిందివాటిలో వేటినైనా పంపవచ్చు:

1. త్రాగే చాక్‌లేట్ బోర్న్-విటా, లేక ఇంకా అటువంటివి. 2. డబ్బాలలో నిల్వచేసిన కాఫీ, పాలు. 3. బాదం కాయలు, వాల్నట్లు, జీడిపప్పు. 4. బిస్కెట్లు, స్వీట్లు (వండినస్వీట్లు ఉదా: లోజాంజెస్, లెమన్ డ్రాప్స్ మొదలైనవి). 5. బ్యాటరీ రేడియో సెట్లు (ముఖ్యంగా 2 వేవ్ ట్రాన్సిస్టర్లు) 6. ఇండోర్ ఆటవస్తువులు. 7. స్పోర్ట్స్‌గేర్. 8. టాయిలెట్ వస్తువులు. 9. పిరియాడికల్స్, పత్రికలు, పుస్తకాలు.

ప్యాకెట్లలోపల వున్న వస్తువుల వివరాలను ప్యాకెట్లపై స్పష్టంగా తెలుపుతూ రవాణా చార్జీలను చెల్లించి ఈ క్రింది వారికి పంపవచ్చు.

1. అడ్మినిస్ట్రేటివ్ కమాండెంట్, హెడ్‌క్వార్టర్సు, సికింద్రాబాద్ స్టేషన్, బొలారం.

లేక

2. స్టేషన్ కమాండర్, ఎయిర్‌ఫోర్స్ స్టేషన్, బేగంపేట, హైదరాబాద్.

లేక

3. శ్రీ యం. హెచ్. కె. ఘజ్నవీ, గవర్నరు సహాయ కార్యదర్శి, రాజభవన్, హైదరాబాద్.

# వ్యవసాయ రంగం తీరుతెన్నులు



### భూసార పరిశీలనా సర్వీసు

ఆంధ్రప్రదేశ్‌లో రాజేంద్రనగర్, బాపట్లలలో ఉన్న రెండు భూసార పరిశీలనా సర్వీసు లెబొరెటరీలు తెలంగాణా, ఆంధ్ర ప్రాంతాలలోని రైతుల అవసరాలను ఆదుకుంటున్నాయి. భూసారం, సేద్యపు నీటి నమోనాలను ఇవి ఉచితంగా పరిశీలించి అధికోత్పత్తికి వాడవలసిన ఎరువులను, రసాయనిక ఎరువులను రైతులకు సిఫార్సు చేస్తాయి.

1962 అక్టోబరు నెలలో 985 భూసార నమోనాలనూ, 19 నీటినమోనాలనూ పరిశీలించి 618 సిఫార్సులను ఇవి చేశాయి. ఇందులో 590 సిఫార్సులు పశ్చిమ గోదావరి జిల్లా తీవ్రతర వ్యవసాయ పథకాన్ని ప్రవేశపెట్టిన ప్రాంతానికి చెందినవి.

### గొట్టపు బావుల త్రవ్వకానికి రుణాలు

ఈ పథకం క్రింద రు.2.00లక్షలు కేటాయించబడ్డాయి. గొట్టం బావులను త్రవ్వడానికి ప్రారంభంలో జరిగే ఖర్చులను భరించలేని వ్యవసాయ దారులకు యెక్కువలో యెక్కువ రు. 400/- ల చొప్పున రుణం ఇవ్వడం జరుగుతుంది. ఇంతవరకు రు. 32,000/-లు గ్రాంటు చేయడం జరిగింది.

### పొగాకు

తూర్పు గోదావరి జిల్లాలో ఫ్లూక్యూర్డ్ వర్జీనియా పొగాకు ఉత్పత్తి దార్లకు పంపిణీ చేయడానికై భారత ప్రభుత్వం యీ సంవత్సరం 2000 మెట్రిక్ టన్నుల అమోనియం సల్ఫేటును కేటాయించింది. గుంటూరు జిల్లాలోని పొగాకు ఉత్పత్తిదార్లకు ప్రత్యేక కేటాయింపునుంచి 3000 మెట్రిక్ టన్నుల రసాయనిక ఎరువులను సరఫరా చేయడం జరిగింది.

సకాలంలో యీ రసాయనిక ఎరువులను సరఫరా చేయడంవల్ల వ్యవసాయ దారులు "డిల్‌క్రెస్ట్" అనే క్రొత్తరకం ఫ్లూక్యూర్డ్ వర్జీనియా సేద్యం చేయగలిగారు.

వ్యవసాయశాఖా సిబ్బంది 2480 ఎకరాలలో తగిన పైర్ల మార్పిడి పద్ధతిని నిర్వహించింది. అనువుగాని, ఉప్పు ఊరే 440 ఎకరాలలో పొగాకు సేద్యాన్ని ఆపుచేసింది.

సకాలంలో మొక్కల సంరక్షణ చర్యలు తీసుకోవడం ద్వారా 438 ఎకరాలలోని పొగాకు నర్సరీలను తెగులునుండి రక్షించడం జరిగింది.

### ప్రత్తి, వేరుసెనగ

దేశంలో ప్రత్తి, నూనెగింజల ఉత్పత్తిని అధికం చేయాల్చిన అవసరం యెంతైనా ఉంది.

రాష్ట్రంలో వీటి ఉత్పత్తిని అధికం చేయడానికి ఆంధ్రప్రదేశ్‌లో ఒక పథకాన్ని ప్రవేశపెట్టడం జరిగింది. ఈ సంవత్సరం కృష్ణా జిల్లాలో వరి సేద్యం తర్వాత 15,000 ఎకరాలలో పి. 216 యఫ్. రకం లాంగ్ స్టాపిల్ ప్రత్తిని వేయడానికి ఉద్దేశించారు. ఆంధ్రప్రదేశ్ వ్యవసాయశాఖా మంత్రి, 1962 నవంబరు 11వ తేదీన తెనాలిలో ఈ పథకం అమలుకు ప్రారంభోత్సవం చేశారు.

కర్నూలు జిల్లా ఎమ్మిగనూరు సమితిలో తుంగభద్ర ప్రాజెక్టు ద్వారా నీటి పారుదల సౌకర్యంఉన్న 5000 ఎకరాలలో వేరుసెనగ ఉత్పత్తిని ఎక్కువ చేయడానికి వీలుగా యీ సంవత్సరం ఒక ప్యాకేజి పథకాన్ని ప్రభుత్వం మంజూరు చేసింది.

ఈ సంవత్సరం రాబీపంట కాలంలో వేరుసెనగ ఆకు తొలిచే చీడ పురుగుల నివారణకై విమానాల ద్వారా భారీ ఎత్తున మందుచల్లడానికి కూడా ప్రభుత్వం ఒక పథకాన్ని మంజూరు చేసింది.

### మొక్క జొన్న

ఆంధ్రప్రదేశ్‌లో ప్రతి సంవత్సరం 4½ లక్షల ఎకరాలలో మొక్కజొన్న పంట వేయడం జరుగుతున్నది. ఇందులో 40 శాతం కరీంనగరం జిల్లాలో వేయబడుతున్నది.

అంబర్‌పేటలోని మొక్కజొన్న పెంపకం స్టేషన్‌లో కనుగొన్న దక్కన్ మిశ్రమజాతి మొక్కజొన్న కరీంనగరం, వరంగల్లు, మెదక్ జిల్లాలకు చాలా అనువయినది.

ఈ రకం మొక్కజొన్న దిగుబడి ఎక్కువగా ఉండడమేగాక, భారీ ఎరువులకుకూడా తట్టుకుంటుంది. సగటున ఎకరాకు దీని దిగుబడి 4000 పౌండ్లు ఉంటుంది. సిఫారసు చేయబడిన విధంగా యీ రకం మొక్కజొన్న సేద్యం చేస్తే ఎకరాకు రు. 400/- ల నికరలాభం కలుగుతుంది. ఖరీఫ్, రాబీపంట కాలాలలో దీని సేద్యం చేయవచ్చు. స్థానిక రకం కన్నా యీ రకం చాలా రుచిగా ఉంటుందని ఉత్పత్తి దారులు భావిస్తున్నారు. కరీంనగర్ జిల్లా, మాడేపల్లిలో ఐ. సి. ఎ. ఆర్. సంస్థవారు కూడా దక్కన్ మిశ్రమజాతి మొక్కజొన్న విత్తుల క్షేత్రాలను పెద్ద ఎత్తున నిర్వహిస్తున్నారు.

రాబీ సేద్యం కాలంలో కరీంనగరం, వరంగల్లు, మెదక్ జిల్లాలలో 95,000 పౌండ్ల

దక్కన్ మిశ్రమజాతి మొక్కజొన్న విత్తనాలను పంపిణీ చేయడం ద్వారా దాదాపు 6800 ఎకరాలలో యీ రకం మొక్కజొన్న సేద్యం చేయాలని అంచనా.

### ఫలాల దిగుబడిపై హార్మోన్స్ ప్రభావం

అనాబె-షాహిరకం ద్రాక్షలపై ఒకవిధమైన రసాయనం (హార్మోన్స్) ఉపయోగించడం ద్వారా పెద్ద సైజు పండ్లను పొందడం సాధ్యమని కడప జిల్లా అనంతరాజు పేటలోని ఫల పరిశోధనా కేంద్రం కనిపెట్టింది. పంట కోతకు 20 రోజులు ముందుగా అనాబె-షాహిగుత్తులపై మిలియన్ (పిపియం)కు 50 నుండి 100 భాగాలు గిబ్బెరాలిక్ ఏసిడ్‌ను ఒకసారి చల్లడంవల్ల పండ్ల సగటు బరువు వరుసగా 19.94, 11.20, శాతం ఎక్కువ అయింది. ఒకవేళ యీ రసాయనాన్ని రెండు సార్లు ఇదేవిధంగా ఉపయోగిస్తే వరుసగా 32.23, 30.37 శాతం పండ్లబరువు ఎక్కువ అయింది. అంతేగాక పండ్లసైజు కూడా పెరిగింది. అయినా యీ విధానం ఇంకా పరిశీలనలో ఉంది. 50 (పిపియం) గిబ్బెరాలిక్ ఏసిడ్ రెండు సార్లు చల్లడం వల్ల ఫలాల పొడపు పెరగడమేకాక, వాటి తియ్యదనం కూడా యెక్కువయింది.

### నారింజలు

20 పిపియంలో 2,4-డి, 20 పిపియంలో 2,4,5-టి, రసాయనాలను చల్లడం ద్వారా పంటకాలానికి ముందు సాత్గుడినారింజలు రాలిపోకుండా అరికట్టవచ్చు.

### చెరుకుగడ క్రొత్త రకాలు

అనకాపల్లిలోని ప్రధానపరిశోధనా స్టేషన్, చెరుకు పైరుపై చేసిన పరిశోధనా ఫలితాలను రైతులకు సిఫార్సు చేసేముందు, బొబ్బిలి (శ్రీకాకుళం జిల్లా), ఎలమంచలి (విశాఖ పట్నం జిల్లా), సామర్లకోట (తూర్పు గోదావరి జిల్లా), తణుకు (పశ్చిమ గోదావరి జిల్లా), ఉయ్యూరు (కృష్ణా జిల్లా) చిత్తూరు (చిత్తూరు జిల్లా)లలోని చెరుకుగడ లైజాన్ క్షేత్రాలలో తిరిగి పరిశీలించడం జరిగింది.

బొబ్బిలిలో మిడిల్ సీజన్ రకం సి. ఒ. 449, పైరు పెరుగుదలలో ఇతర రకాలకన్నా శ్రేష్ఠమైంది. ఎలమంచలి, సామర్లకోట, తణుకులలో పంటదిగుబడికి సి. ఒ. 419 కన్నా సి. ఒ.497 ఉత్తమమైంది.

---

## గ్రామాలకు విద్యుచ్ఛక్తి సరఫరా

1963 జనవరిలో చిత్తూరు జిల్లా, సత్యవేడు తాలుకాలోని అగ్రారం, కలమనాయుడుపేట గ్రామాలకు విద్యుచ్ఛక్తి సరఫరా చేశారు.

1963 జనవరిలో తెలంగాణా సర్కిల్‌లో దిగువ గ్రామాలకు విద్యుచ్ఛక్తి సరఫరా చేయడం జరిగింది :

1. రంగాపురం (ఇబ్రాహింపట్నం తాలుకా)
2. కోరెట్కల్ (నల్లగొండ తాలుకా)
3. లాచాపేట (సిద్ధిపేట తాలుకా)
4. చిన్నాయపల్ల (ఇబ్రాహింపట్నం)
5. గుర్రంగూడ (హైద్రాబాదు జిల్లా)
6. ఈరుగుపల్లి (సిద్ధిపేట తాలుకా)
7. బోయనపల్లి (సిరిసిల్ల తాలుకా)
8. బూరుగుపల్లి (సిరిసిల్ల తాలుకా)
9. మర్లపేట (సిరిసిల్ల తాలుకా)
10. గంగారెడ్డిగూడెం (నల్లగొండ తాలుకా)
11. అనిసెట్టి దుప్పలపల్లి (నల్లగొండ తాలుకా)

1962 డిసెంబరులో చిత్తూరు జిల్లాలో దిగువ గ్రామాలకు విద్యుచ్ఛక్తిని సరఫరా చేశారు :

1. వెంగళరాజ కుప్పం
2. రాచనగరం
3. కలంచేరి
4. వేలూరు
5. వెనగలతూరు
6. నీరవాయె
7. అక్కగారిపేట (ఇవన్నీ సత్యవేడు తాలుకాలోవి)

అదేనెలలో కర్నూలు జిల్లా (తాలుకా) లోని వంగనూరు గ్రామానికి విద్యుచ్ఛక్తిని సరఫరా చేశారు.

# బంగారం కంట్రోలు

భారతదేశంలో బంగారం దొంగ రవాణాను అరికట్టడానికీ, బంగారం కొనుగోలును తగ్గించడానికీ వీలుగా 1963 జనవరి 10 వ తేదీ నుండి బంగారం కంట్రోలు నిబంధనలను అమలులో పెట్టారు. 9 కారెట్ల వన్నెగల ఏ రూపంలో ఉన్న బంగారానికైనా యీ నిబంధనలు వర్తిస్తాయి.

యీ నిబంధనల క్రింద దిగువ లావాదేవీలన్నీ చట్టవిరుద్ధమైనవి :

(1) 14 కారెట్ల వన్నెకుపైగల బంగారం ఆభరణాలను ఏ రూపంలోనైనా తయారుచేయడం, తయారీకై ఆర్డర్ ఇవ్వడం.

(2) లైసెన్సు పొందిన డీలర్లుకానీ పొందని డీలర్లుకానీ 14 కారెట్ల వన్నెకుమించిన బంగారు ఆభరణాలను విక్రయించడం; అయితే 1963 జనవరి 10 వ తేదీకి ముందే అటువంటి ఆభరణాలను తయారుచేసి ఉంచితే వాటిని 30 రోజులలోగా విక్రయించవచ్చు.

(3) బంగారు కడ్డీలు, దిమ్మెలు, పైర్లు ప్లాకులు, వస్తువులు మినహా ఇతర బంగారం వస్తువులను, విద్యుచ్ఛక్తి సహాయంతో శుద్ధిచేసి తయారు చేయడం. బంగారం బోర్డుఅనుమతితో ఇవి చేయవచ్చు.

(4) బంగారం బోర్డు అనుమతిలేనిదే ఆభరణాలు మినహా ఇతర వస్తువులను డీలర్లు తయారుచేయడం.

(5) పరిశ్రమదారులు, దంతవైద్యులు, ఆయుర్వేద వైద్యులు, బంగారం ఆభరణాలు కాక ఇతర విధాల బంగారం వాడేవారు బంగారం బోర్డు అనుమతించని ఇతర వస్తువులు తయారు చేయడం.

(6) పై 4,5 అంశాలలో తెల్పిన వస్తువులను 14 కారెట్ల వన్నెకు మించిన బంగారంతో తయారుచేయడం.

(7) లైసెన్సు పొందని వ్యక్తులు, డీలర్లు సంస్థలు అనుమతిలేకుండా ఆభరణేతర బంగారం లావాదేవీలు జరపడం. లైసెన్సు పొందిన డీలర్లు, శుద్ధిచేసే వారు నిబంధనలను ఉల్లంఘించడం.

(8) నియమనిబంధనల క్రింద బంగారం బోర్డుకు తెల్పకుండా ఆభరణేతర బంగారంపై రుణాలు, అడ్వాన్సులు ఇవ్వడం.

## ఆభరణాల వివరాలను ప్రకటించాల్సిన అవసరంలేదు

ప్రతివ్యక్తీ 50 గ్రాముల ఆభరణేతర బంగారం ఉంచుకోవచ్చు. ఇదేవిధంగా ప్రతి మైనరు 20 గ్రాముల చొప్పున బంగారం ఉంచుకోవచ్చు. యీ మొత్తానికన్నా ఎక్కువ బంగారం కలిగిఉంటే ఆ విషయాన్ని ప్రకటించాలి. ఏ వ్యక్తి దగ్గర బంగారం ఉన్నా అది అతని సొత్తుగానే భావించబడుతుంది. ఆభరణాల రూపంలో ఉన్న బంగారం వివరాలను తెల్పనక్కర లేదు. ఆభరణేతర బంగారం బహుమతిగా ఇవ్వడం చట్టవిరుద్ధం.

బంగారం కంట్రోలు నిబంధనలను అమలు జరిపే బోర్డుకు అనధికార వ్యక్తి అధ్యక్షులుగా ఉంటారు.

## లైసెన్సులు

విద్యుచ్ఛక్తి సహాయంతో బంగారం శుద్ధిచేసే కర్మాగారాలకు బంగారం పెద్ద వర్తకులకు బంగారం కంట్రోలు నిబంధనల వర్తింపజేస్తారు. విద్యుచ్ఛక్తి సహాయంతో బంగారం శుద్ధిచేసే వారు, బంగారం ఆభరణాలుతోపాటు ఇతర బంగారు వస్తువులను తయారుచేసే నమోదు అయిన బంగారం వర్తకు లందరు నెల రోజులలోగా బంగారం బోర్డు నుంచి లైసెన్సులు పొందాలి. లైసెన్సుకై సంబంధిత కేంద్ర ఎక్సైజ్ సూపరింటెండెంటుకు దరఖాస్తు చేయాలి. లైసెన్సు వార్షిక రుసుం రు॥ 100/లు దరఖాస్తుతో దాఖలుచేయాలి. లైసెన్సులు ఇవ్వబడని దరఖాస్తుదారులు ఆ తేదీ నుండి వర్తకం ఆపుచేసి వారివద్ద ఉన్న స్టాకులు అంతర్జాతీయ ధరకు ప్రభుత్వానికి విక్రయించాలి. లైసెన్సు పొందిన వర్తకులు తమవద్ద వివిధ రూపాలలో ఉన్న బంగారం నిలువ వివరాలనూ, క్రయ విక్రయ వివరాల లెక్కలనూ నిర్వహిస్తూ ఉండాలి.

నిర్ణీత ఫారాలలో యీ జాబితాలను నిర్ణీత కాలాలలో దాఖలుచేస్తూ ఉండాలి.

లైసెన్సు పొందని డీలర్లు బంగారం క్రయ విక్రయాలను చేయకూడదు. అయితే ఆభరణాలను ఇతర ఆభరణాలలోకి మార్చడం, పాలిష్‌చేయడంవంటి పనులు నిర్వహించవచ్చు.

లైసెన్సు పొందిన డీలర్లుకానీ, పొందని డీలర్లుకానీ అనుమతిలేకుండా ఆభరణాలు మినహా ఇతర బంగారం వస్తువులు తయారు చేయకూడదు.

లైసెన్సు పొందిన డీలర్లు వారికి అవసరమైన ఆభరణేతర బంగారాన్ని యితర లైసెన్సు పొందిన డీలర్లనుంచి కానీ, బంగారం శుద్ధిచేసే వారినుంచి కానీ, బంగారం నిల్వలను ప్రకటించిన వ్యక్తుల నుంచి కానీ కొనుగోలు చేయవచ్చు.

లైసెన్సు పొందిన బంగారం శుద్ధిచేసే డీలర్లు బంగారం కడ్డీలు, దిమ్మెలవంటి ప్రాథమిక బంగారాన్ని తయారుచేయకలుగుతారు. లైసెన్సు పొందిన డీలర్లతో మినహా ఇతరులతో వారు వ్యాపారం చేయకూడదు.

## పరిశ్రమలలో బంగారం వాడకం

పరిశ్రమలలో బంగారం ఉపయోగానికి అనుమతి లభిస్తుంది. శస్త్రపరికరాలను తయారుచేసే వారు, దంతవైద్యులు ఆయుర్వేద, యూనానీ వైద్యులు మొదలైన వారు తమవద్ద నిల్వఉన్న బంగారం వివరాలను ప్రకటించాలి. అయితే మినహాయింపు పరిధిలోకి వచ్చే నిల్వలను గురించి తెల్పాల్సిన అవసరంలేదు. భవిష్యత్తు అవసరాలకై పరిశ్రమల వినియోగదారులు ఆయా కేంద్ర ఎక్సైజ్ అధికారులనుంచి పర్మిట్లు పొందాలి. గత 12 మాసాలలో వాడి ఆమోదించబడినన నికర అంకెల ఆధారంగా బంగారం విడుదలకు పర్మిటు ఇవ్వబడుతుంది. అయితే యీ బంగారం విడుదల కూడా 50 గ్రాములకు మించి ఉండదు.

## పౌరుల బాధ్యత

బంగారం నిల్వచేయడం గురించీ, బంగారం దొంగ రవాణావల్లకలిగే దుష్పరిణామాలను గురించీ, సాంఘిక కార్యకర్తలు, ప్రజానాయకులు ప్రజలలో బహుళంగా ప్రచారం చేయాలి. అక్రమ నిల్వలకై బంగారాన్ని ఉపయోగించడం సమాజ వ్యతిరేక చర్యగా అందరూ భావించేట్టు చేయాలి.

ప్రస్తుత ఆత్యయిక పరిస్థితిలో అన్ని వనరులనూ రక్షణకు, అభివృద్ధికై వినియోగిస్తున్న యీ తరుణంలో బంగారం కొనుగోలు చేయకుండా ఉండడం ప్రతి పౌరుని నైతిక బాధ్యతగా గుర్తించాలి.

ఆధునిక యుగంలో బంగారాన్ని నిలువ చేయడం నిరుపయోగమే. వ్యక్తిగత దృష్ట్యా దీనికి ఉత్పత్తి విలువ యేమీలేదు. సమాజందృష్ట్యా ఇది ఉత్పత్తికి ఉపయోగపడడంలేదు.

విదేశాలవారు పొదుపుచేసిన ధనాన్ని బ్యాంకులలో వడ్డీ లభించే డిపాజిట్లు, సెక్యూరిటీలలో మదుపుచేస్తారు. బంగారాన్ని పెద్ద మొత్తంలో ఆభరణాల రూపంగా ఉపయోగించడం ఫ్యూడల్ విధానంగా భావించబడుతున్నది. ఆభరణాలకు అంతస్థు విలువ యేమీలేదు. పరిమిత సంఖ్యలో ఆభరణాలు చేయించినా తక్కువ వన్నెగల బంగారంతో చేసినవే అవుతాయి.

భారతదేశంలో సాంఘిక వత్తిడి కారణంగా పెద్ద మొత్తం బంగారంతో విధిలేక ఆభరణాలు చేయించే కుటుంబాలకు యీ క్రొత్తవిధానంకల్ల కొంత భారం తగ్గుతుంది.

ఆధునిక యుగంలో భారతదేశ ప్రజలు, సహగమనం, బాల్యవివాహం, పర్దా, వైధవ్యాలు మొదలైన పాత ఆచారాలకు స్వస్తి చెప్పారు. వారి నవీన భావాలు మరో పాత ఆచారమైన బంగారం ఉపయోగాన్ని, నిలువ చేయడాన్ని విడనాడాలి.

---

**వ్యర్థ వ్యయం మానండి!**
**విలాసాలకు స్వస్తి చెప్పండి!**
**జాతీయ రక్షణ కృషిని బలపర్చండి!**

---

# ఆంధ్రప్రదేశ్‌లో యన్.సి.సి. విస్తరణ

**1962** సంవత్సరం ఆంధ్రప్రదేశ్ రాష్ట్రానికి విజయ సంకేతాన్ని అందించింది. గత సంవత్సరం కొత్త ఢిల్లీలో జరిగిన రిపబ్లిక్ దినోత్సవం పెరేడులో పాల్గొన్న మన ఎన్. సి. సి. దళం ఇంటరు–సర్కిల్ ఛాంపియన్ షిప్పుబానర్‌ను గెలుచుకుంది. దీనికి తోడు ఆంధ్రప్రదేశ్ కేడెట్లు వ్యక్తిగతంగా దిగువ ట్రోఫీలను గెలుచుకున్నారు.

అ. ఇంటర్ – సర్కిల్ డ్రిల్లు పోటీ, ఆ. ఇంటర్ – సర్కిల్ లైన్ డ్రెసింగ్, ఇ. ఇంటర్–సర్కిల్ సమయపాలన, లైన్ డిసిప్లిన్ పోటీ, ఈ. ఇంటర్ – సర్కిల్ టర్నౌటు పోటీ, ఉ. అఖిలభారత జూనియర్ డివిజన్ మాటింగ్ ట్రోఫి, ఊ. ఇంటర్ – సర్కిల్ గార్డ్‌మోటింగ్ పోటీ, రన్నర్స్ అప్, ఋ. ఇంటర్ – సర్కిల్ ఉత్తమ ఒ. టి. యు. కేడెటు (కేడెటు మహ్మద్ సలీం జహంగీరు.)

రాష్ట్రంలోని యన్. సి. సి. మద్రాసు సర్కిల్ నెం 2 క్రింద ఉన్నప్పుడు 1955 వ సంవత్సరంలోనూ, ఆంధ్రప్రదేశ్ సర్కిల్ హెడ్ క్వార్టర్స్‌ను ఏర్పాటు చేసిన తర్వాత 1958 వ సంవత్సరంలోనూ బానర్లను గెలుచుకుని ఆంధ్రప్రదేశ్ విశిష్టస్థానాన్ని నిలుపుకుంది. 1959 నుండి 1961 వరకు వరుసగా మూడు సంవత్సరాలు యీ రాష్ట్రం బానర్‌కు రన్నర్స్ అప్‌గా ఉన్నది. 1962 జూలైలో కళాశాల విద్యార్థులు ఎంతో ఉత్సాహంగా యన్. సి. సి. లో చేరారు. నిర్ణీత కార్యక్రమం ప్రకారం సాధారణ శిక్షణ పూర్తి చేయబడింది. నెల్లూరులోని 8 వ ఆంధ్రబటాలియన్‌ను 2 క్వాయెలనుండి 4 క్వాయ్‌ల బటాలియన్‌కు మార్చడం, 10 జూనియర్ డివిజన్ ట్రూపులు, 45 ఎ. సి. సి. ప్లాటూన్లు, 100 యన్. సి. సి. క్వాయ్‌లను పెంచడం ద్వారా యన్. సి. సి. ని విస్తరించడం జరిగింది.

1962 వ సం. లో అన్ని డివిజనులకు మొత్తం 11 వార్షిక శిక్షణ శిబిరాలను నిర్వహించారు. ఆంధ్రప్రదేశ్ గవర్నరు జనరల్ శ్రీనగేశ్ ఒక శిబిరాన్ని సందర్శించి అక్కడి ఏర్పాట్లకు సంతృప్తి వెల్లడించారు.

అత్యయిక పరిస్థితి కారణంగా 1963 వ సం. రిపబ్లిక్ దినోత్సవంలో పాల్గొనే కేడెట్ల సంఖ్యను 76 నుంచి 5 కు తగ్గించబడింది. దీనివల్ల యీ సంవత్సరం అంతర్రాష్ట్రీయపోటీ నిర్వహించ బడలేదు. అయినా భారత దేశంలో కంటిన్యూటీ డ్రిల్లులో ఉత్తమస్థానం పొందిన బొల్లారంలోని జిల్లా పరిషత్తు పాఠశాల జూనియర్ డివిజన్ ఏర్‌వింగ్ దళాన్ని డ్రిల్లు ప్రదర్శనార్థమై ప్రత్యేకంగా న్యూఢిల్లీ పిలిపించారు.

1963 వ సం. లో ప్రస్తుతం వున్న 80 క్వాయెలను కలుపుకుని 448 యన్. సి. సి. రైఫిల్ క్వాయిలను యెక్కువ చేయడం ద్వారా రాష్ట్రం మొత్తంలో కొత్తగా 19 యన్. సి. సి. రైఫిల్సు బటాలియన్‌లను పెంచడం జరుగుతుంది. రైఫిల్సుతో సహా అన్ని సీనియర్ డివిజన్ యూనిట్లలో మొత్తం 56000 కేడెట్లు ఉంటారు. దేహదార్ఢ్యం గల కళాశాల విద్యార్థు లందరినీ ఎన్. సి. సి. లో చేర్చుకోవాలని భారత ప్రభుత్వం ఆదేశించిన విధంగా యీ పథకం సిద్ధం చేయబడింది.

ఈ విస్తరణ పథకం అమలుకు 148 కళాశాల ప్రొఫెసర్లను ఎన్నుకొని శిక్షణ ఇవ్వడం అవసరం. యీ సెలక్షనులు పూర్తి అయినందువల్ల 1963 ఏప్రిల్, మే, జూన్ నెలలలో ఆంధ్రప్రదేశ్ కేడెట్ కార్ప్స్ డైరెక్టరేటు యీ ఆఫీసర్–కేడెట్లకు ప్రీ–కమీషన్డ్ శిక్షణ కోర్సులో 12 వారాలు తీవ్రతర శిక్షణ ఇస్తుంది.

---

**రక్షణకృషితో సహకరించండి!**
**రక్షణ డిపాజిటు పత్రాలలో**
**మదుపు పెట్టండి!**

---

హిందీ కథ:

# గొర్రెలకాపరీ, సైనా ముష్కరులూ...

మూలం : కృష్ణచంద్ర

అనువాదం : దండమూడి మహీధర్

అతడు దరాంగ్ జాంగ్‌లో 'గొంపా' ముందు ప్రార్థన ముగించుకొని ఒక చిన్న రాతిమీద కూర్చున్నాడు. అది అక్టోబరు మాసం! గొంపాకు దిగువ లోయల్లో అతని గొర్రెల మంద వున్నది. ఆ మందలో మొత్తం తొమ్మిదివందల గొర్రెలున్నాయి. అన్నీ హాయిగా పచ్చిక మేస్తున్నాయి. ఎదురుగా అడవులు! దూరంగా ఎత్తుగా వత్తుగా పెరిగిన 'ఫర్' చెట్లూ, లోయలూ కన్పిస్తున్నాయి. ఈ అడవికి ఎగువ పదమూడున్నర వేల అడుగుల ఎత్తున వున్న సేలా లోయ — గుర్రపు జీనులాగా వున్నది. వరుసగా చిన్న పర్వతాలను, ఆ పర్వతాల మీదుగా కన్పించే నీలి మేఘాలను అతడు తదేకంగా చూస్తున్నాడు. మధ్య మధ్యన చల్లటి పిల్ల గాలులు అతని మేనును స్పృశించి గిలి గింతలు పెడుతున్నాయి. ఏవో ఆలోచనలు అతనిని పులకరింప జేస్తున్నాయి.

ఊహలదోనెల్లో విహరిస్తూ కూర్చున్న అతగాడికి అకస్మాత్తుగా తనవైపు నడచి వస్తున్న ఇద్దరు భారతీయ సైనికులు కన్పించారు. కొంచెం దగ్గరకు వచ్చాక అతడు వాళ్ళను గుర్తు పట్టగలిగాడు — ఒకతను కరణ్‌సింగు, మరొకతను ఆసారామ్! వీళ్ళిద్దరూ దరాంగ్ చౌకీవద్ద కాపలా వున్నారు.

"ఏం బాబాయ్! గొర్రె ఒకటికావాలి!" అని అడిగాడు కరణ్‌సింగు అతనిముందు నవ్వుతూ నిలబడి!

'ఎందుకయ్యా?' అని కోపంగా అడిగాడు. భారతీయ సైనికులు తరచు అతనివద్ద గొర్రెలు కొంటూ వుంటారు. కాని ప్రస్తుతం గొర్రెలు అమ్మడం అతని కిష్టంలేదు. వారం రోజుల క్రితమే జబ్బార్ అనే సైనికుడు యు. పి. లో అనారోగ్యంగా వున్న తన తండ్రి ఆరోగ్యంకోసం పార్టీ చేయాలని ఒక గొర్రెను కొన్నాడు. ఇప్పుడు వీళ్ళు వూడిపడ్డారు.

ఆసారామ్ జమ్మూకు చెందిన డోగ్రా జాతీయుడు. నవ్వుతూ అతనివద్దకు వచ్చి— 'మా ఆవిడ మగబిడ్డను కన్నదట; వుత్తర మొచ్చింది. ఇదే నాకు మొదటిసంతానం. అని అన్నాడు.

'మగబిడ్డ కలిగిన సంతోషానికి ఆసారామ్ మా సైనికులందరికీ పార్టీ యిస్తున్నాడు. ఒక గొర్రె కావాలి బాబాయ్!' అని నవ్వుతూ కరణ్‌సింగు అసలు విషయం బయట పెట్టాడు.

సైనికులంతా అతన్ని గొర్రెల బాబాయి అనే పిలుస్తారు. అతని పేరేమిటో ఎవరికీ తెలియదు. తెలుసుకోవాలని ఎవరూ ప్రశ్నించనుకూడా లేదు. మనిషి చూడడానికి చాలా అమాయకంగా కన్పిస్తాడు. తలమీద వెంట్రుకలు లేవనే చెప్పాలి. వెనుక చిన్న పిలక ముడిమాత్రం వున్నది. ఆ పిలక ముడి ఎప్పుడూ అటూయిటూ ఆడుతూ వుంటుంది. అతనిలో పసిపిల్లల అమాయకత్వం, వయస్కుల గాంభీర్యం — రెండూ మిళితమై కన్పిస్తూ వుంటాయి. అందుకే అందరూ అతన్ని 'గొర్రెల కాపరి బాబాయ్' అంటూ వుంటారు. అప్పుడప్పుడు అతన్ని ఆటలు పట్టించడంకూడా కద్దు.

'ఉహుం... ఇవ్వను!' అన్నాడు గొర్రెల బాబాయ్ కోపంతో. ఆ కోపానికి పిలక ముడి సైతం అటూయిటూ కదిలింది.

'ఊరికే యివ్వమనడంలేదు. డబ్బిస్తాం, ఎంత కావాలో చెప్పు!' అన్నాడు ఆసారామ్.

'డబ్బు అందరూ యిచ్చేవాళ్ళే!' బాబాయ్ విసుక్కుంటూ అన్నాడు — డబ్బు 'యిస్తే మటుకేం?

[ఆంధ్రప్రదేశ్ పాఠకులకు యింతవరకూ నాటికలనుగాని కథానికలనుగాని కేవల స్వతంత్ర రచనలే అందిస్తూ వచ్చాము. యికముందు ఆంధ్రేతర భాషలనుంచి ఉత్తమ రచయితల రచనలను కూడా ఈ "అనువాద భారతి" శీర్షిక క్రింద క్రమంగా ప్రచురించ దలచామని తెలియజెయ్యడానికి సంతోషిస్తున్నాము. —ఎడిటర్]

**అనువాద భారతి**

ఆ డబ్బులు వుంటాయా, చస్తాయా? కాని గొర్రెలు దొరకడమే కష్టం! వాటిని పెంచాలి. మీకేం తెలుసునయ్యా గొర్రెల పెంపకంలోని సాధకబాధకాలు!'

'పిల్లలుకూడా రోజూ పుట్టరు!' అన్నాడు కరణ్‌సింగు.

'ఇవ్వను! అంతే!' అన్నాడు, అదే ఆఖరిమాట అయినట్టు.

ఆసారామ్ ఒక్కసారిగా దిగాలు పడ్డాడు. కరణ్‌సింగు ఉత్సాహంకాస్తా కర్పూరంలా కరిగిపోయింది. వాళ్ళిద్దరూ మారుమాట్లాడలేదు.నిరాశగా తమ చౌకీవైపు వెళ్ళడానికి వెనక్కు తిరిగారు. బాబాయ్‌కు అకస్మాత్తుగా వాళ్ళ మీద జాలిపుట్టింది. 'ఇదుగో! ఇలా రండి!' అని వాళ్ళను వెనక్కు పిలిచాడు.

సైనికులిద్దరూ వెనక్కు తిరిగి వచ్చారు. సంతోషంతో వాళ్ళ మొహాలు వికసించాయి.

'గొర్రె ఖరీదు–పదిహేను రూపాయలు! యిస్తారా?' అని ప్రశ్నించాడు, గొర్రెల బాబాయ్, వారంరోజుల క్రిందట జబ్బార్‌కు పది రూపాయలకే యిచ్చాడు. అయినా వాళ్ళకు పదిహేను రూపాయలు ఎక్కువని పించలేదు.

'ఇరవయ్ యిస్తాను బాబాయ్!' అన్నాడు ఆసారామ్ సంతోషం పట్టలేక.

బాబాయ్‌కు కోప మొచ్చింది. 'పదిహేను రూపాయలంటుంటే, ఇరవయ్ యిస్తానంటా వేమిటి?' అని అన్నాడు.

'ఐదురూపాయలు ఎక్కువే యిస్తున్నాం!' అన్నాడు కరణ్‌సింగు.

కాని కాపరి బాబాయ్ యిష్టపడలేదు. 'నాకు ఎక్కువా వద్దు. తక్కువా వద్దు. నే అడిగినంత యిస్తే యివ్వండి; లేకపోతే మరొక కాపరిని చూసుకోండి!' అని అన్నాడు.

ఆసారామ్ జేబులోనుంచి పదిహేను రూపాయలు తీసి యిచ్చాడు. బాబాయి వాళ్ళి ద్దర్నీ కిందికి లోయలవైపు తీసుకెళ్ళాడు. అక్కడ అతని గొర్రెలు మోరలు వంచు కొని నిశ్చింతంగా గడ్డి మేస్తున్నాయి. మంద లోని ప్రతి గొర్రె పట్ల అతనికెంతో మమకారం! ఏ గొర్రెను అమ్మాలో అత నికి బోధపడలేదు. చివరకు కళ్ళు మూసు కొని ఒక గొర్రెమీద చేయివేసి – 'దీన్ని తీసుకెళ్ళండి!' అని అన్నాడు.

ఆసారామ్ ఆ గొర్రెను పట్టుకున్నాడు.

'వెంటనే తీసుకెళ్ళిపోండి!' అని అన్నాడు కాపరి బాబాయ్ కళ్ళుమూసుకునే.

కొంచెం సేపయిన తరువాత కళ్ళు తెరి చాడు. ఆసారామ్, కరణ్‌సింగు–యిద్దరూ గొర్రెను తీసుకుని చిన్నగుట్ట యెక్కు తున్నారు.

గుట్ట యెక్కి కరణ్‌సింగు బిగ్గరగా కాపరి బాబాయ్‌ను కేకేసి – 'ఏమయ్యోయ్ బాబాయ్! నువ్వుకూడా పెళ్ళి చేసుకోరాదూ? నీకు కుర్రాడు పుడితే మీ ఇంటికి భోజనానికి వస్తాం!' అని అన్నాడు.

'పెళ్ళి చేసుకోనా? ఎలాగయ్యా? నా కున్నది తొమ్మిదివందల గొర్రెలేగా?'

'తొమ్మిదివందలంటే తక్కువా ఏమిటి?'

'వెయ్యి గొర్రెలుంటేగాని నాకు పెళ్ళి కాదు...వెయ్యి గొర్రెలు!' అని అంటూ విచారంగా గొర్రెల కాపరి బాబాయ్ మందను అదిలించుకొంటూ ముందుకు సాగి పోయాడు.

*   *   *

అతగాడు మోన్పా జాతీయుల గీతమేదో ఆలాపించుకుంటున్నాడు. అతని కన్నుల యెదుట ఒక భోటియా యువతిరూపం తార ట్లాడుతున్నది. ఆమె సేలా కనుమకు పశ్చిమంగావున్న సాంగ్ అనే గ్రామానికి చెందింది. వచ్చే వసంతం నాటికి – లోయ లలో పూలు విరియబూసే రోజుకు అతని వద్ద వెయ్యి గొర్రెలు సమకూరుతాయి. ఆ రోజున గొర్రెల మందను తోలుకొని సాంగ్ లోయలనుదాటి తనకోసం ఎదురు చూస్తున్న భోటియా యువతిని కలుసుకుంటాడు.

దరాంగ్ జాంగ్ లోయలగుండా నడిచి దట్టంగావున్న అడవులనుదాటి సేలా కనుమ వద్దకు వచ్చాడు–మందను అదిలించుకుంటూ! సేలా కనుమకు దిగువనున్న లోయలో మధ్యాహ్న భోజనం ముగించుకున్నాడు. అక్కడ ఒక గంటసేపు అతని గొర్రెలు చెట్లకింద నిలబడి విశ్రాంతి తీసుకున్నాయి.

అతను కూడా ఒక చెట్టుకింద గుర్రపు జీనులాగావున్న సేలా కనుమవైపు చూస్తూ కూర్చున్నాడు. అకస్మాత్తుగా తాను పెళ్ళి కొడుకై పోయినట్టు గుర్రంమీద కూర్చొని సాంగ్ గ్రామంవైపు వెళ్ళినట్టు అనిపించింది. సంతోషాన్ని పట్టలేక అతను పాటలుపాడటం ప్రారంభించాడు.

అతనిపాట అకస్మాత్తుగా మధ్యలోనే ఆగిపోయింది. ఒక చెట్టు గుబురు పక్క నుంచి చాలా పొట్టిగావున్న ఒక వ్యక్తి తన వైపురావడం అతను చూశాడు. అతని భుజాన ఒక తుపాకి ఉన్నది. ఆవ్యక్తి దూది కోటు ధరించి వున్నాడు. పెద్దమూట ఒకటి అతని నడుముకు కట్టబడివుంది. అతడొక చైనీయుడు.

ఆ చైనీయుడు అతని వద్దకువచ్చి దగ్గర్లో వున్న మరొక చెట్టుకింద కూర్చొని మొహం మీదవున్న చెమటను తుడుచుకుంటున్నాడు.

'ఎవరయ్యా నువ్వు?', కొంచం కోపంగా అడిగాడు, గొర్రెలకాపరి బాబాయి.

'నా పేరు లీపో' అన్నాడు చైనీయుడు!

'అయితే, ఇక్కడి కెందుకొచ్చావు!'

'కొత్త కొత్త, రంగు రంగుల పూలంటే నాకు చాలా యిష్టం ః దరాంగ్ జాంగ్ లోయలలో నీలంరంగు పూలు దొరుకుతా యని విన్నాను. ఆ పూలకు బంగారు రంగు ఆకు లుంటాయటగా'

'అవు నవును ః ఆ పూలను మేము 'కాశా' పూలంటాం.'

'ఆఁ కాశాపూలు!' లీపో బిగ్గరగా నవ్వుతూ బాబాయ్‌కు చేరువగా వచ్చాడు. అతని చేతిని తన చేతిలోకి తీసుకుంటూ 'హిందీ చీనీ భాయీ భాయీ' అని బిగ్గరగా అన్నాడు.

'అయితే ఏమిటి ?' అని ప్రశ్నించాడు ః బాబాయ్‌కు కొంచెం సందేహం వేసింది అతనిమీద.

'నాకు కాశాపూలగుత్తులు నాలుగైదు కావాలి ?'

'ఎందుకు ?'

'ఊరికే!' అవంటే నాకు చాలా యిష్టం 'నాకు తెచ్చిపెడతావా ?'

'రేపు తెస్తాను!' అని అన్నాడు, కాపరి బాబాయ్. అతని సందేహంకాస్తా మాయ మైంది.

'నాకు రకరకాల పూలు పోగుచేయడ మంటే చాలా సరదా!' అని లీపో తన సంచిలోనుంచి ఒక పుస్తకం తీసి చూపిం చాడు. ఆ పుస్తకం పేజీలమీద రకరకాల ఎండిన పూలు అంటించబడి వున్నాయి. బాబాయ్ వీటిని చూసి ఆశ్చర్యపోయాడు. చాలా సేపు ఆ పుస్తకాన్ని అటూయిటూ తిప్పి మరీచూశాడు. చైనీయుడు వెడుతూ వెడుతూ తన సంచిలోనుంచి ఒక పట్టు రుమాలు తీసి అతనికి చూపించాడు. ఆ రుమాలుమీద 'హిందీ చీనీ భాయీభాయీ!' అనే అక్షరాలు కుట్టబడి వున్నాయి.

'మనం భాయీభాయీలం కదూ ?' అని నవ్వుతూ అన్నాడు.

'అవునవును!' అన్నాడు గొర్రెల కాపరి బాబాయ్, అతని చేతిలో చెయ్యివేసి.

'అయితే ఈ రుమాలును నేను నీకు బహుమతిగా యిస్తున్నా, తీసుకో!'

కాపరి బాబాయి అది నాకు వద్దంటే వద్ద న్నాడు. కాని లీపో వినలేదు. బలవంతం చేశాడు. రుమాలు చాలా అందంగా వుంది. ఆ రుమాలుమీద ఎర్రటి పూలు కుట్టారు. ఆ రుమాలు తన పెళ్ళిరోజున పెళ్ళికూతురికి బహుమానంగా యిస్తే బావుంటుందని భావించి చివరకు దాన్ని తీసుకున్నాడు.

ఆ రెండవరోజున బాబాయ్ లీపో కోసం నీలాల పూలు కోసుకుతెచ్చాడు. ఈ పూలు దరాంగ్ జాంగ్ లోయలలో మాత్రమే దొరుకుతాయి. ఈ విషయం లీపోకు చెప్పి నప్పుడు అతనెంతో సంతోషించాడు. అతన్ని ముద్దు పెట్టుకున్నాడు. గాఢంగా కౌగలించుకున్నాడు. బాబాయ్‌కూడా తన కొత్త మిత్రుడి ప్రవర్తనకు ఎంతో సంతో షించాడు. లీపో తన సంచిలోనుంచి వుప్పు తీసి అతనికిచ్చాడు. పర్వత ప్రాంతాలలో వుప్పు బహుమానంగా పొందడం అంటే చాలా గొప్పవిషయం.

మూడవరోజున బాబాయి లీపోకోసం మరికొన్ని పూలు తెచ్చి యిచ్చాడు. ఆ రోజున ఉభయులూ కలిసి భోజనం చేశారు. ఆ తరువాత గంటలకొలది కూర్చొని కబుర్లు చెప్పుకున్నారు.

అలా కొన్ని రోజులు గడిచాయి.

ఏమయ్యా ః దరాంగ్‌జాంగ్‌లో భారతీయ సైనికులు చాలామంది వున్నారేమిటి ?' అని ప్రశ్నించాడు ఒక రోజున లీపో, ఏదో మాటల సందర్భంలో :

'మా గ్రామంవద్దవున్న గస్తీ చౌకీ చాలా చిన్నది.'

'మరీ : సేలా కనుమకు దరాంగ్‌జాంగ్ చాలా దూరంలో వున్నదికదా, నువ్వు రోజూ ఇంత దూరం ఎలా రాగలుగు తున్నావు ?'

'నేను రోడ్డున వస్తున్నాననుకున్నావా ? అబ్బేకాదు ; ఇక్కడ గొర్రెల కాపర్లకు ఎన్నెన్ని దారులున్నాయో ఏమిటో అన్నీ క్షుణ్ణంగా తెలుసు. ఆ దారుల వెంట వస్తే రోజుల తరబడి నడిస్తేగాని తరగని దూరం — గంటలలో తరిగిపోతుంది.'

'నన్నొకరోజు ఆ దారులవెంట దరాంగ్ జాంగ్ తీసుకు వెడతావా ? ఆ పూల చెట్లను చూడాలని నాకెంతో కుతూహలంగావున్నది.

'తప్పకుండా తీసుకెడతాను.' అని గొర్రెల కాపరి బాబాయి అన్నాడు.

* * *

అడవులలో చిన్న చిన్న దారుల వెంట నడిపించి అతడు దరాంగ్‌జాంగ్ లోయలలో నీలంరంగుపూలు వికసించిన చోటికి తీసు కెళ్ళిన రోజున — లీపో సంతోషానికి మేర లేక పోయింది. లీపో నీలంరంగుపూల చెట్లను కొన్నింటిని మొదలంటా పీకి తన సంచిలో వేసుకొన్నాడు. ఆ తరువాత వుభయులూ కలిసి మళ్ళీ గొర్రెల మంద వున్న సేలా కనుమవద్దకు వచ్చారు.

లీ—పో ఇవ్వాళ చాలా సంతోషంగా వున్నాడు. ఆ సంతోషంలో మంచి చెప్పుల జత ఒకటి తన సంచిలో నుంచి తీసి అతనికి బహుమతిగా యిచ్చాడు. వాటిని చూసి బాబాయి ఎగిరి గంతేశాడు. తన అన్నను అటువంటి చెప్పులు కొనిపెట్టమని ఎన్నో సార్లు అడిగాడు ; పెళ్ళినాటికి కొనిపెడతానని అన్నాడు. ఈ రోజున ఆశించకుండానే తన కా బహుమతి లభించింది.

అతను లీపోను కౌగలించుకున్నాడు. 'మీ చైనా సైనికులు ఎంత మంచివారు ః ఈ రోజువరకు ఒక్క గొర్రె కూడా అడగ

లేదు. పూలు కావాలన్నావు. అంతకుమించి ఏమీ ఆశించలేదు.' అని అన్నాడు :

'మా చైనీస్ సైనికులు మరొకరికి కష్టం కలిగించరు; మరొకరి సొత్తును ముట్టరు. మేము ఎప్పుడూ మా ఆహారాన్ని మేము వెంట తెచ్చుకుంటాం' అని లీ-పో తన సంచి చూపించాడు. ఆ సంచిలో బియ్యం, టీ ఆకులు వున్నాయి.

లీ-పో, గొర్రెల కాపరి బాబాయి-ఇద్దరూ మంచి మిత్రులయ్యారు. లీ-పో రెండు మూడు రోజుల కొకసారి అతని వద్దకు వచ్చి కబుర్లు చెబుతూ చాలా సేపు కూర్చుంటున్నాడు. ఆ అడవిలో గొర్రెలు కాసేవాడికి మరొక వ్యక్తి పక్కన వున్నాడూ అంటే కాలం యిట్టే గడిచిపోతుంది. ఇందుకే లీ-పో ఎప్పుడొస్తాడా అని బాబాయి ఎదురు చూస్తూ వుంటాడు.

మరికొన్ని రోజులు గడిచి పోయాయి. ఇద్దరి మధ్య మైత్రి భావం రోజురోజుకూ పెరిగిపోతున్నది. అక్టోబరు మాసం గడిచి పోయింది. నవంబరు కూడా సగం గడిచి పోయింది. నిత్యం లీ-పో, గొర్రెల కాపరి బాబాయి ఉభయులు సేలా కనుమలకు దిగువ అడవి ప్రదేశంలో కలుసుకుంటూ కబుర్లు చెప్పుకుంటూ కాలం గడుపుతున్నారు.

* * *

నవంబరు మూడవ వారాంతాన-ఆకస్మాత్తుగా దరాంగ్ జాంగ్ సైనిక చౌకీ ఖాళీ చేయవలసినదనీ, గ్రామ ప్రజలు కూడా తమ విలువగల వస్తువుల్ని వెంట తీసుకొని సైనికులతో సురక్షిత ప్రాంతాలకు తరలి వెళ్ళవలసిందని ఆదేశం యివ్వబడింది.

దరాంగ్ జాంగ్ గ్రామస్థులంతా ఆ సాయంత్రం గొంపా బుద్ధవిగ్రహానికి చివరసారిగా నమస్కరించి, గొర్రెల్ని, మేకల్ని తోలుకొని ముఖ్యమైన వస్తువుల్ని వెంట తీసుకొని పిల్లాజెల్లాతో బొమ్‌డిలా వైపు ప్రయాణమైనారు.

ఆరాత్రి బాబాయికు నిద్రపట్టలేదు. అతని మనస్సంతా సాంగ్ గ్రామం మీదనే వున్నది. సేలా కనుమల మీద నిలబడి తరచు సాంగ్ గ్రామాన్ని చూస్తూ వుండేవాడు - అక్కడ తనకోసం ఎదురు చూసే, యువతిని తలుచుకుంటూ ! బొమ్‌డిలా వెడితే తన ప్రియురాలికి మరింత దూరమై పోతాడు !

గ్రామస్థులంతా వెళ్ళిపోయాక, అర్ధరాత్రి వేళ కాపరి బాబాయ్‌లేచి తన మందను బొమ్‌డిలా వైపుకాక, గొంపాకు దిగువగా అదిలించి సేలా కనుమలవైపు పట్టించాడు. అతడు ఆలోచించిన దేమిటంటే — గొర్రెల మందను సేలా కనుమల ప్రాంతాలకు తోలు కెళ్ళి అక్కడ ఎవరికీ తెలియని ఒక గుహలో రహస్యంగా ఆ రాత్రికివుంచి, ఆ రెండవరోజు చీకటి పడేదాక అక్కడే గొర్రెలు మేపుకొని — ఆ తరువాత సేలా కనుమలు, లోయలుదాటి భూటాన్‌కు సరిహద్దునవున్న సాంగ్ గ్రామం చేరుకోవాలి ! భోటియా యువతి తండ్రికి తన తొమ్మిది వందల గొర్రెలమందను అప్పగించాలి అని!

ఇలా చేయడం మంచిదని భావించి వెంటనే ఈ పనికి పూనుకున్నాడు. చైనీయులు ఎవరైనా పట్టుకుంటారనే భయం కూడా అతనికిలేదు. లీపో అతనికి గాఢ మిత్రుడు !

రెండవ రోజు మధ్యాహ్నం లీపో కన్పించాడు. అతనివెంట మరొక ఎనిమిదిమంది చైనా సైనికులున్నారు. వాళ్ళవద్ద ఆటోమేటిక్ తుపాకులున్నాయి.

గొర్రెల కాపరి బాబాయ్‌కు లీపోను చూసేప్పటికి ప్రాణం లేచివచ్చింది. లీపో అతన్ని కౌగలించుకొని — 'నువ్వు బొమ్‌డిలా వెళ్ళ లేదా ?' అని అడిగాడు.

'వెళ్ళలేదు.'

'మంచిపని చేశావు. చాలా మంచిపని చేశావు !' అని లీపో సంతోషంతో చేతులు నలుపుకుంటూ-'ఏమయ్యోయ్ ! మా కిప్పుడు గొర్రెలు కావాలి. చాలా అవసరం సుమా !' అని రెట్టించి అన్నాడు.

బాబాయ్ ఒక్కసారిగా తల్లక్రిందులైనాడు.

'ఎన్ని కావాలి?' అని బొంగురు గొంతుతో అడిగాడు గొర్రెల బాబాయ్.

'వెయ్యి గొర్రెలు కావాలి. వెయ్యి! వెంటనే ! ఈ పని నా కప్పగించారు.'

'మరి నా దగ్గర వున్నది తొమ్మిది వందలేగా ?'

'తొమ్మిది వందలతోనే సరిపెట్టుకుంటాం. మా చైనీయులు ఎవరినీ యెటువంటి బలవంతమూ చేయరు. శాంతి మా మొదటి సిద్ధాంతం !'

'ఇదుగో, నీ శాంతి గీంతి నాకు జాన్తానై ! ఈ గొర్రెలు నావి !' అన్నాడు కొంచెం దర్పంగా !

'నీవయితే ఏమయ్యా ! వాటిని మేము తోలుకెళ్ళి డబ్బిస్తాం. మా చైనా సైనికులు ఇతరుల వస్తువుల్ని వుఫ్ఫాగా కొట్టేయడానికి ఎప్పుడూ ఒప్పుకోరు. అయితే ఎవరి అధికారాలను వాళ్ళకు మేము పంచిపెడతాము. గొర్రెకు ఐదు రూపాయల చొప్పున యిస్తాము.'

'ఐదు రూపాయాలేనా?' అని అరచాడు, గొర్రెల బాబాయ్ కోపం తెచ్చుకొని.

'ఎందుకయ్యా అలా అరుస్తావు ?' లీపో గద్దించాడు-'నువ్వు నా స్నేహితుడివి గనక ఐదురూపాయ లిస్తానన్నాను. ఎగువ స్థావరంలో మేము ఒక్కొక్క గొర్రెకు రెండేసి రూపాయలు మాత్రమే యిచ్చాం. ఆ ముందు స్థావరంలో గ్రామస్థులు వాళ్ళ

దగ్గరున్న గొర్రెల నన్నింటినీ మాకు బహుమతిగా యిచ్చేశారు. నీకుమాత్రం మేము డబ్బిస్తాం. ఎందుకంటే నువ్వు నాకు స్నేహితుడివి! ఇదుగో–ఐదు రూపాయల చొప్పున తొమ్మిదివందల గొర్రెల ఖరీదు!'

లీపో జేబులోనుంచి కరెన్సీ నోట్లకట్ట ఒకటి బయటికి తీశాడు. వాటిని చూసి గొర్రెల బాబాయ్–'ఇవి మా నోట్లు కాదు!' అని అన్నాడు దిగాలుగా.

'ఇకముందు యివే చెలామణీ అవుతాయి. వీటిమీద చూశావోలేదో–మా చైర్మన్ మావో బొమ్మవుంది-ప్రాణాలకంటే మిన్న మాకు మావో!'

గొర్రెల బాబాయి ఆ నోట్లకట్టను లాగి కిందపడేశాడు–కోపంగా, 'ఈ నోట్లు మా దేశంలో చెల్లవు!' అని అన్నాడు – ఉగ్ర రూపం దాల్చి.

వెంటనే ఇద్దరు చైనా సైనికులు తమ ఆటోమాటిక్ తుపాకుల్ని అతని రొమ్ము మీద పుంచారు. లీపో కత్తికంటే కూడా వాడియైన కాఠిన్యంతో 'ఏమయ్యోయ్! మిత్రమా! ఈ యిద్దరు సైనికులతోపాటు నీ గుహలోనికి వెళ్ళి నీ గొర్రెల మందను వీళ్ళకు అప్పగించి వాళ్ళతోపాటు నువ్వుకూడా సేలా కనుమల ప్రాంతాలకు వెళ్ళితీరాలి. ఇది నా ఆజ్ఞ! నా ఆజ్ఞను ధిక్కరించావంటే – నీ ప్రాణాలు నీకు దక్కవు! నా చేతిలో 'హరి' అంటావు! గుర్తుంచుకో' అని అన్నాడు.

లోయలు, ఎత్తయిన గుట్టలూ, అడవులు దాటుకుంటూ గొర్రెల బాబాయి చైనా సైనికులతోపాటు గొర్రెల మందను ముందుకు అదిలిస్తున్నాడు. సాయంత్రం మూడు గంటలు కావస్తూన్నది. ఎంత నడిచినా దారి తరగడంలేదు.

'త్వరగా నడవ్వయ్యా!' అని చైనా సైనికులు తొందర పెడుతున్నారు.

'నడుస్తూనే వున్నానుగదటయ్యా! ఈ గొర్రెలు మరి మందకొడిగా నడుస్తున్నాయి. వీటి సంగతి మీకు తెలియనిదేముంది?'

నిజంగానే గొర్రెలు సక్రమంగా నడవడం మానివేశాయి. ఒకటి ఎడంవైపుకు నడిస్తే మరొకటి కుడివైపుకు పరుగెత్తుతుంది. లోయ ఎగువభాగానికి అదిలిస్తే, దిగువ భాగానికి వెళ్ళిపోతున్నాయి. ఈ హడావిడిలో అతగాడు అసలు దారే మరచిపోయాడు. పైగా సాయంత్రం కావస్తున్నది.

'ఏమయ్యా! మేము వచ్చేప్పుడు ఈ దారిన రాలేదే!' అన్నాడొక చైనా సైనికుడు – సందేహిస్తూ.

'తొందరగా వెళ్ళమంటున్నారుగా! అందుకని మరొకదగ్గర దారిన తీసుకెడుతున్నా. మీకంత నా మీద నమ్మకంలేకపోతే ఈ గొర్రెల్ని మీరే తోలుకెళ్ళండి.

గొర్రెలు మారాము ళ్ళు పెడుతున్నాయని చైనా సైనికులు కూడా అర్థం చేసుకున్నారు. అందుకని మారు మాట్లాడక అతను ఎటు తీసుకెడితే అటు నడుస్తున్నారు. గొర్రెల బాబాయి వాళ్ళను ఆ అడవులగుండా, రకరకాల లోయలగుండా ముందుకు నడిపిస్తున్నాడు.

ఇంకొంచెం సేపటికి చీకటి పడుతుందనగా గొర్రెల బాబాయి గొర్రెల మందను అదిలించుకుంటూ పశ్చిమ కనుమలకు చెందిన ఒక లోయవద్దకు వచ్చాడు. ఇక్కడనుంచి చూస్తే – సేలా కనుమ కన్పిస్తుంది. అప్పుడే ఆకాశగర్భంలో కలిసిపోయే సూర్యకిరణాలు సాంగ్ లోయను స్పృశిస్తున్నాయి. అక్కడికి సమీపంలో వున్న గ్రామాన్ని, అందంగా పెరిగివున్న చెట్లనూ, ఎత్తుగా పెరిగిన పంట పొలాలనూ ఆ పొలాలకు పక్కగా యువతీలలామ వయ్యారపు నడకవలె ప్రవహించే నదీ ప్రవాహాన్నీ–అతని కన్నుదోయి చూచింది.

మనసారా మరొక మారు తలపైకెత్తి అతగాడు తన ప్రియురాలికి చెందిన లోయను చూశాడు. మందలోని గొర్రెలను ఒక్కసారిగా – తనకోసం నిరీక్షిస్తున్న ఆ భోటియా యానతి సాంగ్ గ్రామంవైపు మళ్ళించి గట్టిగా అదిలించాడు.

'ఇదేమిటయ్యా! గొర్రెల్ని అటు తోలుకెడతావేమిటి? సేలా కనుమ ఏగువ భాగాన వున్నదిగా?' అని ఒక చైనా సైనికుడు బిగ్గరగా అరచాడు.

గొర్రెల బాబాయ్ మారు మాట్లాడలేదు. రెప్పపాటు కాలంలో మందలోని గొర్రెలన్నీ 'బేఁ బేఁ' మంటూ సంతోషంతో చిందులుతొక్కుతూ దిగువనవున్న సాంగ్ లోయలోకి పరుగులుతీసి వెళ్ళిపోయాయి. గొర్రెల బాబాయ్ చైనా సైనికుల్ని చూచి ఒక్కసారి బిగ్గరగా నవ్వాడు.

వెంటనే చైనీయులు అతనిమీద తుపాకి కాల్చారు. అతను కిందపడి దొర్లుకుంటూ విరబారిపూసిన నీలిరంగు పూలపొద పక్కకు వెళ్ళిపోయాడు. ఆ పూలచెట్లు ఆకులు బంగారు కాంతితో మెరుస్తునాయి. అతని మొహం సాంగ్ లోయవైపు తిరిగివుంది. ఒక్క క్షణంపాటు అతని స్మృతి పథంలో సాంగ్‌లోయ మనోహరమైన ప్రకృతిశోభ, అక్కడి పొలాలు, తోటలూ, నదులూ, అందమైన ఒక యువతి మొహమూ–మెదిలాయి. వచించడానికి వలను పడని అనుభూతి అతన్ని వుక్కిరి బిక్కిరిచేసింది. 'వచ్చే వసంతంలోనే తన పెళ్ళి..' ఈ దుర్మార్గులు – ఈ కిరాతకులు...అని అనుకుంటూ అంతిమశ్వాస వదిలాడు. 

# "జయహో! భరతవీరా!"

బృందావనం రంగాచార్యులు

పచ్చి కసాయి వైఖరికి జాల్పడి — చల్లని శాంతిసీమలో
జిచ్చురగుల్ప "చౌ" కరకుచిత్తము సమ్మతిజూపె; మైత్రికిన్
కచ్చెను తుల్యగౌరవముగా ప్రకటించి కృతఘ్నులైనవా
రిచ్చు జవాబులిట్టివి — గ్రహించె ప్రపంచపు సభ్యదేశముల్.

*

అలుక యెరుంగనట్టి కరుణాళువు పండిత నెహ్రుజీ మహో
జ్జ్వలుడయి నిల్చినాడు రథసారథిగా — నడుముల్ బిగించెరా!
కలతలుమాని కోట్ల బలగమ్ము — గ్రహించి పరాక్రమించి ఈ
యలతులు సల్పుచుండిన దురాక్రమణమ్ము నెదిర్చి పోరరా!

*

మాతృదేశాభిమాన సంపన్న భరత
జాతి మేల్కొనె — చైనా కిరాతకమ్ము
వమ్మొనర్పగ ప్రాణార్పణమ్మొనర్ప
కనకవర్షమ్ము గురియింప — ఘనత బెంప.

*

నీ వెనుకన్ ప్రబుద్ధ ధరణీతలమంతయు లేచినిల్చె ను
గ్రావహ భారమూన — విజయామృత మాధురులాన — భారతో
ర్వీవర వీరశేఖర ! మలీమసచిత్తుల మత్తనేత్ర యు
గ్మావృతకావరమ్ము భవదద్భుతలీలకు విచ్చిపోవలెన్.

*

మనదేశమ్మనుమాట యొక్కటె మదిన్ మన్నించి చైనీయ దు
ర్జన పైశాచిక మార్గణ క్రియలలో సర్వస్వమున్ దీక్షతో
రణరంగమ్మున నొడ్డి మాతృయశమున్ రక్షింపగాబూను నీ
ఘనతల్ నిల్పు సువర్ణవర్ణముల నిక్కమ్మౌచు నిత్యమ్ముగన్.

*

బుద్ధదేవునిభూమి — సంబుద్ధ భార
తమ్ము — నడయాడు గాంధీపథమ్మునందు
సహనభావాన ముందుకు సాగిపోయి
జయము గనుమన్న ! నీ కపజయముసున్న !



# కాళహస్తి మాహాత్మ్యము

# 'భౌ'? - 'భై'?

దీపాల పిచ్చయ్యశాస్త్రి

"వ్యాకీర్ణస్థితి నాలికించి నకులీ
వారాహు లూటాడఁగా
నౌకారాక్షర మంత్రమర్మమున
కాద్యంబైన వర్ణంబుతో
నేకగ్రీవముచేసి పల్కెఁడు
తురంగేంద్రంబుపై నెక్కి వి
ద్యాకల్పుం బ్రణుతింతు భైరవుని
లీలా హార్యలీలాలయున్.'' (1–3)

ఈ పద్యమునకు (1930 - కొత్తపల్లివారి ప్రతిలో) శ్రీ వావిలికొలను సుబ్బరావుగారు అర్థ మిట్లు వ్రాసినారు.

''ఔకారా...వర్ణంబు = భౌయను నక్షరము. భైరవుని వాహనము కుక్క. అది భౌ భౌ యని మొరుగును.''

1961 లో, శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రి గారు, పూర్వపాఠమును, ఐకారాక్షర మంత్ర వర్ణమున కాద్యంబైన వర్ణంబుతో'' అని మార్చి. అర్థ మిట్లు వ్రాసినారు.

"ఐకారా......వర్ణంబుతోన్ = ఐకార మను మంత్రాక్షరమునకు మొదట నుండెడు భకారముతో, (అనఁగా 'భై' యను ధ్వనితో) ఏకగ్రీవముచేసి = ఏక కంఠముగఁ జేసి, పల్కెఁడి = ధ్వనిచేయు, తురంగేంద్రంబు పైన్ = వాహనముమీఁద — అనగా 'భై' యను ధ్వనిచేయు కుక్కమీఁద, ఎక్కు, భైరవునిన్ = కాల భైరవుని.'' - అని వారి టీక.

''ఆ కుక్కయొక్క అరపును మంత్ర రూపమే నఁట ! అది 'భై' యను నక్షరము. 'భై' యను రవముగలవాఁడు భైరవుఁడు కావున అందలి భై యనుచు నా కుక్క ధ్వనించుచున్న దన్నమాట" అని వారి వివరణము.

పూర్వపాఠము, పూర్వటీకయే సరియైన దనియు, శ్రీ శాస్త్రిగారి పాఠము, వారి టీకా వివరణములు సరియైనవి కావనియు నాకు తోచినది. అందుకుగల కారణములను — పండిత పరిశీలనార్థము-మనవి చేస్తున్నాను.

(1) శాస్త్రిగారు, ఔకారమును, ఐకారముగా మార్చినారు. మార్పునకు కారణము చెప్పలేదు.

ఔకారము మంత్రవర్ణము కాదను కొన్నారేమో ! మంత్రవర్ణములలో — ఐకారము, ఔకారము రెండును ఉన్నవి.

"ఐకారః...మాతృకాన్యాస మంత్రో యథా.-ఏం నమ ఓష్ఠే; ఐం నమో౽ధరే ఇతి.-ఔకారః...మాతృకాన్యాస మంత్రో యథా.-ఓం నమ ఊర్ధ్వదంత పంక్తౌ; ఔం నమోఽధోదంత పంక్తౌ."

(శబ్దకల్ప ద్రుమము)

ఔకారమును మంత్రవర్ణమే కనుక 'ఐ' గా మార్చ నవసరములేదు.

(2) "ఆ కుక్క ఐకారమును మంత్రాక్షరమునకు మొదటనుండెడు భకారముతో ఏకగ్రీవముచేసి ధ్వనించిన" దన్నారు.

ఇందులో రెండు మూడు విప్రతిపత్తు లున్నవి :-

(i) మంత్రములో రెండుగాని, రెంటికి మించిగాని వర్ణములుంటేతప్ప, ఆద్య వర్ణము-అంత్యవర్ణము అను వ్యవహారము పుట్టదు. ఉన్నది ఒకవర్ణమే అయినప్పుడు, అక్కడ ఆద్యమేమి ? అంత్యయేమి ? కనుక "వర్ణమున కాద్యంబైన వర్ణంబుతో'' అను పాఠము సరికాదు. 'వర్ణముల కాద్యంబైన వర్ణంబుతో' అని యుండనగును.

(ii) ''ఐ కారాక్షర మంత్రమునకు - ఆద్యవర్ణము భకార'' మన్నారు.-

ఐ కారాక్షర మంత్రమునకు ఆద్యవర్ణము 'ఐ'యగును గాని,'భ' యెట్లగును ?'భ'ఆద్యక్షర మయితే, 'భకారాక్షరమంత్ర' మగును గాని 'ఐకారాక్షరమంత్ర' మెట్లగును ?

అసలు భకారము మొదటగల ఐకారాక్షర మంత్ర మున్నదా : ఏమో ! ఇది మంత్ర శాస్త్రవేత్తలు చెప్పవలసిన విషయము.

(iii) "భకారముతో ఏకకంఠముచేసి 'భై' యని ధ్వనించిన" దట :

భకారముతో ఏక కంఠముచేస్తే, ధ్వని 'భ' అగును గాని 'భై' కాదు. 'ఐకారముతో గూడిన భకారముతో ఏకకంఠముచేసి పల్కిన' దంటే గాని, భై -యని ధ్వనించిన' దన్న అర్థము రాదు. ఆ విధముగా పద్యము చెప్పుట లేదు. కనుక అపాఠమే అనుమానాస్పదముగా నున్నది. (ఈ చిక్కు 'ఔకారాక్షర' పాఠమునకును కలదు. వావిలి కొలను వారును లోతుగా విచారించినట్లు లేదు.)

(3) "ఆ కుక్క యొక్క అరపును మంత్రరూపమే నఁట !" అని వారి మరియొక వాక్యము.

అది వట్టి మాట. ఏ కుక్క యొక్క అరపును మంత్రము కాదు. "అఁట" అనుటను బట్టియే, అది ఓటి పలుకని తెలియుచున్నది గావున విచారణమనవసరము.

(4) "భై-యను రవముగలవాఁడు భైరవుఁడు" అని వారొక క్రొత్త వ్యుత్పత్తి చెప్పినారు.

అందుకు ఆధారమేమో చెప్పలేదు. సాకును కనబడలేదు. కోశములందును, పురాణములలోను - భైరవ శబ్దమునకు - భయంకరుడు; భయంకరరవముగలవాడు - అను అర్థములు మాత్రమే కనబడుచున్నవి.

"భైరవుడు = భయానకరసము గల వాఁడు" - (శ. ర.)

"భైరవః-భీ ర్భయంకరో రవో యస్య
ఇతి భీరవ, తతః స్వార్థే అణ్"
(శబ్దకల్పద్రుమము.)

"విశ్వం భర్తుం సమర్థోసి
భరణా ద్భైరవః స్మృతః
త్వత్తో భేష్యతి కాలోపి
తత స్త్వం కాలభైరవః."
(కాశీఖండము 31-43.)

లలితా సహస్రములో:-

"మహాతంత్రా మహామంత్రా
మహాయంత్రా మహాసనా
మహాయాగ క్రమారాధ్యా
మహాభైరవ పూజితా."

అన్నచోట, - "భరణ రమణ వమన కర్తా సృష్టి స్థితి సంహృతి కారీ పరశివః భైరవః; తేన మహాభైరవేణ పూజితా." అని వ్యాఖ్య.

విస్తర మెందుకు : శ్రీ శాస్త్రిగారు తమ 'భై' పాఠమునకు అనుకూలముగా, "భై-యను రవముగలవాఁడు భైరవుఁడు" అన్న అర్థమును కల్పించినారుగాని, అది సంప్రదాయశుద్ధమైనది కాదు.

(5) "భై - యను రవముగలవాఁడు భైరవుఁడు కావున అందలి 'భై' యనుచు నా కుక్క ధ్వనించుచున్న దన్నమాట !" అని సారాంశముగా, ఒకమాట సెలవిచ్చినారు. కాని, నా కర్థము కాలేదు.

'అందలి-భై' అనగా, ఎందలి-భై ? "అందలి భై యనుచు ధ్వనించును" అంటే అన్వయ మెలాగు ? అన్వయము మాట పోనిండు. 'భైరవుడు 'భై' అనేవాడు గనుక, ఆ కుక్క కూడా - భైరవుని అరపులోని 'భై' తోనే ధ్వనించుచున్న' దని వారు చెప్పిన అర్థము. ఒప్పదగినదేనా ?

శ్రీ శాస్త్రిగారు త్రొక్కిన త్రోవ సరియైనది కాదు. 'ఔకారాక్షర' పాఠమును 'ఐకారాక్షర'గా మార్చుట పొరపాటు. ఆ పొరపాటే, అసంగతార్థ కల్పనలకు, అపసిద్ధాంతములకు దారి తీసినది.

కుక్క 'భై' యని యరచునని వా రెట్లను కొన్నారో గాని, అది లోకములో లేని వ్యవహారము. కుక్క 'భౌ' అనును గాని 'భై' అనదు. ఇది పసిబిడ్డలకును తెలిసిన సంగతి. ఆబాల గోపాల విదితమైన ఈ చిన్న విషయమునకు, మహాకవుల ప్రయోగములు చూపనవసరము లేదు గాని, ఇదియు నెరుగక ఆక్షేపములు ప్రకటించి, మరల నాకు పని కల్పించు - క్రొత్త విమర్శకులు కొందరున్నారు. అందువల్ల పూర్వ కావ్యముల నుండియు, నేటి కావ్యముల నుండియు కొన్ని ప్రయోగములు చూపుచున్నాను.

(i) "వినఁబడెన్ శ్రవ్యంబులై ఘుర్ఘుర ప్రకరోదంచిత కంఠనాళ కుహళీ భౌ భౌ మహారావముల్." (హర. 7-37)

(ii) "ప్రబలెం గుర్గుర కంఠనాళ కుహరీ భౌ భౌ మహారావముల్."
(శృం. శాకుం. 1-109)

(iii) "అనఁగ ఘుర్ఘుర గళగర్త జనిత భూరి
భూభృదురు చేల భరిత భౌ భౌ భయంకరార్భటీ దీర్ణ దిగ్భిత్తు లగుచు జెలఁగె
సరిపెణలఁ బట్టి తెచ్చిన జాగిలములు."
(మను. 4-31)

(iv) "మోరలు మీఁది కెత్తి కుక్కలు ఘన భౌ క్రియాధ్వనుల గాఢతరోద్ధతి
నించె దిక్కులన్"
(శంకర. హరిశ్చంద్ర. 2-5.)

(v) ఈ నాటి కవులలో-కవి సమ్రాడ్బిరుదాంకితులు - శ్రీ నోరి నరసింహశాస్త్రి గారు రచించిన 'శబ్దవేధి' అను నాటికలో, వేటకాడు,-

"గజఘట లెల్లెడ కలగి పారు నీ
గర్జన మేదే గజమద భైరవి"

అని హెచ్చరింపగా, వేటకుక్క 'భౌః భౌః భౌః భౌః' అని ప్రత్యుత్తర మిచ్చును. (శ్రీ శాస్త్రిగారు మంత్రశాస్త్రమునను పండితులు.)

కుక్క 'భౌ' అని యరచు ననుటకు ఈ ప్రయోగములు చాలవా ! ధూర్జటికి పూర్వులును, సమకాలికులును నైన పలువురు

# పబ్లిక్ వర్క్సు శాఖ కార్యకలాపాలు



**నీటి పారుదల పథకాలు :**

1963_64 వ సంవత్సరపు రాష్ట్రీ ప్రణాళికను సవరించిన దృష్ట్యానూ, ప్రస్తుత ఆత్యయిక పరిస్థితి కారణంగానూ, 1962 డిసెంబరు ఆఖరు వారంలో ప్రణాళికా సంఘం కార్యక్రమాల సలహాదార్లతో జరిగిన చర్చల దృష్ట్యానూ, పెద్దతరహా, మధ్యరకం నీటిపారుదల పథకాలకు సంబంధించిన 1963_64 వ సం॥ రపు ప్రణాళికా మొత్తాన్ని రు. 365.19 లక్షలకు నిర్ణయించారు. పెద్ద, మధ్యరకం నీటి పారుదల పథకాలకై ప్రస్తుత సంవత్సరానికి 431 లక్షల మొత్తాలకు పెంచారు. ఒరిజినల్ కేటాయింపులో యీ సంవత్సరానికి రు. 335.60 లక్షలు మాత్రమే నిర్దేశించారు.

పి.డబ్ల్యు.డి. చిన్న తరహా నీటిపారుదల ప్రణాళికా పథకాలకై 1963_64 వ సం॥ లో రు. 300 లక్షలు కేటాయించారు. ప్రస్తుత సంవత్సరంలో యీ పథకాలకై రు. 190.26 లక్షలు కేటాయించారు. ప్రస్తుత కేటాయింపుకు అదనంగా భారత ప్రభుత్వం యీ సంవత్సరానికై రు.67.50లక్షల అదనపు రుణసహాయం మంజూరు చేసిన కారణంగా యీ కేటాయింపును రు. 257.76 లక్షలకు పెంచారు.

కేంద్రం సహాయాన్ని పూర్తిగా వినియోగించుకోవడానికి వీలుగా యీ సంవత్సరంలో చిన్నతరహా నీటి పారుదల పథకాల అమలును త్వరితగతిని పూర్తి చేయడానికి అవసరమైన చర్యలను తీసుకుంటున్నారు.

---

కవులు, కుక్క 'భౌ' అను నని వర్ణించి చెప్పియుండగా, ధూర్జటి ఆ కవుల రచనలకును _ లోక వ్యవహారమునకును విరుద్ధముగా, కుక్క 'భై' యని ధ్వనించినట్లు కవిత్వము చెప్పియుండునా! శ్రీ పాపయ్య శాస్త్రిగారు గ్రంథములలోని ప్రయోగములనైనను గుర్తింపలేదు. అందువల్లనే యీ పొరపాటు జరిగినది. వారే కాదు; మన నిఘంటుకర్తలును, ఈ 'భౌ' శబ్దమును గుర్తింపలేదు. (శ.ర. లో లేదు; సూ.ని. లోను లేదు.) విదేశీయుడైన బ్రౌను, తన నిఘంటువులో,_"భౌంక్రియ–The yelping of a dog" అని శబ్దమును _ అర్థమును చెప్పి, విష్ణు పురాణములోని,_

"శునక భౌంక్రియా నాదంబులకు
బిట్టులికి" (7_147)

అను ప్రయోగమును గూడా చూపియున్నాడు. (ఆ మహానుభావుడు ఆంధ్ర భాషోపాసకులకు నిత్యస్మరణీయుడు గదా!)

ఈ విచారణలో, కుక్క 'భౌ' అనును గాని 'భై' యన దనియు, శ్రీ శాస్త్రిగారి 'భై' సిద్ధాంతము 'ఊహాగానమే'గాని ఉపధా శుద్ధము కాదనియు తేలినది. కాని సరియైన పాఠ మేమో ఇంకను విచారింప వలసియే యున్నది.

ధూర్జటి కుర్కుర స్వాభావికమైన 'భౌ' శబ్దమునకు మంత్ర వర్ణముతో పొత్తుకలిపి చక్కని కల్పన చేసినాడు. సహజ శబ్దమునకు ప్రకరణాను గుణముగా విలక్షణార్థమును పొసగించుట ఒక చమత్కారము. ఇట్టిచమత్కారములు ప్రౌఢకవుల రచనలలో అందందు గోచరించు చుండును. మచ్చుకు ఒక్కటి యిచ్చు చున్నాను.

"ఇవి రాజసుతులు చేయవలసిన పనులు
కావు కావంచుఁ గాకంబు లఱచె"
(తి. వేం. కవుల బుద్ధచరిత్ర. 3_101)

ఆలుబిడ్డలను విడిచి అడవికి పోవుచున్న శౌద్ధోనినిగూర్చి కాకులు,_"ఇవి రాజకుమారులు చేయదగిన పనులు కావు, కావు" అని యన్నట్లు కల్పన. కాకులు 'కావు _ కావు' అని యరచుట సహజము. ఆ సహజ శబ్దమునకు విలక్షణార్థము కల్పింపబడినది. ధూర్జటి, 'భౌ' _ అను కుక్క యరపును మంత్రవర్ణముగా పొసగించుటయు నిట్టిదే.

పూర్వముద్రణములోని 'ఔకారాక్షర' పాఠమే సరి యనియు, వావిలికొలనువారి టీకయే సమంజస మనియు, శ్రీ పాపయ్య శాస్త్రిగారి సవరణ, అర్థవివరణములు సరియైనవి కావనియు చర్చాసారాంశము.

ఇది నా యభిప్రాయము. పండితులు విచారించి పాఠమును నిర్ణయింతురుగాక. ★

# సంగ్రహప్రకటనలు

## నమోదు కేంద్రాలు

ఏదేని స్వచ్ఛందసేవా కార్యక్రమంలో పాల్గొనదలిచిన పౌరులు తమ పేరును నమోదు చేయించడానికి వీలుగా నమోదు కేంద్రాలను ప్రారంభించాలని కేంద్ర పౌర మండలి నిశ్చయించింది. వివిధ వాలంటీరు గ్రూపులను ఏర్పరచి, అవసరమైతే శిక్షణ కూడా ఏర్పాటుచేయాలని ప్రతిపాదించారు.

తదనుగుణంగానే జిల్లా, బ్లాకుల, మునిసిపాలిటీ స్థాయిలలో తక్షణం నమోదు కేంద్రాలను ప్రారంభించాలని ప్రభుత్వం కలెక్టర్లకు విజ్ఞప్తిచేసింది. గ్రామ స్థాయిలో కూడా పేర్లు నమోదు చేయించుకునే సౌకర్యాలు కల్పింపబడతాయి. దిగువ ప్రొఫార్మాలో తెల్పిన విధంగా వాలంటీర్లు తమ పూర్తి వివరాలను తెల్పాల్సివుంటుంది. వివిధ వృత్తులు, అభిరుచులు, వయస్సులకు అనువుగా దిగువ తెల్పిన 5 స్వచ్ఛంద సేవా సర్వీసులలో మాత్రమే వాలంటీర్ల పేర్లను ప్రస్తుతం నమోదు చేసుకుంటారు.

1. జాతీయ వాలంటీర్ రైఫిల్ దళాలలో 18—35 సంవత్సరాల మధ్య వయస్సుగల వారిని చేర్చుకుంటారు. యీ పథకానికి సంబంధించిన వివరాలు భారతప్రభుత్వం నుంచి అందాల్సి వున్నాయి.

2. కళాశాల విద్యార్థి, విద్యార్థినుల కొరకు నేషనల్ కేడెట్ కోర్.

3. 18—50 సంవత్సరాల మధ్య వయస్కులైన వారి కొరకు, మంటలు చల్లార్చి, ప్రాణాపాయా స్థితిలోవున్న వారిని రక్షించడం, ప్రథమ చికిత్స చేయడంవంటి పనులతో కూడిన పౌరరక్షణ సంస్థ.

4. పోలీసు దళాన్ని పటిష్ఠం చేయడానికి 18—40 సంవత్సరాల మధ్య వయస్కులైన వారి కొరకు హోంగార్డ్స్. ప్రారంభంలో హైద్రాబాదు, సికింద్రాబాదు, విశాఖపట్నం, మచిలీపట్నం, గుంటూరులలో హోంగార్డ్స్‌ను ఏర్పాడుచేసే పథకం ప్రభుత్వం పరిశీలనలో వుంది.

5. తమకు అప్పగించిన నిర్దిష్టమైన పనులను కొద్ది సమయంపాటు చేయడానికి ముందుకు వచ్చే స్త్రీ, పురుషులకొరకు స్వచ్ఛంద శ్రామిక దళాలు.

దిగువ ఇచ్చిన ప్రొఫార్మాలో తెల్పిన వివరాలను వలంటీర్లు తెల్పాలి.

### ప్రొఫార్మా

1. పేరు, 2. వయస్సు, 3. చిరునామా, 4. విద్యార్హతలు, 5. ప్రస్తుత వృత్తి, 6. పనిచేయదలచిన స్వచ్ఛంద సేవా సంస్థపేరు. (అ) జాతీయ వాలంటీర్ రైఫిల్స్. (ఆ) నేషనల్ కేడెట్ కోర్, (ఇ) మంటలు చల్లార్చడం, ప్రథమచికిత్స వంటి పనులతో కూడిన పౌరరక్షణ సంస్థ, (ఈ) హోంగార్డ్స్, (ఉ) కొద్ది సమయం పాటు నిర్దిష్టమైన పనులు, చేసే స్త్రీ పురుషుల స్వచ్ఛంద శ్రామికదళాలు, 7. తాము పనిచేయదలచిన సంస్థలో లోగడ పొందిన అనుభవం, 8. స్వచ్ఛందంగా పనిచేయడానికి బయటి ప్రదేశాలకు వెళ్ళడానికి సమ్మతమేనా, 9. స్వంత మోటారువుందా, వున్నట్లయితే రవాణా దళాల ఉపయోగార్థం అవసరమైనప్పుడు ఇవ్వడానికి సమ్మతమేనా, 10. ఒక రోజులో నిర్ణీత వేళల్లో పనిచేయదలిచారా, లేక పూర్తి సమయం పనిచేయదలిచారా.

## ఆత్యయికపరిస్థితిలో సైనికసర్వీసు

దిగువ పేర్కొన్న సర్వీసు నిబంధనలను, షరతులను ప్రస్తుత ఆత్యయిక పరిస్థితిలో సైనిక సర్వీసులో ప్రవేశించడానికి అనుమతించబడిన రాష్ట్ర ప్రభుత్వోద్యోగులకూ, రాష్ట్రంలోని స్థానిక సంస్థల ఉద్యోగులకూ వర్తింపజేయడానికి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం నిశ్చయించింది.

సివిల్ ప్రభుత్వోద్యోగుల (స్థానికసంస్థల ఉద్యోగులు కూడా) కుటుంబాలకు ఆయా సివిల్ ఉద్యోగాలలోని అధికార్ల కుటుంబాలకు లభించేట్టి వైద్య సౌకర్యాలు పొందడానికి అర్హత వుంటుంది.

శాశ్వతమైన సివిల్ ప్రభుత్వోద్యోగులు, సైనిక సర్వీసులో, సైనిక సర్వీసుకు బదిలీ చేయబడని పూర్వం వారికి వర్తించిన సివిల్ సెలవు నియమావళి ననుసరించి సెలవు పొందడానికి అనుమతించబడతారు. కాగా

తాత్కాలిక సివిల్ ప్రభుత్వోద్యోగులకు వారి సైనిక సర్వీసులో అన్ని విషయాలలోనూ, సైనిక సెలవు నియమావళి వర్తింపజేయబడుతుంది. అన్ని సందర్భాలలోనూ, సైనిక సర్వీసు కాలంలో, సెలవు జీతం రక్షణశాఖవారు చెల్లిస్తారు. సివిల్ శాఖలు రక్షణ మంత్రిత్వశాఖ నుంచి సెలవు జీతం కంట్రిబ్యూషన్లను కోరవు.

శాశ్వతమైన సివిల్ ప్రభుత్వోద్యోగులందరూ, సైనిక సర్వీసులో వుండే కాలంలో తమ తమ సివిల్ ఉద్యోగాలలో లీవ్ వుంచుకోడానికి అనుమతించబడతారు. ప్రాథమిక నియమావళి ననుసరించి తాత్కాలిక సివిల్ ప్రభుత్వోద్యోగికి అతని ఉద్యోగంలో లీన్ ఇవ్వడానికి వీలుండదు. అయినప్పటికీ సైనిక సర్వీసులో ప్రవేశించడానికి అనుమతించబడిన తాత్కాలిక సివిల్ ప్రభుత్వోద్యోగులు ఒకవేళ వారు దరఖాస్తు చేసినట్లయితే, సైనిక సర్వీసునుంచి విడుదలైన పిమ్మట తమ తమ సివిల్ ఉద్యోగాలలో తిరిగి చేరడానికి అనుమతించబడతారు. భవిష్యత్తులో ఏర్పడే ఉద్యోగ ఖాళీలలో కొన్నింటిని వారికొరకు ప్రత్యేకించి వుంచే విషయం ప్రభుత్వ పరిశీలనలో వుంది. యఫ్.ఆర్. 30 (1) నిబంధనల వర్తింపుకై సివిల్ ప్రభుత్వోద్యోగుల విషయంలో వారు మిలిటరీ సర్వీసులో ఉండే కాలాన్ని మామూలు పద్ధతికి చెందని సర్వీసుగా పరిగణిస్తారు. దీని ఫలితంగా వారు ఉద్యోగం చేస్తుండిన శాఖలో తర్వాతి శ్రేణి నియమావళి ప్రకారం ప్రమోషన్ అర్హతకలిగి ఉంటారు. అంతేగాక మిలిటరీ సర్వీసుకు వెళ్ళకుండా వుండే పక్షంలో ఉన్నత పదవికి గలవారి సీనియార్టీ హక్కు ఇప్పుడు కూడా ఉంటుంది.

మిలిటరీ సర్వీసులోకి పోకుండా ఉన్న స్థితిలో సివిల్ ప్రభుత్వోద్యోగులు పొందే జీతం రేటు అలవెన్సులుగానీ మిలిటరీ రేటులో జీతం, అలవెన్సులుగానీ యేది యెక్కువగా ఉంటే దానిని పొందుటకు వారు అర్హులవుతారు.

మిలిటరీ సర్వీసులో జూనియర్ కమీషన్డ్ ఆఫీసర్లుగా గానీ ఇతర హోదాలోగానీ ఉండే సివిల్ ప్రభుత్వోద్యోగులకు ఉచిత రేషన్ ఇచ్చే పద్ధతి ఉన్నందువల్ల వారు సివిల్ రేట్లలో పొందే జీతభత్యాలను నెలకు 25 లకు తగ్గించడం జరుగుతుంది.

మిలిటరీ సర్వీసులోకి వచ్చే సివిల్ ప్రభుత్వోద్యోగులు లోగా వారు సభ్యులుగా ఉన్న ఏదేని ప్రావిడెంటు ఫండుకు ఇచ్చే సబ్‌స్క్రిప్షన్‌లకు చెందిన బాధ్యతలు, హక్కులను ఉంచుకునే అర్హతకలిగి ఉంటారు. వారి ప్రావిడెంటు ఫండు సబ్‌స్క్రిప్షన్‌కు ప్రభుత్వం ఇచ్చే వాటాలు మిలిటరీ సర్వీసుకాలంలో రక్షణ సర్వీసుల అంచనాల లెక్కలో కలుపబడుతాయి.

## దక్షిణ మండలంలో బియ్యం రవాణా

1960 వ సం॥పు దక్షిణ బియ్యం మండలం (రైలు బుక్కింగులపై నిర్బంధాలు) ఉత్తర్వుక్రింద, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం 1960 ఆగస్టు 22 వ తేదీన వ్యవసాయ శాఖ జారీచేసిన 1918 వ నెంబరు జి.ఒ.ఎం.ఎస్. లోని ప్రకటనకు దిగువ సవరణ చేసింది. ఈ ప్రకటనను 1960 ఆగష్టు 23 వ తేదీ ఆంధ్రప్రదేశ్ గెజెటులో ప్రకటించడం జరిగింది. పై ప్రకటనలోని "బియ్యం రవాణాకై" అనే మాటల తరువాత, "తమతమ అధికార పరిధులలోగల" అనే మాటలు చేర్చబడతాయి.

వ్యవసాయ శాఖ 1960 ఆగష్టు 22 వ తేదీన జారీచేసిన 1918 వ నెంబరు జి. ఓ. ఎం. ఎస్. లో చెనని ఉత్తర్వులో కలెక్టరుకు సంక్రమించే అధికారంతోపాటుగా అతని అధికార పరిధి పేర్కొనబడలేదు. 1897 వ సం॥పు జనరల్ క్లాజెస్ చట్టం 2 (ii) సెక్షనుక్రింద "కలెక్టరు" అంటే జిల్లా ముఖ్య ఆఫీసర్ ఇన్‌ఛార్జి అని అర్థం. కలెక్టరుకు సంక్రమించిన అధికారాన్ని అతను తన అధికార పరిధిలో వినియోగించవచ్చు.

ఈ దృష్ట్యా, జిల్లా కలెక్టరు, 1960 వ సం॥పు దక్షిణ బియ్యం మండలం (రైలు బుక్కింగులపై నిర్బంధాలు) ఉత్తర్వుక్రింద, తన అధికార పరిధిలో లేని ప్రాంతాలలోకాక తన రెవెన్యూ పరిధిలో గల బియ్యం నిలువల విషయంలో మాత్రమే పర్మిట్లు జారీ చేయగలుగుతాడు.

## ఆరోగ్యకేంద్రాలకు వైద్యాధికారులు

ప్రస్తుత ఆత్యయిక పరిస్థితి కారణంగా అసిస్టెంట్ సర్జనుల కొరత ఎక్కువగా ఏర్పడినదృష్ట్యా అర్హతగల అసిస్టెంట్ సర్జనుల కొరత కారణంగా వైద్యాధికారుల నియామకం జరగని ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలలో దిగువ నిబంధనలకు లోబడి ప్రైవేటు డాక్టర్లను గౌరవ అసిస్టెంట్ వైద్యాధికారులుగా నియమించాలని ప్రభుత్వం ఉత్తరువులు జారీచేసింది. తడవకు 2 సంవత్సరాల కాలంవరకు యీ నియామకం జరుగుతుంది. ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలలో గౌరవ అసిస్టెంట్ వైద్యాధికారులుగా నియమింపబడే వారికి నెలకు రు. 100 ల ఉపకారవేతనం ఇవ్వబడుతుంది.

## ఉత్తమ గ్రామస్థుల రేడియో గోష్ఠి

గ్రామస్థుల రేడియో గోష్ఠులను జనబాహుళ్యంలో ఎక్కువ ప్రచారంలోకి తేవడానికి

వీలుగా ప్రతిజిల్లాలో ఉత్తమ గ్రామస్థుల రేడియో గోష్ఠికి రు. 500 ల విలువగల బహుమతిని ఇచ్చే ఏర్పాటుచేయాలని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం నిర్ణయించింది. జిల్లా స్థాయిలో జిల్లా కలెక్టరు అధ్యక్షతన కమిటీని నియమిస్తారు. ఈ కమిటీ ప్రతి సంవత్సరం జిల్లాలో ఉత్తమ గ్రామస్థుల రేడియోగోష్ఠిని సెలక్టుచేసి బహుమతి ప్రదానం చేస్తుంది.

డిస్ట్రిక్ట్ పబ్లిక్ రిలేషన్ ఆఫీసరు యీ కమిటీ కన్వీనర్‌గా ఉంటారు. వారం వారం సమావేశాల మొత్తం సంఖ్య, ప్రతి సంవత్సరం–(నవంబరు నుంచి నవంబరువరకు) ప్రతి గోష్ఠి, కార్యక్రమాలలో చేసిన సూచనలు, ఇచ్చిన సలహాలపై గైకొన్న చర్యల ఆధారంగా ఉత్తమ గ్రామస్థుల రేడియో గోష్ఠిని ఈ కమిటీ సెలక్టు చేస్తుంది. రు. 500ల విలువగల ఆధునిక వ్యవసాయ పరికరాల రూపంలో యీ బహుమతిని ఇవ్వడం జరుగుతుంది. 1961 నవంబరు నుంచి 1962 నవంబరు వరకుగల సంవత్సరానికి సంబంధించిన బహుమతిని 1963 మార్చి ఆఖరు వరకు ఇవ్వబడుతుంది.

## రక్తదానం కేంద్రాలు

జవానుల కొరకు ఇచ్చే రక్తదానాలను దిగువ తెల్పిన అనుపత్రులు, సంస్థలు మాత్రమే స్వీకరించడానికి ప్రభుత్వం అనుమతి ఇచ్చిందని ఇందుమూలంగా తెలియజేయడమైనది :

జంటనగరాలలోని రక్తం బ్యాంకులు:– 1. కేంద్ర రక్తం బ్యాంకు, ఉస్మానియా ఆసుపత్రి, హైద్రాబాదు, 2. ప్రభుత్వ ప్రసూతి ఆసుపత్రి, హైద్రాబాదు, 3. నిలోఫర్ ఆసుపత్రి, హైద్రాబాదు, 4. ఛాతీ వ్యాధులు, టి. బి. ఆసుపత్రి, ఎర్రంనుమా. హైద్రాబాదు 5. రేడియం సంస్థ, కాన్సర్ ఆసుపత్రి, హైద్రాబాదు. 6. గాంధీ ఆసుపత్రి, సికింద్రాబాదు.

జిల్లాలలోని రక్తం బ్యాంకులు:– 1. కింగ్‌జార్జి ఆసుపత్రి, విశాఖపట్నం, 2. ప్రభుత్వ జనరల్ ఆసుపత్రి, కాకినాడ, 3. ప్రభుత్వ జనరల్ ఆసుపత్రి, గుంటూరు. 4. ప్రభుత్వ జనరల్ ఆసుపత్రి, కర్నూలు. 5. మహాత్మాగాంధి మెమోరియల్ ఆసుపత్రి, వరంగల్లు, 6. జిల్లా హెడ్ క్వార్టర్స్ ఆసుపత్రి, శ్రీకాకుళం, 7. జిల్లా హెడ్‌క్వార్టర్స్ ఆసుపత్రి, ఏలూరు, 8. జిల్లా హెడ్‌క్వార్టర్స్ ఆసుపత్రి, మచిలీపట్నం, 9. జిల్లా హెడ్ క్వార్టర్స్ ఆసుపత్రి, అనంతపురం, 10. జిల్లా హెడ్ క్వార్టర్స్ ఆసుపత్రి, చిత్తూరు. 11. జిల్లా హెడ్‌క్వార్టర్స్ ఆసుపత్రి, కడప, 12. జిల్లా హెడ్ క్వార్టర్స్ ఆసుపత్రి, నెల్లూరు, 13. జిల్లా హెడ్ క్వార్టర్స్ ఆసుపత్రి, రాజమండ్రి, 14. జిల్లా హెడ్‌క్వార్టర్స్ ఆసుపత్రి, నిజామాబాదు, 15. ప్రభుత్వ డబ్ల్యు. యఫ్. టి. టి. సి. డి. ఆసుపత్రి, నెల్లూరు, 16. నాగార్జున సాగర్ ఆసుపత్రి విజయపురి, (ఉత్తర).

## ఆత్యయిక ఉత్పత్తి కమిటీ

ఆత్యయిక పరిస్థితి దృష్ట్యా పారిశ్రామిక ప్రశాంతతను నెలకొల్పటానికి అన్ని రంగాలలోనూ అధికోత్పత్తి సాధించడానికి ప్రత్యేకచర్యలు తీసుకోడానికి వీలుగా 'ప్రత్యేక సిబ్బంది'ని ఏర్పాటు చేయాలని ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం నిశ్చయించింది.

యీ నిర్ణయానుసారం రాష్ట్రం లో ఆత్యయిక ఉత్పత్తి కమిటీని ఏర్పాటు చేయడం జరిగింది. 1962 నవంబరు 3 వ తేదీన న్యూఢిల్లీలో జరిగిన యజమానుల, పనివారల కేంద్ర సంస్థల సంయుక్త సమావేశంలో చేసిన పారిశ్రామిక శాంతి తీర్మానంలోని మూడవ భాగాన్ని అమలు చేయడమే యీ కమిటీ ఉద్దేశ్యం. ఖర్చులను తగ్గించి, అధికోత్పత్తికి తీసుకోవలసిన చర్యలను కూడ ఇది పరిశీలిస్తుంది.

ప్రభుత్వం హోంశాఖ కార్యదర్శి యీ కమిటీ అధ్యక్షులు, కన్వీనర్‌గా ఉంటారు. పరిశ్రమల శాఖ కార్యదర్శి, పబ్లిక్ వర్క్స్ శాఖ కార్యదర్శి యీ కమిటీ సభ్యులుగా ఉంటారు. అవసరమైతే కార్మిక శాఖ కమిషనర్‌నూ, పరిశ్రమలశాఖ డైరెక్టరునూ యీ కమిటీ కోఆప్ట్ చేస్తుంది. వీరినికూడా సమావేశాలకు ఆహ్వానించవచ్చు. అవసరమైనప్పుడల్లా యీ కమిటీ సమావేశం జరుపుతుంది.

## రక్షణ దళాలకు పంపే కానుకలకు ఉచిత రవాణా సౌకర్యం

రక్షణ దళాల సౌకర్యార్థమై పంపదలచిన వస్తువులను రైలు ఖర్చు భరిస్తూ, బొల్లారంలోని హెడ్‌క్వార్టర్స్ సికింద్రాబాదు స్టేషన్ అడ్మినిస్ట్రేటివ్ కమాండెంటుకు కానీ, బేగంపేటలోని వైమానిక దళం స్టేషన్ కమాండర్‌కుకానీ, హైద్రాబాదు, రాజ్‌భవన్‌లోని గవర్నరు అసిస్టెంట్ సెక్రెటరీ శ్రీ యం. హెచ్. కె. గజ్నవీకికానీ పంపాలని ప్రభుత్వం లోగడ ప్రకటన జారీచేసింది.

కేంద్రపౌర మండలి అధ్యక్షురాలు శ్రీమతి ఇందిరాగాంధీ పేర న్యూఢిల్లీలోని రాష్ట్రపతి భవన్‌కు పంపే రక్షణ దళాలకు నిర్దేశించిన కానుకల పార్శిళ్ళ (చెడిపోయే పదార్థాలు మినహా)కు ఎట్టిరైలు చార్జీలు చెల్లించాల్సిన అవసరం లేదని కలెక్టర్లు మొదలైన వారికి తెలియజేయడం జరిగింది.

రక్షణ దళాల సౌకర్యార్థమై పంపదల్చిన వస్తువులకు (చెడిపోయే పదార్థాలు మినహా) రైలు ఖర్చులు లేకుండా ఉచితరవాణా

సౌకర్యం గ్రాంటు చేయాలని రైల్వేమంత్రిత్వ శాఖ (రైల్వే బోర్డు) రైల్వేలకు ఆదేశాలు పంపినట్టు భారత ప్రభుత్వం తెలియజేసింది. గూడ్స్, ప్యాసింజర్, పార్సిల్ రైళ్ళలో ఏ స్టేషన్‌నుండి అయినా మిలిటరీ హెడ్ క్వార్టర్స్‌గా గానీ వైమానిక దళం స్టేషన్‌గా కానీ వ్యవహరించే ఏ స్టేషన్‌కైనా ఉచితంగా పంపవచ్చు.

ఈ దృష్ట్యా సైనిక హెడ్‌క్వార్టర్స్‌కు కానీ, వైమానిక దళం స్టేషన్‌ల స్టేషన్ కమాండర్‌కు కానీ పంపే కానుకల (చెడిపోయే పదార్థాలు మినహా) పార్సిళ్ళను ఎట్టి చార్జీలు లేకుండానే పంపవచ్చు.

జాతీయ పొదుపు పథకం

జాతీయపొదుపు ఉద్యమాన్ని తీవ్రతరం చేయడానికై పర్యటించడానికి వీలుగా జాతీయ పొదుపు రాష్ట్ర సలహాబోర్డులోని అనధికార సభ్యులకు కొన్ని ప్రాంతాలను కేటాయించాలని రాష్ట్ర నేషనల్ సేవింగ్స్ కమీషనర్ ప్రతిపాదించారు.

ఈ ప్రతిపాదనలకు అనుగుణంగా బోర్డులోని అనధికార సభ్యులకు దిగువ జోనులను ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం కేటాయించింది.

శ్రీమతి ఎ. శ్యామలాదేవి, ఉపాధ్యాయురాలు,నేషనల్ సేవింగ్స్ రాష్ట్ర సలహాబోర్డు, ఆంధ్ర ప్రదేశ్. (నిజామాబాదు, మెదకు)

శ్రీమతి సంగం లక్ష్మీబాయి. యం. పి. (హైద్రాబాదు నగరం, కరీంనగర్ జిల్లాలు)

శ్రీమతి అనీస్ ఫాతిమా, (మహబూబు నగర్, నల్లగొండ జిల్లాలు)

శ్రీ రేబాల లక్ష్మీనరసారెడ్డి. (నెల్లూరు జిల్లా)

శ్రీ భోజిరెడ్డి యం. యల్. సి. (హైద్రాబాదు జిల్లా)

శ్రీ మంగళగిరి పరవతుదాసు. నరసారావుపేట (కృష్ణా జిల్లా)

శ్రీ ఎ. సుబ్బారావు, రాజవరం (పశ్చిమ గోదావరి, తూర్పు గోదావరి)

శ్రీ సి. సుబ్బయ్య చెట్టి (కర్నూలు, అనంతపురం, కడప జిల్లాలు)

శ్రీ బి. నరసింహారెడ్డి (హైదరాబాదు నగరం)

శ్రీ ఆర్. దశరథ రామిరెడ్డి. (చిత్తూరు)

శ్రీమతి కుముదినీదేవి. యం. యల్. ఎ. (హైద్రాబాదు, సికింద్రాబాదు)

శ్రీమతి రోడామిస్త్రీ, (హైద్రాబాదు, సికింద్రాబాదు)

శ్రీ జి. సంజీవరెడ్డి, (హైద్రాబాదు, సికింద్రాబాదులలోని పారిశ్రామిక ప్రాంతాలు, ఆదిలాబాదు జిల్లా)

శ్రీమతి బి. సామ్రాజ్యలక్ష్మి (వరంగల్లు, ఖమ్మం జిల్లాలు)

శ్రీ బండారు వందనం, (గుంటూరు జిల్లా)

శ్రీమతి బి. కమలాదేవి (విశాఖపట్నం; శ్రీకాకుళం జిల్లాలు) ★

# "జైహింద్!"

వేటూరి ఆనందమూర్తి

జైహిందని లేవాలి జైహిందని సాగాలి
జైహిందని నవభారత జయభేరీ మ్రోగాలి ॥
దగాకోరు నణచాలి దిగంతాలు తరమాలి
యుగయుగాల మనచరిత్ర జగజగాలు తెలియాలి ॥జై॥
యువలోకం కలవాలి నవతేజం పొందాలి
జవంచూపి మనభూమిని సంరక్షణచేయాలి ॥జై॥
జీవిత నాటకరంగం చీకటితెర తొలగాలి
వేవినాయకులదయ నిర్విఘ్నం కాసాగాలి ॥జై॥
అంతిమ విజయం పొందేటంతవరకు ఎంతైనా
క్రాంతిపథంలోనే విశ్రాంతిలేక నిలవాలి ॥జై॥
త్యాగం ధర్మం ధైర్యం తనువు మనువుకావాలి
కాగలకార్యం మనకై గంధర్వులె తీర్చాలి ॥జై॥

# నేఫాలో చైనావారి దురాక్రమణ

**1962** అక్టోబరు 20వ తేదీ మన భారతదేశానికే కాదు మొత్తం నాగరిక ప్రపంచానికే ఒక దుర్దినం. ఆ రోజు ఉదయం ఇంకా అయిదు కొట్టకముందే చైనా భారత ఉత్తర సరిహద్దులపై ధర్మాధర్మ విచక్షణ లేకుండా పెద్ద ఎత్తున అకారణంగా అన్యాయంగా దాడులు ప్రారంభించింది. అంతకుముందు అనేక సంవత్సరాలుగా సమితిలో చైనాకు సభ్యత్వం ఇవ్వవలసిందని వాదిస్తూ తనతో ఎంతో స్నేహంగా ఉంటూ వచ్చిన పొరుగుదేశం; పవిత్ర భారతదేశంపై చైనా వారు దాడి ప్రారంభించిన దుర్దినం అది. అదీ సరిహద్దు వివాదాన్ని శాంతియుతంగా పరిష్కరించుకోడానికి సిద్ధంగా ఉన్నట్లు ప్రపంచాన్ని నమ్మించడానికి చైనా విశ్వ ప్రయత్నం చేస్తున్న సమయం. అంతకుముందు ఇండియా — భూటాన్ — టిబెట్ సరిహద్దులలో భారత, చైనాల కొన్ని అగ్రస్థావరాలకు చెందిన గస్తీదళాల మధ్య చిన్న చిన్న సంఘర్షణలు వచ్చినా చైనా అవన్నీ స్వల్ప సంఘటనలుగా చిత్రించి, ఆ బాధ్యత అంతా స్థానిక దళవాయిలపై నెట్టి తాను మాత్రం శాంతి వాంఛిస్తున్నట్లు నటించింది. అల్లాంటి సమయంలో ఏ నాగరిక దేశమైనా శాంతియుతంగా జీవిస్తున్న పొరుగు దేశంపై అకారణంగా ముందుగా యుద్ధం ప్రకటించకుండా దురాక్రమణకు దిగుతుందని ఎవరూ నమ్మలేక పొయ్యారు. పైకి బ్రహ్మాండంగా ఎన్ని శాంతి ప్రకటనలు చేస్తున్నా చైనా వారు చాల సంవత్సరాలు ముందునుంచే కేవలం యుద్ధంకోసమే సన్నాహాలు చేస్తూ వచ్చారు. ఈ మోసం, ఈ దొంగచాటు సన్నాహాలు చైనా సైనికులు అచ్చం దొంగల్లాగా చీకట్లో గుమికూడి మెక్‌మోహన్ రేఖకు దక్షిణంగా ఖింజ్మానే నుంచి ధోలా తాంగ్లే వరకు వ్యాపించి ఉన్న థాగ్లా పర్వత శ్రేణికి సమీపప్రాంతంలో మన స్థావరాలపై దొంగచాటు దాడులు జరిపినప్పుడు బయటపడింది. యుద్ధంలో ఉపయోగించే అతి ఆధునిక ఆయుధాలు ధరించి చైనా సైనికులు అత్యధిక సంఖ్యలో అలలు అలలుగా వచ్చి పడుతూ మన స్థావరాలపై దాడి చేశారు. శత్రువులు భారీ ఎత్తున ఫిరంగులు, మరతుపాకులు కాలుస్తున్నా లెక్కచెయ్యకుండా మన సైనికులు ధైర్య సాహసాలు ప్రదర్శించి అంగుళం అంగుళం తీవ్రంగా ప్రతిఘటిస్తూ, తుపాకులలో చిట్టచివరి గుండు అయిపొయ్యేదాకా పోరాడారు. పునః సమీకరణ నిమిత్తం ఉపసంహరించుకోవలసిందని ఉత్తరువులు వచ్చేదాకా మన సైనికులు పోరాడుతూనే ఉన్నారు. చైనా వారి దాడి ముందుగా ఆలోచించుకొని, సన్నాహాలు చేసుకొని జరిపిందేనని స్పష్టమైంది.

## తవాంగ్ వైపుకు

మన సైనికులు ప్రారంభంలో హఠాత్తుగా జరిగిన దాడులకు తట్టుకొని నిలచి నామ్కాచూ నదికి దక్షిణంగా కొత్త రక్షణ స్థావరాలకు చేరుకున్నారు. అక్టోబరు 21వ తేదీ రాత్రి ఆ ప్రాంతంలో విపరీతంగా మంచు కురుస్తోంది. అయినా చైనా వారు ఆ రోజు రాత్రి, పగలూ ముందుకు తోసుకొని వస్తూనే ఉన్నారు. శత్రువుల సంఖ్యాబలం, ఆయుధబలం ముందు నిలవలేక మన సైనికులు మళ్ళీ వెనక్కు తగ్గి క్రొత్త స్థావరాలకు పోవలసి వచ్చింది. అప్పుడే మన త్సాంగ్‌ధార్ స్థావరం శత్రువశమైంది. అప్పటికీ చైనా వారు ముందుకు వస్తూనే ఉన్నారు. అక్టోబరు 23వ తేదీన తవాంగ్‌కు రెండు వైపులనుంచీ దారి సంపాదించేందుకుగాను బూమ్లా సమీపంలో మన స్థావరాలపై దాడులు ప్రారంభించారు. ఇదే రోజున సుబాన్‌సారి విభాగంలో తీవ్ర ప్రతిఘటన అనంతరం అసఫిలా స్థావరం కూడా శత్రువులకు చేజిక్కింది. ఈ పోరాటాలలో అననుకూల వాతావరణం, శత్రువుల అత్యధిక సంఖ్య, వారి ఆయుధబలం వేటినీ లెక్కచెయ్యకుండా మన సైనికులు అసమాన ధైర్య సాహసాలు ప్రదర్శించిన సందర్భాలు, అపూర్వ త్యాగాలు చేసిన సందర్భాలు అనేకం. మన సైనికులు — చివరి సైనికుడు నేల కూలేదాకా, తుపాకులలో చివరి గుండు అయిపొయ్యేదాకా వీరోచితంగా పోరాడుతూనే ఉన్నారు. కొన్ని స్థావరాలలో మందుగుండు సామాన్లు అయిపోతే మన జవాన్లు శత్రువులతో ముఖాముఖిగా

తలపడి పోరాడారు. మరికొన్ని స్థావరాలలో వాస్తవంగా ఒక్క సైనికుడు అధిక సంఖ్యా బలం గల శత్రు సైన్యాన్ని ప్రతిఘటించటం జరిగింది. మన సైనిక చరిత్రలో హవల్దార్ మేజర్ సౌదాగర్‌సింగ్, సిపాయ్ బాజ్ రామ్‌థాపా, లెఫ్టినెంటు జతీందర్‌సింగు చౌదరీ మొదలైన వారి పేర్లు సువర్ణాక్షరాలతో లిఖించబడతాయి.

అక్టోబరు 24 వ తేదీ ఉదయం తవాంగు లోని మన సైన్యాలపై చైనా ముష్కరులు త్రిముఖంగా దాడి చేశారు. తవాంగు పరిసర ప్రాంతాలలో ఆ రోజురోజల్లా భీషణ సమరం జరిగాక మన సైనికులు ఒక నిర్ణీత ప్రణాళికానుసారంగా ఉపసంహరించుకోవడం జరిగింది. వారు ఉపసంహరించుకోడానికి ముందు జెంపో తవాంగు బౌద్ధ దేవాలయాలలోని బౌద్ధ సన్యాసులను, స్థానిక ప్రజలను ఆయా ప్రాంతాలనుంచి సురక్షిత ప్రాంతాలకు తరలించారు. వెనక ఉండిపోయిన జనం అడవులలోకి పారిపొయ్యారు. చైనావారు తవాంగులో ప్రవేశించేసరికి అక్కడ ఒక్క మనిషి కూడా లేరు. బావురుమంటోంది ఊరు. తవాంగును వశపరచుకోడానికి జరిగిన పోరాటంలో చైనావారికి చాలా జననష్టం కలిగింది.

తవాంగ్ పడిపొయ్యాక పోరాటం కొంత కాలం నిలిచిపోయింది. మరోసారి ముందుకు వచ్చిపడడానికిగాను చైనావారు తమ సైన్యాలను సమీకరించుకోడం, ఆయుధాలను చేర వేసుకోవడం జరిగింది. అటుతర్వాత నవంబరు 3 వ తేదీన చైనా సైనికులు వరుసగా రెండురోజులు వాలాంగ్ సమీపంలో మన స్థావరాలలో ఒక దానిపై దాడిచేశారు. మన సైనికులు ఈ రెండు దాడులను తిప్పికొట్టారు. మన రక్షణ స్థావరాలపై చైనా ముష్కరులు ఫిరంగులు కాల్చారు. అయితే మన సైనికులలో ఎవరికీ ప్రాణనష్టం కలుగలేదు. నవంబరు 10 నుండి 13 వ తేదీవరకు ఉభయ సైనికుల మధ్య కాల్పులు జరిగాయి. వలాంగ్ సమీపంలో శత్రువులు కొంచెం కొంచెంగా ముందుకు వచ్చారు. మన గస్తీ దళాలు శత్రు సైన్యాలను ప్రతిఘటించి వారికి కొంత నష్టం కలిగించారు. నవంబరు 13 వ తేదీన ఒక చైనీయుల జట్టు వలాంగ్ సమీపంలోకి వచ్చి కాల్పులు మొదలు పెట్టారు. మన సైనికులు ఎదురు కాల్పులు సాగించే సరికి చైనా సైనికులు కాలికి బుద్ధి చెప్పారు. వలాంగ్‌కు వాయవ్యంగా కొద్ది మైళ్ళ దూరంలో నవంబరు 14 వ తేదీన చైనావారు కాల్పులు ప్రారంభించగా మన సైనికులు ఎదురు కాల్పులు జరిపారు. ఉభయ పక్షాలలోనూ సమానంగా ప్రాణనష్టం లేదా గాయపడటం జరిగింది.

సామాన్యంగా దురాక్రమణదారులకు అందరికీ ప్రారంభంలో ఉండే అవకాశాలు చైనా వారికి లభించాయి. వ్యవధి దాటి పోకుండా వారు వాటిని ఉపయోగించుకొన్నారు. అక్టోబరు 25 వ తేదీన తవాంగ్‌కు తూర్పుగా కొద్దిమైళ్ళ దూరంలో జాంగ్ పై చైనావారు దాడిజరిపారు. లోహిత్‌డివిజన్‌లో కూడా చైనావారు కిబిటూ నుంచి వలాంగ్ పరిసర ప్రాంతాలకు చేరుకున్నారు. అక్కడ మన స్థావరాలపై చైనా వారు జరిపిన రెండు దాడులను మన సైనికులు తిప్పికొట్టారు. శత్రువులకు తీవ్ర నష్టాలు కలిగించారు. ఆ మరుసటి రోజుకూడా వలాంగ్‌పై దాడి కొనసాగింది. ఇందులో ఒక దాడిలో ఒక నాన్‌కమీషన్డు ఆఫీసరు సిపాయ్ కెవాల్ సింగ్ తన కందకంలోంచి హఠాత్తుగా బయటకు దుమికి శత్రువులపై గుళ్ళవర్షం కురిపించి ఎనిమిది మందినిచంపి తాను శత్రువుల తుపాకీ కాల్పులకు గురియై వీరస్వర్గం అలంకరించాడు.

అక్టోబరు 26 వ తేదీనుంచి జాంగ్ స్థావరం శత్రువుల వశమయ్యేవరకు—నవంబరు 17 వ తేదీవరకు పరిస్థితిలో పెద్దమార్పు కన్పించలేదు. నేఫాలో ఎక్కువ భాగం ప్రాంతంలో చైనావారు చెదురు మదురుగా తుపాకీ కాల్పులు, భారీ ఫిరంగుల కాల్పులు జరుపుతూనే వచ్చారు.

మన స్థావరాలపై నవంబరు 15 వ తేదీ రాత్రి వలాంగ్‌లో చైనావారు పెద్ద ఎత్తున దాడి ప్రారంభించారు. అత్యధిక సంఖ్యలో వచ్చి పడ్డారు. వారివెంట భారీ శతఘ్నులు తెచ్చారు. మన జవాన్లు తీవ్ర ప్రతిఘటన అనంతరం వెంట వెంటనే వచ్చిన దాడులకు, పెద్దఎత్తున జరిపిన ఫిరంగి కాల్పులకు తట్టుకోలేక మన సైనికులు కొంత వరకు లొంగక తప్పలేదు. 24 గంటల పాటు భీషణ సమరం కొనసాగింది. ఇరుపక్షాలకు కూడా తీవ్ర జననష్టం కలిగింది.

ఒక పూర్తి డివిజనుకు చెందిన సైన్యాన్ని ఈ పోరాటంలోకి పంపారు చైనావారు. అత్యధిక సంఖ్యాబలం, అత్యంత ఆధునిక ఆయుధబలం, భారీ ఫిరంగుల కాల్పులకు ఎదురు నిలిచి పోరాడడం ఎంతో కష్టమైంది. శత్రువులకు తీవ్రమైన నష్టాన్ని కలుగజేసినప్పటికి మన సైనికులు వలాంగ్‌కు దక్షిణంగాఉన్న స్థావరానికి వెనక్కు తరలి రావలసి వచ్చింది. ఈ పోరాటంలో శత్రు సైనికులలో అనేక మంది నిహతులయ్యారు. ఇంకా అనేక మందికి తీవ్రమైన గాయాలు తగిలాయి.

వలాంగ్‌కు దక్షిణంగా కొన్ని స్థావరాలలో నిలచి ఉండి ప్రతిఘటిస్తూనే ఉన్నారు. మన సైన్యంలో అధిక భాగాన్ని చుట్టు ముట్టాలని చైనా వారు చేసిన ప్రయత్నాలన్నీ మన సైనికులు విఫలం చేశారు.

శత్రువులకు తీవ్ర నష్టాలను కలిగించారు.

### కామెంగ్ డివిజన్

కామెంగ్ డివిజన్‌లో నవంబరు 14 వ తేదీన జాంగ్‌నుంచి కొద్దిమైళ్ళ దూరంలో చైనా వారు స్వాధీన పరచుకొన్న ఒక గ్రామంపై మన గస్తీ దళాలు దాడి చేశాయి. చైనా వారు నవంబరు 17 వ తేదీ వరకూ జాంగ్ ప్రాంతంలో మన అగ్రస్థావరాలపై చైనావారు దాడి చేస్తూ వచ్చారు. కాని మన సైనికులు ఈ దాడులన్నింటినీ తిప్పి కొట్టారు. 17 వ తేదీన మన అగ్రస్థావరాలపై చైనావారు పెద్ద ఎత్తున దాడిచేశారు. వారి సంఖ్యాబలం మరీ అత్యధికంగా ఉండడంచేత మన సైన్యాలు శత్రుపక్షానికి తీవ్ర నష్టాలు కలిగించిన మీదట సేలాలోని ప్రధాన స్థావరానికి ఉపసంహరించుకోవడం జరిగింది. అటు తర్వాత రాత్రిపూట సేలాలోని మన అగ్రస్థావరాలపై శత్రువులు దాడిచేయడం ప్రారంభించారు. అక్కడ భీషణ సమరం ప్రారంభమైంది.

### వలాంగ్ పోరాటం

స్వతంత్ర భారత చరిత్రలో నేఫా తూర్పు రంగంలో వలాంగ్‌వద్ద జరిగిన పోరాట చరిత్ర సువర్ణాక్షరాలతో లిఖించబడుతుంది. భారత సైన్యానికి చెందిన 3000 మంది ఆఫీసర్లు, ఇతర సిబ్బంది అతి ప్రమాదకరమైన పర్వత ప్రాంతంలో ఏడు మైళ్ళ పొడవున ఉన్న యుద్ధరంగంలో, తిండి సంగతి దేవుడెరుగు కనీసం త్రాగడానికి నీరైనా దొరకని చోట మూడువారాలు మన సైనిక స్థావరాలను అంటిపెట్టుకొని నిలచి 12000 నుంచి 15000 మంది వరకు సంఖ్యాబలంతో, ఆధునిక ఆయుధ బలంతో అలలు అలలుగా పైబడుతున్న శత్రువులను తీవ్రంగా శక్తిమంతంగా ప్రతిఘటించిన విషయాలు ఎన్నటికీ మరువరానివి. ఇది సైనిక చరిత్రలో అపూర్వం. ఈ పోరాటంలో మన సైన్యాలను చుట్టుముట్టి, వారివెనుక ఉన్న స్థావరాలతో సంబంధాలను తెగకొట్టడానికి శత్రువుచేసిన ప్రయత్నాలన్నీ విఫలం చేయబడ్డాయి. ఎదురుగా ముఖా ముఖిగా వచ్చి పోరాడక ప్రక్కలనుంచి ముందుకు చొచ్చుకొని రావడం, మన రక్షణ శ్రేణిలో బలహీనంగా ఉన్నచోట్లు వెతుక్కుంటూ ముందుకు చొచ్చుకొని రావడానికి ప్రయత్నించడం-ఇది చైనా వారి పోరాట పద్ధతి.

వలాంగ్‌వద్ద జరిగిన పోరాటాన్ని యువ సైనిక ఆఫీసర్లు నిర్వహించారు. వారిలో చాలామంది అత్యంత ధైర్యసాహసాలతో తమ తుపాకులలో చివరిగుండ్లు అయిపొయ్యే దాకానేకాదు తమ కొన ఊపిరి పొయ్యేదాకా కూడా పోరాడారు. అనేకమంది తమ స్థావరాలలోనే నేలకూలారు. బ్రతికి బయటపడిన కొద్దిమంది తాము ఈ పోరాటంలో దెబ్బ తిన్నప్పటికీ అపజయం మాత్రం పొందలేదనీ, మరో రోజు మరోసారి శత్రువుతో పోరాడితీరవలసిందేననీ భావిస్తున్నారు.

24 గంటలసేపు భీషణ సమరం జరిగాక మనసైన్యాలు వలాంగ్‌నుంచి ఉపసంహరించుకోవలసి వచ్చింది. శత్రువుల సంఖ్య ఒక డివిజనుకు మించి ఉన్నదనీ అంచనా వేయబడింది. ఫిరంగులు, భారీ మోర్టారులు, ఆధునిక తుపాకులు మొదలైన ఆయుధాలతో అలలు అలలుగా తీవ్రనష్టాలకు గురి అవుతున్నప్పటికీ ముందుకు వచ్చిపడ్డారు. భయంకరమైన 15 దాడులను త్రిప్పికొట్టడం జరిగింది. శత్రువులకు తీవ్రనష్టాలు కలుగజేసి మన సైన్యాలు చివరకు అక్కడనుంచి ఉపసంహరించుకొన్నాయి.

అప్పుడు చైనావారు దాదాపు నాల్గు బెటాలియన్ల సంఖ్యాబలంతో సేలా రంగములోకి వచ్చిపడ్డారు. అత్యధిక సంఖ్యలో వచ్చి పడి శతఘ్నులు, మోర్టారులు, ఆధునిక ఆయుధాలు ఉపయోగించిన శత్రువులతో తీవ్రంగా పోరాడినప్పటికీ చివరకు మన సైనికులు సేలా నుంచి ఉపసంహరించుకోవలసి వచ్చింది. ఒక వంక సేలాపై దాడి జరుపుతూ చైనావారు మరొక వంక బొమిడిలాకు కొన్ని మైళ్ళ ఉత్తరంగా సేలాకువచ్చే రోడ్డును కూడా పట్టుకొన్నారు.

14000 అడుగుల ఎత్తున ఎముకలు కొరుక్కుతినే చలి, నీరు గడ్డకట్టే ఉష్ణోగ్రతలో - విపరీత వాతావరణంలో ధర్మాధర్మవిచక్షణ, దయాదాక్షిణ్యాలులేని శత్రువు అత్యధిక సంఖ్యాబలంతో, అతి ఆధునిక ఆయుధ సంపత్తితో వచ్చి పడినపుడు తీవ్ర పోరాటం జరిగిన తర్వాత నవంబరు 19 వ తేదీన సేలా కనుమ శత్రువశమైంది. ఎత్తైన ప్రాంతాలలో వాతావరణానికి అలవాటు పడి ఉండడం, దీర్ఘకాలంగా జరుగుతున్న సన్నాహాలు, ఆధునిక ఆయుధ బలం, తమ పక్షాన ఎన్ని వందల మంది చనిపోయినా లెక్కచెయ్యక పోవడం - వంటివి ప్రారంభంలో వారి విజయాలకు కారణాలయ్యాయి. వరుసగా 32 రోజులు దాడిజరిపి, నిర్హేతుకంగా దురాక్రమణ జరిపి చైనావారు నవంబరు 23 వ తేదీన యుద్ధ విమరణ ప్రకటించారు.

సేలా పడిపోయిన తర్వాత నవంబరు 18 వ తేదీన బొమ్డిలా స్థావరంపై చైనావారు రెండు దాడులు జరిపారు. వీటిని మనవారు తిప్పికొట్టారు, కాని ఆరోజు 18 వ తేదీ రాత్రి శత్రువు తాకిడికి తప్పనిసరై మన సైనికులు బొమ్డిలాకు కొన్నిమైళ్ళ దక్షిణంగా ఉన్న స్థావరాలకు ఉపసంహరించుకోవడం జరిగింది. బొమ్డిలాకు దక్షిణంగా ఉన్న పర్వతాలలో చెదురు మదురుగా

పోరాటం కొన సాగుతూనే ఉంది. అటు తర్వాత యుద్ధ విరమణ.

నవంబరు 27 వ తేదీన-వారి ఏకపక్ష యుద్ధ విరమణ ప్రకటించడం జరిగిన ఒక ఆరురోజుల తర్వాత దర్రాంగ్ జాంగ్ సమీపంలో రోడ్డు మలుపులో బ్రిగేడియర్ హోషియార్ సింగ్ నాయకత్వాన వెనుతిరిగి వస్తున్న 200 మంది భారతీయ ఆఫీసర్లపై చైనావారు దొంగచాటుగా అకస్మాత్తుగా దాడి చేశారు. వెను తిరిగి వస్తున్న ఈ భారతీయ దళంపై చైనావారు మూడువైపులనుంచి భారీ ఎత్తున కాల్పులు సాగించారు. బ్రిగేడియర్ హోషియార్ సింగ్ పరిస్థితిని ఎలా ఎదురు కోవడమా, తన సిబ్బందిని రక్షించే ఉత్తమ మార్గమేమిటా అని ఆలోచిస్తూ ఉండగానే ఒక చైనా ఆఫీసరు గబగబా ముందుకు వచ్చి పిస్తోలుతో హోషియార్ సింగుపై కాల్పులు జరిపి ఆయనను అన్యాయంగా పొట్టను పెట్టుకున్నారు. కొద్దిమంది యువ సైనికులు అదృష్టవశాత్తు అక్కడినుంచి రక్షించుకొని వచ్చి చైనా వారి దురాక్రమణను గురించి చెప్పారు.

ఈ కథ ఇంతటితో పూర్తికాలేదు. సేలా బొమిడిలాలో చైనా వారు మన సైనికులను ఎన్నో విధాల మోసగించారు. భారతీయ సైనికులయూనిఫారాలు వేసుకొన్నారు. హిందీలో, తమిళంలో ధారాళంగా మాట్లాడేస్తూ తప్పుడు ఉత్తరువులు ప్రకటించారు. మోంపా ఆదివాసుల, బౌద్ధ సన్యాసుల వేషాలు వేసుకొని మన స్థావరాలపై దొంగచాటుగా దాడి చేశారు. ఆ ప్రాంతాలన్నింటినీ పూర్తిగా కొల్లగొట్టి దేవాలయాలను దోచుకొని, అమాయక ప్రజలను మోసగించి వారిపై అత్యాచారాలు జరిపి, కనిపించినదల్లా సర్వనాశనం చేసి, చేతికందినదల్లా దొంగిలించుకొని పొయ్యారు. ఆఖరికి పశువులను కూడా తోలుకొని పొయ్యారు.

వీరి ప్రవర్తన మూలంగా వీరికి మతం, మానవ జీవనం పట్ల ఏ విధమైన గౌరవం లేదనీ, వ్యక్తి స్వాతంత్ర్యాన్ని మన్నించరనీ స్పష్టంగా ఋజువైంది.

---

# మీ ప్రేమోత్సుకత

దుర్గమమైన హిమాలయ ప్రాంతంలో ఎన్నో కష్ట పరిస్థితులలో దేశసరిహద్దులను కాపాడుతున్న వీరులైన మనసైనికులు మీరు కానుకలుగా పంపే వెచ్చని బట్టలను ఎంతో గొప్పగా పరిగణిస్తారు.

ఈ క్రింది వస్తువులను పంపండి :

ఉన్ని బట్టలు, లోపల ధరించే బనీన్లు, డ్రాయర్లు, కేప్-కంఫర్టర్లు, స్కార్ఫ్స్, మేజోళ్ళు, గ్లోవ్స్, పుల్లోవర్లు దుప్పట్లు, కాటన్ పిల్లో-స్లిప్పులు (3′ × 1½′) (తెలుపు), నూలు పక్కదుప్పట్లు (తెలుపు) 'పజమా' సూట్లు (తెలుపు)

శస్త్ర చికిత్స కుపయోగించే కాటన్, వూలు బాండేజీలు (బూడిద, వైమానికదళనీళం, ఖాకీ బీజ్, లేక ఇతర "న్యూట్రల్" రంగులలో వుంటే మంచిది).

ప్యాకెట్లలో వున్న వస్తువుల వివరాలను ప్యాకెట్లపై స్పష్టంగా తెలపాలి. వాటిని ఈ క్రింది చిరునామాకు రవాణా చార్జీలు చెల్లించి పంపాలి.

1. అడ్మినిస్ట్రేటివ్ కమాండెంట్, హెడ్‌క్వార్టర్స్, సికింద్రాబాద్ స్టేషన్, బొలారం.

లేక

2. స్టేషన్ కమాండర్, ఎయిర్ ఫోర్స్ స్టేషన్, బేగంపేట, హైదరాబాద్.

లేక

3. శ్రీ యం. హెచ్. కె. ఘజ్నవీ, గవర్నర్ సహాయ కార్యదర్శి, రాజభవన్, హైదరాబాద్.

*శ్రీ జి. యస్. ఆర్. శాస్త్రి, విశాఖపట్నం.*

ప్రశ్న : పశ్చిమ గోదావరి జిల్లా కొలమూరులోగూడ కొంగ క్షేత్రాన్ని ప్రారంభించాలని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ప్రతిపాదించిందని తెలిసింది. ఈ పథకాన్ని ఎప్పుడు ప్రారంభిస్తారు ? దయచేసి పథకం వివరాలు తెలియజేయండి. ఈ పథకం అమలుకు ఎంత ఖర్చు అవుతుంది ?

సమాధానం.: భారత దేశంలో ప్రత్యేకంగా బూడిదవర్ణం గూడకొంగలపెంపకానికి ముఖ్య ప్రాంతమయిన కొల్లేరు సరస్సు (పశ్చిమ గోదావరి జిల్లా) లో గూడ కొంగల పెంపకం క్షేత్రాన్ని ప్రారంభించాలని ప్రొఫెసర్ కె. కె. నీలకంఠం సిఫారసు చేశారు. 1961 వ సం॥ ప్రారంభంలో ఆయన ఆ ప్రాంతంలో పర్యటించారు. ఆయన సిఫారసుల ప్రాతిపదికగా అటవీ శాఖ ఒక పథకాన్ని తయారు చేసింది. యీ పథకం ప్రభుత్వ పరిశీలనలో ఉంది.

ప్రకటింప బడిన ప్రాంతంలో గూడ కొంగలను చంపడం కానీ, పట్టుకోవడం కానీ, ఏ విధమైన గాయాలు కలగ జేయడం కానీ నిషేధించాలని యీ పథకంలో ప్రతిపాదించారు. వీటి సంరక్షణకై ఫారెస్టురేంజి ఆఫీసర్ హోదాగల ఒకవార్డెన్, కొందరు ఫీల్డు మెన్ సిబ్బందిని నియమిస్తారు. వారు గూడకొంగల సంరక్షణకు తగిన చర్యలు తీసుకోవడమే కాక, వాటి అలవాట్లు మొదలైన వివరాలకు సంబంధించిన నివేదికలను సమర్పిస్తారు. అధిక సంఖ్యలోవచ్చేయాత్రికులకు గణపవరం, ఉండి,ఆకివీడు, భీమవరంలలో ప్రస్తుతం ఉన్న ట్రావెలెర్స్ బంగళాలలో వసతి లభ్యమవుతుంది. కొలమనూరులో ఆధునిక సౌకర్యాలుగల విశ్రాంతిగృహం నిర్మింపబడవచ్చు. నీలకొండ, ఉప్పుటేరు కాలువ కట్టలను మోటారు కార్లు వెళ్ళేవిధంగా విస్తరింప చేయవచ్చు.

# ప్రశ్నలు - సమాధానాలు

అటవీ శాఖక్రింద ఉన్న యీ పథకానికి రు. 23000 లు ఖర్చు అవుతుంది. సిబ్బందికి క్వార్టర్లు, పర్నీచర్, ప్రచార పరికరాలకు నాన్ రిక్కరింగ్ ఖర్చు రు. 16000/-లు, మొక్కలు నాటడం, వ్యవస్థాగత ఖర్చులు రు. 7000/- లు అవుతుంది.

*శ్రీ వి. రామకృష్ణారావు, విజయనగరం.*

ప్ర : ఆంధ్రప్రదేశ్ నలుమూలలలో చేనేత కుటుంబాలు అధిక సంఖ్యలో ఉన్నాయి.వీరి జీవనాధారం చేనేత పరిశ్రమే. అది ఇప్పుడు కుటీర పరిశ్రమగా స్థిరపడింది. ఇప్పటి చేనేత విధానానికి భంగం కలుగకుండా ఉత్పత్తి అధికం చేయడానికి కొత్త డిజైనులకోసం సాంకేతిక విధానాలను ప్రవేశం పెట్టడానికి ప్రభుత్వ ఏమైనా చర్యలు తీసుకున్నదా ?

స్పిన్నింగ్, వీవింగ్ అద్దకంలలో శిక్షణతో కూడిన ఉత్పత్తి యూనిట్లను ఎక్కడ నెలకొల్పారో దయచేసి తెల్పండి. చేనేత పరిశోధన, అభివృద్ధి కేంద్రాన్ని ఎక్కడ నెలకొల్పారు? వాటిలో ప్రవేశానికి నియమ నిబంధన లేమిటి ?

సమాధానం : 1953-54 వ సంవత్సరంనుంచి అమలు జరుపబడుతున్న చేనేత పరిశ్రమ అభివృద్ధి కార్యక్రమం క్రింద సాంకేతిక విధానాలద్వారా ఉత్పత్తిని పెంచడానికీ, వివిధ క్రొత్త రకాలను ప్రవేశపెట్టడానికీ అనేక చర్యలు తీసుకోబడ్డాయి.

ఉత్పత్తిని అధికం చేయడానికి వీలుగా చేనేత సంఘాలకు దిగువ సాధనాలను సరఫరా చేయడం జరిగింది :

(1) ఫ్లయిషటిల్‌లూమ్సు (2) పిక్సను రెగ్యులేటుచేసే మోషన్ అటాచిమెంట్సు (3) స్టాండర్డ్ రీడ్స్ (ఇనుము, దేశీయ రీడ్స్), (4) దొబ్బీలు. (5) ఫెడల్-లూమ్సు (6) స్లేస్ (7) హార్పింగ్ మిషన్లు (8) కాటన్ వ్యానిష్డ్ హీల్సు (9) ఫ్రేంలూమ్సు (10) హీల్డ్సుతో

ఉన్నచోలంరీడ్స్ (11) రోలర్ టెంపుల్సు (12) ప్రెస్ మిషిన్స్ (13) వైర్ హీల్డ్స్ మొదలైనవి.

క్రొత్త డిజైనులను ప్రవేశపెట్టడానికీ, ఆధునిక సాధనాలను ఉపయోగించడానికీ చేనేత పనివారికి ప్రత్యక్ష శిక్షణ ఇవ్వడానికై సాంకేతిక అసిస్టెంట్లనూ, డిమాన్ స్ట్రేటర్లనూ నియమించారు.

నవీన విధాలను కనుగొనడానికీ, చేనేతవారికి శిక్షణ ఇవ్వడానికీ మద్రాసు, బొంబాయి, వారణాసి, కలకత్తా, న్యూఢిల్లీవంటి ముఖ్యప్రదేశాలలో వీవర్స్ సర్వీసు కేంద్రాలను అఖిలభారత చేనేత బోర్డువారు ప్రారంభించారు.

విజయవాడలోని ఆంధ్ర చేనేత పనివారల సహకార సంఘం దిగువ ప్రదేశాలలో నమోనా తయారీల ఫ్యాక్టరీలను నిర్వహిస్తున్నది.

(1) పెడన (కృష్ణాజిల్లా) (2) పుల్లంపేట (కడపజిల్లా) (3) మంగళగిరి చేనేత పరిశోధన, అభివృద్ధి కేంద్రం (4) ఆదోని (5) రాజమండ్రి.

క్రొత్తరకాలను ప్రవేశపెట్టడంలోనూ, ఆధునిక సాధనాలను ఉపయోగించడంలోనూ చేనేత పనివారికి పై కేంద్రాలలో ప్రత్యక్ష శిక్షణ ఇవ్వడం జరుగుతున్నది. దిగువ ప్రదేశాలలో మూడు ఆధునిక అద్దకం యూనిట్లను నెలకొల్పారు.

(1) ఎమ్మిగనూరు (2) ఏలూరు (3) చేనేత పరిశోధన, అభివృద్ధి కేంద్రం, మంగళగిరి.

ఆంధ్ర చేనేత పనివారల సహకార సంఘం, రాజమండ్రి, నెల్లూరులలో రెండు అద్దకం గృహాలను నిర్వహిస్తున్నది. చిన్న అద్దకం గృహాలను నిర్వహించడానికి 22 ప్రాథమిక వీవర్స్ సహకార సంఘాలకు సహాయం చేయడం జరిగింది. మంగళగిరిలో చేనేత పరిశోధన, అభివృద్ధి కేంద్రాన్ని నెలకొల్పారు. ఆధునిక విధానాలను నేర్చుకొనగోరే చేనేత పనివారు యీ కేంద్రంలో పనిచేయడానికి అనుమతింపబడ్డారు.

శ్రీ *బి. శేషగిరిరావు, మధిర.*

ప్ర : వరంగల్లులో రేడియో స్టేషన్‌ను నెలకొల్పే ప్రతిపాదనేదైనా ఉందా ?

స : వరంగల్లు వంటి పరిసర ప్రాంతాలకు మరింత బాగా ఉపయోగపడే విధంగా హైద్రాబాదు రేడియో స్టేషన్ శక్తిని ఎక్కువ చేయడానికి ఒక ప్రతిపాదన ఉంది. వరంగల్లుకు ప్రత్యేకంగా రేడియో స్టేషన్ నెలకొల్పడానికి ప్రస్తుతం యెట్టి ప్రతిపాదనా లేదు.

శ్రీ *వి. కృష్ణమూర్తి, తిరుపతి.*

ప్ర: ఒకే శాఖలో ప్రభుత్వ గజిటెడ్ అధికారి ఎన్ని సంవత్సరాలు పని చేయవచ్చు ?

స : ప్రభుత్వ శాఖలోని గజిటెడ్ అధికారి గరిష్ఠవయః పరిమితిని చేరేవరకు అదే శాఖలో పనిచేయవచ్చు.

శ్రీ *కె. నాగభూషణం, చందూరు, నిజామాబాదు జిల్లా.*

ప్రశ్న : మూడవ శ్రేణిలో (కంపార్టుమెంటల్) ఉత్తీర్ణులయిన హెచ్. యస్. సి. అభ్యర్థులు, పూర్తి సబ్జెక్టులతో తిరిగి పరీక్ష ఇవ్వవచ్చునా ? అటువంటి సందర్భంలో హాల్ టికెటు పూర్వం మాదిరిగా ఉండదు. పూర్వం మాదిరిగా ఉండనట్లయితే వాటి విధానమేమిటి ? క్రొత్త పరీక్షలో అనుత్తీర్ణులయినచో పూర్వపు పరీక్ష విద్యార్హతలు కోల్పోతారా తెల్పండి ?

స: హెచ్. యస్. సి. పరీక్షలో తక్కువ శ్రేణిలో ఉత్తీర్ణులయిన అభ్యర్థులు, ఉత్తమ శ్రేణిని పొందడానికి వీలుగా ప్రైవేటుగాగానీ, విద్యార్థి అభ్యర్థిగాగానీ తిరిగి పరీక్ష ఇవ్వవచ్చు. అయితే అవసరమైన పూర్తి ఫీజును చెల్లించాల్సి ఉంటుంది. హెచ్. యస్. సి. పరీక్షకు నిర్ణయించబడిన అన్ని సబ్జెక్టులతోనూ పరీక్ష ఇవ్వాలి. పూర్వపు ఉత్తీర్ణతలో మార్పు ఉండదు. 

---

**కృత నిశ్చయం కావాలి!**
**పట్టుదలగా పనిచేయండి!**
**జాతీయ రక్షణ కృషిలో పాల్గొనండి!**

---

నా టి క :

# దేశభక్తి

బి. విద్యాసాగర్

పాత్రలు :- రామారావు, ఆనందరావు సరోజ, మధు.

ఆనంద : ఏరా! చైనాతో యుద్ధం యింత టితో ఆగిపోయినట్లేనా!... లేక మళ్లీ కొన్నాళ్ళు పోయాక, యుద్ధం కొన సాగుతుందంటావా!

రామ : ఏమో : చెప్పలేము. ఇంతటితో యుద్ధం ఆగిపోతే ఆగిపోవచ్చును... లేదూ, కొన్నాళ్ళు గడిచాక, యిప్పటి కంటే భారీయెత్తున యుద్ధం సాగినా సాగవచ్చును. ఏమయినా, మనదేశం అజాగ్రత్తగా వుండేందుకు వీలులేదు.

ఆనం : యుద్ధం మళ్లీ రాకండా వుంటే బాగుండును! విరాళాల పేరుతో ప్రజల దగ్గర ప్రభుత్వం బాగావసూలు చేస్తున్నది. నాకు మొన్న జీతంలో వొక రోజు జీతం రక్షణ నిధికి విరాళం ఇవ్వమంటే, బాధ కలిగింది. ఎందుకు వూరికే డబ్బు వృధా చేయడం, యింత కంటే యుద్ధం విరమించి, సంధి చేసుకుంటే పోయేదికదా అనిపించింది.

రామ : నువ్వు నీజీతంలో కొంతడబ్బు రక్షణ నిధికి తీసుకున్నారే అని ఆలోచించావు గాని, దేశగౌరవం సంగతి యేమయినా ఆలోచించావా! మనకు స్వాతంత్ర్యం రాక పూర్వము, దేశానికి దాస్య విముక్తి యెప్పుడు కలుగుతుందా, ఎప్పుడు మనకు స్వాతంత్ర్యం వస్తుందా అని మనమంతా వెయ్యి కళ్ళతో నిరీక్షించలేదా !

ఆనం : అయితే, యేమిటంటావు :

రామ ; ఎంతో కష్టపడి, యెన్నో త్యాగాలు చేసి, మన దేశానికి స్వాతంత్ర్యం సంపాదించుకున్నాము. దానిని రక్షించుకుని, మన ప్రభుత్వాన్ని సుస్థిరం చేసుకోవడం మన కర్తవ్యం కాదా!... అటువంటప్పుడు, మరొకదేశం అన్యాయంగా, అక్రమంగా మనపై దండయాత్ర సాగిస్తే సహించగలమా : చైనాకు మనం వుపకారంచేస్తే వాళ్ళు దుర్బుద్ధితో, మనకే కీడు తలపెట్టి దురాక్రమణ ప్రారంభించి, మనదేశంలోనికి చొచ్చుకు వస్తుంటే, చూస్తూ వూరుకోగలమా !

ఆనం : అవును ! ఊరుకోలేము. కాని యుద్ధం అంటే మాటలతో వుందా ! ఎంతో డబ్బు కావాలి. ఆయుధాలు కావాలి. ఇవన్నీ సమకూర్చుకున్నా, యుద్ధంలో విపరీతమైన ప్రాణ నష్టం కలుగుతుంది. అది మాత్రం యేమి బాగుంది!

రామ : నువ్వు చెప్పింది బాగానే వుంది. కాని యుద్ధం వస్తే జననష్టం కలుగుతుందని, చాలా డబ్బు ఖర్చు అవుతుందని యుద్ధప్రయత్నాలు విరమిస్తామా :

ఆనం : విరమించడమే మంచిది! సంప్రదింపుల ద్వారా ఈ సమస్య పరిష్కరించుకోవడం ఉత్తమం! తటస్థరాజ్యాలు పూనుకుని యుద్ధం నివారిస్తే మంచిది.

రామ : కాని ఈ రాజీ ప్రతిపాదనలు పని చేయనప్పుడు యేమి చేయాలి? చెవిటివాడిముందు శంఖం వూదినట్లు, యెంత మంది నాయకులు విజ్ఞప్తి చేసినా, శత్రువు యుద్ధం మానకపోతే, మన మేమిచేయాలి ? శత్రువును అరికట్టి మనదేశంలోకి చొచ్చుకు రాకుండా గట్టి ప్రయత్నం చేయాలి.

ఆనం : ఏమయినా ఈయుద్ధం వలన చాలా జననష్టం, కలిగింది. అది గాక మన దేశ ప్రతిష్టకు భంగం కూడా కలిగింది. శాంతి అంటూ, ఏకూటమికీ చెందకుండా తటస్థంగా వున్న మనదేశం యిప్పుడు యితర దేశాల సహాయం కోరవలసి వచ్చింది. ఇంక మనకు పరువేమి వుంటుంది ?

రామ : అక్కడే నువ్వు పొరబాటు పడుతున్నావు. మనదేశ ప్రతిష్టకు యేమీ భంగం కలుగలేదు. పైగామనకు చాలా దేశాలు సానుభూతి ప్రకటించాయి. ఈ సరిహద్దు వివాదంలో యుద్ధం చెలరేగడానికి కారణం చైనా యొక్క మిత్రద్రోహమేనని గ్రహించారు. అంతే కాదు! చాలాదేశాలు ఆయుధాలు సరఫరా చేస్తున్నాయికదా!

ఆనం : ఇతర దేశాలు వూరికే సహాయం చేస్తున్నా యనుకుంటున్నా వేమిటి ! నెమ్మదిగా మనదేశాన్ని యే సైనిక కూటమిలో నయినా యిరికించి, వారి

గుప్పెట్లో పెట్టుకోవడానికి ప్రయత్నిస్తున్నాయి.

రామ ; ఏమీకాదు! ఆయుధాలు యెట్టి షరతులు పెట్టకుండానే, యితర దేశాలు సరఫరా చేస్తున్నాయి. ఎటువంటి షరతులు వున్నా మనదేశం ఈ సహాయం కోరేదికాదు. నీకు ఈ విషయంలోవున్న అభిప్రాయం పూర్తిగా తప్పు.

ఆనం : ఏమయినా మనదేశానికి తటస్థంగా వుండటం యిక వీలుకాదు.

రామ ; ఎందుకు వీలుకాదు? తటస్థంగా వుంటునే, యితర దేశాలనుండి ఆయుధాలు తెప్పించుకుంటున్నది మనదేశం. చాలాదేశాలు మనకు సహాయం చేస్తామంటున్నాయి.

మధు : నాన్నా!...నాన్నా! మరీ...

రామ : ఏమిటిరా! ఏమిటి సంగతి?

మధు : మరీ, మా స్కూలులోనే, మా మేష్టరుగారు దేశరక్షణ నిధికి డబ్బులు తీసుకు రమ్మని చెప్పేరు. నాకు వొక రూపాయి యివ్వవూ!

రామ : అలాగే యిస్తాను వుండు.

ఆనం : ఎందుకురా! యుద్ధం అయిపోయినాక. అయినా ఈ డబ్బు సద్వినియోగం అవుతుందని నాకు నమ్మకం లేదు.

రామ : ఊరుకోరా! నువ్వు మరీవిచిత్రంగా మాట్లాడుతావు! ఎంతసేపూ ప్రతి విషయాన్ని వక్రంగా ఆలోచించటం తప్పితే. నీకు మరొక పనిలేదల్లే వుంది.

ఆనం : ఎంతమాట! నాకుతోచిందిచెప్పాను. నీకు యిష్టమైతే, యిచ్చి పంపించు, నాకేమీ అభ్యంతరం లేదు.

రామ : నేను యివ్వడమేకాదు! ప్రతి కుర్రవాడిని, తను దాచుకున్న డబ్బు యేమయినా వుంటే ఈ సమయంలో దేశరక్షణ నిధికి విరాళంగా యివ్వమని సలహాయిస్తాను. అంతేకాదు! ఆడవాళ్ళు తమ నగలు, ఆభరణాలు అన్నీ దేశరక్షణ నిధికి విరాళం యివ్వమని అందరినీ ప్రోత్సహిస్తాను.

ఆనం : కబుర్లుకాదు! చేతయితే మీ ఆవిడ నగలు దానంచేయి, చూద్దాము!

రామ : నీకింకా తెలియదేమిటి! నేను నా భార్య నగలు రక్షణ నిధికి యిదివరకే యిచ్చేశాను.

ఆనం : ఏమిటి! నిజంగా!

రామ : నిజంగానే! యుద్ధం ప్రారంభం కాగానే, మా ఆవిడతో వొకసారి నగలు యిద్దామంటే, సరేనని వెంటనే వొప్పుకుంది.

మధు : అవునండి! మా అమ్మ పెట్టుకునే నగలు యిచ్చేశారు.

ఆనం : నేను యేమో అనుకున్నాను. నీలో దేశభక్తి చాలావుందిరా! ఇందాక, నేను చెప్పాను చూశావూ ఒక రోజు జీతం రక్షణ నిధికి యివ్వవలసి వస్తే, నాకు కొద్దిగా బాధ కలిగిందని ... ఇప్పుడు అందుకు సిగ్గుపడుతున్నాను. నీవుచేసిన త్యాగంలో నేను చేసింది యెన్నోవంతు వుంటుం దంటావు!

రామ : అలా యెందుకు వూహించుకోవాలి! నువ్వు కూడా మీఆవిడ నగలు రక్షణ నిధికి దానం చేయమని చెప్పు. లేదూ, కనీసం గోల్డ్‌బాండ్సు అన్నా కొని ఆవిధంగా నయినా దేశానికి సహాయ పడండి. దేశానికి ప్రస్తుతం బంగారం చాలా అవసరం!

మధు : నాన్నా! మరే తాతయ్య, మామయ్య, అత్తయ్య వాళ్ళు మనయింటికి వచ్చారే! వాళ్ళు వచ్చి నప్పుడు నాకే బోల్డు డబ్బులు యిచ్చారు. నాపెట్టెలో వున్నాయి. అవి అన్నీ స్కూలులో మేష్టారు గారికి యిచ్చేయనా!

రామ : అలాగే యిచ్చెయ్యి! నేనొక రెండు రూపాయలు యిస్తాను. అవి కూడా పట్టుకువెళ్ళి మీ మేష్టరు గారితో రక్షణ నిధికి అని చెప్పి యిచ్చిరా!

ఆనం : నాకు యిప్పుడు అనిపిస్తున్నదిరా! దేశంలో నలుమూలలా, ప్రజలు, యింత విపరీతంగా రక్షణనిధికి విరాళాలు యిస్తున్నారంటే, మన స్వాతంత్ర్యం రక్షించుకోవడానికి అందరూ దీక్ష పూనారని...

రామ : అంతేకాదు! ఇదివరకు యేమయినా విభేదాలు వుంటే, అన్నీ మరచిపోయి అన్ని పార్టీలవారు ప్రభుత్వానికి మద్దతు యిస్తున్నారు.

ఆనం : ఈమధ్య అమెరికా, ఇంగ్లండుల నుంచి ప్రతినిధి వర్గాలు మన దేశానికి వచ్చాయికదా ! అంటే యుద్ధం మళ్ళీ సాగుతుందంటావా!

రామ : ఏమో! చెప్పలేము! ఇప్పటివరకూ సేనలను పూర్తిగా వుపసంహరించుకోలేదు. అందుకే ప్రపంచంలో అన్ని దేశాలవారు ఆసక్తితో ఈపరిణామాలను పరిశీలిస్తున్నారు.

ఆనం : నేను రక్షణ నిధికి ప్రతినెలా నా జీతంలోనుంచి వొకరోజు జీతం విరాళంగా యిద్దామనుకుంటున్నాను. ప్రస్తుతం అమలులోవున్న అత్యవసర పరిస్థితి కొనసాగుతున్నంత వరకూ ఈవిధంగా చేద్దామనుకుంటున్నాను.

రామ : ఏమి! ఒక్కసారి అలా అనేశావు! నీకు కూడా దేశం అంటే భక్తి కలిగిందేమిటి!

ఆనం : దేశంలో అందరూ ధనికులు, బీద వాళ్ళు అనే తారతమ్యం లేకుండా రక్షణ నిధికి విరాళం యిస్తుంటే వొక రోజు

జీతం నేను వదులుకోవడం, పెద్దత్యాగ మనిపించటంలేదు: నిజానికి మనం, యుద్ధమంటూ మళ్ళీవస్తే యింత కంటే యెక్కువ త్యాగాలు చేయవలసి వుంది.

రామ : నీలోవున్న సంకుచితత్వం పోగొట్ట గలిగాను. నాకు చాలా సంతోషంగా వుంది. ప్రస్తుతపరిస్థితుల్లో మనం చాలా పొదుపుగాఖర్చుపెడుతూ, సాధ్యమైనంత వరకూ, దేశానికి సహాయపడటం మన కర్తవ్యం.

ఆనం : దేశంలో అన్ని ప్రాంతాలలోనూ వాలంటీరు దళాలు యేర్పడు తున్నాయి. కాలేజీలలో విద్యార్థులు యన్.సి.సి.లో యెక్కువగా చేరుతున్నారు. మనసైన్యా నికి తర్ఫీదు యిస్తున్నారు. చూడపోతే మనవాళ్లు యెటువంటి పరిస్థితి కయినా సిద్ధంగా వున్నట్టుగా వున్నారు.

రామ : అవును: ఉండక తప్పదు మరి. యుద్ధప్రమాదం వున్నంతకాలం మనం అజాగ్రత్తగా వుండేందుకు వీలులేదు.

ఆనం : నిజమే: చైనావాళ్ళు యుద్ధవిరమణ చేస్తున్నామని ప్రకటించాక కూడా మన సైనికులపై వొకసారి కాల్పులు జరిపా రని పేపర్లో చదివాను.

రామ : కనుక దీనినిబట్టి, చైనా నాయకు లలో హృదయపరివర్తన కలిగి, ఈ విధంగా యుద్ధవిరమణ చేస్తున్నట్లు ప్రకటించారనికానీ, లేక యుద్ధం యింత టితో ఆగిపోతుందనిగానీ నమ్మేందుకు వీలులేకుండా వుంది.

ఆనం : అందుకే కాబోలు: ఇతర దేశాల నుంచి వచ్చిన నాయకులు ప్రస్తుత పరి స్థితి సమీక్షించాక, యుద్ధ ప్రమాదం యింకా పోలేదని భావిస్తున్నారు.

రామ : యుద్ధం రాకుండా వుండాలనే మనం కోరుకుందాము. కాని వొకవేళ అకస్మాత్తుగా యుద్ధం అంటూ మళ్ళీ చెలరేగితే, మనదేశం అందుకు సిద్ధం గానేవుంది. మిత్రదేశాలు ఆయుధాలు సప్లయిచేసి దురాక్రమణను అరికట్టి తీరుతాయి.

మధు : నాన్నా: అమ్మపిలుస్తోంది. భోజనా నికి రమ్మని చెప్తోంది.

రామ : ఏరా: ప్రొద్దుపోతున్నది. భోజనా నికి లేద్దామా యేమిటి: నువ్వు ఈపూట యిక్కడే భోజనం చేసివెళ్ళు.

ఆనం : ఎందుకురా: మరొకసారి యెప్పు డయినా వస్తాను, నేను యింటికిపోవాలి. మా ఆవిడ భోజనం చేయకుండా కని పెట్టుకుని వుంటుంది నాకోసం.

మధు : నాన్నా ! మరే, మా మేష్టరుగారికి నువ్వు యిచ్చినడబ్బు, నాదగ్గర వున్న డబ్బులు యిచ్చివచ్చాను.

ఆనం : గుడ్! వస్తానురా:

రామ : మంచిది ["స్వాతంత్ర్యమే మా జన్మహక్కని చాటండి" అనే రికార్డు వినిపిస్తుంది].

* * *

(తలుపు తట్టిన శబ్దం)

ఆనం : సరోజా:...సరోజా:

సరోజ : వస్తున్నా:......ఏమండీ: ఇంత ఆలస్యం చేశారేమి:

ఆనం : ఆదివారమేకదా: భోజనానికి తొందర లేదని, రామారావు యింటికివెళ్ళి అత నితో కబుర్లు చెపుతూ కూర్చున్నాను. టైమెంతయిందో కూడా తెలియలేదు.

సరోజ : మీయిద్దరూ కబుర్లుమొదలుపెడితే దానికి అంతూ పంతూ వుండదు. నాకు తెలియనిదేమున్నది: ఇంతకూ, వాళ్ళ యింట్లో మళ్ళీ కాఫీ త్రాగారా యేమిటి:

ఆనం : కాఫీయేమిటి: ఫలహారం కూడా చేశాను.

సరోజ : అందుకే ఆకలి యెరుగక కబుర్లు చెప్పుకుంటూ కూర్చున్నారు. ఇంతకూ యేమిటి యింత సేపు కబుర్లు?

ఆనం : ఏముంటాయ్: చైనాతో వచ్చిన యుద్ధం గురించి, యుద్ధం ఆగిపోయాక పరిస్థితి గురించి కాసేపు చర్చించాము. రక్షణ నిధికి వాళ్ళ ఆవిడ తన నగలు దానం చేసిందట: నీకు తెలుసా!

సరోజ : తెలుసులెండి: ఆవిషయం గొప్ప గా చెప్పుకున్నాడేమిటి?

ఆనం : అతనేమి గొప్పగా చెప్పుకోలేదు. మాటల సందర్భంలో అన్నాడు. అంతే:...సరేకానీ, నువ్వు కూడా నీ నగలు దానం చేయకూడదూ రక్షణ నిధికి? నీమెళ్లో వుండటం వలన వొరిగే దేమిటి:

సరోజ : చాల్లెండి: వాళ్ళకు మతిపోతే, మనకు కూడా మతిపోవాలా: నేనేమి నా నగలు యివ్వను.

ఆనం : నువ్వు రోజూ పేపరు చదువు తున్నావా:

సరోజ : చదువుతున్నాను. ఏమి: అలా అడిగారు ?

ఆనంద : దేశంలో నలుమూలలా ప్రజలు చేస్తున్న త్యాగాలు నువ్వు గమనిస్తే అలా మాట్లాడవు.

సరోజ : ఉన్నవాళ్లు త్యాగాలు చేయగలరు. మనమేమి చేస్తామండీ:

ఆనం : ఉన్నవాళ్ళు, లేనివాళ్ళు అనే తార తమ్యం యేమీ లేదు ఈవిషయంలో. ఎవరికి తోచిన సహాయం వారు చేయ వచ్చును.

సరోజ : ఏమయినా, నానగలు నేను యివ్వ దలచుకోలేదు.

ఆనం : నువ్వు యివ్వకపోతే, బలవంతం గా లాక్కుని నేనుయిస్తాను. తెలిసిందా.

# పదవోయి! సిపాయి!!

కమ్మిశెట్టి వెంకటేశ్వరరావు

పదవోయి సిపాయీ!! పదవోయీ!!
రణ కాలమేఘములు ముసిరాయీ

ఆసేతు హిమాచల మేకముగ
లేస్తున్నది ధర్మప్రతీకముగ
జలమందున అనలం రేగింది
నిశ్శబ్ద మృదంగం మ్రోగింది
పదవోయి సిపాయి! గభీరుడవై —
హిమశైల మహోజ్జ్వల ధీరుడవై -

చిగురాకులు బాకులు దూశాయి
పూవులలో జ్వాలలు ఎగశాయి
ప్రతి తిర్లిక రేగెను జ్వాలికయై
ఉన్మత్త భయంకర కాళికయై
పదవోయి సిపాయి! అజేయుడవై
గాంగేయుడవై, వాజ్రేయుడవై

ఈ భూమి పరాక్రమవంతులది
అసమాన త్యాగధనవంతులది
అణువేని సహింపదు దీనతను
బలహీనతను పరాధీనతను

పదవోయి సిపాయీ! పదవోయి
నీ అడుగున దిక్కులు అదిరాయి

నీ దేశం ధర్మం వీడనిది
పోరాటంలో వెనుకాడనిది
దుర్నీతి పథాంకితమగు చైనా
నీ ధాటికి చెదరక నిలిచేనా

పదవోయి సిపాయీ! పదవోయి
నినుజూచి చుక్కలే బెదిరాయి ★

---

సరోజ : (నవ్వుతూ) చూడబోతే మీరు అంతపని చేసేటట్లున్నారు! అయినా మీరు అన్నట్లు, దేశంలో అందరూ రక్షణ నిధికి విరాళాలు యిస్తుంటే, మనం పట్టనట్లు వూరుకోవడం బాగుండదు.

ఆనం : అయితే. నీ నగలు రక్షణ నిధికి యిస్తావా!

సరోజ : తప్పకుండా! మొన్న రామారావు గారి భార్యవచ్చి, మాటల సందర్భంలో తను చేసినపని చెప్పింది. నాకుఅప్పుడు అనిపించింది నేను కూడా ఆవిడలాగా నా నగలు రక్షణ నిధికి విరాళంగా యిద్దామని. అయినా మీరు యేమంటారో అని వూరుకున్నాను.

ఆనం : ఇది వరకు అడిగితే వద్దనే చెప్పేవాడిని! కాని యివేళ రామారావుతో మాట్లాడుతుంటే, అతను చెప్పినదంతా విన్నాక, అనవసరం కబుర్లు, విమర్శలతో కాలం వృధాచేయడంకన్నా, కార్యదీక్షతో ప్రస్తుత పరిస్థితులలో పనిచేయడం అవసర మనిపించింది. ప్రజలలో చైతన్యం తీసుకు రావలసిన అవసరం యెంతయినావుంది.

సరోజ : పేపరు చదువుతుంటేతెలుస్తున్నది, మన ప్రజలు యెంత ఐకమత్యంతో పనిచేస్తున్నారో! రక్షణ నిధికి డబ్బు, బంగారం బాగా వసూలు అవుతున్నట్లుంది.

ఆనం : నలుగురూ పూనుకుంటే, యెందుకు కాదు. ఈయుద్ధం రావడం వలన, మనవాళ్లు స్వాతంత్ర్యాన్ని రక్షించుకోవడానికి యెంత దీక్షతో వున్నారో ప్రపంచం అంతటికీ తెలిసింది,

["జయమ్ము నిశ్చయమ్మురా! భయంబు లేదురా!" అనే రికార్డు]



*రక్షణ నిధికి :* 1963 జనవరి 24 వ తేదీన గుంటూరులో ముఖ్యమంత్రిని రు. 5/ నోట్లతో తూస్తున్న దృశ్యం.



మెదకుజిల్లా, సదాశివపేట బ్లాకులోని తొగరపల్లి గ్రామంలో పాఠశాల విద్యార్థి తన బంగారు ఉంగరాన్ని జాతీయ రక్షణ నిధికి విరాళంగా రెవిన్యూ మంత్రికి సమర్పిస్తున్న దృశ్యం.



కరీంనగర్ జిల్లా పరిషత్తు బహుళార్థ సాధక ఉన్నత పాఠశాల ప్రధానోపాధ్యాయులు, మొత్తం రు. 2,500/-లు ఉన్న ఒక రూపాయినోట్ల హారాన్ని ముఖ్యమంత్రికి సమర్పించారు. ఇది యీ పాఠశాల విద్యార్థులు, సిబ్బంది జాతీయ రక్షణ నిధికి ఇచ్చిన మూడవ దఫా విరాళం. దీనితో మొత్తం రు. 18000 లను వీరు నిధికి విరాళంగా ఇచ్చారు.



శ్రీ కె. హనుమంత రెడ్డి, ఫారెస్టర్, ఆసిఫాబాదు డివిజన్, 1962 నవంబరు నుంచి పదిరోజుల వేతనాన్ని జాతీయ రక్షణ నిధికి విరాళంగా ఇచ్చారు.



పెడ్యాట్రిక్ వార్డుకై: శ్రీమతి చిన్న వెంకమ్మ, 1963 ఫిబ్రవరి 10 వ తేదీన ముఖ్యమంత్రికి రు. 50,000/- చెక్కు సమర్పించారు. కర్నూలులోని ప్రభుత్వ జనరల్ ఆసుపత్రిలో పెడ్యాట్రిక్ వార్డు విస్తరణకు యీ డబ్బు వినియోగింపబడుతుంది.

చెక్కు సమర్పించారు. కర్నూలులోని ప్రభుత్వ జనరల్ ఆసుపత్రిలో పెడ్యాట్రిక్ వార్డు విస్తరణకు
యీ డబ్బు వినియోగింపబడుతుంది.

హైదరాబాదులోని ప్రత్యేక ఉద్యోగ సాధక కేంద్రంవద్ద చేరిన వికలాంగులు, అంధులు, బధిరులు.



అంధుడైన ఒక బాలుడు చదవడంలో తనకుగల ప్రతిభను ఉద్యోగ సాధక కేంద్రంలో ప్రదర్శిస్తున్న దృశ్యం.



1963 జనవరి 20 వ తేదీన లెబనాన్ ప్రధానమంత్రి ఉస్మానియా విశ్వ విద్యాలయ ఛాన్సలర్ నుంచి డాక్టరేట్ గౌరవ పట్టాను స్వీకరించారు.




ఆంధ్ర యన్. సి. సి. ల ప్రత్యేకత : గత సంవత్సరం ఢిల్లీలో జరిగిన రిపబ్లిక్ దినోత్సవ విన్యాసంలో ఆంధ్ర యూనిట్ పొందిన బ్యానర్, కప్పులు.



ఆర్థికమంత్రి 1963 ఫిబ్రవరి 20 వ తేదీన శాసనసభలో 1963–64 సం॥ రాష్ట్ర బడ్జెటును సమర్పించారు.



1963 జనవరి 26 వ తేదీన హైద్రాబాదులో ప్రభుత్వోద్యోగుల వినియోగదారుల సహకార స్టోర్సుకు ప్రారంభోత్సవం జరిగింది.

# సైనిక దళాలలో ఎలా చేరాలి ?

| సైనిక విభాగం | వర్గాలు | దరఖాస్తు పంపవలసిన స్థలం |
|---|---|---|
| 1 పదాతి దళం | కమీషన్డ్ ఆఫీసర్ల పదవులకు | నిర్ణీత దరఖాస్తుఫారాలు ఈ క్రింద పేర్కొన్న స్థలాలనుంచి పొందవచ్చును :—<br>1. ఆర్మీ హెడ్క్వార్టర్స్, అడ్జుటంట్ జనరల్ బ్రాంచి, డి. హెచ్. ఓ. (పోస్టు), న్యూ ఢిల్లీ–11.<br>2. హెడ్క్వార్టర్స్, సికింద్రాబాదు స్టేషన్, సికింద్రాబాదు–10, బొలారం (దక్కన్).<br>3. రిక్రూటింగ్ ఆఫీసు, బొలారం (దక్కన్) (ఇది బొలారంలో లకర్‌వాడా బస్సు స్టాపు సమీపంలో, ఓల్డ్ క్యాంటీన్‌లో నెలకొనివుంది). |
| | ఎమర్జెన్సీ కమీషన్డ్ ఆఫీసర్ల పదవులకు | 1. ఆర్మీ హెడ్క్వార్టర్స్, అడ్జుటంట్ జనరల్ బ్రాంచి, డి. హెచ్. ఓ. (పోస్టు), న్యూ ఢిల్లీ–11.<br>2. హెడ్క్వార్టర్స్ సికింద్రాబాదు స్టేషన్, సికింద్రాబాదు–10, బొలారం (దక్కన్).<br>3. రిక్రూటింగ్ ఆఫీసు, బొలారం (ఇది బొలారంలో లకర్‌వాడా బస్సు స్టాపు సమీపంలో, ఓల్డ్ క్యాంటీన్‌లో నెలకొనివుంది).<br>4. సికింద్రాబాదులో టివోలీ టాకీస్‌కు ఎదురుగావున్న హెడ్క్వార్టర్స్ 12 సర్కిల్ కేడెట్ కోర్.<br>5. అన్ని విశ్వవిద్యాలయాలు, కళాశాలలు. |
| | ప్రాంతీయ సైన్యంలో కమీషన్ పదవికి | 1. హెడ్క్వార్టర్స్, సికింద్రాబాదు స్టేషన్, సికింద్రాబాదు–10 (బొలారం దక్కన్).<br>2. 117 ఇన్‌ఫెంట్రీ బెటాలియన్ (టి. ఎ.) ఆసిఫ్‌నగర్ లైన్స్, హైద్రాబాదు–28. |

*గమనిక* పత్రికలలో అడ్వర్‌టైజు అయినట్లయితే నిర్ణీత దరఖాస్తు ఫారాలు పొందవచ్చు.

| | | |
|---|---|---|
| | ఇతర హోదాలు | రిక్రూటింగు ఆఫీసు, బొలారం, సికింద్రాబాదు, (లకర్‌వాడా బస్సు స్టాపు సమీపంలో ఓల్డ్ క్యాంటీన్‌లో నెలకొనివుంది). |
| 2 నౌకా దళం | నావికునిగా కమీషన్ పదవికి | నావల్ హెడ్క్వార్టర్స్, న్యూ ఢిల్లీ–11.<br>రిక్రూటింగ్ ఆఫీసు, బొలారం, సికింద్రాబాదు, (బొలారంలో, లకర్‌వాడా బస్సు స్టాపు సమీపంలో ఓల్డ్ క్యాంటీన్‌లో నెలకొనివుంది). |
| 3 విమాన దళం | కమీషన్ పదవికి | 1. ఏర్ హెడ్క్వార్టర్స్, (పోస్టు–4) న్యూ ఢిల్లీ.<br>2. ఏర్‌ఫోర్స్ స్టేషన్, బేగంపేట, హైద్రాబాదు–16. |
| | వైమానికులు | ఏర్‌ఫోర్స్ స్టేషన్, బేగంపేట, హైద్రాబాదు–16. |

# పారిశ్రామిక విశేషాలు

## రాష్ట్రీ రంగం

ఖమ్మం జిల్లా బోనకల్లులో సిమెంటు ఫ్యాక్టరీని నెలకొల్పడానికై ఆంధ్రప్రదేశ్ మైనింగ్ కార్పొరేషన్‌కు భారత ప్రభుత్వం, లైసెన్సును అంగీకారపత్రాన్నీ జారీచేసింది. రోజుకు 600 టన్నుల చొప్పున ఉత్పత్తి శక్తిగల యీ ఫ్యాక్టరీకి 300 లక్షల పెట్టుబడి ధనం అవసరం అవుతుంది. దీనికి కావలసిన మొత్తం యంత్రాలు భారత దేశంలోనే తయారు అవుతాయి.

హైద్రాబాదు జిల్లా తాండూరులో నెలకొల్పబడే మరో సిమెంటు ఫ్యాక్టరీకి సంబంధించిన మినరల్ ఎంటర్‌ప్రైసెస్ దరఖాస్తును కూడా లైసెన్సింగ్ కమిటీ ఆమోదించినట్లు తెలుస్తుంది.

## ప్రైవేటు రంగం

కొత్తగూడెంలో లో–టెంపరేచర్ కార్బొనైజేషన్ ప్లాంటును నెలకొల్పడానికి శ్రీ హషీమ్ మొహదీకి ఆమోదపత్రాన్ని జారీ చేయడం జరిగింది. సంవత్సరానికి 3,60,000 టన్నుల కోల్‌ఫ్యూల్ తయారు చేసేశక్తి కలదే కాక, అమోనియా, క్రూడ్ టార్ ఎసిడ్, క్రూడ్ మోటారు స్పిరిట్స్, రోడ్‌టార్, క్రిసోటే ఆయిల్ మొదలైన ఇతర బైప్రాడెక్ట్సును కూడా తయారు చేస్తుంది. యీ ప్రాజెక్టుకు దాదాపు రు. 3 కోట్లు ఖర్చు అవుతాయని అంచనా. సింగరేణి బొగ్గును ఉపయోగించే ప్రాదిపదికపై ఇది నెలకొల్పబడుతుంది.

## పబ్లిక్ రంగం

*1. సింగరేణి కాలరీలు :* మూడవ ప్రణాళికలో సింగరేణి కాలరీలు ఉత్పత్తి చేయాల్సిన లక్ష్యాన్ని సాధించడానికి వీలుగా 1962 డిసెంబరు 14 వ తేదీన బెల్లంపల్లి కాలరీలోని రామకృష్ణాపురం ప్రాంతంలో క్రొత్తగా 4 గనులను తెరిచారు. ఒకేసారి నాల్గు క్రొత్త గనుల త్రవ్వకాలను గనుల కంపెనీ ప్రారంభించడం భారతదేశ బొగ్గు గనుల చరిత్రలో యిదే ప్రథమం. ఈ గనులు పూర్తి ఉత్పత్తిని ప్రారంభించినప్పుడు సంవత్సరానికి ఒక మిలియన్ టన్నుల బొగ్గు ఉత్పత్తి జరుగుతుంది. అంతేకాక 6000 మందికి పనులు లభిస్తాయి.

1962 డిసెంబరు మొదటి వారంలో గోదావరిగని నెం 7 లో పని ప్రారంభించారు. ప్రథమంలో రోజుకు 200 టన్నుల ఉత్పత్తి జరుగుతుందని అంచనా. పూర్తిగా అభివృద్ధి చెందితే సంవత్సరానికి 2,50,000 టన్నుల ఉత్పత్తి జరుగుతుంది. 1200 మందికి పని దొరుకుతుంది.

అనుకున్న నాటికంటే 11 రోజులు ముందుగానే ఉత్పత్తి లక్ష్యాన్ని చేరుకున్న డిసెంబరు 20 వ తేదీ, సింగరేణి కాలరీల చరిత్రలో స్వర్ణ అక్షరాలతో వ్రాయతగింది. ఆ రోజున 3 మిలియన్ టన్నుల ఉత్పత్తి లక్ష్యాన్ని చేరుకోవడం జరిగింది.

సింగరేణి కాలరీల గ్రూపులో 1962 నవంబరులో 2,95,101.3 టన్నుల ఉత్పత్తి ఉండగా 1962 డిసెంబరులో 3,01,012.9 టన్నుల ఉత్పత్తి జరిగింది. 1961 డిసెంబరులో 2,80,050.9 టన్నుల ఉత్పత్తి జరిగింది.

1961 డిసెంబరు ఆఖరు వరకు 27,95,400.9 టన్నుల ఉత్పత్తి జరగగా 1962 డిసెంబరు ఆఖరువరకు 31,20,533.1 టన్నుల ఉత్పత్తి జరిగింది.

*2. నిజాం చక్కెర ఫ్యాక్టరీ :*

(i) చెరుకు క్రషింగ్: 1962 డిసెంబరు నెలలో 1,01,941 టన్నుల చెరుకును క్రష్ చేయడం జరిగింది.

(ii) చక్కెర ఉత్పత్తి: 1962 డిసెంబరులో మొత్తం 1,08,540 సంచుల చక్కెర ఉత్పత్తి జరిగింది.

(iii) చెరకుగడ సరఫరా: 1962 డిసెంబరులో ఫ్యాక్టరీ స్వంత క్షేత్రాలనుంచీ రైతుల నుంచీ దిగువ మొత్తంలో చెరుకు గడ అందింది.

| | |
|---|---|
| సెంట్రల్ రైల్వే : | 22,205 |
| యల్.టి. రైల్వే : | 47,326 |
| రోడ్డు మార్గాన : | 33,023 |
| మొత్తం | 1,02,554 టన్నులు |

### బోనసు

1961–62 వ ఆర్థిక సంవత్సరంలో పని వారలకు 4–3/8 నెలల బోనసును మేనేజిమెంటు మంజూరు చేసింది.

### సంక్షేమం

ప్రభుత్వ పథకం క్రింద నిర్మించబడిన టి. ఆర్. టి. క్వార్టర్స్‌కు 1962 డిసెంబరు 7 వ తేదీన ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి ప్రారంభోత్సవం చేశారు.



# గ్రామీణ స్వచ్ఛందదళాలు : వ్యవసాయోత్పత్తి

యం. యం. కె. వాలి

భారతదేశం గ్రామాలలో నివసిస్తుందని చెప్తారు. భారత దేశంలో గ్రామీణ జనాభాయే యెక్కువ అనేదే దీని భావం. మన సంస్కృతికి మూల ప్రాతిపదిక గ్రామమే. నిరాడంబరత, విశాల హృదయత, పటాటోపం లేకపోవడం మన గ్రామాలలో కనిపిస్తాయి. మొగల్ చక్రవర్తుల, నవాబుల దర్బారులలో ఉండే నాగరిక పద్ధతులు, 'కల్చర్' దర్బారుల ప్రాకారాల వరకు, వారి ప్రాపకంలో ఉండేవారి వరకు మాత్రమే పరిమితమైనాయే కాని విస్తరించలేదు. నిజస్థితిని పరిశీలించినా జాతీయ రంగంలో గ్రామానికి గర్వించతగినస్థానం ఉంది. మన ఎగుమతులలో చాలా వరకు వ్యవసాయ పదార్థాలే వున్నాయి. మన జాతీయ ఆదాయంలో సగానికిపైగా వ్యవసాయం నుంచే లభిస్తున్నది. మన సాయుధ దళాలలో ఉన్నది చాలా వరకు గ్రామీణులే. ఈవిధంగా మన ఆయుధ, సైనిక సంపత్తి అంతా గ్రామాలలో నిక్షిప్తమై ఉంది. విదేశీ దురాక్రమణ కారణంగా జాతీయ స్వాతంత్ర్య ప్రశాంతతకు ప్రమాదం ఏర్పడిన యీ తరుణంలో దురాక్రమణను ఎదుర్కొడానికై గ్రామం ప్రధాన పాత్ర వహించాల్సి ఉంది. యుద్ధరంగంలో తుపాకి యెంత ముఖ్యమో వ్యవసాయక్షేత్రంలోని నాగలి కూడా అంతే ప్రాధాన్యం కలిగిఉంది. దేశంలో ఆహార కొరతను తీర్చి, తద్వారా విదేశీమారక ద్రవ్యంపై భారంపడకుండా ఉండడానికే కాక, రైతు ఆదాయాన్నీ, దేశ సంపదనూ పెంపొందించడానికి కూడా వ్యవసాయ పదార్థాలను అధికంగా ఉత్పత్తి చేయాలి.

ఉత్పత్తికృషిదళం ద్వారా గ్రామీణ స్వచ్ఛందదళం గ్రామ ప్రజలకు ప్రధాన శక్తిగా ఉపయోగపడాలి. వ్యవసాయోత్పత్తులను అధికంగా ఉత్పత్తిచేసే ప్రత్యేక బాధ్యత వీరిపై ఉంటుంది. కంపోస్టు, నీటి పారుదల సౌకర్యం, మేలురకం విత్తనాల వాడకం మొదలైన వివిధ సాధనాలద్వారా ఉత్పత్తి లక్ష్యాలను అధిగమించాలని గ్రామ ఉత్పత్తి ప్రణాళికలో నిర్దేశించారు. గ్రామ ప్రణాళికలో నిర్దేశించిన లక్ష్యాలను సాధించడానికి ఉత్పత్తి కృషి దళం తీవ్రంగా కృషి చేయాలి. అయితే వ్యవసాయం సాధారణంగా వ్యక్తిగత కృషిపై ఆధారపడిన విషయమైనప్పుడు ఉత్పత్తి కృషి దళంయే మాత్రం ప్రయోజకారి అవుతుందని అడుగుతూ ఉంటారు. పంచాయితీ దళపతి ఉపదళపతి, కృషిదళం సభ్యులు నిర్వహించే కృషి విధానాలను సరిగా అర్థం చేసుకోవడంపై దీని సమాధానం ఆధారపడి ఉంటుంది.

ఈ దళం సామూహిక, గ్రూపుల కార్యాచరణకు ప్రోత్సహించేదే కాక వ్యక్తిగత కృషికి కూడా బాధ్యత వహిస్తుంది.

## సమాజిక ఆస్తులు

"రక్షణ శ్రామిక బ్యాంకు" లకు అందిన విరాళాలను ప్రణాళికా బద్ధంగానూ, ఫలవంతంగానూ వినియోగించడం కృషి దళం ముఖ్య విధి. ప్రస్తుత ఆత్యయిక పరిస్థితి దృష్ట్యా సామాజిక ఆస్తులు ఉత్పత్తి యోగ్యంగా ఉండాలి. స్థానిక పరిస్థితులు, అవసరాలను దృష్టిలో ఉంచుకొని ఎన్నిక చేసిన కొన్ని కార్యక్రమాలను అమలు జరుపాలి. నీటి పారుదలకు సంబంధించిన చెరువుల త్రవ్వకం, మరమ్మతులు, పశుగ్రాసం, వంటచెరుకు చెట్లను నాటడం, గ్రామం మొత్తానికి చెందిన భూములలో కంపోస్టు గోతులను త్రవ్వడం, భూసార సంరక్షణ, మత్స్యపోషణకు చెరువులను బాగుచేయడం, మొదలైన విషయాలకు ప్రథమస్థానం ఇవ్వాలి. ఇవి ఉత్పత్తికి దోహదం చేసేవేకాక పంచాయితీలకు ఆదాయాన్ని కూడా కలగజేస్తాయి. స్వంత భూములపై కంపోస్టు గోతులు త్రవ్వుకో వీలులేని చిన్న వ్యవసాయదారులకు పంచాయితీ కంపోస్టులు ప్రత్యేకంగా సహాయపడతాయి. యీ పంచాయితీ కంపోస్టు గోతులను చిన్న రైతులకు కౌలుకు ఇవ్వాలి. వారు స్వంతంగానే ఎరువులు తయారు చేసుకుంటారు.

రక్షణ శ్రామిక బ్యాంకులకు శ్రమదానం ప్రతినెలా ఒక నిర్ణీత తేదీన సక్రమంగా

లభ్యం కాకపోవచ్చు. చాలా మంది ప్రజలు సంవత్సరంలో విరాళంగా ఇచ్చే మొత్తం 12 రోజుల శ్రమదానాన్ని తమకు తీరికవున్న సమయాలలో 4,5 లేక అంతకు తక్కువ దఫాలలోనే ఇవ్వవచ్చు. పనులను త్వరిత గతిని పూర్తిచేయడానికి వీలుగా ఇటువంటి శ్రమదానాన్ని సద్వినియోగం చేసుకోవచ్చు. యిటువంటి సందర్భాలలోనైనా యీ శ్రమను సక్రమపద్ధతిలో వినియోగించాలి. పనిలోని ముఖ్యభాగం శ్రమదానం ద్వారా పూర్తి అయినా తర్వాత అనవరతం వాటిని సంరక్షించాల్సిన పనులు కొన్ని ఉండవచ్చు. వంట చెరకు చెట్లను నాటడాన్ని యీ విషయంలో ఉదాహరణగా తీసుకోవచ్చు. యీ చెట్లను నాటడానికై గోతులను తీసి నాటడం వాటి చుట్టూ రాతితో కానీ, ముళ్ళ కంపతో కానీ కంచెవేయడంతో సరిపోదు. వాటికి సక్రమంగా నీరుపోయడం, వాటిని సంరక్షించడం వంటి పనులను యెల్లప్పుడూ చేస్తూ ఉండాలి. ఇటువంటి సందర్భాలలో యీ సంరక్షణాభారాన్ని యువజన క్లబ్బులకు (యీ ప్రాజెక్టుపై ఆధారపడే మహిళా మండలికిగానీ) ఒప్ప చెప్పాలి. శ్రామిక బ్యాంకు లెక్కలను సులభంగా ఉంచాలి.

నిర్వహించాల్సిన పనుల సంఖ్యనుబట్టి కృషి దళాన్ని గ్రూపులుగా విభజించాలి. ప్రతి గ్రూపుకూ వారిలో నుంచే ఎన్నుకున్న ఒక గ్రూపు నాయకుడు ఉండాలి. ఆయా పనులకై నిర్దేశించబడిన వ్యక్తుల శ్రమను పూర్తిగా ఉపయోగబడేట్టు యీ గ్రూపు నాయకులు ప్రయత్నించాలి. అయితే గ్రూపు నాయకులుకానీ, కృషిదళంలోని ఇతర సభ్యులుకానీ కేవలం పర్యవేక్షకులుగా ఉంటారని భావించరాదు. వారు కూడా స్వంత శ్రమద్వారా పని నిర్వహణలో పాల్గొంటారు.

## వ్యక్తిగత ప్రాజెక్టులు

సామాజిక లాభానికి నిర్దేశించి పనులన్నింటినీ చేపట్టిన తర్వాతకూడా రక్షణ శ్రామిక బ్యాంకులో శ్రమదానం చేసే వ్యక్తులు మిగిలి ఉంటే వ్యక్తిగత లాభం కలిగించే పనులకు వీరిని వినియోగించాలి. అయితే ఇటువంటి సందర్భాలలో స్వంత కృషి (కుటుంబంతో సహా) ద్వారా కూడా సంతృప్తికరంగా పనిని నిర్వహించుకోలేని వారికీ, కూలీల ద్వారా చేయించుకోలేని నిరుపేదలకు మాత్రమే యీ శ్రమను వినియోగించాలి.

కృషి దళంలోని ప్రతి సభ్యునికి నిర్ణీత సంఖ్యలలో రైతులను కేటాయించడం మంచిది. యీ సంఖ్య 10 రైతు కుటుంబాలకు మించి ఉండరాదు. వారికి నిర్ణయించిన లక్ష్యం మేరకు ఉత్పత్తిని అధికం చేయడానికి తనకు నిర్ణయించబడిన రైతులు కృషిచేసే విధంగా ప్రతి సభ్యుడు బాధ్యత వహించాలి. ఉదాహరణకు, రైతులు కంపోస్టు ఎరువుల గోతులు త్రవ్వుకునేట్టు చూడాలి. నీటిపారుదల సౌకర్యం ఉండి కూడా కాలువలు త్రవ్వకోకుండా ఉపయోగించుకోని రైతులను కాలువలు నిర్మించుకునేట్టు చూడాలి.

వరి, గోధుమ, చెరకు వగైరాలకు పచ్చి ఎరువు వాడేట్టు చూడాలి. లభ్యమయినంత వరకు రసాయనిక ఎరువులు, మేలురకం విత్తనాలను వాడేట్టు ప్రోత్సహించాలి. ఇదే విధంగా కృషి దళంలోని ప్రతి సభ్యుడు నిర్ణీత సంఖ్యలో సహకార సంఘంలో సభ్యులను చేర్చే విధంగా లక్ష్యం నిర్ణయించాలి. ఈ విధంగా కృషిదళంలో సభ్యులు కృషి చేయాలి. కంపోస్టు గోతుల త్రవ్వకం, పచ్చి ఎరువుల తయారీ, పంటకాలువల మరమ్మతు, నిర్మాణంవంటి కొన్ని పనులను సామూహిక కృషిద్వారా, ఉద్యమం ద్వారా నిర్వహించాలి. ఇటువంటి ఉద్యమాలను నిర్వహించేందుకు కృషిదళం సభ్యులు తగిన వాతావరణాన్ని సృష్టించాలి. పంచాయితీలు యీ ఉద్యమ నిర్వహణకు తగిన సమయాన్ని నిర్ణయించిన తర్వాత వారు తమకు కేటాయించబడిన రైతులు ఆ ఉద్యమంలో పాల్గొనేటట్టు కృషిదళం సభ్యులు ప్రోత్సహించాలి.

ఈ పనులన్నిటినీ నిర్వహించడానికి కృషి దళం సభ్యులు నిర్విరామంగా కృషిచేయాల్సి ఉంటుంది. అంతేకాక దళం సభ్యులు స్వయంగా ఆధునిక వ్యవసాయ పద్ధతులను అనుసరించాలి. తోటి రైతులకు అవసరమైన సాంకేతిక సహాయ సలహాలను గ్రామ సేవకుని వద్దనుంచి కానీ ఆయా విస్తరణాధికారులనుంచి గానీ లభించేందుకు కూడా యీ దళం సభ్యులు రైతులకు సహాయపడాలి. గ్రామ పంచాయితీలు గ్రామ వ్యవసాయ ఉత్పత్తుల ప్రణాళికలను సవివరంగా తయారు చేయడం, ఆచరణ యోగ్యం చేయడం, యీ విషయాలలో యీ దళానికి సహాయ సహకారాలను ఇవ్వడం పైననే కృషిదళం సభ్యులు చేసే పై పనులు ఆధారపడి ఉంటాయి. మొదడు ఆదేశించిందాని కంటే మించి ఉత్తమంగా చేతులు పనిచేయలేవు. గ్రామ వ్యవసాయ ఉత్పత్తి ప్రణాళికను నిర్దిష్టంగానూ సక్రమంగానూ రూపొందించడానికై కృషిదళంలోకి నామినేటు చేసుకోబడిన గ్రామ సహాయకులనే పంచాయితీ వ్యవసాయ ఉత్పత్తి సంఘంలో కూడా సభ్యులుగా నామినేటు చేయవచ్చు. వీరి సహాయంతో ప్రణాళికను తయారు చేసుకోవాలి.





# ప్రగతిపథంలో

(జిల్లాలనుంచి అందిన అభివృద్ధి కార్యక్రమాలను గురించిన సంక్షిప్త వార్తలు)

## అనంతపురం జిల్లా

*గ్రామీణ స్వచ్ఛంద దళానికి ప్రారంభోత్సవం :*

గోరంట్ల పంచాయితీ సమితిలో రిపబ్లిక్ దినోత్సవంనాడు గ్రామీణ స్వచ్ఛంద దళాలు, రక్షణ శ్రామిక బ్యాంకులకు ప్రారంభోత్సవం జరిగింది. గోరంట్లలో 186 మంది సభ్యులు యీ దళంలో చేరారు.

## ఆదిలాబాదు జిల్లా

*ప్రదర్శన :*

1963 జనవరి 26 వ తేదీనుంచి రెండు రోజుల పాటు జరిగిన కెస్లాపూర్ గిరిజన జాతర సందర్భంగా ఒక ప్రదర్శనను ఏర్పాటు చేశారు. వ్యవసాయం, నీటి పారుదల ప్రాజెక్టులు, మత్స్య పరిశ్రమ మొదలైన రంగాలలో సాధించిన అభివృద్ధికి సంబంధించిన విషయాలను ఇందులో ప్రదర్శించారు.

## కరీంనగరం జిల్లా

*జాతీయ రక్షణనిధి సేకరణ :*

ధర్మపురికి చెందిన బాల సంఘం సభ్యులు జనవరి నెలలో జాతీయ రక్షణనిధి సహాయార్థమై ఒక నాటకాన్ని ప్రదర్శించారు. ఈ సందర్భంగా వసూలయిన రు. 50/- లను నిధికి సమర్పించారు.

*యన్. జి. ఓ. ల ఆదర్శం :*

జగిత్యాల యన్. జి. ఓ. ల సంఘం సభ్యులు జవాహర్ టాకీసులో ఒక టీ స్టాల్‌ను నిర్వహించి తద్వారా వచ్చిన రు. 125/- ల ఆదాయాన్ని జాతీయ రక్షణనిధికి ఇచ్చారు. వీరి ఉత్సాహాన్ని చూచి ముగ్ధులైన ఆ టాకీసు యజమాని శ్రీ సంతపూర్‌రావు, ఒక రోజు ఆదాయం మొత్తం రు. 250/- లను రక్షణ నిధికి విరాళంగా ఇచ్చారు.

## కడప జిల్లా

*శత జయంతి ఉత్సవాలు :*

నాగరాజు పేట మునిసిపల్ ఎలిమెంటరీ ఉపాధ్యాయుల సంఘం సభ్యులు శ్రీ స్వామి వివేకానంద స్వామి శత జయంతి ఉత్సవాలను జరిపారు. యీ సందర్భంగా సాంస్కృతిక కార్యక్రమాలను ఏర్పాటుచేశారు.

*రక్షణనిధి సేకరణ :*

జిల్లాలో జనవరి 19 వ తేదీ నుంచి మూడు రోజుల పాటు పర్యటన జరిపిన ప్రణాళిక, పంచాయతీ రాజ్య శాఖల మంత్రికి 500 గ్రాముల బంగారం, 2 లక్షలు నిధికి సమర్పించడం జరిగింది.

## కృష్ణా జిల్లా

*ఉత్తమ గ్రామం :*

జనవరి 18 వ తేదీన చిలకలపూడిలో జరిగిన కృష్ణా జిల్లా పరిషత్తు సర్వ సభ్య సమావేశంలో మోటూరు పంచాయతీ సమితి అధ్యక్షులు శ్రీ జి. కష్ణమూర్తికి రు. 250/- ల రొక్కం బహుమతిని ఇవ్వడం జరిగింది. జిల్లాలో మోటూరు గ్రామాన్ని ఉత్తమ గ్రామంగా ఎన్నుకున్నారు.

*గ్రామ సేవకునికి బహుమతి :*

తిరువూరు గ్రామ సేవకుడు శ్రీ బ్రహ్మేశ్వరరావును ఉత్తమ గ్రామ సేవకునిగా నిర్ణయించి రు. 100/- బహుమతి అవార్డు చేశారు.

## ఖమ్మం జిల్లా

*సమాచార కేంద్రంలో :*

1962 జనవరి 12 వ తేదీన ఖమ్మంలోని జిల్లా సమాచార కేంద్రంలో వివేకానంద శతజయంతి ఉత్సవాలను జరిపారు. గాయత్రీమఠం అధిపతి శ్రీ విద్యానంద భారతీ శంకరస్వామి యీ ఉత్సవాలకు అధ్యక్షత వహించారు.

**ఖమ్మంలో** జనవరి 15 వ తేదీన రాష్ట్ర ఆరోగ్యశాఖా మంత్రి నేత్ర చికిత్సా శిబిరానికి ప్రారంభోత్సవం చేశారు.

తూర్పు గోదావరి జిల్లా

తాళ్ళరేవు పంచాయితీ సమితిలో తను మళ్ళ గ్రామానికి చెందిన శ్రీ యం. సుబ్బరాజు, గ్రామంలో ఎలిమెంటరీ పాఠశాల భవన నిర్మాణానికై రు॥ 4000/–లను విరాళంగా ఇచ్చారు. యీ భవననిర్మాణానికి రు॥ 8,500/– లు ఖర్చు అవుతాయని అంచనా.

*రచయితల సమావేశం :*

జనవరి 4,6 తేదీలలో రాజమండ్రిలో ద్వితీయ అఖిలభారత రచయితల సమావేశాలు జరిగాయి. భారతదేశం మొత్తం నుండి 200 మంది ప్రతినిధులు యీ సమావేశాలలో పాల్గొన్నారు.

గుంటూరు జిల్లా

*ముఖ్యమంత్రికి నిధి సమర్పణ :*

పిడుగురాళ్ళ పంచాయతీ సమితి రక్షణ సంఘం, జాతీయ రక్షణనిధికై రు. 11,562.61 లను సేకరించి, జనవరి నెలలో నర్సారావుపేట సదర్శించిన ముఖ్యమంత్రికి సమర్పించింది.

*యఫ్. ఏ. ఒ. నిపుణుని రాక :–*

యఫ్. ఎ. ఒ. కు చెందిన ఉద్యానవన నిపుణుడు శ్రీ ఇ. డబ్ల్యు. యం. వర్స్లే, జనవరి 7 వ తేదీన ఈమని పంచాయతీ సమితిలోని పెదపాలెం, పెద కొండూరు, మున్నంగి, వల్లభాపురం గ్రామాలను సందర్శించారు. బలవర్ధక ఆహారవిస్తరణ కార్యక్రమంక్రింద పాఠశాలలో వేసిన గార్డెన్‌లను ఆయన పరిశీలించారు.

చిత్తూరు జిల్లా

*దళపతులకు శిక్షణ :*

సత్యవీడులో రిపబ్లిక్ దినోత్సవంనాడు గ్రామీణ స్వచ్ఛంద దళం, రక్షణ శ్రామిక బ్యాంకు పథకానికి ప్రారంభోత్సవం చేశారు. స్థానికపోలీసు సబ్ ఇన్స్పెక్టరు 40 మంది దళపతులకు శిక్షణ ఇచ్చారు.

నల్లగొండ జిల్లా

*శిక్షణ శిబిరం :*

ఆలేరులో గ్రామీణ స్వచ్ఛంద సేవా దళం, రక్షణ శ్రామిక బ్యాంకుకు ప్రారంభోత్సవం జరిగింది. ఆత్యయిక సంఘం అధ్యక్షులు యీ ప్రారంభోత్సవానికి అధ్యక్షత వహించారు. వివిధ గ్రామ పంచాయితీల నుంచి వచ్చిన 30 మంది దళపతులకు సూర్యాపేటలో 6 రోజులపాటు సామూహిక శిక్షణ ఇవ్వడం జరిగింది. సూర్యాపేట సమితిలో 34 రక్షణ శ్రామిక బ్యాంకులను ఏర్పాటు చేస్తారు.

*ముఖ్యమంత్రికి నిధి సమర్పణ :*

జనవరి 22 వ తేదీన భోనగిరి సందర్శించిన ముఖ్యమంత్రికి బహిరంగ సభలో రు॥ 1.27 లక్షలు నిధికి విరాళంగా సమర్పించారు.

*గ్రామీణుల ఔదార్యం :*

కోదాడు గ్రామస్థులు, 6 పడకలుగల ప్రాథమిక ఆరోగ్య కేంద్రాన్ని నెలకొల్పడానికై 2 ఎకరాల భూమినీ, రు॥ 6000/– లను విరాళంగా ఇచ్చారు. కోదాడులో ఆరోగ్యకేంద్రం నిర్మాణానికై రు॥ 4000/- విలువచేసే సామాగ్రిని విరాళంగా ఇవ్వాలని కూడా ప్రతిపాదించారు.

నెల్లూరు జిల్లా

*శిక్షణ శిబిరం :*

కొండపి పంచాయితీ సమితిలోని కందుకూరులో జనవరి 26 వ తేదీన గ్రామీణ స్వచ్ఛంద సేవాదళం, రక్షణ శ్రామిక బ్యాంకు పథకానికి రెవిన్యూ డివిజనల్ ఆఫీసర్ ప్రారంభోత్సవం చేశారు. జనవరి 19 వ తేదీనుంచి 24 వరకు 6 రోజులపాటు 23 మంది దళపతులకు శిక్షణ ఇవ్వడం జరిగింది.

పశ్చిమగోదావరి జిల్లా

*కూరగాయల అధికోత్పత్తి :*

పెదపాడు పంచాయితీ సమితి రక్షణ సంఘం గ్రామ చెరువుకట్టపై ఫల వృక్షలనూ, కూరగాయల మొక్కలనూ నాటడం ద్వారా రిపబ్లిక్ దినోత్సవాన్ని జరిపింది.

*ప్రధానమంత్రి సందేశం :*

రక్షణ శ్రామిక బ్యాంకు సభ్యులు కొబ్బరి మొక్కలను నాటారు. పెదపాడు ఆత్యయిక కమిటీ ఆనాడు ప్రధానమంత్రి సందేశాన్ని గురించి చర్చించారు.

*4 హెచ్ క్లబ్ ప్రతినిధి :*

యు. యస్. కు చెందిన 4 హెచ్ క్లబ్ ప్రతినిధి శ్రీ కె. జి. ఆడికిన్స్, జనవరి 11 వ తేదీన పెంటపాడు బ్లాకులోని నందమూరు గ్రామానికి వచ్చారు. భారత దేశంలోని గ్రామాల పరిస్థితులను పరిశీలించడానికై ఆయన వచ్చారు. ఇక్కడ ఆయన 11 రోజుల పాటు ఉంటారు. జనవరి 13 వ తేదీన పశ్చిమవేపగ్రులో కమ్యూనిటీ కేంద్రం భవనానికి ఆయన ప్రారంభోత్సవం చేశారు. యువకర్షక క్లబ్ సభ్యులు శ్రమదానం ద్వారా యీ భవనాన్ని నిర్మించారు.

మహబూబునగర్ జిల్లా

*సహాయక ప్రదర్శనం :*

పాలెంలోని శ్రీ వేంకటేశ్వర సైన్సు కళాశాల సహాయార్థం, జనవరి 13 వ తేదీన మహబూబునగరంలో ఒక నాట్య ప్రదర్శ

# సంప్రతింపులు - చైనా అనుసరించే పద్ధతులు

టిబెట్ స్వాతంత్ర్యాన్ని కోల్పోవడానికి దారి తీసిన చైనా - టిబెటన్ సంభాషణల వాస్తవిక గాథను మరుగు పరిచిన ముసుగును దలైలామా తమ జీవిత చరిత్రలో తొలగించారు. టిబెటన్ అధికారులకు పెకింగ్‌లో చిరునగవుతో స్వాగత మిచ్చి తర్వాత ఒప్పందంపై సంతకం పెట్టమని బలవంతం పెట్టిన తీరును ఆయన అందులో వివరించారు. ఆ ఒడంబడిక పత్రంపై టిబెటన్ ప్రభుత్వం యొక్క దొంగముద్ర పెకింగులో వేయడం జరిగింది.

1951 మొదట్లో టిబెట్ చైనాయొక్క భారీ ఎత్తు దురాక్రమణకు గురైనప్పుడు చైనాతో శాంతి సంధిని గురించి సంభాషణలు జరపడానికి టిబెట్ అధికారుల బృందాన్ని చైనాకు పంపింది. చైనా ప్రధానమంత్రి చౌఎన్‌లై వారికి గౌరవ మర్యాదలతో స్వాగతం యిచ్చి ఒక విందు ఏర్పాటుచేసి చైనా ఉద్యోగులకు వారిని పరిచయం చేశారు. తర్వాత సంప్రతింపులు ప్రారంభ మైనాయి.

## ముందే సిద్ధంచేసిన ఒప్పందం

తొలి సమావేశంలోనే అంతకుముందే సిద్ధంచేసిన ఒక ఒప్పందాన్ని చైనా ప్రతినిధులు టిబెటన్ ప్రతినిధుల ముందు పెట్టి దానిమీద సంతకాలు చేయాలన్నారు. టిబెట్ చైనాలో భాగం అన్న ప్రాతిపదికపై ఆ ఒప్పందం తయారుచేయబడింది. టిబెట్ స్వతంత్రదేశమని, టిబెటన్లు చేసిన వాదం, దాని తాలూకు సాక్ష్యాధారాలు మూలకునెట్టి వేశారు. టిబెటన్ ప్రతినిధులు తమవాదం గురించి పట్టుబట్టగా చైనా ప్రతినిధులు సవరణ చేసిన మరొక ఒప్పందం ప్రతిని సమావేశంలోకి తీసుకు వచ్చారు. అందులో మార్పులు చేయడానికి వీలులేదని సంతకాలు పెడితే పెట్టమనీ లేకపోతే ఫలితం అనుభవించమనీ చైనా ప్రతినిధులు బెదిరించారు.

టిబెట్ ప్రతినిధులు అక్కడికే తటపటాయించారు. చైనా ప్రతినిధులు వారిని నానా దుర్భాషలాడి, దౌర్జన్యానికి దిగబోయారు. టిబెట్ ప్రాంతంలో తిష్టవేస్తున్న చైనా సైన్యంయొక్క శక్తిని గుర్తించమని వారిని హెచ్చరించారు. సంతకాలు పెట్టడానికి ముందు లాసాలోని తమ ప్రభుత్వంతో సంప్రతించాలని టిబెటన్ ప్రతినిధులన్నారు. అలా వీల్లేదన్నారు అవతలివారు. గత్యంతరం లేక సంతకాలు పెట్టారు.

దానిమీద టిబెట్ ప్రభుత్వ ముద్రవేస్తే గాని ఆ ఒప్పందం చెల్లదు. దొంగముద్రను సృష్టించి చైనావారు ఆ ఒప్పందం ప్రతిపై వేశారు. తర్వాత టిబెట్ ప్రతినిధి వర్గ నాయకునిచేత ఒప్పందం పూర్తయినట్లు పెకింగు రేడియోలో ప్రసంగం యిప్పించారు.

---

నాన్ని ఏర్పాటు చేశారు. జిల్లా పరిషత్తు అధ్యక్షులు యీ ప్రదర్శనకు అధ్యక్షత వహించారు.

### మెదక్ జిల్లా

*జాతీయ రక్షణనిధికి బంగారం :*

జనవరి 3 వ వారంలో గజ్వేలు సందర్శించిన రెవిన్యూ మంత్రికి, సమితి అధ్యక్షులు 450 గ్రాముల బంగారం, రు. 40,016/- లను సమర్పించారు.

### వరంగల్లు జిల్లా

*జాతీయ రక్షణనిధికి విరాళాలు :*

రెవిన్యూ మంత్రి, జనవరి 11 వ తేదీన పర్కాలబ్లాకులోని నారేడిపల్లి గ్రామానికి వచ్చిన సందర్భంగా అక్కడి కక్కడ ఆయనకు రు.3000/-ల రొక్కాన్ని రు.23000/-ల బ్యాంక్ డ్రాఫ్టులను సమర్పించారు.

*శిక్షణ :*

బ్లాకులో 43 మంది దళపతులను ఎన్నిక చేసి 5 రోజుల పాటు శిక్షణ ఇచ్చారు.

*సమితి ప్రారంభం :*

రెవిన్యూ మంత్రి, జనవరి 24 వ తేదీన నరిమెట్టలో నరిమెట్టబ్లాకు పంచాయితీ సమితికి ప్రారంభోత్సవం చేశారు.

### విశాఖపట్నం జిల్లా

*కమ్యూనిటీ అవార్డు :*

విశాఖపట్నం జిల్లాకు, 1959 వ సం॥ ఖరీఫ్ ఉద్యమంక్రింద రు 10,000/- లు 1959-60 వ సం॥ రాబీ ఉద్యమం క్రింద 10,000 లు మొత్తం రు 20,000/- ల కమ్యూనిటీ అవార్డు లభించింది.

ఫిబ్రవరి 2 వ తేదీన హైద్రాబాదులోని అఖిల భారత ప్రదర్శన మైదానంలో జరిగిన బహిరంగ ఉత్సవంలో యీ జిల్లా తరఫున జిల్లా పరిషత్తు అధ్యక్షులు యీ అవార్డును స్వీకరించారు.

### శ్రీకాకుళం జిల్లా

*కలెక్టరు కృషి :-*

శ్రీకాకుళం జిల్లా కలెక్టరు, జనవరి 17 వ తేదీ నుంచి 24 వ తేదీ వరకు జరిపిన తీవ్రతర కృషి ఫలితంగా జాతీయ రక్షణ నిధికై రు 14.5 లక్షలను సేకరించడం జరిగింది. ఫిబ్రవరి 2 వ తేదీతో అంతమైన వారంలో యీ జిల్లాకు కేటాయించిన రు. 20 లక్షలను మించి నిధిని సేకరించారు.

### హైద్రాబాదు జిల్లా

*నమోనా సమావేశం :*

హైద్రాబాదు జిల్లా రక్షణ కమిటీ, ప్రచార ఉపసంఘం ఆధ్వర్యాన జనవరి 12 వ తేదీన గండిపేటలో నమోనా బహిరంగ సమావేశాన్ని ఏర్పాటుచేశారు. బ్లాకు రక్షణ కమిటీ సభ్యులకు యిందులో శిక్షణ ఇచ్చారు. కలెక్టరు యీ సమావేశానికి అధ్యక్షత వహించారు.



# పంచాయతీరాజ్య పురోగమనం

## లిఫ్ట్ ఇరిగేషన్ పథకం

గుంటూరుజిల్లా ఈమని పంచాయితీ సమితిలోని కొలకలూరులో జనవరి 21 వ తేదీన కొలకలూరు సహకార లిఫ్ట్ ఇరిగేషన్ పథకానికి ప్రారంభోత్సవం జరిగింది. యీ సంఘంలో 60 మంది సభ్యులు ఉన్నారు. దీని పెట్టుబడి ధనం రు॥ 1,930/– లు. దీనివల్ల 700 ఎకరాల మెట్టభూమికి నీటి పారుదల సౌకర్యం కలుగుతుంది.

ఈ పథకం అమలుకు మొత్తం రు. 75000/–లు ఖర్చు అవుతుందని అంచనా. ఎకరాకు రు॥ 70/–ల చొప్పున రైతులు ఇవ్వాల్సి ఉంటుంది. కొమ్మనూరు ప్రధాన కాలువ కుడివైపు 15/4 మైలువద్ద పంపులు నెలకొల్పుతారు. భూమి పల్లపు ప్రాంతాలకు నీటి సరఫరా జరిగే విధంగా సిమెంటు కాలువలను నిర్మించడం జరుగుతుంది. యీ పథకం అమలు పూర్తి అయ్యాక 10,000 బస్తాలకు పైగా ఆహార ధాన్యాల ఉత్పత్తి జరుగుతుందని భావించబడుతున్నది.

## 4 హెచ్ క్లబ్బు సభ్యురాలరాక

యు. యస్. నుంచి వచ్చిన 4 హెచ్ క్లబ్ సభ్యురాలు కుమారి రుబే అన్నా హారిసన్, జనవరి 27 వ తేదీన ఈమని పంచాయితీ సమితిలో కూరగాయల ఉత్పత్తి వారోత్సవానికి ప్రారంభోత్సవం చేశారు. ఆమె బ్లాకులో 15 రోజులపాటు ఉన్నారు. అంతర్జాతీయ రైతు యువకుల మార్పిడి పథకం క్రింద ఆమె భారతదేశం వచ్చింది.

## మేలురకం వరి సేద్యం

జనవరి నెలలో మహబూబు నగరం జిల్లాలోని అచ్చంపేట పంచాయితీ సమితిలో 6 మణుగుల మేలురకం వరి విత్తనాలు, 232 పౌండ్ల రసాయనిక ఎరువులు, 2 ఆధునిక వ్యవసాయ పరికరాలను పంపిణీ చేయడం జరిగింది. 137 ఎకరాలలో జపాను పద్ధతి వరి సేద్యం చేశారు.

## కమ్యూనిటీ వినోద కార్యక్రమాలు

తూర్పుగోదావరి జిల్లాలోని ప్రత్తిపాడు పంచాయితీ సమితిలో జనవరి నెలలో 4811 టన్నుల గ్రామీణ కంపోస్టు ఎరువులను తయారుచేశారు. 226 పౌండ్ల రసాయనిక మందులను పంపిణీచేశారు. 11 ఆధునిక వ్యవసాయ పరికరాలనూ, 22½ టన్నుల రసాయనిక ఎరువులను పంపిణీ చేయడం జరిగింది. 39 ఎకరాల భూమిని సాగుకు యోగ్యంచేశారు. 246 సేద్య ప్రదర్శనలను ఏర్పాటుచేశారు.

సాంఘిక విద్యారంగంలో యీ నెలలో 18 కమ్యూనిటీ వినోద కార్యక్రమాలను ఏర్పాటు చేశారు.

## మహిళా మండలులు

జనవరి నెలలో తూర్పు గోదావరి జిల్లాలోని పెద్దాపురం పంచాయితీ సమితిలో 5611 పౌండ్ల మేలు రకం వరి, చెరకు, వేరుసెనగ విత్తనాలనూ, 5309 పౌండ్ల రసాయనిక ఎరువులను పంపిణీ చేశారు. 97 కంపోస్టు గోతులను త్రవ్వారు. ఈ నెలలో 2281 టన్నుల కంపోస్టు ఎరువులను తయారు చేశారు. 40 మంది సభ్యులతో 4 మహిళా మండలులను నెలకొల్పారు.

## క్రొత్త సహకార సంఘం

అనంతపురం జిల్లా, తనకల పంచాయితీ సమితిలోని మలమీద పల్లిలో ఒక సహకార సంఘాన్ని ప్రారంభించారు.

రిపబ్లిక్ దినోత్సవం నాడు అన్ని పంచాయితీలలోను గ్రామీణ స్వచ్ఛంద సేవా దళం, రక్షణ శ్రామిక బ్యాంకు పథకాన్ని ప్రారంభించారు. దళపతులకు 5 రోజులపాటు శిక్షణ ఇచ్చారు.

## నూలుతీయు కేంద్రం

అనంతపురం జిల్లా, ముదిగుబ్బ బ్లాకులో సుగాలీలకై జనవరి 3 వ తేదీన జనపనార నూలుతీయు కేంద్రాన్ని ప్రారంభించారు. ప్రస్తుతం 12 మంది సుగాలీలు ఇందులో శిక్షణ పొందుతున్నారు. శిక్షితులకు నెలకు రు. 20/–ల చొప్పున స్టయిఫండు ఇస్తారు. 50 శాతం సబ్సిడి రేటుపై వీరికి ఆధునిక చేతి పనిముట్లు సరఫరా చేయబడుతాయి. అనంతపురం జిల్లా రాష్ట్రప్రభుత్వం ఆధ్వర్యంలో నెలకొల్పబడిన ప్రథమ కేంద్రం ఇది.

## విద్యుచ్ఛక్తి సరఫరా

మెదకు జిల్లా సిద్ధిపేట పంచాయితీ సమితి బ్లాకులోని బూరుగుపల్లి గ్రామానికి జనవరి 27వ తేదీన విద్యుచ్ఛక్తి సరఫరా చేశారు.★



# ఏరిన ముత్యాలు

*(ప్రాచీన కవుల కావ్యాలనుంచి రసవద్ఘట్టాలను ఆంధ్రప్రదేశ్ పాఠకులకు అందించాలన్న దృష్టితో యీ కొత్త శీర్షికను ప్రారంభిస్తున్నాము. కవిరాజ శిరోమణి నన్నెచోడదేవుని కుమార సంభవంలో దుష్పరిపాలనాదక్షుడు దురాక్రమణాపరుడు లోకకంటకుడు అయిన తారకాసురుని వద్దకు దేవతలు "సుమతి" అనే సద్విప్రోత్తముణ్ని దూతగా పంపగా అక్కడ దూతకు తారకాసురునికి సంభాషణ జరిగిన ఘట్టంలోని యీ క్రింది పద్యాలు.)*

ఏ సమరదూత హరి సే
నానులు సురపతియు దనుజనాయకుతో సం
ధానమునకుఁ బుత్తెంచిన
దానికిఁ జనుదెంచితిం బ్రధానుఁడ నెందున్.

అనిన విని హరిసురేశ్వరులతోడం గూడి నీ యెన్నుచున్న సేనాని యనువాఁ డెవ్వఁడు మిమ్మెవ్విధంబునం గూడె ననిన నుమామహేశ్వరుల వీర్యంబున నగ్ని గంగాకృత్తికాశరవణంబుల యందు షడాననద్వాదశ భుజంబులతో నుదయించెం గుమారుం డక్కుమారకు నమరవర ప్రార్థితుండై.

ఆ పరమేశ్వరుండు దివిజావలికిం
గరుణించి పంచె సే
నాపతిఁ గాఁగఁ బూన్చి నిజ
నందను నాతనితోడఁ గూడ ల
క్ష్మీపతిఁ బంచె వా రనుపమేయ
పరాక్రమ శక్తియుక్తులై
మా పగఁ దీర్పఁ బూని రహి
మండను పంపునఁ దద్ద పెంపునన్.

అన విని కాప్యుఁడు దన మన
మునఁ గడు భయమంది కలహమునకీశ్వర నం
దనుచేత నిలుగుఁ దారకుఁ
డను నాదేశంబు నిక్క మగునొకొ యనుచున్.

అని చింతించుచుండె నంత హరి సేనాసహితులై సురవరులుద్దవడి నెత్తుదెంచుటయు నెఱింగించుచున్న దేవదూతం గని తారకుండు కోపోద్దీపితాంతరంగుండై.

పని యేమేనియుఁ గల్గెనేని
సుమనఃపాలుండు దా వచ్చి యొ
య్యన నా ముందట నిల్చి విన్నపము
సేయంబోయి కంపించు ని
న్న నిలింపాధిపుఁ డింత వేళక
సమానస్కంధుఁడుం బోలె నై
తన కార్యస్థితి సెప్పి నా కడకు
దూతం బూన్చి పుత్తెంచెనే

అని కోపరసాపూరితాంతస్స్మెర వదనారవిందుం డగుచును

ఏమేమీ మది నోటికండ సెడి
దేవేంద్రాదు లుద్వృత్తులై
నా మీఁదం జనుదెంచిరే నిఁక మెయి
న్నాకీశ బృందారక
స్తోమం బెన్నఁడు దొల్లి మార్బలసి
రెచ్చోఁ దొల్లి పోటొగ్గి సం,
గ్రామోద్యోగము సేసిరిప్పు డెదురంగాఁ
గారణం బేమియో.

దురమున నోడి దానవులతోడి
విరోధము వీడి భక్తితో
సురపతి వచ్చి నా శరణు సొచ్చి
తగం బెఱ లిచ్చియున్న నేఁ
గరుణయ పుట్టి తమ్ముఁ బొడఁగట్టి
శమించిన యట్టి నాకుఁ దా
నిరవుగఁ బూని మార్కొనియెనేని
సహింతునె వాని నెల్లెడన్.

అనిన విని దేవతాదూత దారకాసురుం గనుంగొని.

త్రిదశేంద్రాదులు గ్రుక్క కాజి
కెదురేతే నెంత నీ కోడరే
యది లే దంటిమె తొంటి వేల్పు
లని నీ కాదర్పముల్ వల్కఁ బ
ట్టదు సు మ్మింకఁ బురారి
నందనుఁడు షడ్వక్త్రుిండు దోతెంచి బ,
ల్లిదుఁడై నిన్నని నోర్చి
దేవతల నేలించున్ ద్రిలోకంబులున్.

భక్తి గీర్వడి సేనాని పనుపుసేసి
తడవు లేదేనిఁ గలిగిరే నడువు మొండె
నెఱవు సేయక దివిజుల చెఱలు లేక
విడువు మొండేని మన్నాన విడువు మొండె.

అనిన విని తారకాసురుండు కోపించి.

చెఱలు విడు మనిన పలు కెడఁ
గోఱవిం గొని చూఁడినట్లు గొని కాలంగ బి
ట్టఱఁ గోపవహ్నిఁ జూచెం
జుఱజుఱ మదకరికి సిల్లు చూపినభంగిన్.

నన్నుఱ కేపునం జెఱల నా కిప
కాంతలఁ దేరఁబంచె నే
పన్న గయక్ష సిద్ధ సురపాలకు
లాదిగ వేల్పులెల్ల నే
నన్న భయంబుఁ బొంది కలహంబున
కెక్కరు నిన్నఁ బుట్టి తా
నెన్నడు బ్రాఁతి యయ్యె మఱి
యెన్నడు నేర్చెను వెక్కిరింపఁగాన్.

చెనసి కలహభీతి చేతులతీఁట వోఁ
బొడువఁ జాలునేని మృడుఁడ గాక
నిరత మిగురు గుట్టి నెత్తురు ద్రాగిన
భంగి గాక నాకు బాలుఁ డెదురె.

బహుముఖ మఱె తన రాజ్యము
బహుదోషాధ్యుఁ డఱె తాను బాలుం డఱె వాఁ
డు హరుండైనను నీతి వి
రహితం బది యిట్టి పతికి రణజయ మగునే.

విడు మని వేఁడ నావలని వేల్పులు
ముందఱ వీరిఁ దెచ్చి యి
ల్లడ యిడి వోయిరే భుజబలంబున
నెమ్మొయి నాచికొంటి నే
నడరఁగఁ దారు నమ్మొయి రయంబునఁ
గ్రమ్మరఁ గొంట యొప్పుఁగా,
కడుగుట యొప్పునే యడిగినంతన
యిచ్చుట నాకు నొప్పునె.

బాలకుఁ బట్టియే సురలు బల్విడి
నాపయి నెత్తిరింత యే
నేలిద మైతినే తమకు నెన్నఁడు
మద్భుజవిక్రమక్రమా
భీలకరాళఖడ్గవరభీషణ
వేషము చూచి నేలపైఁ
గాలిడి నిల్తురే యనికిఁ
గ్రమ్మఱ వత్తురె వృత్తి సొత్తురే.

అనిన సుమతి కుమతి యగు తారకాసురు దురాలాపంబులు విని కోపించి.

వడిఁ ద్రిదశాలి నోర్చు డొక
వావిరిబీరము గాఁగ రజ్జు చె
ప్పుడు నది నీవు చేసిన
తపోవిభవంబున నబ్జగర్భుచేఁ
బడసిన విద్యగాక నిజబాహు
బలం బని చూతె పుట్టిన
ప్పుడు భుజశక్తి మా గుహుడు
వోలె సురాధిపుఁ బోరనేర్చితే.

ఇనుఁ డుదయింపక ముందఱ
ఘనముగ వర్తించుఁ దారకప్రభ మా క
య్యినుఁ డుదయించిన పిమ్మటఁ
గనుఁగొన లోకమునఁ దారకప్రభ గలదే.

తారక విరచిత కృతియుం
దారక విరచిత సుకృతియుఁ దా నడఁగు సదా
చారక విబుధాళికి సువి
చారక విబుధాధినాధు షణ్ముఖుఁ గనినన్.

* * *

[శుక్రాచార్యులు తారకునికి రాజనీతి నుపదేశించిన ఘట్టంలోని పద్యాలు]

అయతమతి నుతసప్తో
పాయంబులు నెఱుఁగవలయుఁ బతి సామము భే
దాయతి దానము దండము
మాయోపేక్షేంద్ర జాలమార్గము లోలిన్.

చన వెఱిఁగి నడువవలయును
వినయోచిత వృత్తి సంధి విగ్రహయానా
సనసంశ్రయణ ద్వైధులు
ననుషాడ్గుణ్యములు నిజమాత్యులతోన్.

స్త్రీపానాక్ష మృగవ్యథ
నాపహ పరదండనిష్ఠు రాలాపములన్
పాపగస ప్త వ్యసన
వ్యాపారము లుడుగవలయు వసుధేశునకున్.

సప్తవ్యసనేతరుఁడై
సప్తోపాయజ్ఞుఁడైన జనపతి పేర్మిన్
సప్తాంగ రాజ్యవృద్ధిగ
సప్తాబ్ధి పరీతధాత్రి సకలము నేలున్.

అరిషడ్వర్గ జయిత నన
వరతశమావాప్తి లోకవందిత విషయో
త్కర రక్ష సతతమాగమ
పరిపాలన సదృశు లవనిపతులును వ్రతులున్.

తగుఁ దగదని మనమున మును
వగవఁగ నొడఁబడఁగ వగవ వగవఁగ బడయున్
దగుఁ దగ దని వగవనివగ
వగవఁగఁ బనిగలదె తనకు వగ మఱి జగతిన్.

తన కధికుల కతిభక్తియు
మనమున నెయ్యంబుఁ దన సమానులకును హీ
నునియందుఁ గృపయుఁ జేకొని
మనుజునకు వగయుఁ వలదె మదిఁ బరికింపన్.

మునుకొని దేశకాల బల ముం
దగు దైవబలంబు గల్గఁగా
మొనసి విశేష మూలబలము
న్నిజ బాహుబలంబు నచ్చి పై
జని రిపులన్ జయింతు రని శత్రుల
కిన్నియుఁ గల్గియున్న చోఁ
జెనయక సామదానముల జేసి
జయింతురు నీతి విత్తముల్.

దారుణ కార్యవృత్తిఁ దుది దాఁకిన
వారును దొల్లి దుర్దశల్
సేరినచో నొకొం డొకనిచేఁ జెడ
రై రె కుమారుతో నహం
కారముదక్కి కూడి మనఁ గాదె
దురాగ్రహ మేఁటి కెల్లచో
బీరము సన్నె పెద్దలకుఁ బెద్దలు
లేరె ధరాతలంబునన్.

శివుఁ డాత్మసుతు నభిషేకంబు సేయుడు
దిగధీశులంతన ధిక్కరించి
పను లడ్గరాఁడ జంభారి బానసమున
కనలుండు రాఁడ కృతాంతకుండు
నరమాంసములు దేఁడ నైఋతి దలియకు
జలధీశ్వరుఁడు రాఁడ జలకమార్చ
మలయానిలుండు పువ్వులు దేఁడ ధనదుండు
తొడవులు గొనిరాఁడ మృడుఁడు రక్ష

వెట్టిరాఁడయ్యె వీరెల్లఁ బిట్టు నీకు
మరలి రిది మున్ను సాధ్యమె పరిభవములు
వడి భయార్తులై కూడినపగలఁ దమకుఁ
దొగుగని పగ సాధింపఁ దొడరు టరుదె.

బలహీను లయ్యు నే మగుఁ
బలువురు దమలోనఁ గూడి బలియునినైనన్
గెలుతురు సూడఁగ నీ హా
రలవంబులు గూడి తీవ్ర రశ్మిన్ గప్పున్.

"కు మా ర సం భ వ ము"

## లలనా వనం



# మారుతున్న నారీలోకం

ఆవుల జయప్రదాదేవి

*[ఆంధ్రప్రదేశ్ పాఠకులకు నూతనంగా పరిచయం చేయబడుతున్న శీర్షికలలో యీ లలనావనం ఒకటి. స్వాతంత్ర్యానంతరం సర్వతోముఖంగా జరుగుతున్న స్త్రీల అభ్యుదయానికి సంబంధించిన వ్యాసాలకు స్త్రీలసమస్యల విషయమై నిర్మాణాత్మకమైన సూచనలకు ఈ శీర్షిక క్రింద స్థానం లభిస్తుంది. నేటి ఆత్యాయిక పరిస్థితిలో స్త్రీలు వహించవలసిన ప్రముఖ పాత్రగురించిన ఉదాత్తమైన రచనలకు ప్రత్యేకత యివ్వబడుతుంది — ఎడిటర్ ]*

భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చిన తరువాత భారత జాతి పురోభివృద్ధి వైపు పరుగులిడుతున్నది. స్వేచ్ఛావాయువులను ఆస్వాదించి, జీవిత విధానాలను తీర్చి దిద్దుకోవడానికి తాపత్రయ పడుతున్నది. బానిసత్వంతో మ్రగ్గిన భారత జాతిలో ప్రత్యేకంగా నారీలోకం మరింత అధః పతనం చెందింది.

అయితే పంజరం నుండి బయటపడిన పక్షులలాగా, సంకెళ్ళను త్రెంచుకున్న సాధు జీవులలాగా, భయవిహ్వలలైన స్త్రీలు, తమజీవిత పథాలకు, సరియైననియమాలను వెదుక నారంభించారు. స్త్రీ కేవలం ఇంటిలో నాల్గు గోడల మధ్యనే మ్రగ్గ వలసిన పనిలేదు. దౌర్జన్యపూరితమైన మూఢాచారాలను, గ్రుడ్డిగా అనుసరించవలసిన పనిలేదని, గుర్తించ గలిగింది మహిళాలోకం.

కానీ స్త్రీలు, విద్యలోనేమి, విజ్ఞానంలో నేమి, ప్రపంచ జ్ఞానంలోనేమి ఎంతో వెనుకబడి ఉన్న సమయంలో, దీనికి పరిష్కారమేమిటనేదే ప్రశ్న. విజ్ఞానవంతులైన స్త్రీలు, సహృదయులైన తమ సోదరుల సహకారంతో, ముందు స్త్రీ జాతిని విద్యావంతులుగ, వివేక వంతులుగ చేయటం అతి ముఖ్యమని గ్రహించారు.

దేశంలో నలుమూలలా ప్రణాళికలు తయారైనాయి. ఎంతో ఉత్సాహంతో దేశాభ్యుదయానికి కృషిచేస్తున్నారు. మాతృస్థానముల నలంకరించి, భావిభారత సౌభాగ్యానికి, పునాదులు వేయవలసిన స్త్రీల అభ్యుదయం, అతి ముఖ్యమని గుర్తించింది ప్రజానీకం. దానితోనే ఈ ప్రజాస్వామ్య సిద్ధాంతాలతో, ప్రజాభ్యుదయ పథకాలలో, స్త్రీ జనోద్ధరణ ప్రారంభమైనది. వెనుకబడి ఉన్న స్త్రీలకు, సకాలంలో తగిన విద్యా సౌకర్యము లందని స్త్రీలకు, వంచితులైన స్త్రీలకు, పతిత గృహములను, మాతా శిశుసంరక్ష కేంద్రాలను నెలకొల్పి, వాటిల్లో వసతీ సౌకర్యములతోపాటు, విద్యా సౌకర్యములుకూడా ఏర్పాటు చేయబడినవి. ఇంతేగాక సంక్షిప్త విద్యా విధానముల ననుసరించి ఈ స్త్రీలకై ప్రత్యేకంగా శిక్షణ ఏర్పాటు చేయబడినది. ఎందరో స్త్రీలు వీటిల్లో విద్యా ప్రాప్తిని పొందుతున్నారు. చేతిపనులు మొదలైన వృత్తి విద్యలలో కూడా తర్ఫీదుపొందుతున్నారు. యోగ్యతలను పొందిన పిమ్మట, వారు వారికి తగిన ఉద్యోగములనుపొంది, జీవనభృతిని కూడ ఏర్పరచుకొన గలుగుతున్నారు.

వాస్తవానికి నేటి దేశాభ్యుదయానికి, సగానికిపైగా ఉన్న స్త్రీలను నిర్లక్ష్యం చేయడానికి వీలులేదు. ఉపాధ్యాయ వృత్తిలో, వైద్య వృత్తిలో, నర్సింగువృత్తిలో స్త్రీలు ఎంతైనా రాణించగలరు. సహజ సిద్ధమైన కరుణామూర్తి స్త్రీ మూర్తి. సహనశీల. మన భారతీయ సాంప్రదాయంతోవారు, భక్తి గౌరవాలతో తమ సోదరులనూ, బిడ్డలనూ ఆరాధించగలరు. వారు నిజమైన సేవామూర్తులు.

చారిత్రకంగా చూచినా స్త్రీలు తమ దేశ సౌభాగ్యానికి, తమ సర్వస్వాన్నీ అర్పించిన విషయం మన కందరకూ విదితమే. దేశభక్తిని ఉగ్గుపాలతోపోసి, తమ బిడ్డలను దేశ సేవాపరులుగాచేసి వీరులను

# విశేషాలు

## నేఫా యోధుని లేఖ

రక్షణ శాఖ మంత్రి శ్రీ వై. బి. చవాన్, జనవరి 29వ తేదీన చిరావా (ఝన్ ఝనూ జిల్లా) వెళ్ళినప్పుడు అక్కడ రాజాస్థానీ సైనిక సంప్రదాయాన్ని వ్యక్తపరచే దృశ్యాన్ని తిలకించారు. రెండు ప్రపంచ సంగ్రామాల లోని అనేక యుద్ధరంగాలలో వీరోచితంగా పోరాడిన రిసాల్దారు బేదార్ మేజర్ పుత్రశోకంలో ఉన్నాడు. నేఫా యుద్ధ రంగంలో అతని కొడుకు చంపబడ్డట్టు భావించ బడుతున్నది. ఆయన రక్షణ మంత్రితో ఇలా అన్నాడు "దేశ సేవలో నా కొడుకు మరణించి నందుకు నేను గర్విస్తున్నాను."

65 సంవత్సరాల వీర సైనికుడు చెత్రాం, ఆయన వితంతువు కోడలు, వారికి రొక్కరూపంగా ఇచ్చిన రు. 1000/-లను జాతీయ రక్షణ నిధికి విరాళంగా ఇచ్చి, తమ సమస్యలకన్నా దేశరక్షణకు అధిక ప్రాధాన్యం ఇచ్చారు. కోడలు తన ముక్కుపోగును కూడా విరాళంగా ఇచ్చింది.

ఆయన కుమారుడు రెండవ లెఫ్టినెంటు ఇంద్రాజ్ సింగ్ నవంబరు 14 వ తేదీన నేఫా యుద్ధరంగం నుంచి తన సోదరునికి ఆఖరులేఖ వ్రాస్తూ దేశభక్తిని అన్నిటి కన్నా మిన్నగా భావిస్తానని వ్రాశారు.

జయపూర్ లో విద్యార్థిగా ఉన్న తన సోదరునికి ఇంకా ఇలా వ్రాశారు. "దేశ రక్షణకోసం నీ చేతనైనంత విరాళంగా ఇచ్చావనే నేను భావిస్తున్నాను. ఎటువంటి త్యాగాలు చేయాల్సివచ్చినా దేశ సేవకు మించినది యేదీలేదు."

ఝన్ ఝనూ జిల్లా జనాభా 700,000. 5,3000 మంది ఇప్పటికే సైన్యంలో ఉన్నారు. రక్షణమంత్రి అక్కడికి వెళ్ళినప్పుడు 1000 మంది యువకులు రిక్రూటుమెంటుకై వేచి ఉండడం ఆయన చూచారు.

## ప్రెసిడెంటు పోలీసు మెడల్స్

రిపబ్లిక్ దినోత్సవం నాడు ఆంధ్ర ప్రదేశ్ కు చెందిన 8 మంది పోలీసు అధికారులకు ప్రెసిడెంటు మెడల్స్ బహూకరించారు.

పోలీసు డిప్యూటీ సూపరింటెండెంటు, శ్రీ ధరణీ ధర్ ప్రసాదుకు ప్రెసిడెంటు పోలీసు, ఫైర్ సర్వీసుల మెడల్ ను బహూకరించడం జరిగింది.

దిగువ అధికారులకు పోలీసు మెడల్స్ బహూకరించ బడ్డాయి. శ్రీ సి. రాజశేఖర రెడ్డి, కమాండెంటు, 11 బటాలియన్, ఆంధ్ర ప్రదేశ్ స్పెషల్ పోలీసు కర్నూలు. శ్రీ యస్. ఆర్. మెహతా, డైరెక్టర్. ఫింగర్ ప్రింట్ బ్యూరో, నేర పరిశోధన శాఖ, హైద్రాబాదు, శ్రీ బి. రాయన. పోలీసు డిప్యూటీ సూపరింటెండెంటు (అఫిష్యేటింగ్) క్రైంబ్రాంచి. సి. ఐ. డి. హైద్రాబాదు. శ్రీ కె. సి. జి. శర్మ, పోలీసు ఇన్స్పెక్టర్, క్రైంబ్రాంచి, సి. ఐ. డి. హైద్రాబాదు. శ్రీ యం. టి. నాయుడు, పోలీసు ఇన్స్పెక్టర్ (అఫిష్యేటింగ్) అవినీతి నిరోధక బ్యూరో, చిత్తూరు. శ్రీ డి. రామారావు, యస్. ఐ. (అఫిష్యేటింగ్) తూర్పుగోదావరిజిల్లా. ★

---

తయారుచేసినది స్త్రీ జాతియే. నాడు జిజియాబాయి మొదలైన వీరమాతలు, తమ బిడ్డలను దేశ భక్తులుగా రూపొందించి మహా వీరులుగా తయారుచేసారు. రాణీ రుద్రమ, మల్లమ్మ, ఝాన్సీ లక్ష్మీబాయి మొదలైన వీర నారీమణులు, తమ దేశములను కాపాడుకొనుటకే అసువులను బాశారు. స్వాతంత్ర్య సముపార్జనలో బాపూజీకి బాసటగా నిలచి, స్వాతంత్ర్య సమరంలో భర్తతోపాటు అష్టకష్టాలకు గురియైన కస్తూర్బాను మనం చూచే ఉన్నాము. ఎండ కన్నెరుగని సరోజినీ నాయుడు, విజయలక్ష్మి పండిట్ మొదలైన వారందరూ దేశమున కంకితమైన విషయం మరవరానిది. ఇంకెందరో మహిళామణులు త్యాగంచేసి సంపాదించిన స్వాతంత్ర్యముకు, రక్షించుకోవలసిన అవసరం, బాధ్యత నేటి మహిళలపై ఎంతైనా ఉన్నది.

స్త్రీ గృహిణిగా, సోదరిగా, తల్లిగా తమ కర్తవ్యాలను నెరవేర్చుకొంటూనే, దేశ రక్షణకు, దేశ సౌభాగ్యానికి, పురుషునికి తోడునీడగా కృషి సల్పటంలో ఏమరుపాటు ఉండకూడదు. ఎక్కడ చూచినా దేశరక్షణకు కావలసిన ఏర్పాట్లు చేయబడుతున్నవి. ఒక్క ఆర్థికంగానే కాదు, వివిధ సేవారూపాల్లో చేయవలసిన అవసరం ఎంతో ఉంది. అందుకనే స్త్రీలకు, ప్రథమచికిత్స, హోమ్‌నర్సింగు మొదలైన వాటిల్లో తర్ఫీదు నివ్వడానికి ప్రయత్నిస్తున్నారు. ప్రతి స్త్రీ ఏ మాత్రమైనా తీరికను కల్పించుకుని ఈ శిక్షణలో చేరి తగువిధంగా తర్ఫీదు నందడం దేశానికెంతో అవుసరం. తమ తమ తీరిక వేళల్లో అహోరాత్రులు మన సరిహద్దులు కాపాడుతున్న మన జవానులకు కావలసిన దుస్తులు మొదలైన వాటిని తయారుచేయడంలో స్త్రీలెంతో శ్రద్ధచూపుతున్నారు. స్త్రీలు, పురుషులు ఒకరికొకరు సహకార భావాలతో, దేశాభ్యుదయానికి ముందంజవేస్తే నేడు మనకు ప్రత్యక్షమైఉన్న ఒక్కచైనా సమస్యేకాదు సమస్తమానవాళి సమస్యలే పరిష్కారము కాగలవు. శాంతియుత సహ జీవనము సుస్థిరపడగలదు.

# వికలాంగులకు సహాయం

పి. వీరాస్వామి

స్వాతంత్ర్యోదయానికి పూర్వం మన దేశంలో వికలాంగులకు పునరావాస సౌకర్యాలు కల్పించడానికి కేవలం స్వచ్ఛంద సాంఘిక సేవా సంస్థలు మాత్రమే ప్రభుత్వ ప్రోత్సాహం లేకుండానే తీవ్రంగా కృషి చేశాయి. వికలాంగులు అంధులు, మూక, బధిరులు, అని వీరిని మూడు వర్గాలుగా విభజింపవచ్చు. బాగా అభివృద్ధి పొందిన దేశాల్లో ఈ మూడు వర్గాల ప్రజల విషయమై తీవ్ర పరిశోధనచేసి వారికి తగిన శిక్షణయిచ్చి ఉద్యోగావకాశాలు కల్పించడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి. వారి అనుభవాన్ని బట్టి చూస్తే, ప్రతివర్గానికీ కొన్ని ప్రత్యేకమైన అంశాలు వున్నట్లు గమనించవచ్చు. అంధుల సహాయార్థం అమెరికన్ సంస్థకు ప్రధాన సలహాదారుగావున్న డా. మిస్. హెలెన్ కెల్లెర్, వికలాంగులకు శిక్షణ యిచ్చి పునరావాసం కల్పించే విషయంలో నిపుణుడైన డా. హెన్రీకెస్లెర్; అంధులకొరకై ఏర్పడి వున్న అమెరికన్ ఫౌండేషన్, దూరప్రాచ్య సర్వీసుకు డైరెక్టరుగావున్న మేజర్ బ్రిడ్జెస్ ఈ అభాగ్యుల విషయమై ప్రజలలో చైతన్యం కల్గించడమేగాక, వికలాంగులకు యెనలేని సేవచేశారు. రెండవ ప్రపంచ యుద్ధం అంతమైన తరువాత, మన దేశంలోనూ, విదేశాలలోనూ, యుద్ధంలో క్షతగాత్రులై, వికలాంగులైన వారినిగూర్చి ఒక సమస్య వుత్పన్నమైంది. మాజీ సైనికులనూ, ఇలాంటి వారినీ, వారి వారి యోగ్యతలకు తగినట్లు ఉద్యోగాలు ఇప్పించి, పునరావాసం కల్పించడానికి భారత ప్రభుత్వం పూనుకొనింది. పాశ్చాత్య దేశాలలో మానవశక్తి కొరత ఏర్పడిన కారణంగా అనేక వృత్తులు చేపట్టడానికి, ముఖ్యంగా పారిశ్రామికంగా పురోగతిచెందిన దేశాలలో అంగ వైకల్యం అడ్డురాదని గుర్తించాయి. రెండవ ప్రపంచ యుద్ధం ముగిశాక ప్రపంచ మంతటా ఈఅభిప్రాయం బాగా ప్రబలింది. వికలాంగులు యేయేపనులు చేయలేరు అని కాదు. వాళ్ళు ఎలాంటి పనులు చేయగలరు అనే విషయమే ప్రధానమైంది. డా. మిస్ హెలెన్ కెల్లెర్ ఇలా అన్నారు: "దేహదార్ఢ్యంగల వారిని సైన్యంలో చేర్చుకొని, రక్షణ ఫ్యాక్టరీలలో పని చేయడానికి యుద్ధకృషికి తోడ్పడటానికీ చేతగానివారిని స్త్రీలు, వృద్ధులకోవకు చేర్చడం జరిగింది. అయితే వీరు రికార్డు వుత్పత్తి సాధించి చరిత్ర సృష్టించారు".

మన దేశంలో ప్రభుత్వం ఈ విషయమై శ్రద్ధ వహించింది. వికలాంగుల పునరావాస కృషి క్రమేణా అభివృద్ధి చెందుతూ వచ్చింది. ఈ రంగంలో లోగడనుంచే కృషిచేస్తున్న స్వచ్ఛంద సాంఘిక సేవా సంస్థలు ప్రభుత్వానికి సంపూర్ణ సహకారమివ్వాలని భావించి సమధికోత్సాహంతో పనిచేశాయి. తత్ఫలితంగా కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు ఆర్థిక సహాయం చేయడం ప్రారంభించాయి. రెండవ ప్రణాళిక కాలంలో వికలాంగులకు వివిధ శిక్షణ సంస్థలు, శరణాలయాలు, ప్రీ-ఎంప్లాయ్‌మెంటు పథకాలు, పునరావాస కేంద్రాలు, రక్షిత వర్కు-షాపులు వగైరా ఏర్పాటు చేయబడ్డాయి. డా. మిస్. హెలెన్ కెల్లెర్, మేజర్ బ్రిడ్జెస్, యునిస్కో సలహాదారుడు సర్. కె. క్లూతా మెకంజీ మనదేశాలలో పర్యటించి, ఈ సంస్థలు చేసిన కృషిని పరిశీలించిన ఫలితంగా, వాటికి నూతనోత్సాహం కల్గించినట్లయింది. ఒక విధంగా అభాగ్యుల జీవితాలను చక్కబరచాలనే భావం ప్రజల్లోకూడా కల్గింది. ఈ చిన్న వ్యాసంలో మన దేశంలోని వివిధ స్వచ్ఛంద సేవా సంస్థలు చేసిన కృషినంతటినీ పేర్కొనడం సాధ్యం కాదు.

భారత ప్రభుత్వం 1950 సం॥లో డెహరాడున్‌లో అంధులకొరకై ఒక జాతీయ సంస్థను ఆరంభిస్తూ, ఒక శిక్షణా కేంద్రాన్ని కూడా తెరిచింది. కాలక్రమేణా ఇక్కడ సెంట్రల్ బ్రెయిల్ ప్రెస్సు, నేషనల్ బ్రెయిల్ లైబ్రరీ అంధులైన పిల్లలకు ఒక మాధ్యమిక పాఠశాల, రక్షిత వర్కు-షాపు తెరువబడ్డాయి. అంధులు, మూక బధిరులు, వికలాంగులకు నూతనోత్సాహం కల్గించేందుకై వారికి విద్యామంత్రిత్వశాఖ ఉపకార వేతనాలు ఇవ్వడం ఆరంభించింది. వికలాంగుల విద్యాభ్యాసానికై 1955సం॥లో జాతీయసలహా మండలి ఏర్పాటు చేయబడింది. వీరికి తగిన శిక్షణ

యిచ్చి, ఉద్యోగావకాశాలు కల్పించే నిమిత్తమై ఏర్పడే సమస్యలనుగూర్చి భారత ప్రభుత్వానికి ఈ మండలి తగు సలహా లిస్తుంది. ఇదే సంవత్సరంలో అంతర్జాతీయ సంస్థ తదనుబంధ సంస్థల సహకారంతో బొంబాయిలో అఖిల భారత స్థాయిపై ఫిజికల్ మెడిసిన్, రీహాబిలిటేషన్ సంస్థ ఆరంభించబడింది. వికలాంగులకు పునరావాసం కల్పించడానికి వారికి సాంకేతిక శిక్షణ ఇవ్వడమే ఈసంస్థ ప్రధానోద్దేశం. 1955-56సం॥లో భారత ప్రభుత్వం మిస్సౌరీలో అంధులు, బధిరుల విద్య, అంధులకు ఉద్యోగాలు ఇవ్వడం అను అంశాలను గూర్చి మూడు గోష్ఠులను ఏర్పాటు చేసింది. ఈ సందర్భంలో చేయబడిన ప్రధాన సూచనల ప్రాతిపదికపై అంగ వికలుల పునరావాస పథకాలు విస్తృత పరచడానికి వీలు కలిగింది. 1959 సం॥లో బొంబాయిలోను 1961 సం॥లో ఢిల్లీలోను వికలాంగుల కొరకై ప్రత్యేకంగా రెండు ఉద్యోగ సాధక కేంద్రాలు తెరువబడ్డాయి. వీరి సమస్యలపట్ల ఇతోధిక శ్రద్ధవహించి, రెండవ పంచవర్ష ప్రణాళిక కాలంలో గణనీయమైన కృషిచేసిన ఫలితంగా ఈ విషయమై మరింత ముందుకు పోవడానికి అవకాశాలేర్పడ్డాయి. వీరికి శిక్షణయివ్వడం, ఉద్యోగాలు యిప్పించడం అన్న విషయాన్ని గూర్చి భారతప్రభుత్వం 1961 లో బెంగుళూరులో ప్రథమజాతీయగోష్ఠిజరిపింది.ఇందులో రాష్ట్ర ప్రభుత్వాలు, స్వచ్ఛంద సంస్థలు, కార్మిక సంఘాలు, యజమానుల ప్రతినిధులు, యితర ప్రతినిధులు పాల్గొని వికలాంగుల జీవిత వికాసానికి అనేక ముఖ్య సూచనలు చేశారు. వికలాంగులు ఆత్మ విశ్వాసంతో ధైర్యంతో తమ తమ నియమిత పనులను ఎలా నిర్వహిస్తున్నారో ప్రత్యక్షంగా చూసి తెలుసుకోగలందులకై ఒక ప్రదర్శన కూడా ఏర్పాటు చేయబడింది. బెంగుళూరు గోష్ఠీ, ప్రదర్శనమూ చాలా విజయవంతంగా నిర్వహించబడినాయని ప్రసంశలు పొందినాయి.

భారత ప్రభుత్వ మంత్రిత్వ శాఖ తృతీయ పంచవర్ష ప్రణాళిక కాలంలో 1962 సెప్టెంబరు నెలలో హైద్రాబాదులో వయోజనులైన బధిరులకు ఒక శిక్షణ కేంద్రం స్థాపించింది. ఇక్కడ ఫిట్టింగ్, వైర్‌మన్ షిప్, షట్ మెటల్ వర్క్ పనులలో రెండేళ్ళ శిక్షణ కోర్సు ఆరంభించబడింది. ఇదే కాలంలో హైద్రాబాదులోనూ, మద్రాసులోనూ వికలాంగుల కొరకై ప్రత్యేకంగా రెండు ఉద్యోగ సాధక కేంద్రాలు కూడా తెరువబడ్డాయి. స్వాతంత్ర్య సముపార్జనానంతరం రాష్ట్ర ప్రభుత్వాలు కూడా అనేక పునరావాస పథకాలను చేపట్టాయి.

మొత్తంమీద చూస్తే, దేశంలో ఇప్పుడు అంధులకు 110, బధిరులకు 57, వికలాంగులకు 22 సంస్థలు పనిచేస్తున్నాయి. మన దేశంలో లభ్యమయ్యే ఫ్రీ-ఎంప్లాయ్‌మెంట్, శిక్షణరీతుల దృష్ట్యానూ, వికలాంగుల అభిరుచుల దృష్ట్యాను, ఈ దిగువ పేర్కొనబడిన మూడు పద్ధతులలో ఏదో ఒక దానిలో వారికి రిక్షణ ఇవ్వడం ఉచితమని బెంగుళూరులో జరిగిన గోష్ఠిలో సూచన చేయబడినవి.

1. బయటి ఉద్యోగులకు శిక్షణ.

2. ఒకే చోట (షెల్టర్డ్) ఉద్యోగం చేయడానికి శిక్షణ.

3. గృహ కృత్యాలలో పనులు నిర్వహించడానికి శిక్షణ.

భారత ప్రభుత్వ ఆహ్వానంపై, వృత్తి పనులలో పునరావాసం కల్పించడంలో ఐ. యల్. ఓ. నిపుణుడైన శ్రీ ఆర్. టర్నర్ ఇప్పుడు మన దేశంలో వున్నారు. అంధులకు వృత్తిపనుల శిక్షణ, ఉద్యోగాలు ఇచ్చే విషయమై ఆయన విద్య, కార్మిక మంత్రిత్వ శాఖలకు ఈ క్రింది విషయాలను గూర్చి సలహా లిస్తారు :

1. పరిశ్రమలలో అంధులకు ఉద్యోగావకాశాలను కల్పించడానికి పరిశ్రమలను పరిశీలించడం.

2. తగిన వృత్తి శిక్షణా కోర్సులను తయారుచేసి, పాఠ్య ప్రణాళికలు రూపొందించడం, పరికరాలు, యంత్రాలు, ఇతర సామాగ్రిని ఎన్నుకోవడం; శిక్షణా పద్ధతులు సూచించడం మున్నగు అంశాలను గూర్చి సాంకేతిక దృష్ట్యాను, పరిపాలనా దృష్ట్యానూ సలహా లివ్వడం;

3. వృత్తి శిక్షణ గరపడానికి అంధులను ఎన్నికచేసే విషయమై సలహా యివ్వడం;

4. పారిశ్రామిక శిక్షణ పొందిన అంధులకు పనులు కల్పించే పద్ధతులను గూర్చి సలహా యివ్వడం;

5. అవసరమైన ఉద్యోగ సిబ్బందికి శిక్షణ యివ్వడం.

ఆంధ్ర ప్రదేశ్‌లో వికలాంగుల కొరకై నాలుగు ప్రభుత్వ స్కూళ్ళు వున్నాయి. అంధులకు రెండు స్కూళ్లు, ఒకటి హైద్రాబాదులోనూ, మరొకటి కడపలోనూ వున్నాయి. బధిరులకు గాను ఒకటి హైద్రాబాదులోనూ యింకొకటి తూర్పు గోదావరి జిల్లా, కాకినాడలోను, స్కూళ్లున్నాయి. పైన చెప్పినట్లు కేంద్ర ప్రభుత్వం వయోజనులైన బధిరులకు హైద్రాబాదులో 1962 సెప్టెంబరులో ఒక శిక్షణ కేంద్రాన్ని నెలకొల్పింది. అంధుల కొరకు లూథరన్ స్కూలు అనే పేరుతో ఒక ప్రైవేటు సంస్థ గుంటూరు జిల్లాలో రెంటచింతలలో 1911 నుంచీ నడుస్తున్నది. రాష్ట్ర ప్రభుత్వ సంస్థలన్నీ విద్యాశాఖ డైరెక్టరు కంట్రోలు కింద వున్నాయి. వికలాంగులకు సాధారణవిద్యతో పాటు, నేత

# ప్రభుత్వ నిర్ణయాలు

హైద్రాబాదు కెమికల్స్, ఫర్టిలైజర్స్ సంస్థ, స్టేట్ బ్యాంక్ ఆఫ్ హైద్రాబాదు నుంచి రు. 12/- లక్షలు రొక్కంగా రుణం తీసుకోవడానికీ, నేత సహకార సంఘం స్పిన్నింగ్ మిల్లు రు. 3 లక్షలు రుణం తీసుకోవడానికీ, ఉయ్యూరులోని ఆంధ్ర రాష్ట్ర సహకార బ్యాంకు, రిజర్వు బ్యాంక్ ఆఫ్ ఇండియా నుంచి రు. 1,50,000 లు రుణం తీసుకోవడానికీ గ్యారంటీలుగా ఉండడానికి ప్రభుత్వం నిశ్చయించింది.

పరిశ్రమావసరాలకు ఉపయోగించే ఆల్కోహాల్‌పై ఎక్సైజ్ సుంకం విధింపును గూర్చి పరిశీలించడానికి అధికార కమిటీని నియమించాలని ప్రభుత్వం నిర్ణయించింది.

రాష్ట్ర విద్యుచ్ఛక్తి బోర్డులో ఉస్మానియా విశ్వవిద్యాలయం రు. 3 కోట్లు పెట్టుబడి పెట్టడానికి ప్రభుత్వం గ్యారంటీ ఇచ్చింది. దీనిపై 4½ శాతం వడ్డీ లభిస్తుంది. ఐదు సంవత్సరాల తర్వాత 5 సమాన దఫాలలో వడ్డీతోసహా యీ ధనం తిరిగి చెల్లింపబడుతుంది.

సెలక్టు కమిటీకి నివేదించబడిన వ్యవసాయ విశ్వవిద్యాలయం బిల్లును అమలు పరచడానికి ప్రభుత్వం నిశ్చయించింది ★

---

పని, దర్జీపని, పేముపని, బుక్ బైండింగు సంగీతం, నవార్ నేయడం మున్నగు పనులలో కూడా శిక్షణ యివ్వడం జరుగుతున్నది. ప్రభుత్వం ఈ విద్యార్థులకు హాస్టళ్లను కూడా ఏర్పాటు చేసింది. వారికి ప్రభుత్వం దుస్తులు, పుస్తకాలకూ అలవెన్సులు యిస్తుంది. వీరికేగాక ఇక్కడ చేరే యితర విద్యార్థులకు కూడా స్టయిఫెండులు ఇస్తారు. వాళ్ళకు స్కూలు ఫీజులేదు.

మనరాష్ట్రంలో ప్రభుత్వమూ, కొన్ని స్వచ్ఛంద సంస్థలూ కలసి పునరావాస పథకాలను అమలు పరుస్తున్నాయి. ఆ సంస్థలు దిగువ పేర్కొనబడి వున్నాయి.

1. వృద్ధులకూ, వికలాంగులకూ యాకత్‌పూరా, శరణాలయం, హైద్రాబాదు.
2. వికలాంగులకు శరణాలయం, బన్సీలాల్‌పేట, హైద్రాబాదు.
3. ఆరామ్‌ఘర్, హైద్రాబాదు.
4. ఆంధ్రప్రదేశ్ సంక్షేమ సంస్థ, హైద్రాబాదు.
5. వృద్ధులకు శరణాలయం, ముషీరాబాదు.
6. వికలాంగులు, అంధులు అయిన పిల్లలకు శరణాలయం, గుంటూరు.
7. వికలాంగులైన పిల్లలకు శరణాలయం, వాల్తేరు.

ఆంధ్రప్రదేశ్‌లో వికలాంగులకు ప్రత్యేక ఉద్యోగ సాధక కేంద్రానికి ఆర్థిక మంత్రి శ్రీ బ్రహ్మానందరెడ్డి 1962 సెప్టెంబరులో ప్రారంభోత్సవం చేశారు. కార్మిక మంత్రి శ్రీ బి. వి. గురుమూర్తి అధ్యక్షత వహించారు. అంగవైకల్యం ఎంత ప్రతిబంధకమైనా, జీవిత పోషణకు వృత్తి చేయడానికి ఇది అడ్డురాకుండా చేయడమే ఈ పథకం యొక్క ముఖ్యోద్దేశం. ఇలాంటి వ్యక్తులకు, వారికి సాధ్యమైనంతలో నిపుణతగల పనులను చేపట్టడానికి సహాయమిచ్చి, వారికి తృప్తికరమైన జీవనభృతి మార్గాన్ని చూపించడమే ఈ పథకం యొక్క ప్రధాన లక్ష్యం. ఈ లక్ష్యసాధనకు ప్రత్యేక ఉద్యోగసాధక కేంద్రం, సాంఘిక సేవా సంస్థలు, యజమానుల మధ్య అనుసంధాన కృషి చేయడం జరుగుతున్నది. పారిశ్రామిక వేత్తలు తమ వద్దకు ఉద్యోగ నిమిత్తం పంపబడ్డ వికలాంగుల పట్ల సానుభూతి ప్రదర్శించి సంఘంలో వారికి గల న్యాయమైన స్థాయి కలిగించే, అవకాశం యిప్పించవలసిందిగా వారికి ప్రత్యేకంగా విజ్ఞప్తులు చేయడం జరిగింది. యజమానులు ప్రదర్శించే సహకారం పైన ఈ పథకం విజయం కావడం ఆధారపడి వుంటుందని ప్రత్యేకంగా చెప్పనక్కర లేదు. వికలాంగులకు యజమానులు సహాయం చేయడం ద్వారా వారికి ఉద్యోగావకాశాల్ని ప్రోత్సహించే వాతావరణాన్ని కల్గించినవారవుతారు. యజమానుల సహకారం లభిస్తున్నందువల్ల, ఈ విషయమై ఎంప్లాయ్‌మెంటు శాఖకు ఏ విధమైన సందేహమూ లేదు. వారికి ఈ శాఖ కృతజ్ఞతలు తెలుపుతున్నది. ఇక ముందుకూడా వారి సహకార సానుభూతులు లభిస్తూ వుంటాయని ఈ శాఖ విశ్వసిస్తున్నది.

గత మూడు మాసాలలో ప్రత్యేక ఉద్యోగ సాధక కేంద్రం పదిమంది వికలాంగులకు ఉద్యోగా లిప్పించింది.

వివరాలు యివి :—

కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వ శాఖలలో : 6 మంది వికలాంగులు, ఇద్దరు మూక బధిరులు.

ప్రయివేటు సంస్థలో : వికలాంగుడైన ఒక వ్యక్తి.

మరొక ప్రయివేటు సంస్థలో: చెవిటి, మూగ వ్యక్తి

అంగవికలులైనంత మాత్రాన వృత్తి నవలంభించడానికి అనర్హులని భావించనవసరం లేదు. ఈ విషయం గుర్తిస్తే అభాగ్యుల భావి జీవితం బాగుపడుతుంది. అభాగ్యులను ఆదరిస్తే భగవంతుని స్మరించినట్లువుతుందని వేరే చెప్పనక్కర లేదు. ★

# శ్రీనాథయుగము - అన్యదేశ్యములు

తూమాటి దోణప్ప

ఆంధ్ర సాహిత్యమున శ్రీనాథ యుగమనఁగా క్రీ. శ. 1350-1500 మధ్య కాలమని వేత్తల భావన. శ్రీనాథుఁడు క్రీ. శ. 1370 ప్రాంతముల జన్మించి, చిన్నారి పొన్నారి చిరుత కూకటి నాఁటి నుండియు సాహితీ వ్యవసాయము సాఁగించినను, ఉపలబ్ధములగు ఆయన కృతులన్నియు పదునైదవు శతాబ్ది ప్రథమ భాగమునందే ఆకృతి దిద్దుకునినవి కావున ప్రస్తుత సమాలోచనమున క్రీ. శ. 1400-1500 నడిమికాలము శ్రీనాథ యుగమని వ్యవహృతము. కోశమును చూడు, అథవా, దేశమును చూడు అను నర్థమున కన్నడమున ఒక సామెత. రెంటిని చూచి, శాస్త్రజన్య జ్ఞానమును స్వానుభవముతో మేళవించి, అష్టభాషా భారతీ సందర్భ సౌభాగ్య గరిమంబు సంగ్రహించిన శ్రీనాథుని సాహితీ సమారాధనము ఆంధ్ర శారదా భాగధేయము. కవిసార్వభౌముని ఆదరించిన సాహితీ పోషకులందరును హేమా హేమీలు. విస్సనమంత్రి పంక్తిని హేమ పాత్రాన్నము నారగించి, తెనుంగు రాయ రాహుత్తుఁడిచ్చిన కస్తూరిని సేవించి, వీరభద్రారెడ్డి యొసంగిన రత్నాంబరములు ధరించి, సర్వజ్ఞ చక్రవర్తి బిరుదాంచితులగు రెడ్డిరాజుల విద్యాధికారిగా బహుదేశ బుధులతో విద్యాపరీక్షణ వేళలందు భాషించి, ఉద్భటవివాద ప్రౌఢి గౌడడిండిమభట్టు కంచుఢక్కా పగులఁగొట్టించి, కర్ణాట క్షితిపాలమౌక్తిక సభాగారాంతరా కల్పిత స్వర్ణస్నానగతి ప్రసిద్ధి వహించి, రావుసింగమహీపాలు నిండుకొలువున మన్ననలంది ఇట్లు తెలుఁగునేల నాలుగు చెరఁగులు తిరిగి, సీమసీమల తీరుతీయము లెఱింగి, శబ్దార్థగౌరవ శక్తి మరగి, మధురార్థ శ్రీకముగా, ఉక్తి ప్రగల్భ సమీహితముగా తన కృతులను దిద్ది తీర్చి, సమకాలీన కవులను సైతము ప్రభావితము సేసిన ఉత్తమ సాహితీశిల్పి శ్రీనాథుఁడు.

ఈ యుగమున సాహితీ రథ సారథిగా వెలసిన శ్రీనాథుని కృతులు అయిదు - శృంగార నైషధము, భీమేశ్వర పురాణము, కాశీఖండము, హరవిలాసము, శివరాత్రి మాహాత్మ్యము - ఇవి అయిదును శ్రీనాథ కృతములనుట నిర్వివాదము. క్రీడాభిరామ కర్తృత్వము వివాదగ్రస్తమయినను, శ్రీనాథయుగ రచనముగా నిష్కర్షించుట నిర్బాధము. పల్నాటి వీరచరిత్రము శ్రీనాథ కృతమనుటకును, అసలా యుగరచన మనుటకును బలమయిన ప్రమాణములు తక్కువ. శ్రీనాథునిపేర 'చెలామణి' యగుచున్న చాటు సాహిత్య మంతయు తత్కృతమని గట్టిగా చెప్పుట కష్టము. అంతా కాకపోయినను, చాలా పాలు ఆయన గంటపు టొరవడుల పంటయని పండితపరిశోధకుల విశ్వాసము. దీని శయ్యా వైయాత్యమును, పండిత పరంపరా యాతప్రతీతియును ఇది శ్రీనాథ ప్రణీతమనుటకు హేతువులు. శ్రీనాథ చాటువులకు అసంపూర్ణమయిన అర్వాచీన రూపము వీధి నాటకము. తక్కిన మరుత్తరాట్చరిత్రాదులు నామమాత్రావశిష్టములు. విన్నకోట పెద్దన, మడికిసింగన, కొలని గణపతిదేవుఁడు, నిశ్శంక కొమ్మన, పేరంరాజు జక్కన, అనంతుఁడు, వెన్నెలకంటి అన్నయ్య శ్రీనాథ యుగమున తొలిసగమునకు చెందినవారు. బమ్మెర పోతన, ప్రౌఢ కవిమల్లన, కొఱవి గోపరాజు, గౌరన, పిల్లలమఱ్ఱి పిన వీరభద్రుఁడు, దూబగుంట నారాయణకవి, బైచరాజు వేంకటనాథుఁడు, దగ్గుఁబల్లి దుగ్గన, నంది మల్లయ - ఘంట సింగయలు మలి సగమునకు చెందినవారు. భాస్కర రామాయణములోని యుద్ధకాండ శేషకర్త యగు అయ్యలార్యుఁడు దేవరకొండ రాచవారికి ఆశ్రితుఁడగుటవలన క్రీ. శ. 1407 ప్రాంతమున వాఁడను మల్లంపల్లి వారి నిర్ణయము[1] ప్రమాణముగా ఒకటి రెండు అయ్యలార్యుని ప్రయోగములు సైతమీ కృషిలో స్వీకృతములు. వెన్నెలకంటి సూరన కృత విష్ణుపురాణ కృతిపతి యగు

1. M. Somasekhara Sarma, History of the Reddi Kingdoms pp. 532,533.

రావూరి బసువయ రాఘవరెడ్డి క్రీ. శ. 1528 ప్రాంతము వాఁడని నిర్ణీతమగుటచే ఏతత్కృతియందు ప్రయుక్తములయిన అన్యదేశ్యములిందు పరిహృతములు. నాసికేతూపాఖ్యాన ప్రబోధ చంద్రోదయ కావ్యములకు కృతిపతి చెందలూరి అనంతామాత్యుని గంగయ మంత్రి2 కావున దగ్గుఁబల్లి దుగ్గనయు, నంది మల్లయ — ఘంట సింగయలు, సమ్మ సమకాలికులు. తాళ్ళపాక అన్నమయ్య నూటికి నూఱుపాళ్ళు పదునైదవు శతాబ్దివాఁడు. ఫణిభట్టు, భైరవకవి రచనములు ఏతద్యుగీనములగు నాయనిశంక. అయినను పూర్వ పరిశీలకుల నిర్ణయము ననుసరించి ఈ రచనలను ప్రస్తుత చర్చలో ఉదాహృతములు.

పారసీకాద్యన్య దేశభాషలనుండి ప్రత్యక్షముగాఁగాని, పరోక్షముగా మరాఠీభాషా ముఖమునఁగాని తెలుఁగునఁ జేరినపదములును, మరాఠీభాషకు నిసర్గములయి సంసర్గ వశమున తెలుఁగునఁ బ్రవేశించిన పదములును అన్యదేశ్యములని ఈ వ్యాసమున పరిమితార్థమున ప్రయుక్తము. ఈ వ్యాసము చివరి పట్టికలోని పదములలో ముక్కాలుపాలు పారసీకాద్యన్య దేశభాషలకు నిసర్గములు. తక్కినవి మాహారాష్ట్రి ప్రాకృతజన్యమగు మరాఠీ భాషాస్వత్వములు. ఈ యీ పదములు హిందూస్థానీ జన్యములని పూర్వ పరిశీలకుల మతము. ఉర్దూ పాలెక్కువయిన సంకీర్ణహిందీ భాషను 'హిందూస్తానీ' యని వ్యవహరించు పరిభాష పరంగుల రాకతో మూర్తికట్టుట. హిందీభాషగాని, దీని మాండలికములుగా సంభావ్యము లగుచున్న అవధీ, బ్రజ, మైథిలీ, ఖడీ బోలీ మొదలగు నవిగాని, హిందీభాషా వికృతియగు హిందూస్తానీగాని ఆంధ్రుల చరిత్రమునను, సాహిత్యమునను అప్రసక్తములు. అర్వాచీన యుగముల మాండలిక పరముగా 'ఉర్దూ' భాషా ప్రభావము లేకపోలేదు. శ్రీనాథ యుగమునాఁటికి 'ఉర్దూ' ఆలు చూలులేని సోమలింగము. 'జాతీయ కాంగ్రెసు' ప్రోద్బలమున, దక్షిణ భారత హిందీ ప్రచారసభ పక్షమున ఇరువది యవు శతాబ్ది ద్వితీయ పాదమున ప్రచారము ప్రారంభమగు దాఁక, హిందీ భాషతోఁగాని, తద్వ్యవహార ప్రాంతముతోఁగాని తెలుఁగు జనులకు సంబంధ బాంధవములు మృగ్యము. నాఁటికి నేటికి హిందీ, తెలుఁగునకు పరిసరస్థభాషకాదు. కావున, ప్రాక్కాలికమగు హిందీ బాంధవమును నిర్వహింప నుద్యోగించుట నిష్ప్రయోజనము; తెలుఁగునందలి మధ్యయుగ నాన్యదేశ్యములకు హిందీ తోడి సమీప మాతృకతను స్థాపింప సమకట్టుట నిరాధారము. కాని, మరాఠ్వాడా — తెలుఁగు నాడులకుఁగల సంబంధ బాంధవములు ఇక్ష్వాకుల తాత ముత్తాతల నాటివి. పైపెచ్చు తెలుఁగు — మరాఠీలు భౌగోళికముగా పరిసరభాషలు. శాతవాహన చక్రవర్తులనాఁడు ఇంచుమించు నన్నూఱేండ్ల పాటు మరాఠ్వాడా, తెలుఁగు నాడులు ఒక గొడుగునీడ కూడి మాడియుండుట జగమెఱిఁగిన చరిత్ర. మరాఠ్వాడాను ఏకాతపత్రముగా శాసించిన పశ్చిమ చాళుక్య వంశీయుల ఒక రెమ్మయేకదా సాగరాంధ్రసీమల వేంగి రాజమహేంద్ర పురములు ఆలవాలములుగా ప్రాచ్య చాళుక్య శాఖగా పరిఢవిల్లుట! నెల్లూరి '......మన్మవిభు పంపై చన్న సైన్యంబు ... మహారాష్ట్రి సామంతు సారంగుందోలి తురంగముంగొనిన సంగ్రామము (నిర్వచనో. 1–43) తెలుఁగు మరాఠీల సరాసరి సంబంధములకు ఒక చక్కని నిదర్శనము. యాదవ రాజుల పరిపాలన కాలము మరాఠ్వాడా చరిత్రలో స్వర్ణ యుగము. దేవగిరి యాదవరాజులలో రామచంద్రదేవుఁడు (క్రీ. శ. 1271–1309) సుప్రసిద్ధుఁడు. ఇతని మహామాత్యుఁడే హేమాద్రి. క్రీ. శ. 1277 నాఁటి పంధరా పురశిలాశాసనమునను, క్రీ. శ. 1279 నాఁటి ఉణ్కాక దేవశిలాశాసనము (ఆదిలాబాదు మండలము)నను కీర్తితుఁడయిన మహాప్రౌఢ ప్రాతాప చక్రవర్తి శ్రీరామ చంద్రదేవుని మహా ప్రధాని హేమాడియును, చతుర్వర్గ చింతామణి కర్తయగు హేమాద్రి పండితుఁడును అభిన్నులని చరిత్రకారుల నిర్ణయము. వ్రతదాన తీర్థ మోక్ష పరిశేషములను నైదు ఖండములలో సంగ్రథిత మయిన విజ్ఞాన సర్వస్వము చతుర్వర్గ చింతామణి. యాదవ రాజుల దేవగిరికి, త్రిలింగ పరమేశ్వరుల ఓరుగంటికిఁగల రాజకీయ సంబంధములు చిరకాల సమీచీనములు. కాకతీయ చక్రవర్తుల కొలువులో మెలఁగి, పాలకుల మెలఁకువ లెఱిఁగిన రాజనీతి చతురుఁడు ప్రోలయ వేమారెడ్డి (1300 — 1353); ఓరుగంటి పతనముతో మధ్యాంధ్ర మహీ మండలమున స్వతంత్ర పతాకమెత్తిన ఈ రెడ్డి ప్రభువు రెడ్డి రాజుల కుదురునకు మూల పురుషుఁడు. రెడ్డి రాజులకు ఒకటి రెండు తరములు పూర్వుఁడయిన హేమాద్రి పండితుని చతుర్వర్గ చింతామణికి సాగరాంధ్ర సీమలో నుండిన ప్రచార ప్రభావములు అనన్వయము. చతుర్వర్గ చింతామణి త్రిలింగ రాజ పరమేశ్వరు (కాశీ. 3–248)లగు రెడ్డి ప్రభువుల నిత్యానుష్ఠానములకు ప్రమాణ గ్రంథముగా చెల్లుబడి యగు చుండి నట్లును, అది వీరి విమల చారిత్ర శిక్షకా

2. 'ప్రఖ్యాత నాచికేతూ - పాఖ్యాన మహాప్రబంధ పరిమళిత సుధీ - వ్యాఖ్యాన - శ్రవణోదిత - సౌఖ్యా, సంఘటిత చిత్తశంకర సఖ్యా!' (ప్రబోధ. 4.71).

చార్యకము వహించి నట్లును ప్రమాణములు కో కొల్లలు. రెడ్డిరాజు లందఱును హేమాద్రి ప్రోక్తదానపరులు. హరివంశ కృతిపతియగు ప్రోలయ వేమారెడ్డి 'హేమాద్రి' పరికీర్తితామిత వ్రతదాన నివహంబులన్నియు నిర్వహించె' (హరివంశము, పీఠిక, 19) ననిఎఱ్ఱాప్రెగ్గడప్రశంస. ప్రోలయ వేమారెడ్డి తనయుఁడు అన వేమారెడ్డి (1364–1386) 'హేమాద్రి దాననిరత 'బిరుదాంకితుఁడు(చూ. శ్రీశైలశాసనము, A. R. No. 20of 1915; క్రీ. శ. 1377; 132 వ పంక్తి). అన పోతారెడ్డి కుమారుఁడగు కుమార గిరిరెడ్డి (1386–1402) యును (చూ. తంగెడ శాసనము, A. R. No. 380 of 1926; క్రీ. శ. 1391; 3 వ పంక్తి), కొండవీటి పెదకోమటి వేమారెడ్డి (1402–1420) తనయుఁడగు రాచ వేమారెడ్డి (1421–1424) యును (చూ. అమీనబాద శాసనము, A. R. No. 543 of 1909; క్రీ. శ. 1415; 3 వ పంక్తి), వీరభద్రారెడ్డి జనకుఁడగు దొడ్డమరెడ్డి అల్లాడ రెడ్డి యును (చూ. పలివెల కొప్పేశ్వర స్వామిదేవాలయ కల్యాణ మంటప స్తంభము మీఁది శాసనము, A. R. No. 503 of 1893; క్రీ. శ. 1416; 41; 42 పంక్తులు) 'హేమాద్రి దాన చింతామణి' బిరుద విరాజితులుగా కీర్తితులు — వీరభద్రారెడ్డి అగ్రజుఁడు, కాశీఖండ కారయిత '... వేమాంబాల్లమహీశ భాగ్య విభవో వేమ క్షమాధీశ్వరః... హేమాద్రి దానాని సదా కరోతి..' (చూ. దాక్షారామ శాసనము, A. R. No. 448 of 1893; 4,5,6...8,9 పంక్తులు). ఈ అల్లయ వేమారెడ్డి యే'... హేమాద్రి దానక్రియా మహత్వంబున విప్రుల నతి దశాన్వితుల(జేయు...'నని నిశ్శంక కొమ్మన సాక్ష్యము (చూ. శివలీలా విలాసపీఠిక). కాశీ ఖండకృతి పతియగు అల్లాడ వీరభద్రయ్య 'హేమాద్రి దానదీక్షితుఁ...' డని రెడ్డిరాజుల విద్యాధికారి శ్రీనాథుని కైవారము (చూ., కాశీ. 5–1). ఈ వీరభద్రయ్య యే 'హేమాద్రి దాన దీక్షాగరిష్ఠుఁడు'గా శివలీలా విలాసకర్తచే కీర్తితుఁడు. వీరభద్రారెడ్డి అనుజున్మఁడును, శివలీలా విలాసకృతి భర్తయును అగు దొడ్డారెడ్డియును 'హేమాద్రి విశిష్టా దానపరుఁడు'గా వర్ణితుఁడు. ఈ బిరుదములు కేవలము కుల క్రమాగతములని కొట్టివేయ వీలులేదు. ఇవి రెడ్డిరాజుల వితరణ గుణప్రదర్శకములయి, ప్రతిపద సార్థకములయిన బిరుదములని వారి శాసనాదికములు ప్రత్యక్ష సాక్ష్యము.

బహమనీ సామ్రాజ్యము బ్రద్దలగు దాఁక 'మరాత్వాడా తెలంగాణము లోక యేలుబడిలోని మండలములు. మరాఠీభాషయు, తద్వ్యవహర్తలును 'ఆరెము,' 'ఆరె' అను పేరులతో తెలుఁగున వ్యవహృతమగుటకు మధ్య యుగముఁనుండియు ప్రమాణములు పెక్కులు. పండితారాధ్య చరిత్రయందలి 'ఆరె' పరుసనడకలు సుప్రసిద్ధములు (పుటలు, 381–387, పర్వత ప్రకరణము). '..ఆరెలుఁ గన్నడీల రవలుఁ దెలుఁగులుఁ దన బిరుదందియఁ దగిలి కొలువ నెగడి..' (ద్వా. 1–42)నవాఁడు సనదప్రోలి వెన్నయ మంత్రి. ఈ వెన్నయ, వెలనాటి చోడ వంశీయుఁడగు గొంకనృపాలుని మంత్రి; పదుమూఁడవు శతాబ్దివాఁడు. సింహాసన ద్వాత్రింశిక కర్తయగు కొఱవిగోపరాజు ఈ వెన్నయ మంత్రి కేడవు తరమువాఁడు. తెలుఁగు సీమలో రెడ్డి (= మునసబు లేక పటేలు), కరణము (= పట్వారి), వెట్టి, తలారి మొదలగు పంద్రెండుగురు గ్రామోద్యోగులను 'బారా బలూతి' (< మరాఠీ. బారా = పంద్రెండు; బలుతేఁ = గ్రామోద్యోగుల హక్కు) అని వ్యవహరించు ఆచారము మహారాష్ట్రిది. నిన్న మొన్నటి దాఁక పశ్చిమాంధ్ర ప్రాంతముల ప్రబల ప్రచారములో నుండిన 'బాళబోద్' లేక 'బాళబంధు' లిపి సంప్రదాయము[3] మహారాష్ట్రి ప్రభావమునకు మఱియొక మచ్చుతునుక. తెలుఁగు వారు కొందరు తమ పేళ్ళ చివర తగిలించుకొను 'రావు' (పీష్వాబాజీ రావు, జీవాజిరావు సిందియా, మురారిరావు ఘోర్పడే, యశ్వంతరావు హోల్కార్) మరాఠీ వారిది. ఆంధ్రలో — ముఖ్యముగా కర్నూలు, కాకినాడ, గుంతకల్లు పరిసరముల యందలి తోలు బొమ్మలాటల వారు మహారాష్ట్రులు. తెలుఁగు సీమలోని సంచార జీవులగు సుగాలీలు (= తండాలు, లంబాడీలు) మరాఠీ–గుజరాతి జాతులకు చెందిన వారు; మరాఠీ — గుజరాతి భాషాసమ్మిశ్రమముతో, స్థానిక భాషాసాహచర్యముతో వికృతినందిన వాగ్రూప వ్యవహారము వీరి భాష, పత్తికొండ సీమకు చెందిన 'ఆరె మరాఠీల' కథయు, పానుగంటి సీమకు చెందిన 'మాయలమరాఠీ' కథయు తెలుఁగులకు సుపరిచితము. తెలుఁగు కన్నడిగల ఉగాదియును, మరాఠీల ఉగాదియును ఒక్కనాడు. ఏకారణము వలననో గాని తెలుఁగుల తోపాటు మరాఠీలును పంచద్రావిడులుగా పరిగణితులు. ఇంకను, ఇట్టి చిల్లరమల్లర పోలికలు సవాలక్ష. ఇది సంక్షేప రూపమయిన చరిత్ర. అనాదియును, అవిచ్ఛిన్నమును అయిన ఇట్టి సమీపసంసర్గ సంబంధము వలన ఈ రెండు ప్రాంతములలోని వ్యవహార భాషలు పరస్పరము ప్రభావితమైయుండు ననుట నిర్వివాద విషయము. తొలినాళ్ళలోని ఆదాన ప్రదానముల మహారాష్ట్రి ప్రాకృతము

3. తిరుమల రామచంద్ర, మనలిపి పుట్టు పూర్వోత్తరాలు, పుటలు 164–166.

ప్రముఖపాత్ర వహించినట్లు చరిత్ర. మహారాష్ట్రి ప్రాకృత పుత్రికయగు మరాఠీ పంద్రెండవు శతాబ్దాంతమునఁగాని సాహిత్యస్థాయినందికొనలేదు 4.ఆమాటకు వచ్చినచో, పంద్రెండవు శతాబ్దికి పూర్వము నవీనోత్తరాహ భాషలేవియును పురుటి గదినుండి వెలికి వచ్చినవి కావు. ఈ సంసర్గము కారణముగా తెలుఁగు పదము లెన్నో మరాఠీ వారి నోళ్ళలో నలుగుడువడి వ్యావహారిక రూపములుగా కోశముల కెక్కియు, పండితకవి సమ్మతిని బడిసి సాహిత్యస్థాయిని సంపాదించియు అక్షరరూపమున చిరస్థాయియయినవి. అడకిత్తా (= అడకొత్తు), ఆటపాట (= బాలికల ఆట), ఊరగుడి, ఓనామా, కట్ట (= అరఁగు), బసవీ, (= వేశ్య), బాగ (= బాగు), వకటి (= విటిదాండు-బిళ్ళంగోడి లేక చిల్లకట్టె-ఆటలో 'ఒకటి' అను అంకె), సజ్జగురా (= సజ్జకొట్టు). ధాన్యవిశేషము- మొదలగునవి మరాఠీలో మచ్చికపడిన కొన్ని తెలుఁగు పదములు.[5] వీనిలో ఒక కొన్నింటికి కావ్య ప్రయోగములును లేకపోలేదు. భక్త కవియగు జ్ఞానేశ్వర (క్రీ. శ. 1290) కృతమగు 'జ్ఞానేశ్వరి' (భగవద్గీతకు మరాఠీలో విపుల వ్యాఖ్యానము) యందును, మహానుభావ పంథకు చెందిన భాస్కరభట్ట కవి (క్రీ. శ. 1305) రచితమగు 'శిశుపాల వధ' యందును పూర్వోక్తములగు తెలుఁగు పదములలో కొన్ని ప్రయుక్తము. 'విటిదాండు' ఆట లెక్కింపులోని వకటి, లేండ, మూండ, నాల, ఆర, పైద-అను అంకెలు క్రమముగా తెలుఁగునందలి ఒకటి, రెండు, మూడు, నాలుగు, ఆఱు, ఐదు-అను వానికి వికృతులు. మరాఠీలో ఈ యాట యందు ఆర (= ఐదు), పైద (= ఆఱు) అని వ్యవహారము. మూలపదముల అర్థము తెలియమి, పరిగణ నక్రమము నందలి ఈ తబ్బిబ్బునకు మూలము. ఇట త్ర్వర్థకముగా 'మూండ' అని ప్రాచీనోచ్చారణమునకు గుఱుతుగా పూర్ణబిందు ఘటితరూపము నిర్వాహమగుట గమనార్హము! ఆఱేడు శతాబ్దుల క్రిందటి మాట. మరాత్వాడాలో పంద్రెండేండ్లు వఱపు పట్టి పెద్దకఱవు రాగా, ఆరె వారు ఆబాల గోపాలము సుభిక్షమగు తెలుఁగు సీమకు వలసవచ్చిరఁట! ఆ పంద్రెండేండ్ల సావాసము ఊరకపోలేదు. 'సోళా దొప్పియు నెత్తమున్ మొదలుగా జూదంబు...'ల లోని పరిభాషయంతయు మరాఠీవారి ఆటలనుండి తెలుఁగున దిగుమతి యయినది.[6] తెలుఁగు పిల్లల ఆటపాటలు మరాఠీ బిడ్డలు నేర్చిరఁట! తెలుఁగు అంకెల పరిభాష కలిగిన 'విటిదాండు' దీనికి సాక్ష్యము. ఇది, మన గొప్పకు చెప్పెడి అన్యోన్య ధన్యతా కథనము కాదు. ఇది, మరాఠీ పండితులును, చరిత్రకారులును అంగీకరించిన యంశము.[7] మరాఠీయందలి ఇట్టి తెలుఁగు పదములను గూర్చి వివరించు భారము మరాఠీపండితులది. తెలుఁగునందలి మరాఠీపదములు శ్రీనాథ యుగీనములు ఈ వ్యాసమున వివృతములు. తదర్వాచీన యుగీనములగు పదములు: ఉగ్రాణము మరాఠీ ఉగ్రాణ, ఉగ్రాణీ; సంస్కృత. ఉద్గ్రిహణ (ణీ); చూ. ప్రాకృత. ఉగ్గహణ; తెలుఁగు. గడమ (వ)ంచు, గెడంచు, గెడమంచ (చి). < మరాఠీ. ఘడమంచ, ఘడోంచీ < ప్రాకృత. ఘడమంచ < సంస్కృత. ఘటమంచ (చక). ఇది దిక్ప్రదర్శనము మాత్రము.[8]

ఇఁక, ఆ యుగము నాఁటి పారసీక సంబంధము మాట! ఉత్తరా పథమున మొహమ్మద్ ఘజ్నవీ, షాహబ్-ఉద్-దీన్ మొహమ్మద్ గోరీల మెఱపు దాడులు[9] కడచని, ఖిల్జీసుల్తానుల (క్రీ. శ. 1290-1320) పాలన అంతరించి, తుఘ్లుక్ వంశీయులు (క్రీ. శ. 1320-1414)ను సయ్యద్ వంశీయులు (క్రీ. శ. 1414-1450)ను, లోడీ వంశీయులు (క్రీ. శ. 1451-1526)ను క్రమముగా ఢిల్లీ సింహాసన మధిష్ఠించిన కాలమది. ఆర్షధర్మ నిర్వాహకములుగా పెట్టని కోటలయిన దేవగిరి, ఓరుగంటి రాజ్యములు పతనము కాఁగా. తండములు తండములుగా వచ్చు ముస్లిముల

---

4. శ్రమణబెళగుళ (క్రీ. శ. 983), దివే ఆగర (క్రీ. శ. 1060), అంబేజోగాఇ (క్రీ. శ. 1144) శాసనములు మరాఠీ భాషానేపథ్యాలంకారములని కొందఱు (Vide : Prof S. G. Tulpule, An Old Marathi Reader, Poona).

5. K. P. Kulakarni, Marathi Etymological Dictionory.

6. ఉత్తరహరివంశము, తృతీయా 120-129.

7. సురవరము ప్రతాపరెడ్డి, ఆంధ్రుల సాంఘిక చరిత్ర, ద్వి. ము., పుటలు 84,85.

8. మఱికొన్ని ఉదాహరణములకు చూ. డా. భద్రిరాజు కృష్ణమూర్తి, మాండలికవృత్తి పదకోశం ( వ్యవసాయ విభాగం) ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీ ప్రచురణ, 1962, పుటలు, 33,34.

9. వీరి మెఱపుదాడులవలన ఉత్తర భారత భాషలేవియును ప్రభావితము కాలేదని డా. హరదేవ్ భాహిరి నిర్ధారణము (Vide : Dr. Har Dev Bahri, Persion Influence on Hindi, pp.3,4). ఇట్టిచో దక్షిణభారత భాషల ప్రస్తావము అప్రస్తుతము.

దాడుల నరికట్టుటకు గాను క్రీ. శ. 1336 లో విజయనగర సామ్రాజ్యమునకు విద్యారణ్యుల చేతి మీఁదుగా శంకుస్థాపన జరిగి, విజయ పరంపరలతో, విద్యావినోదములతో తుంగభద్రా సముత్తుంగ తరంగ రంగములు నూత్న భంగిమల నంగీకరించిన స్వర్ణయుగమది. దీనికి పక్కలో బల్లెముగా క్రీ. శ. 1347 లో తెలుఁగు — కన్నడ నాడుల కూడలియగు 'గుల్బర్గా' రాజధానిగా బహమనీ సామ్రాజ్యమును అవతరించి నిరంతర ప్రతిభటత్వముతో ప్రభుతనిర్వహించిన స్పర్ధాసమయమది. కాలము, కర్మము కలసిరాక ఆంధ్ర సురత్రాణ బిరుదాంచితులగు ముసునూరి దొరల రాచసిరి తరలిపోఁగా, కొండవీడు, రాజమహేంద్రవరములలో రెడ్డిరాజులును, రాచకొండ, దేవరకొండలలో వెలమ ఱేండ్లును, అహమహమికతో రాచఱికము నెఱపిన రగడ రోజులవి. ఈ యుగమున హిందూ ముస్లిము పాలకులకు జరిగిన సంధి విగ్రహాదులు అసంఖ్యాకములు. వాని నన్నింటిని పేరుపేరున పేర్కొనవలయుచో ఇది యొక కంబరామాయణము కాఁగలదు. విస్మృతాంశములు కొన్ని ఇట విస్తృతము.

డిల్లీశ్వరులకు నామమాత్రపు సామంతులుగా, పాండువాపట్టణము రాజధానిగా బంగాళానుబాను పాలించిన సుల్తానులనే శ్రీనాథుఁడు 'పండువాసురతాణు'లని వ్యవహరించుట. వీరికే లక్ష్నావతీ పాదుషాలనియు వ్యవహారము. వీరిలో ఘియాజ్_ఉద్_దీన్ ఆజమ్‌షా (క్రీ. శ. 1389_1410), సైఫ్_ఉద్_దీన్ హంజహ్‌షా (క్రీ. శ. 1410_1412), షిహాబ్_ఉద్_దీన్ బాయజీద్ షా (క్రీ. శ. 1413_1414), అలా_ఉద్_దీన్ ఫీరోజ్‌షా (క్రీ. శ. 1414_1415), జలాల్_ఉద్_దీన్ మొహమ్మద్ షా (క్రీ. శ. 1415_1431)లు శ్రీనాథునకు సమకాలికులగు 'పండువాసురతాణులు' పదుమూఁడవు శతాబ్దాదినుండియు పండువా_కటకములకు సరిహద్దు వివాదముల మూలమున అప్పటప్పట చిటిపొటికయ్యములు సాఁగుచుండెడివి. పండువాసురతాణులలో పూర్వుఁడగు షంష్_ఉద్_దీన్ ఇల్యాస్‌షా (క్రీ. శ. 1345_1359) ఫౌజులు 1353 లో ఒరిస్సాపై దండెత్తి చిలకసరస్సు దాఁక కూచి చేసినవి.[10] బంగాళమునకును, సాగరాంధ్రమునకును నడిమిది ఉత్కలదేశము. మధ్యాంధ్ర మహీశులగు రెడ్డిరాజులును గౌడాధిపతి గెల్చి గజపతిదళవిబాళాఖ్యాన బిరుదంబు లలవరించి.....సింహాచలోత్తర భాగలిఖిత వివిధ జయశాసనాక్షర...సమిద్ధగుణులు.'[11] రెడ్డిరాజులు, పండువాసురతాణులు ఈ ఉభయులును కటకేశ్వరులకు అహితులు. ఒకే శత్రువునకు సామాన్య శత్రువులగుట కారణముగా ఈ యుభయులును పరస్పరము హితులు; సమానవ్యసనవ్యాపారములచే సన్నిహితులు. తన్మూలముననే 'పండువాసురతాణి పావడం బంపిన భద్రేభములు (రాజమహేంద్ర) వీధిఁబాలె ముండు' (భీమ. 1_38; కాశీ. 1_35) టః. ఇంతేకాదు. 'పండువాడిల్లిరాఘాది పట్టణముల యధిపతులు మౌళిఁదాల్చు రత్నాంకురంబు లవచి త్రిపురాంతకానీతయానపాత్ర సింహళ ద్వీపమండల క్షేత్రజములు' (హర. పీఠిక, 29). ఈ అవచిత్రి పురాంతకుఁడు 'కొమరగిరి నృపవసంతాగమ కేళీగంధసార కస్తూరీ కుంకుమ కర్పూర హిమాంభస్సము దంచిత బహుసుగంధి శాలాధ్యక్షుఁడు' (హర. పీఠిక, 30). అవునో కాదోకాని, అర్వాచీనుఁడును, కావ్యాలంకార సంగ్రహకృతి భర్తయును నగు నరసభూపాలుడు 'మక్భామండువ పండువా భయదదోర్మాహాత్మ్య' (కావ్యా. సం. 5_244) ము కలవాఁడఁట ! పారసీక భాషావలంబులగు పండువా సురతాణు లిట్లు మన సాహిత్యమున ఉట్టంకితులు.

మఱియొక దిక్కు : ధారా, మండువా పట్టణములు రాజధానులుగా, వింధ్యాద్రి పాదములఁగల మాళవదేశ దక్షిణ భాగమును పాలించిన ఘూరీ వంశీయులగు సుల్తానులు (క్రీ.శ. 1401_1500) ఆంధ్ర సాహిత్యమున ధారాసురత్రాణులుగా వ్యవహృతులు. వీరే మండువా సుల్తానులు. వీరు అటు గుజరాతు నవాబులతోడను, ఇటు హిందూ పాలకులగు ఒరిస్సా ప్రభువుల తోడను నిరంతరము యుద్ధములు చేయుటయందే గడపిరి. ఈ సుల్తానులలో నొకఁడగు హూషంగ్ (క్రీ.శ. 1405_1435) కుటిల రాజనీతి కోవిదుఁడు; క్రీ.శ.1421లో కటకేశ్వరుఁడగు నాల్గవ భానుదేవుని (క్రీ శ. 1409_1435) కపట ప్రబంధమున ఓడించి, చెఱపట్టినవాఁడు.[12] కటక విజయముతో మత్తెక్కి, భద్రజాతి గజసైన్యముతో రాజమహేంద్రపురమును ముట్టడించి, దొడ్డయ అల్లాడరెడ్డి చేత నిర్జితుఁడయిన వాఁడు ఈ హూషంగ్. వాస్తవముగా భద్రజాతి గజముల పెంపకమునకు ధారాసురత్రాణులు పెట్టినది పేరు. కడిమి కత్తులమ్మిని వర్ణించు సందర్భమునందలి 'దాని చన్నుదోయి ధారాసురత్రాణ కటక కుంభికుంభ

10. R. C. Mazumdar, Delhi Sultanate.
11. నిశ్శంకకొమ్మన శివలీలా విలాస పీఠిక.
12. R. C. Mazumdar, Delhi Sultanate.

కలహకారి'యను క్రీడాభిరామకర్త ఉత్ప్రేక్ష దీని కనుప్రాసము. 'ప్రబల ధారాసురత్రాణ భద్రజాతి కరిఘటా సైన్యదుస్సాధ కనక లోహ గోపురద్వాః కవాటప్రదీపి తమది సాంద్రవిభవంబు రాజమహేంద్రపురము', (కాశీ. 1-58) రాజధానిగా 'చీకటియున్ గళింగయును చిల్కసముద్రము సింహశైలమున్... ఏకసితాత పత్రముగ నేలిన ఉత్తమ శ్లోకుఁడు......' (కాశీ. 1-60) అల్లాడవీరభద్రారెడ్డి 'ధారాపట్టణ సార్వభౌమ సురధాణ్దర్పాహారక్రియా ధౌరంధర్య పటిష్ఠ నిష్ఠుర భుజాదండ భోశి సంరంభ...' (కాశీ. 5-37)ము వలన 'ధారాసురతాణ దర్ప ధరణీధ్ర పవి' (కాశీ. 6-309) యని బిరుదందినవాఁడు. వీరభద్రారెడ్డి జనకుఁడగు దొడ్డయ అల్లాడరెడ్డి '...ధారాసుర త్రాణుఁ బోర నిర్జితుఁజేసి కొల్లవెట్టించెఁ దద్ఘోటకములు...'అని శివలీలా విలాసకర్త నిశ్శంకకొమ్మన కథనము. 'ధారాసురత్రాణ ధాటీ సమారంభ గర్వపాథోరాశికలశజులు... వీరభద్రేశ వేమ పృథ్వీధవులు...' (భీమ. 1-29) అని వీరభద్రారెడ్డి విద్వాంసుఁడు కైవారము సేయుట 'ధారాసురత్రాణ పరాజయము' ప్రాధాన్యమును ఆమ్రేడించుటకు '...అల్లాడాధీశు వేమ క్ష్మాధీనాథు భూరి నిష్ఠుర ధాటీ విహార చటుల సైన్యనాసీర తుక్ఖార శఫపుటోత్థ విధ్యపార్శ్వ వసుంధరా విపులధూళి' (కాశీ. 1-34) దీనికి ఉపబలకమగు మరియొక ఉపపత్తి.[13] బొఁగాములు నిర్ధారింప అనువుపడలేదుగాని '...బోనగిరి చెంచికొమ్మ ధారాపురీ పెనుగొండాద్యఖిలైక దుర్గహరణ ప్రెంఖత్ప్రతాపోదయుఁడు' (జై. 6-271) అఁట జైమినీ భారత కృతిపతియగు సాళ్వగుండ నారసింహరాజు! ఆ పిమ్మట ఉద్ధతుల మధ్య పేదలగు రెడ్డిరాజులకు 'కర్ణాటోత్కల పారసీకనృపసఖ్య' (కాశీ. 3-243)ము అవశ్యమయి, 'ఉత్కల కర్ణాట తురుష్కరాట్పరమమిత్రులు' (కాశీ. 2-165)గా వారు మెలఁగ ప్రయత్నించినను వారి ప్రభుత్వము అనతికాలముననే ఆరతి కర్పూరమయినది. మనకు మిగిలినది 'దాక్షారామ చళుక్యభీమ వరగంధర్వాప్సరో భామినీ వక్షోజద్వయ గంధసార ఘుస్పణ ద్వైరాజ్యభారంబు నధ్యక్షించు' కవిసార్వభౌముని ప్రౌఢసాహిత్యము. ఈసాహిత్యమే ప్రస్తుత సమీక్షా వ్యాపారమునకు మొదలు నంచి.

బహమనీ సులతానులు, గుజరాతు నవాబులు, ఘూరీ వంశీయులగు ధారాసుర త్రాణులు, పండువా పాదుషాలు రాజకీయ భాషగా పారసిని చేపట్టి రాజ్యభారభరణ వ్యాపార దక్షులయిన శతాబ్దమది. ఈ యీ ముస్లిము పాలకులతో రాజకీయ సంబంధములను సమర్థముగా నిర్వహింపవలయుచో, అందఱు కాకపోయినను పరిసర సీమలలోని బాహత్తరి నియోగము వారిలో ముఖ్యులు కొందఱయినను పారసి భాష నభ్యసింపక తీఱదుకదా! శక్తిత్రయ చతురుపాయ షాడ్గుణ్య ప్రయోగ్యాయోగ్య విచారులగు రాయబారులు '......లిపులెల్లఁ జదువను లిఖియింపవలఁతులై భాషలఁ బెక్కింటఁ బ్రౌఢిగల్గి......' (342) యుండవలయుననియు, గణకుఁడు 'అలఘుచిత్తుఁడు లఘుహస్తుండునై పెక్కులిపులభ్యసించి యేలికకు మిగుల ననుకూలుఁడై ...' (303) మెలఁగవలయు ననియు మడికిసింగన (క్రీ.శ.1430)

13. చరిత్ర కావచ్చును. కాకపోవచ్చునుగాని ఇక్కడ ఒక చమత్కారము. సుమేరుశైలముతో ప్రతిఘటించిన వింధ్యమహీధర వృత్తాంతము రెడ్డిరాజులకు, ధారాసురత్రాణులకు ప్రధానత్వాపేక్ష నడచిన పోరాటములకు వ్యంజకముగా వర్ణ్యమని నాయూహము. సంస్కృత కాశీ ఖండమున వింధ్యాటోపఘట్ట మింత విశిష్టముగా లేకపోవుట నాయూహకు ప్రధానబలము. శ్రీనాథుని సంతరింపునందలి కొన్ని భంగ్యంతర సూచనలు దీనికితోడు, వింధ్యమువలె 'ఒరుల యైశ్వర్య మీక్షించియు పతపించునట్టి ఖలుఁడు...' (కాశీ. 3-6) ధారాసురత్రాణుఁడు. వింధ్యము ప్రతిస్పర్థించిన సుమేరుశైలము సురాష్ట్రపాలకుఁడగు గుజరాతునవాబు అహమ్మదుషాహి (క్రీ. శ. 1411-1443). వీరభద్రేశవేమ పృథ్వీధవుల మంత్రి బెండపూఁడి అన్నయ పారసీ బాసలో కాకితములు వ్రాసినది. ఈ అహమ్మదుషాహికే అఁట: (Vide: History of the Reddi Kingdoms, p. 186, Fn. 38). రెడ్డిరాజులకు మిత్రులయిన గుజరాతు నవాబులకును, జ్ఞాతిభూభృజ్జిగీషా చింతాగ్రస్తులగు ధారాసురత్రాణులకును నిరంతరము పోరాటములుసాఁగుట చరిత్రప్రసిద్ధము. 'ఉదయ పర్వత కటక గండోపలము ఆ...ప్రాఁకిన భాను కిరణముల...' (కాశీ. 1-122) కటకేశ్వరుఁడు నాల్గవ భానుదేవుఁడు (క్రీ. శ. 1409-1435) వ్యంజితుఁడు. 'ఒక్క నిమేషము రాహువు పుక్కిటిలోఁ దగులు వడకపోయెడు భానుం డిక్కొండ పక్కఁజిక్కు ... (కాశీ. 1-134) టలో వింధ్యపార్శ్వవసుంధరా సురత్రాణుఁడగు హూషంగ్‌షా చెఱలోఁజిక్కి చీకాకుపడిన నాల్గవ భానుదేవుఁడు సూచితుఁడు. 'భాను...ప్రతిబంధము త్రైలోక్యప్రతిబంధంబై విపత్పరంపరలఁబెనచు...' (కాశీ. 1-136)ట భానుదేవుని నిర్బంధము త్రైలోక్యవిజయ మంటపాధిరూఢులగు రెడ్డిరాజులకును విపత్పరంపరలకు మూల మనుట వ్యంగ్యము. వింజమాఁకిడుటవలన నయిన ఆపదను తొలఁగింప అగస్త్యునివేఁడ కాశికరిగి, 'నిఖిలదేవతా సార్వభౌమునకు త్రైలోక్యసామ్రాజ్య పట్టాభిషేకంబునకుఁదగిన హేమపీఠంబునుంబోని యమ్మహాస్థానంబు గలయఁగ్రుమ్మరి' (కాశీ. 2-42)నవారు జంభమథన పురోగములైనసురలు. 'త్రైలోక్యవిజయాభిధంబైన చంద్రశాలా ప్రదేశంబునందు' (కాశీ. 1-10) కాశీఖండ కృతిస్వామి వీరభద్రేశుఁడు ద్వితీయ శంభుఁడు కొలువుతీరుట భంగ్యంతర సూచన. వింధ్యగర్వాటోప భంజనుఁడు కలశజుఁడు. 'ధారాసురత్రాణ ధాటీసమారంభ గర్వపాథోరాశి కలశజులు...వీరభద్రేశవేమ పృథ్వీధవులు...'(భీమ. 1-29). 'కలశజులు' వ్యంగ్య వైభవమునకు పతాక.

సకల నీతి సమ్మతము మతము. మంచన కేయూరబాహుచరిత్ర కృతిపతియగు గుండనామాత్యునకు '......వాచకత్వము లేఖకత్వము నాంధ్రలిపిరీతిగా సర్వ లిపుల యందు – ఫణితి జాతియుఁ దీవ్రభంగియును దెనుంగుబాసపోలిక సర్వభాషలందు....... సహజమఁట! పంచాంగస్థిర మంత్రరక్షణ కళాప్రౌఢులును, స్వామి కార్యనిర్వహణ ప్రవీణులునునగు రెడ్డిరాజుల అమాత్యులును పరిసర భాషలను, ముఖ్యముగా పారసిని నేర్చి, అభ్యస్తలిపి ప్రపంచులయి నియోగము నెఱపుట తప్పనిసరి! కొండవీటి మహామాత్యుఁడును, శృంగారనైషధ కృతిభర్తయునునగు మామిడిసింగన 'యవనాదీశ సభానిరంకుశవచో వ్యాపారపారంగతుఁడు' (నైష. 2-144) వీరభద్రారెడ్డి మంత్రియగు బెండపూఁడి అన్నయ (క్రీ.శ.1423-1447) 'అరబీభాష తురుష్కభాష గజకర్ణాటాంధ్ర గాంధార ఘూర్జర భాషల్ మళయాళభాష శకభాషా సింధు సౌవీర బర్బరభాషల్ కరహాటభాషమఱియుంభాషావిశేషంబులు..' (భీమ. 1-73) గోష్ఠీ సంప్రయోగముల అచ్చెరువుగా నియోగింప నేర్చిన వ్యవహారవేత్త. ఈ 'అన్నయ మంత్రిశేఖరుఁ డహమ్మదు షాహి వదాన్య భూమిభృత్సన్నిధికిన్ 14 మదిన్ సముచితంబుగ వేమమహీవరేంద్ర రాజ్యోన్నతి సంతతాభ్యుదయ మొందఁగఁ బారసిభాష...' (భీమ. 1-74) లో కాకితములు వ్రాసిన స్వామి కార్యాభిరక్షాక్రియాదక్షుఁడు, 'కర్ణాట...ఘూర్జరాది నృపసభాస్థాన బుధవర్ణనీయ సుగుణ మండనుండగు బెండపూఁడన్న మంత్రివరుఁడు...' (భీమ.1-19) శ్రీనాథుని కృతిపతులలో నొకఁడు. ఈ సమీక్షా కాలమున రాజకీయ సంబంధమేకాక, వాణిజ్య పరమయిన సంసర్గమును లేకపోలేదు. 15 మన బేహారులు, "విలాతి బాజారు దుకాణదారులనుండి జలతారు కుల్లాయలు, జరీశాలువులు, ముఖమల్లు మోజాలు, లాలుజీబులు, పింగాణీ సామానులు, సుప్పాణి ముత్యములు, గంజాయి, గసగసలు మొదలగు లాహిరి దినుసులు, హురుముంజి తేజీలు, కప్పలి, జోఁగు, వల్లి, వలికా, సమ్మాన్లలో తెప్పించి సలీసు వెలలకు విక్రయించి, అసలుఖర్చు వహితేల్చి కోటికి పడగలెత్తినవారు. జలపోసనపు జమ్మఖానములు పరచిన హజారపు చావడిలో జాళువాపైఁడి తఖ్తుపై తబల, సన్నాయి, డమాములు మ్రోయ ఖుసిమీరన్ సురధాణి నిండుకొలువై కూర్చుండెడివాఁడు. కొజ్జాలు, గులాములు సేవింప, నకీబులు పరాకు లెచ్చఱింప, విలాతిఖానులు, సరిహద్దు సహాలు పంపిన రాయబారులు వచ్చి అరబి, ఆరె, పారసి, రుమీ మొదలగు బాసలలో వ్రాసిన కాకితములను వినిపించెడివారు. విలాతి దుకాణదారులు వచ్చి కుందనపు కమ్మరుబందులు, చికిలిసేసిన అపరంజి మోళపు బాఁకులు, బిబ్బీల గాగరాలు ఉలుపా చదివించెడివారు. జూటరులు గలబ, జులుము, లూటిసేయకుండ గస్తుకావలివారు కాఁపుండెడివారు. కంఖాణి. కత్తలాని, సామ్రాణి, జిరా తేజీలపై చబుకుసేయు సవాలక్ష పౌజు బరాబరులు సేసెడిది." 16 'చీని సింహళ తవాయి హురుముంజి చోళంగి తరుణాసీరిగోవ ప్రభృతి నానా ద్వీప నగరాకరంబులగు ధనకనక వస్తు వాహన మాణిక్య గాణిక్యములు తెప్పించెడి అవచితిప్పయసెట్టి' (హర. 1-7) హరవిలాసకృతిపతి; శ్రీనాథునకు బాల్యసఖుఁడు. 'హరిహరరాయ ఫేరోజజహా సురధాణ గజాధిపాదిభూవరులు నిజప్రభావ మభివర్ణన సేయ కుమార గిర్యధీశ్వరుని వసంత వైభవము సర్వము నొక్కఁడ నిర్వహించు...తిరుమల నాథసెట్టి...' (హర. 1-24) అవచి తిప్పయకనుజన్ముఁడు.

వ్యాకరణ సంప్రదాయము : తెలుఁగు వ్యాకర్తల విభజనలో శబ్దజాలము తత్సమ తద్భవ దేశ్యములని మూఁడు ముఖ్య వర్గములు. 'ఒక భాషలోనికితరభాషలనుండి సంక్రమించిన పదములన్నిటిని అన్యదేశ్యములుగాఁ బరిగణించినఁ జాలదా అని విచారించినచో వీరికి సాంప్రదాయము ప్రాకృత వ్యాకరణముల ఫక్కినను సరించుట వలన వచ్చినదని తెలియకపోదు' 17 తాను, 'త్రాసు' అను అన్యదేశ్యమును ప్రయోగించియు కేతన, అన్యదేశమును పేర్కొనక పోవుట వింత. అచ్చతెనుఁగు కాక దేశి

---

14. ఈ పాదము 'అన్నయ మంత్రిశేఖరుఁడహమ్మదుషా గుజరాత భూమి భృత్సన్నిధికిన్...'అని యుండుట యుక్తమని మల్లంపల్లివారి సూచన (Vide : History of the Reddi Kingdoms, p. 186, Fn. 38).

15. He (Firuz Shah of Bahmani, 1397--1422 A. D.) devoted much attention to the two principal ports of his Kingdom, Chaul and Dabhol, which attracted trading ships from the Red sea and Persian gulf, and poured in to the Kingdom articles of necessity and luxury not only from Persia, Arabia and the African coast, but also from Europe) (R. C. Mazumdar, Delhi Sultanate, p. 256).

16. ఈ యుద్ధరణ చిహ్నముల నడిమి కూర్పు పదపట్టికలో నుట్టంకితమయిన అన్యదేశ్యముల చేర్పు.

17. కోరాడరామకృష్ణయ్య, ఆంధ్రదేశ్యము - అన్యదేశ్యము, భాషాచారిత్రకవ్యాసములు, పు. 111.

తెనుఁగులు (ఆంధ్రభాషా భూషణము, 24), దేశ్యంపుఁ దెనుఁగులు (పైది, 25) అను రెండు రకములయిన పట్టికలనిచ్చుటలోని పరమార్థము దురూహము. కావ్యాలంకార చూడామణి కర్తయగు విన్నకోట పెద్దన (క్రీ. శ.1405).

'కవమునఁ దత్సమమును ద
ద్భవమును సహజాంధ్రదేశభవమును దేశో
ద్భవమును గ్రామ్యముననఁ బం
చ విధములై తెలుఁగు పలుకుజాతము పరఁగున్' (కావ్యాలంకార

చూడామణి, 9-11) అనియు

'శ్రేయములై బహు దేశా
నేయములై చక్కఁదనము నెఱఁదనములునై
యాయా నెలవులఁ జెవులకుఁ
దీయములగు పలుకులెల్ల దేశ్యముల రయన్' (పైది. 9-16)అనియు

నిరూపించినాఁడు. దేశోద్భవమనఁగా పరిసర స్థలములగు దేశభాషలనుండి ఎరవుతెచ్చిన పదరాశికాఁబోలు! బహుదేశానేయములైన దేశ్యములివియే. సహజాంధ్ర దేశభవము లనఁగా తెలుఁగు సీమకు నిసర్గములయిన పదములని అన్వయము. కాని, దేశి నామకములైన పదముల పట్టికలో అచ్చెరువు, డిల్ల (పాటు), (నె)మ్మొము మొదలగు తద్భవములుండుటను ఎట్లు సమన్వయింప వలెనో తత్త్వాభిజ్ఞులు నిర్ణయింతురుగాక!

'తజ్జాసమాచ దేశ్యా గ్రామ్యా చేయం
చతుర్విధాభవతి.
ప్రకృతిద్వయ జాతజ్జాతుల్యాతు సమా
ప్రవాహిని దేశ్యా'—

అని ఆంధ్ర శబ్దచింతామణి. 'అహేయ మన్య దేశీయం యత్తదేవ ప్రయుజ్యతే' (వికృతి వివేకము. సంజ్ఞా. కా. 9) అను వికృతి వివేకకారుని హృదయమే మో సుబోధముగాదు. ఈ పట్టునఁగల వ్యాఖ్యాతల వివరణమును కారికాతత్త్వ ప్రకాశకముగా స్వీకరించుట యుక్తియుక్తముగాఁ దోఁపదు. తేజీ, నేజా — మొదలగు అన్యదేశ్యములను బాల సరస్వతి దేశ్యములని వ్యవహరించినాఁడు (చూ. బాల సరస్వతీయము, అజంత. 'నచదేశ్యపదే' అను సూత్రము క్రింది వివరణము), అప్పకవి (క్రీ. శ. 1656) శుద్ధాంధ్రంబులు, అన్యదేశ్య జాంధ్రంబులు అని ఆంధ్రదేశ్యము రెండు తెఱంగు లయ్యెనని చెప్పి (చూ. అప్పకవీయము. 1-105) లక్ష్యములు పేర్కొనినాడు.

(సశేషం)

# రచయితలు

డాక్టర్ నీలం సంజీవరెడ్డి, ముఖ్యమంత్రి, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, హైదరాబాద్.

శ్రీ పి. వి. నరసింహారావు, B. Sc., LL. B. సాహిత్యరత్న, న్యాయ-సమాచారశాఖల మంత్రి, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం హైదరాబాద్.

శ్రీ రాయప్రోలు సుబ్బారావు, 44 నెహ్రూ నగర్, సికింద్రాబాద్.

శ్రీ కె. బ్రహ్మానందరెడ్డి, ఆర్థిక - సహకారశాఖల మంత్రి, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, హైదరాబాద్.

శ్రీ కె. వి. భాస్కరరావు, పి. ఆర్. ఓ., సమాచార పౌరసంబంధాలశాఖ, హైదరాబాద్,

"కరుణశ్రీ" శ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రి, ఎ. సి. కాలేజి, గుంటూరు, గుంటూరుజిల్లా

శ్రీ వెన్నెలకంటి రాఘవయ్య, B. A., B. L., అధ్యక్షుడు, ఆంధ్ర రాష్ట్ర ఆదిమజాతి సేవకసంఘం, నెల్లూరు, నెల్లూరు జిల్లా,

డాక్టర్ కె. కృష్ణారావు. లీగల్ ఎడ్వైజర్. ఎక్స్ టర్నల్ ఎఫేర్స్, కేంద్ర ప్రభుత్వం, న్యూఢిల్లీ.

శ్రీ కమ్మిశెట్టి వెంకటేశ్వరరావు, గోషామహల్, హైదరాబాద్,

శ్రీ కృష్ణచంద్ర, దాదర్, బొంబాయి.

శ్రీ దండమూడి మహీధర్, ఆల్ ఇండియా రేడియో, హైదరాబాద్.

శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రి, ఉస్మాన్‌సాహెబ్‌పేట, నెల్లూరు, నెల్లూరుజిల్లా.

శ్రీ వేటూరి ఆనందమూర్తి, నల్లకుంట, హైదరాబాద్.

శ్రీ బృందావనం రంగాచార్యులు, తెలుగుపండిట్, పర్చూరు, గుంటూరుజిల్లా.

శ్రీ బి. విద్యాసాగర్, చిక్కడ్‌పల్లి, హైదరాబాద్.

శ్రీమతి ఆవుల జయప్రదాదేవి, హిమాయత్‌నగర్, హైదరాబాద్.

శ్రీ తూమాటి దొణప్ప, తెలుగుశాఖ, ఆంధ్ర యూనివర్శిటీ, విశాఖపట్టణము.

శ్రీ యం. యం. కె. వాలి.

గ్రంథసమీక్ష:

శ్రీ బోయి భీమన్న, మధురకవి, ప్రభుత్వ అనువాదశాఖ, హైద్రాబాద్.

# ముఖ్యవార్తలు

## రాష్ట్రంలో

24 జనవరి :_ గుంటూరులో ముఖ్యమంత్రిని ఐదు రూపాయల నోట్లతో తూచారు. ఈ మొత్తాన్ని జాతీయ రక్షణనిధికి ఇచ్చారు.

26 జనవరి :_ రాష్ట్రంలో గ్రామీణ స్వచ్ఛంద దళం, రక్షణ శ్రామిక బ్యాంకు పథకం అమలుకు ప్రారంభోత్సవం జరిగింది.

హైద్రాబాదులో ప్రభుత్వోద్యోగుల వినియోగదారుల సహకార స్టోర్స్‌కు ముఖ్యమంత్రి ప్రారంభోత్సవం చేశారు. దీనిపెట్టుబడి ధనం ఒక కోటి రూపాయలు.

1 ఫిబ్రవరి :_ కేంద్ర ఆరోగ్య మంత్రి, హైద్రాబాదులో అఖిలభారత పెయిడ్యాట్రీషియన్‌ల సమావేశానికి ప్రారంభోత్సవం చేశారు.

11 ఫిబ్రవరి :_ ముగ్గురు సభ్యులుగల జెకొస్లొవేకియా నిపుణుల బృందం, భారీ విద్యుత్పరికరాల ప్లాంటును గురించి చర్చించడానికి హైద్రాబాదు విచ్చేసింది.

నదీ జలాల వివాదాన్ని గూర్చి చర్చించడానికై కేంద్ర నీటి పారుదల మంత్రి నాయకత్వాన ఒక బృందం హైద్రాబాదు వచ్చింది.

13 ఫిబ్రవరి :_ చీరాల సహకార స్పిన్నింగ్ మిల్లుకు ముఖ్యమంత్రి ప్రారంభోత్సవం చేశారు.

14 ఫిబ్రవరి :_ కేంద్ర ఉక్కు భారీ పరిశ్రమల మంత్రి, హైద్రాబాదులో భారీ విద్యుత్పరికరాల ప్లాంటును గూర్చి రాష్ట్ర ప్రభుత్వ ప్రతినిధులతో చర్చలు జరిపారు.

## భారతదేశంలో

18 జనవరి :_ బంగారం కంట్రోల్ బోర్డు సభ్యులు బొంబాయిలో మొదటిసారిగా సమావేశమయ్యారు.

19 జనవరి :_ మద్యనిషేధం అమలును యధావిధిగా కొనసాగించాలని న్యూఢిల్లీలో జరిగిన ముఖ్యమంత్రుల సమావేశంలో నిర్ణయించారు.

22 జనవరి :_ వేర్పాటుతత్వాన్ని నిషేధించడానికి నిర్దేశించిన రాజ్యాంగం ( 16 వ సవరణ ) బిల్లును పార్లమెంటు సంయుక్త సెలక్టు కమిటీకి నివేదించారు.

25 జనవరి :_ కొలంబో ప్రతిపాదనలపై భారత ప్రభుత్వ దృక్పథాన్ని లోకసభ ఆమోదించింది.

30 జనవరి :_ విమాన దాడుల నుంచి రక్షణకై భారత అవసరాలను పరిశీలించడానికి సంయుక్త పశ్చిమ వైమానిక కమిషన్ న్యూఢిల్లీ వచ్చింది.

2 ఫిబ్రవరి :_ భారతదేశంలో అధికార పర్యటనపై గ్రీక్ రాజు పాల్ న్యూఢిల్లీ విచ్చేశారు.

4 ఫిబ్రవరి :_ రాష్ట్ర గృహ నిర్మాణాల మంత్రుల సమావేశం బొంబాయిలో జరిగింది.

5 ఫిబ్రవరి :_ రాష్ట్ర ఆర్థిక మంత్రుల సమావేశం న్యూఢిల్లీలో జరిగింది.

7 ఫిబ్రవరి :_ బొంబాయిలో జరిగిన అంతర్విశ్వవిద్యాలయ బోర్డు సమావేశంలో విశ్వవిద్యాలయం స్థాయిలో బోధనా భాషను మార్చడానికి బోర్డు తన అనుకూలతను ప్రకటించింది. అయితే " జాగ్రత్తగా తయారు అయ్యాకనే " యీ మార్పు తేవాలని అభిప్రాయ పడింది.

8 ఫిబ్రవరి :_ ఇండియా, పాకిస్తాన్‌ల మధ్య మంత్రుల స్థాయిలో మూడవ సారి చర్చలు కరాచీలో ప్రారంభమయ్యాయి.

కృష్ణా గోదావరి నదీ జలాల సమస్య పై దక్షిణ రాష్ట్రాలతో చర్చలు జరపడానికి కేంద్ర నీటిపారుదల మంత్రి నాయకత్వాన ఉన్నతాధికార బృందం న్యూఢిల్లీనుంచి బయలుదేరింది.

ఆభరణేతర బంగారం నిల్వలను ప్రకటించే గడవును ఫిబ్రవరి 28 వ తేదీ వరకు పొడిగించడం జరిగింది.

11 ఫిబ్రవరి :_ భారత _ పాకిస్తాన్ చర్చలు సమాప్తమయ్యాయి.

4 రష్యన్ యం. ఐ. జి. యుద్ధ విమానాలు బొంబాయి రేవుకు చేరాయి.

13 ఫిబ్రవరి :_ కేంద్ర హోం వ్యవహారాల స్టేట్ మంత్రి శ్రీ బి. యన్. దాతార్ న్యూఢిల్లీలో మరణించారు.




సంపాదకవర్యా!

నమోవాకములు : మీరు ప్రతి నెలా పంపుతున్న "ఆంధ్రప్రదేశ్" మాసపత్రికను ఆనందముతో చదువుతున్నాను. ఆకర్షణీయంగా ముస్తాబై వచ్చి మమ్ముల నలరించుచున్న ఈ మాసపత్రికను అందరూ కొంటున్నారను కొంటాను. మీ పత్రిక మూలంగా ఎన్నో విషయాలను–విశేషాలను తెలుసు కుంటున్నాను. ముఖ్యంగా ఈనాటి దేశ విషమ పరిస్థితుల గూర్చి సమగ్ర సమాచారం మాకు అందుతున్నది. *యుద్ధ విశేషాలను, వార్తలను గురించిన–కరపత్రాలు* Booklets *మున్నగునవి మీ వద్ద నున్న* పంపండి. 'ఆంధ్ర ప్రదేశ్' నాకు చేరగానే నా స్నేహితులంతా నా చుట్టూ గుమిగూడి విశేషాలను తెలుసు కుంటారు.

ఇందలి పద్యాలు, కథలు, గేయాలు, దివ్యానుభూతిని కల్గిస్తున్నాయి. అప్పుడప్పుడు నాటికలు, నాటకములు ప్రచురించండి. వాఙ్మయ సంబంధమైన వ్యాసాలు తరచు ప్రచురించండి. దయతో నేను కోరిన వివరాలను పంపుతారు గదూ ! మరి సెలవా !

జి. శ్రీనివాసరావు,
జూనియర్ ట్రైనింగ్ క్లాసు,
జి. బి. టి. స్కూలు,
ఒంగోలు.

[వీరికి కావలసిన సమాచారం అందజెయ్యడం జరిగింది. ఎడిటర్.]

మీ ఆంధ్రప్రదేశ్ వెలుగు బాటలు, తెలుపు నలుపు, ముఖ్యవార్తలు, నన్నెంతో సంతోషింప చేయుచున్నవి. చెత్త అనునది లేకుండా క్లుప్తముగా దేశ పురోభివృద్ధిని, ప్రస్తుత పరిస్థితులను తెలుపుటలో యీ పత్రిక సాటిలేని దని చెప్పవచ్చును.

రాయవరపు రామస్వామి కవి,
దార్లపూడి.

ఆర్యా,

1963 సంవత్సరము ఫిబ్రవరి ఆంధ్ర ప్రదేశ్, తెలుగు : సర్వాంగ సుందరముగా కన్నుల కింపుగా వెలువరించినందుకు మీకు నా అభినందనలు. దీనిలోని కావ్య ఖండికలు ఎంతో ఆకర్షకముగా ఆబాల వృద్ధులకు శౌర్యోద్రేకములను కార్య శూరత్వమును కలిగించునవిగా నున్నవి.

శ్రీ వివేకానందుడు, శ్రీ వీరేశలింగము వీరిని గూర్చిన వ్యాసరాజము లెంతో గంభీరమై యలరారు చున్నవి.

ముఖ్యముగా రచయితల పరిచయము నా బోటివానికెంతో ఉపకరించునదిగా ఉన్నది. అనేక మంది కవులతో మీ రిచ్చిన చిరునామాల ద్వారా స్నేహము పెంపొందించుకొన నవకాశము కలిగినది. మీకు నా కృతజ్ఞతలు —

సాహిత్యరత్న–భాషాప్రవీణ,
కె. టి. యల్. నరసింహాచార్యులు,
తెలుగు పండిట్
జడ్. పి. హెచ్. స్కూలు,
ముదునూరు.

---

14 ఫిబ్రవరి :– ప్రస్తుతం ఉన్న డాక్టర్ల కొరతను తీర్చడానికి వీలుగా స్వల్పకాలిక వైద్య కోర్సును ప్రవేశ పెట్టాలని భారత వైద్య మండలి సిఫారసు చేసింది.

## విదేశాల్లో

18 జనవరి :– బ్రిటిష్ లేబర్ పార్టీ నాయకుడు శ్రీ హ్యూగ్‌గేట్సుకల్ మరణించారు. ఆయన వయస్సు 56 సంవత్సరాలు.

22 జనవరి :– ఫ్రాన్స్, పశ్చిమ జర్మనీలు ఉభయుల సహకారంపై ఒక ఒప్పందాన్ని కుదుర్చుకున్నాయి.

4 ఫిబ్రవరి :– టాంగనికా అధ్యక్షులు మోషిలో ఆఫ్రికా – ఆసియా సమైక్యతా సమావేశానికి ప్రారంభోత్సవం చేశారు.

5 ఫిబ్రవరి :– కెనడా కామన్స్ సభలో ప్రభుత్వంపై తెచ్చిన "అవిశ్వాస" తీర్మానం నెగ్గిన ఫలితంగా డిఫెన్ బేకర్ ప్రభుత్వం పతనమైంది.

8 ఫిబ్రవరి :– ఇరాక్‌లో మిలిటరీ జుంటా అధికారాన్ని వశంచేసుకొని ప్రధాన మంత్రి కాశింను ఉరితీసింది.

8 ఫిబ్రవరి :– కల్నల్ అబ్దుల్‌సలాంఆరిఫ్ ఇరాక్ క్రొత్త ప్రెసిడెంటుగ నియమింపబడ్డారు.

# గ్రంథ సమీక్ష

బాహ్యదృష్టికి సంప్రదాయం, అసంప్రదాయం అనేవి రెండూ భిన్న ధ్రువాలుగా కన్పించినా, సూక్ష్మంగా జీవితాన్ని, జీవిత ప్రకృతినీ పరిశీలించే వారికి అవి రెండు కావు, ఒకే సత్యానికి పూర్వాపరాలు. నేటికి నిన్న సంప్రదాయం. రేపు అసంప్రదాయం. ఈ నేడు రేపటికి సంప్రదాయమే. నిరంతర చలనశీలమైన జగత్తులో క్షణాన్ననుసరించి క్షణం సాగిపోతున్నప్పుడు, సంప్రదాయ, అసంప్రదాయాల ప్రసక్తే లేదు.

అయితే సంప్రదాయికుల సనాతన దృక్కోణంతో చూచినప్పటికీ ఇప్పుడు వచన కవిత కూడా సనాతనమైనట్టిదే; బ్రాహ్మణాలు, ఆరణ్యకాలు మొదలైన సనాతన సాహిత్య క్షేత్రంలో యీ వచన కవితాసస్యం విరివిగా పండించబడినట్టిదే. అన్ని విలువలతోపాటు, యీ విలువలుకూడా మృగ్యమైపోయిన యిటీవలి పిదపకాలంలో ఏది సంప్రదాయమో, ఏది అసంప్రదాయమో గుర్తు తెలియకుండా పోయింది. కాలాన్ని ఏకస్వరూపంగా భావించగల వారికి సంప్రదాయ, అసంప్రదాయాల ప్రశ్నే ఉదయించదు. కాలాన్ని మూడుగా విభజించి, గతం లేదు, భవిష్యత్తు రాదు, అనుకొనే కేవల తత్కాల వాదులకు మాత్రమే యీ రభస.

ప్రస్తుతం మన ముందున్న పుస్తకాలు 'కాలం గీస్తున్న గీతలు' (కవిత) అశ్వఘోషుడు (నాటకం) శ్రీ విశ్వంగారివి. 'భిన్న ధ్రువాలు' (కావ్యం) శ్రీ మురళీధర్ గారిది.

కాలం గీస్తున్న గీతలు ! ఏమిటవి ? అవి ఏమీ కావు. వట్టి గీతలు.

''అనుభవాల నేలపై
ఇంకని జ్ఞాపకాల చుక్కలు
చెట్టా పట్టాలు పట్టి
వేసుకొన్న బొమ్మ-జీవితం"

విశ్వంగారి దృష్టిలో. అందరికీ జీవితం అంతే. రంగు రంగుల తీయని బొమ్మ అది. సర్వమాధుర్యాలకు నిలయం అది. ఆనంద క్షేత్రం అది. ప్రతివ్యక్తి తన జీవితాన్ని అనుభవాల నేలపై జ్ఞాపకాల రేఖలతో పరమ రమణీయంగా చిత్రించు కొంటాడు. అయితే దానిపైనుంచి, కాల ప్రవాహం ఉవ్వెత్తున ప్రవహించి పోవటంలో — అది కరిగి కేవలం గీతలు మాత్రమే మిగిలే ప్రమాదం ఉంది. భవిష్యత్తుకు బాట వేస్తున్నవాడే, వర్తమానానికి బలైపోవటం తప్పని స్థితి నేటిది. అదెంత భయంకరమో చూపుతారు విశ్వంగారు — నేటి త్యాగానికి రేపటి హక్కుదారు లంతా ఆ త్యాగియొక్క "గొంతులోని మాటల దీపాలు ఎప్పుడు కొండెక్కుతయా అని, వాటి నెప్పుడు శిలాక్షరాలుగా చెక్కిద్దామా అని" ఎదురు చూస్తున్నారని.

విశ్వంగారి యీ సాహితీకళా విశ్వంలో-విశ్వంలో చతుర్దశ భువనాలవలె పదునాలుగు శీర్షికలు.

ముప్ఫై రెండు పుటలు. వెల రూపాయి. ప్రాప్తిస్థానం. 3-4-424 శివనిలయం.
నారాయణగూడ, హైదరాబాద్—29.

భిన్నధ్రువాలు మురళీధర్ గారి రచన. భిన్నధ్రువాలు, బ్రతక లేక అనే రెండు కావ్యాల సంపుటి యిది.

ఏ సృజనాత్మక మేధావి, కవి, పౌరుడూ కూడ ఉన్నవ్యవస్థలో భాగమై, గడ్డిపోచలా తలవంచుకొని, ప్రవాహంలో కొట్టుకుపోవటానికి ఒప్పుకోడని, మహావృక్షం లాగా పడిపోవటానికే సిద్ధపడతాడని, ప్రపంచిస్తూ, ఆరెండు ప్రవృత్తులకూ రెండు గొంతుకల్ని కల్పించి, వాటి సంఘర్షణనుంచి శ్రీ మురళీధర్‌గారు తీసిన నవనీతం యీ భిన్న ధ్రువాలు.

గతాను గతికంగా తలవంచుకు పోయే గొంతు.

"ఒప్పుకో, ఒప్పుకో
జీవితాన్ని ఒప్పుకో'' అంటూ

ఉద్బోధించగా, మహావృక్షంలా ఎదిరించి నిలిచే మరో గొంతు.

''ఒప్పుకోను, ఒప్పుకోను
యీ వ్యవస్థనే ఒప్పుకోను" అంటూ

తిరుగుబాటు చేస్తుంది. ప్రస్తుత సామాజిక వ్యవస్థ దానంతటది అలా ఏర్పడినట్టిదని, ప్రకృతి సిద్ధమైనట్టిదని, దాన్ని మార్చబూనటమే పిచ్చితనమని, అందువల్ల ఉన్నదాన్ని ఉన్నట్లు స్వీకరించి, నలుగురితో నారాయణగా బ్రతకటం ఒక్కటే మనిషికి సుఖప్రదమని ఉద్బోధించే పాతగొంతుకను, నోరు మూయించే యీ కొత్తగొంతుక—

"ఈనాటి మనిషి,
మనిషి చంపిన మనిషి,
యీనాటి మనిషి
మనిషిని చంపిన మనిషి" అంటూ

ప్రస్తుత సామాజిక నగ్నస్వరూపాన్ని చూపి

"ఊరు నంటుకొన్న మంటలు
ఒకళ్ళ యింటితో ఆగవు"

అంటూ హెచ్చరించి.

"ప్రకృతితో సహకరించటం
పురోగమనానికి విరుద్ధం
వాళ్లంతట వాటిని వదిలేస్తే
నదులన్నీ సముద్రంలో కలుస్తా"

యంటూ సహజస్థితిని ధిక్కరించి ప్రతిభా

ప్రాబల్యాలతో మేధావులు, కవులూ, పౌరులూ అందరం.

''సమాజ కళ్యాణపు
పందిరి గుంజలం
ప్రపంచ శాంతికి గింజలం''

కావాలన్న నినాదం యిస్తుంది. ఇది శ్రీ మురళీధర్‌గారి సందేశం యీ కావ్యంలో.

ఈ భిన్నధ్రువాలు మొత్తం ముప్పై మూడు పేజీలు. వెల రూపాయిన్నర. ప్రాప్తి స్థానం: 3–4–424 శివనిలయం, నారాయణగూడ, హైదరాబాద్–29. సాహిత్యంలోని అన్ని ప్రక్రియల్లోనూ, చేయి తిరిగిన రచయిత శ్రీ అరిపిరాల విశ్వంగారు. ఛాందసపద్యప్రక్రియలో నైపుణ్యం గడించిన తర్వాతనే వచన కవితారీతికి మళ్ళినట్టి వారు. చక్కని గేయాలు వ్రాసినట్టి వారు. వీరి కథలు, నవలలు, పాఠకలోక ప్రసిద్ధాలే. వీరి నాటకం అశ్వఘోషుడు. సంగీతం వినాలి. నాటకం చూడాలి. ఈ అశ్వఘోషుడు నాటకం ఎంత ఆనందమధుర నిర్ఝరో కనీసం చదవనైనా చదివితే సమీక్షలో తదను భూతిని అందివ్వటం సాధ్యంకాదు.

అసలు అశ్వఘోషుడి జీవితమే ఒక దృశ్యకావ్యం. అశ్వఘోషుడు మహాకవి, తత్వవేత్త, గాయకుడు, ప్రేమికుడు; విశ్వ మాధుర్య సమామ్నాయంలో ఏ ఒక్క సాఫల్యం దక్కినా జీవితం ధన్యతమంగా పరిగణించ బడుతుంది. మొత్తం సమామ్నాయమంతా జీవితమై ఆవిష్కరించబడ్డ పూర్ణవ్యక్తి అశ్వఘోషుడు. ఒక సనాతన బ్రాహ్మణ వంశంలో ఏకైక పుత్రుడుగా జన్మించి, పరమ దీక్షతో హిందూమతాన్ని అనుష్ఠించి, ప్రభ అనే గ్రీక్ సుందరిని ప్రేమించి, ప్రేమించబడి, స్వీయమత సనా తన ఆచార కాఠిన్యంతో సంఘర్షించి దాన్ని అభ్యుదయ పథంలోకి మలచలేక ధిక్కరించి, ప్రియురాలి త్యాగంతో, తనవ్యక్తి ప్రణయాన్ని, విశ్వప్రణయంగా భావింపజేసుకొని జగత్ శ్రేయంకోసం బౌద్ధ దీక్షను స్వీకరించిన మహా మనీషి అశ్వఘోషుడు. అట్టి చారిత్రక పురుషుణ్ణి కథానాయకుడుగా గ్రహించి, అతిలోక రమణీయమైన ప్రభాదేవి కథానాయికగా శ్రీ విశ్వంగారు రూపొందించిన యీ దృశ్యకావ్యం ఏభై తొమ్మిది పేజీలది. పదమూడు సన్నివేశాలు కలది.

ఈ నాటకం ప్రాప్తిస్థానం పైదే. ఈ నాటకం ఆంధ్రసాహితీ నందనమందారం అయిన శ్రీ దేవులపల్లి రామానుజరావు గారికి అంకితం కావడం మరీ రమణీయం.

—బోయి భీమన్న.

---

# విశేషాలు-వ్యాఖ్యలు

(8వ పేజీ తరువాయి)

బడలేదని అనుకోవడం జరుగుతున్నది. పరిష్కరించడానికి సాధ్యంకాని సాంకేతిక సమస్యలుగల కొన్ని సందర్భాలలో తప్ప మిగితావాటి విషయంలో దేశంలో పారిశ్రామిక ప్రగతి సమానంగా వుంటే, పరిశ్రమల దృష్ట్యా ఇది ప్రయోజనకారిగా వుండడమే కాకుండా జాతీయ సమైక్యతను పెంపొందించడానికి కూడా తోడ్పడుతుంది. ఈ విషయంలో శ్రీ సుబ్రహ్మణ్యం గారు యిచ్చిన హామీ పూర్తిగా అమల్లోకి రాగలదని ఆశింప బడుతున్నది.

## ఆంధ్రప్రదేశ్ బడ్జెటు

రాష్ట్ర శాసనసభలో 1963 ఫిబ్రవరి 20వ తేదీన ప్రతిపాదించిన బడ్జెటులో 1963–64 సంవత్సరానికి రాష్ట్ర ఆదాయము రూ. 118.36 కోట్లు, ఖర్చు రూ. 118.26 కోట్లు వుంటుందని సూచించ బడింది. బడ్జెటులో రూ. 10 లక్షలు నామమాత్రపు మిగులుగా చూపబడింది.

డా. పి. యస్. లోకనాథన్ సిఫార్సుల ప్రకారం అమ్మకం పన్ను రేటు విషయంలో చేయబడనున్న మార్పుల ఫలితంగానూ, మోటారు బండ్ల పన్నుల విషయంలో చేసిన మార్పుల ఫలితంగానూ రూ. 2కోట్లు అదనపు ఆదాయం వస్తుందని ఆశింపబడుతున్నది. ఈ సంవత్సరంలో ఇతర చర్యలద్వారా మరొక రూ. 4 కోట్లను సమకూర్చుకోవలసి వుంది.

[ఇతర వివరాలు ఈ సంచికలోనే వేరొకచోట ప్రకటించడం జరిగింది. చూ. 10 వ పేజీ. -ఎడిటర్]



మాధవస్వామి దేవాలయంలో బయటపడిన స్థూపం
(చూ. ఏలేశ్వరం త్రవ్వకాలు xlviii వ పేజీ)



అస్థిపంజరం కూర్చున్న తీరు ('చూ. ఏలేశ్వరం త్రవ్వకాలు l వ పేజీ )

# ఆంధ్రప్రదేశ్

(సచిత్ర మాస పత్రిక)

మార్చి, 1963

ఫాల్గుణ - చైత్ర 1884 - 1885 శకం



విద్య యొసగును వినయంబు వినయమునను
బడయుఁ బాత్రత పాత్రతవలన ధనము
ధనము వలనను దానంబు దానివలన
నైహికాముష్మిక ఫలంబు లందునరుడు

—తిక్కన : భారతం



# విద్యాసంచిక

(అనుబంధం)

# విషయసూచిక

# ఆంధ్రప్రదేశ్‌లో

# విశ్వ విద్యాలయాలు: కళాశాలల విద్య

లంకపల్లి బుల్లయ్య

ప్రాచీన భారతం మతాలకు పుట్టినిల్లు.

చరిత్ర ప్రారంభ కాలంలోనే సంస్కృతి, నాగరికతలను నెలకొల్పుకుంది. ఆధునిక యుగంలోని ఉన్నత విద్య, పరిశోధన, బోధనా విషయాల విశ్వవిద్యాలయాల మాదిరిగానే విద్యా పీఠాలు విలసిల్లినాయి. తక్షశిల, నలంద, ఉజ్జయినీ, వల్లభి, కంచి, విక్రమశిల, వారణాసిలోని ఆనాటి విశ్వవిద్యాలయాలు అందరికీ సుపరిచితాలు. స్వదేశ, విదేశాలలోని అనేక వేల మంది విద్యావేత్తలను ఇవి ఆకర్షించాయి. వేదశాస్త్రం, తత్వశాస్త్రం, తర్కం, గణితశాస్త్రం, జ్యోతిశ్శాస్త్రం, వ్యాకరణం, లలితకళలు, వైద్యం, మొదలైన శాస్త్రాలలో నియమబద్ధమైన అభ్యాసం కావించారు. 10 నుంచి 15 సంవత్సరాలవరకు వివిధ విషయాలలో విద్యావంతులయిన అధ్యాపకులు విద్యగరిపేవారు. అశోక, కనిష్క చక్రవర్తులకాలంలో బౌద్ధమతం వ్యాప్తిచెందేవరకూ యీ విద్యాసంస్థలు రాజవంశీయులకు మాత్రమే పరిమితమై ఉండేవని భావించబడుతూంది. నలంద విశ్వవిద్యాలయంలో 10,000 మంది విద్యార్థులు, 1500 మంది అధ్యాపకులు ఉండేవారని పరిశోధనలవల్ల తెలుస్తున్నది. ప్రాచీన విశ్వవిద్యాలయాలు, హిందు, బౌద్ధ మతాల ప్రభావానికి లోనైనా మతాలకు అతీతమైన స్వాతంత్ర్య వాతావరణంలో విద్య గరిపే వారు. మధ్యయుగం కాలంలో యీ ప్రసిద్ధ విశ్వవిద్యాలయాలు, సంరక్షణ, విద్యావేత్తల కొరత కారణంగా క్షీణించాయి. అంతేకాక మారిన రాజకీయ పరిస్థితుల ఫలితంగా లాహోర్, ఢిల్లీ, రాయపూర్, లక్నో, అలహాబాదు, జావున్‌పూర్‌లలో విద్యా సంస్థలు ఏర్పాటు అయ్యాయి. యీ విద్యా సంస్థలలో ముఖ్యంగా పర్షియన్, అరబిక్, తర్కశాస్త్రం, వ్యాకరణం, న్యాయశాస్త్రం, మొదలయిన విషయాలలో మాత్రమే విద్య గరిపేవారు. ఆ తర్వాత బ్రిటిష్‌వారి పరిపాలనలో పశ్చిమ విజ్ఞాన శాస్త్రాలు, ఇంగ్లీషు, భారతీయ భాషలలో క్రమబద్ధమైన విద్యాభ్యాసం జరగాలనే తత్వం ప్రబలింది. ఆనాటి భారతీయ విద్యార్థులలో కూడా యీ భావమే ఉండేది. దేశంలో జాతీయతా భావాన్ని కలిగించడానికి ఇటువంటి క్రమబద్ధమైన ఉన్నత విద్య ఎంతో అవసరమని ప్రఖ్యాత విద్యావేత్త, సంస్కర్త రాజారాంమోహన్‌రాయ్ అభిలషించారు. ఈ వుద్దేశ్యంతోనే కలకత్తాలో సంస్కృత కళాశాలను నెలకొల్పాలనే ప్రతిపాదనను ఆయన తీవ్రంగా వ్యతిరేకించారు. యిది ఆధునిక విశ్వవిద్యాలయాలను నెలకొల్పడానికి దారితీసింది. భారతదేశ పరిస్థితులకు అనుగుణంగా బ్రిటిష్ నమోనాలో దేశంలో విద్యాశాఖలను కూడా ఏర్పాటు చేయడం జరిగింది.

భారతదేశంలో విశ్వవిద్యాలయాలను సంగ్రహంగా సర్వేచేయడానికి 1857 ను ప్రారంభ సంవత్సరంగా తీసుకోవచ్చు.

యీ సంవత్సరంలో భారతదేశంలోని కలకత్తా, బొంబాయి, మద్రాసులలో మూడు విశ్వవిద్యాలయాలను నెలకొల్పడంజరిగింది. 25 సంవత్సరాలవరకు భారతదేశంలో యీ మూడు విశ్వవిద్యాలయాలు మాత్రమే ఉన్నాయి. ఆ తర్వాత 33 సంవత్సరాల కాలంలో కేవలం రెండు విశ్వవిద్యాలయాలు నెలకొల్పబడ్డాయి. 1915వ సంవత్సరం తర్వాతికాలంలో విశ్వవిద్యాలయాల విస్తృత కార్యక్రమాలు అమలు చేయబడ్డాయి. తిరిగి 1930–1943 వరకు స్థబ్దత ఏర్పడింది. 1960–61 వ సంవత్సరంలో మన దేశంలో మొత్తం 46 విశ్వవిద్యాలయాలు ఉన్నాయి.

యీ అభివృద్ధి సర్వేతోపాటు, భారతదేశంలోని విశ్వవిద్యాలయ వ్యవస్థ, వాటి కార్య నిర్వహణ కార్యక్రమాలు కూడా చదవడానికి ఆసక్తి కలిగిస్తాయి. 'ఆర్ట్సు, సైన్సుల

లోని వివిధ విభాగాలలో పరిపూర్ణతకు ప్రమాణంగా డిగ్రీలను ఇవ్వడంద్వారా స్వేచ్ఛాయుత రెగ్యులర్ విద్య'ను ప్రోత్సహించడమే ప్ర ప్రథమంగా నెలకొల్పబడిన 3 విశ్వ విద్యాలయాల ప్రాథమిక ఉద్దేశ్యాలుగా ఉండేవి. ఆ కారణంగా ఇవి కేవలం పరీక్షకులు గానూ, అనుబంధ సంస్థలుగానూ ఉండేవి. 1904 వ సం॥ పు భారతీయ విశ్వవిద్యాలయాల చట్టం ఎన్నో సంస్కరణలను ప్రవేశపెట్టింది. విశ్వ విద్యాలయాలకు బోధనాధికారాలు ఇవ్వడం, అనుబంధ కళాశాలలపై వీటికి ఎక్కువ అధికారాలను సంక్రమింపచేయడం, పరిశోధనలను చేపట్టడం మొదలైనవి యీ సంస్కరణలోని ముఖ్య అంశాలు. యీ చట్టాన్ని ప్రవేశపెట్టడంద్వారా సమర్ధతను పెంపొందింపచేసినా 1913వ సం॥ లో భారత ప్రభుత్వం చేసిన తీర్మానం విస్తరణకు ఎంతో తోడ్పడింది. ప్రముఖ ప్రావిన్స్‌లకు వేర్వేరు విశ్వవిద్యాలయాలు ఉండడానికి వీలుగా ప్రస్తుత అనుబంధ విశ్వ విద్యాలయాల అధికార పరిధి ప్రాంతాన్ని పరిమితం చేయాలని యీ తీర్మానం వెల్లడించింది.

ఆధునిక ఉన్నత విద్యానుగుణంగా స్థానిక విద్యాసంస్థలను, విశ్వ విద్యాలయాలను క్రొత్తగా వెంటనే నెలకొల్పాలని కూడా యీ తీర్మానంలో పేర్కొన్నారు. భారత దేశంలో విశ్వ విద్యాలయాల విద్యాస్థాయిని పెంపొందించడానికి 1917 వసం॥ లో నియమించబడిన కలకత్తా విశ్వ విద్యాలయం కమీషన్ రెండవ ముఖ్య అంశం. ఉన్నత విద్యా వ్యాప్తికి, వాస్తవిక విశ్వ విద్యాలయ బోధనా విషయాలపై దృష్టిని కేంద్రీకరించడానికి వీలుగా మధ్యంతర పనులనుంచి వీటిని విముక్తం చేయాలని యీ కమీషన్ సిఫారసు చేసింది. యూనిటరీ, రెసిడెన్షియల్ విశ్వ విద్యాలయాలను నెరకొల్పాలని ప్రతిపాదించింది. విశ్వ విద్యాలయానికి సంబంధించిన విషయాలలో ప్రభుత్వం కంట్రోలు తక్కువగా ఉండాలనీ, విశ్వ విద్యాలయం వ్యవహారాలలో అధ్యాపకులు ఎక్కువగా పాల్గొనేట్టు ఉండాలనికూడా యీ కమీషన్ సిఫారసుచేసింది. విశ్వ విద్యాలయాలు, కళాశాలల మధ్య ఎక్కువ సన్నిహిత సంబంధం ఉండాలని, పూర్తికాలం పనిచేసే వైస్ చాన్సలర్లను నియమించాలని కూడా యీ కమీషన్ వారు పేర్కొన్నారు. 1917–1947 వ సంవత్సరాల మధ్య కాలంలో మరి రెండు ముఖ్యమయిన నివేదికలను ప్రచురించారు. (1) హార్టగ్ కమిటీ నివేదిక (2) (1944) యుద్ధం తర్వాతికాలంలో భారత దేశంలో విద్యాభివృద్ధి పరిశీలించే విద్యాబోర్డు కేంద్ర సలహాసంఘం నివేదిక. ఇది సార్జెంటు రిపోర్టుగా వాడుకలో ఉంది.

బ్రిటిష్ ఇండియాలో విద్యాభివృద్ధి సమీక్షకు సంబంధించినది హార్టగ్ నివేదిక. విశ్వ విద్యాలయాలలో కార్పొరేషన్ జీవితానికి గల ప్రాధాన్యం గురించి యీ నివేదికలో చర్చించారు. భారతదేశ అవసరాలను కేవలం యూనిటరీ విశ్వ విద్యాలయాలు తీర్చలేవని నివేదిక కర్త వెల్లడించారు. అనుబంధ విశ్వ విద్యాలయాలు చాలా సంవత్సరాల వరకు ఉండి పోతాయని కూడా ఆయన అభిప్రాయ పడ్డారు. భారత విశ్వ విద్యాలయం పద్ధతిలో ఉన్న ముఖ్యమైన లోపాలను సార్జెంటు నివేదికలో దృష్టికి తెచ్చారు. పరీక్షలకు ఇచ్చిన అనుచిత ప్రాముఖ్యత, స్వతస్సిద్ధమైన ఆలోచనలకన్నా పాఠ్య పుస్తకాల పఠనకు యిచ్చిన ప్రాధాన్యం, అధ్యాపకులు, విద్యార్థుల మధ్య వ్యక్తిగత సంబంధాలకొరత, విశ్వ విద్యాలయాలు పరీక్షా రుసుములపై ఆధార పడడం, అర్హత గల బీద విద్యార్థులకు సహాయపడే పథకాలు లేక పోవడం, అదనపు విశ్వ విద్యాలయాల ఆవశ్యకత మొదలైనవే యీ ముఖ్య లోపాలు. యీ నివేదికలోని ముఖ్యమైన సిఫారసులు దిగువ ఇవ్వబడ్డాయి: (1) స్థాయిని తగ్గించకుండా డిగ్రీకోర్సు కాల పరిమితిలోని ఒక సంవత్సరాన్ని పాఠశాలకు చేర్చి డిగ్రీ కోర్సు కాల పరిమితిని 4 సంవత్సరాలనుంచి 3 సంవత్సరాలకు తగ్గించాలి. (2) నిర్వహణగ్రాంట్లు, స్కాలర్‌షిప్పులద్వారా విశ్వ విద్యాలయంలోని 3 వ వంతు విద్యార్థులకు ప్రభుత్వ సహాయం లభించాలి. (3) గ్రేట్ బ్రిటన్‌లోని విశ్వ విద్యాలయం గ్రాంట్సు కమీషన్ మాదిరిగా విశ్వ విద్యాలయం గ్రాంట్సు కమీషన్ను నియమించడం.

బ్రిటిష్ పరిపాలన కాలంలో బ్రిటన్‌లోని విశ్వవిద్యాలయాల వలెనే ఆనాటి ప్రభుత్వం ఇక్కడ విశ్వ విద్యాలయాలను నెలకొల్పింది. దేశంలో పరిపాలనా వ్యవహారాలలో సహాయపడేందుకు వీలుగా భారతీయులకు విద్యగరపడం, శిక్షణ ఇవ్వడమే వీటి ముఖ్య ఉద్దేశ్యం. అయితే పశ్చిమ విజ్ఞానశాస్త్రాలు, సాంకేతిక విద్య, మోడరన్ భాషలలో స్వేచ్ఛాయుత విద్యా ప్రాతిపదికపై ఉన్నత విద్యా విధానంలో జాతీయ దృక్పథాన్ని పెంపొందింప చేసే తత్వం ఇమిడి ఉంది. ఈ విధంగా బ్రిటిష్ ఇండియాలో నెలకొల్పబడిన విశ్వవిద్యాలయాలు, దేశంలో పరిపాలనకు సంబంధించిన ఉద్యోగాలకు విద్యాధికులను సరఫరా చేయడమే కాక రెండోవైపు దేశంలో స్వేచ్ఛాభావాలు గల విద్యాధికులయిన నాయకులను పెంచడంలో తోడ్పడి తద్వారా ద్వంద్వ పాత్రలను నిర్వహించాయి.

1947 వ సంవత్సరంలో స్వాతంత్ర్యాన్ని పొందిన భారతదేశం, ఆర్థిక, సాంఘిక,

రాజకీయ సమస్యల ఎన్నిటినో ఎదుర్కోవాల్సి వచ్చింది. ఈ సమస్యలను ఆమూలాంతం అర్థంచేసుకొని, పరిష్కరించడానికి వ్యక్తుల విషయంలో ఉన్నత విజ్ఞానాభివృద్ధి ఎంతో అవసరం. వాస్తవిక విషయమేమంటే ఏ ఉన్నత ప్రజాస్వామ్య దేశంలోనైనా ఆయా విషయాలలో పరిపూర్ణ పరిజ్ఞానం గల సేచ్ఛాభావాలు గల విద్యాధికులే ఆయా సమస్యలను అర్థం చేసుకుని పరిష్కరిస్తారని ఆశించబడుతున్నది. స్వతంత్ర భారత ప్రభుత్వం సమస్యల తీవ్రతలను సహజంగానే గుర్తించి నేటి విశ్వవిద్యాలయం విద్యను పరిశీలించి, ప్రజాస్వామ్యానికి అనుగుణమైనపునర్వ్యవస్థీకరణకు సూచనలివ్వడానికై నిపుణుల కమిటీని ఏర్పాటు చేసింది. డాక్టర్ యస్. రాధాకృష్ణన్ అధ్యక్షతన ఏర్పడిన యీ నిపుణుల కమిటీ సర్వే జరిపి అతిప్రాముఖ్యం గల రిపోర్టును తయారు చేసింది. రెండు సంవత్సరాల డిగ్రీకోర్సుకు బదులుగా 3 సంవత్సరాల డిగ్రీకోర్సు ఆవశ్యకతను రాధాకృష్ణన్ కమీషన్ గుర్తింపజేసింది.

డిగ్రీస్థాయిలో భాషల అధ్యయనం, సైన్సు హ్యూమానిటీలలో సాధారణ విద్యావశ్యకతను గురించి యీ కమీషన్ నొక్కి చెప్పింది. సైన్సు హ్యూమానిటీలలో ప్రాథమిక విద్య బోధించడం ద్వారా దృక్పథాలను మలచడం సాధ్యమని అభిప్రాయపడింది. ఉన్నత విద్య, సాంకేతిక విద్యలకై క్రొత్తగా విశ్వవిద్యాలయాలను నెలకొల్పాలని కూడా యీ కమీషన్ సిఫారసుచేసింది. ఆ తర్వాత దేశంలోని సెకండరీ విద్యను సర్వేజరిపి తగిన సిఫారసులు చేయడానికై భారత ప్రభుత్వం, డాక్టర్ ఎ. ఎల్. మొదలియార్ అధ్యక్షతన నిపుణుల కమిటీని నియమించింది.

సెకండరీ విద్య పునర్వ్యవస్థీకరణకు సూచనలు చేస్తూ, కళాశాలల పాత విద్యా విధానంలో లోపాలు ఉన్న దృష్ట్యా విశ్వవిద్యాలయం స్థాయిలో 3 సంవత్సరాల డిగ్రీ కోర్సును ప్రవేశపెట్టాలనే సూచనలను యీ కమీషన్ బలపర్చింది. రాధాకృష్ణన్ కమీషన్ సూచనలను పరిశీలించిన తర్వాత విశ్వవిద్యాలయం విద్యకై ఆ సిఫారసులను జాతీయ విధానంగా భారత ప్రభుత్వం అనుసరించింది. క్రొత్త సంస్కరణల అమలును అజమాయిషీ చేయడానికి వీలుగా విశ్వవిద్యాలయం గ్రాంట్సు కమీషన్‌ను భారత ప్రభుత్వం నియమించింది.

"భారత దేశంలోని విశ్వవిద్యాలయ విద్యా విషయాలపై రాధాకృష్ణన్ కమీషన్ తయారు చేసిన రిపోర్టు అధికారికమైందీ, సవివరమైందీ, కొద్దికాలం క్రితం ప్రతిపాదించబడింది'' విద్యావిధానంలో ఉపాధ్యాయునికి ఇంతవరకూ విస్మరించబడిన స్థానాన్ని యీ రిపోర్టు ఇచ్చింది. విశ్వవిద్యాలయం ఉపాధ్యాయుల ప్రాముఖ్యాన్ని విసిష్టతను గుర్తించి వారికి తగిన వేతనాలను సిఫారసు చేసింది. వారి ఉద్యోగ సర్వీసు గరిష్టపరిమితిని కూడా హెచ్చించడానికి ప్రతిపాదించింది. విశ్వవిద్యాలయం పరీక్షలలో విద్యార్థుల అనుత్తీర్ణతవల్ల సంభవించే దుబారాకు తన విచారాన్ని ప్రకటిస్తూ సెకండరీ పాఠశాల విద్యాస్థాయిని పెంచాలని సిఫారసు చేసింది. అనువైన వృత్తులలో విద్యార్థులు ప్రవేశించడానికి వీలుగా వృత్తి విద్యా సంస్థలు ఏర్పాటు చేయడం, విశ్వవిద్యాలయంలో ప్రవేశానికి స్థాయిని పెంచడం, ఆనర్సు డిగ్రీ కోర్సును 2 నుంచి 3 సంవత్సరాలకు పెంచడం, డిగ్రీ పరీక్షలలో ఉత్తీర్ణతకు మార్కుల శాతాన్ని పెంచడం, డిగ్రీకోర్సు మొత్తంలోని క్లాసు వర్కులను పరిగణించడం, పరీక్ష పద్ధతులలో ఇతర మార్పులను ప్రవేశపెట్టడం వంటి సూచనలను కూడా సిఫార్సు చేసింది. కళాశాలలో ప్రవేశాలకు నిర్బంధాలు విధించాలనికూడా ఈ కమీషన్ సూచించింది. నేటి భారత విశ్వవిద్యాలయాలు తీవ్రంగా ఎదుర్కొంటున్న బోధనా భాష సమస్యపై ఈకమీషన్ చేసిన సిఫారసులు చాలా ముఖ్యమైనవి. భాషా విషయకంగా ఇంగ్లీషును నిర్బంధం చేయాలని సిఫారసు చేస్తూ, బోధనాభాష విషయంలో ఇంగ్లీషుస్థానే ఇతర భారతీయ భాషలకు అవకాశం కల్పించడం మినహా గత్యంతరం లేదనే విషయాన్ని యీ కమీషన్ గుర్తించింది. తదనుగుణంగానే సంస్కృతం మినహా ఇతర భారతీయ భాషలను బోధనా భాషలుగా ఇంగ్లీషుస్థానే ప్రవేశపెట్టాలని యీ కమీషన్ సిఫారసు చేసింది. విజ్ఞానశాస్త్ర సాంకేతిక పదాలు, అంతర్జాతీయ సాంకేతిక పదాలతో సహా వివిధ మార్గాల ద్వారా పదాలను సేకరించి హిందీ భాషలో కలిపి యీ భాషను అభివృద్ధి చేయాలని కూడా యీ కమీషన్ సిఫారసు చేసింది. విశ్వవిద్యాలయాలు ప్రాంతీయభాషలస్థానే హిందీని బోధనా భాషగా వాడుకోడానికి స్వేచ్ఛ ఇవ్వాలని సూచించింది. విశ్వవిద్యాలయం, హయ్యర్ సెకండరీ దశలలో విద్యార్థులు ప్రాంతీయ భాష, ఫెడరల్‌భాష (హిందీ), ఇంగ్లీషు, యీ మూడు భాషలను నేర్చుకోవడం అవసరమని కమీషన్ సిఫారసు చేసింది.

ప్రస్తుత శాసనపట్టికలో విశ్వ విద్యాలయం విద్యను చేర్చుకొని నాన్-రికర్రింగ్ విషయాలకై ఇచ్చే పెట్టుబడి గ్రాంట్లతోపాటు, విశ్వ విద్యాలయాలలో పోస్టుగ్రాడ్యుయేటు, పరిశోధనా పనులఖర్చుకై కేంద్రం 50 శాతం వరకు విరాళం ఇవ్వాలని కూడా కమీషన్ సిఫారసు చేసింది. విశ్వ విద్యాలయం

గ్రాంట్సు కమీషన్ను నెలకొల్పాలనికూడా సూచించింది.''-

(1961 వ సం॥ కామన్ వెల్త్ విశ్వ విద్యాలయం వార్షిక పుస్తకం నుంచి)

1956 వ సం॥లో ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ఏర్పడినప్పుడు రాష్ట్రంలో మూడు విశ్వ విద్యాలయాలు ఉన్నాయి. అవి : ఉస్మానియా విశ్వవిద్యాలయం (1918 వ సం॥లో నెలకొల్పబడింది), (2) ఆంధ్రవిశ్వవిద్యాలయం (1926), శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం (1954). యీ మూడు విశ్వ విద్యాలయాలు బోధనతో కూడిన అనుబంధ రకాలవి.

భారతదేశంలో ఉస్మానియా విశ్వ విద్యాలయమే ప్రథమంగా భారతీయభాషలో(ఉర్దు) విద్యా బోధనను ప్రారంభించింది. దీనికొరకై విశ్వ విద్యాలయం నెలకొల్పబడిన దాదాపు ఒక సంవత్సరానికి అనువాదం, ప్రచురణల శాఖను ఏర్పాటు చేశారు. ఇది పాఠ్య పుస్తకాలను తయారుచేసి, పాఠ్య పుస్తకాలను ప్రచురిస్తుంది.ఆర్ట్సు, ఇంజనీరింగ్, వైద్యం, సైన్సు, ఇతర సబ్జెక్టులలో మొత్తం 550 పుస్తకాలను అనువదించి ప్రచురించింది. ఇంతవరకు ఉర్దుభాషలోకి అనువదించి, ప్రచురిస్తున్న యీ విభాగం ప్రస్తుతం హిందుస్థానీ భాషానువాదాలు, ప్రచురణలను ప్రారంభించింది. ప్రస్తుతం వృత్తి విద్యావిషయాల బోధనకై కేవలం ఇంగ్లీషు భాషనే వాడుతున్నారు. ఆర్ట్సు, సైన్సు విషయాలకు ఇంగ్లీషు, హిందుస్థానీ భాషలను బోధనా భాషలుగావాడుతున్నారు. మద్రాసు ప్రావిన్సులోని తెలుగుజిల్లా ప్రజలు స్వంత విశ్వ విద్యాలయం కావాలని కోరిన దృష్ట్యా ఆంధ్ర విశ్వ విద్యాలయాన్ని నెలకొల్పారు. స్థానిక ప్రాంతీయాభిమానం కారణంగా విశ్వ విద్యాలయం నెలకొల్పబడే స్థలం విషయంలో అధికారులు ఎన్నో చిక్కులను ఎదుర్కోవాల్సి వచ్చింది. మొదట దీనిని బెజవాడలో నెలకొల్పారు,తర్వాత 1930వసం॥లో వాల్తేరుకు మార్చారు. 1942 వ సం॥లో యుద్ధపరిస్థితుల కారణంగా దీని హెడ్‌క్వార్టర్సును గుంటూరుకు మార్చాల్సివచ్చింది. 4 సంవత్సరాల తర్వాత తిరిగి వాల్తేరుకు మార్చారు.

భాషా ప్రాతిపదికపై ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రం ఏర్పడిన తర్వాత ఆర్థికంగానూ, వెనుకబడిఉన్న రాయలసీమ ప్రాంతం అవసరాలకు ప్రాధాన్యత ఇవ్వాలనే కోరిక బయలుదేరింది. యీ సందర్భంలో తీవ్ర కృషి జరిగింది. తద్వార యీ ప్రాంతానికి విడిగా ఒక విశ్వ విద్యాలయాన్ని నెలకొల్పారు. ఈవిశ్వ విద్యాలయ స్థాపనకు అవసరమైన భూమిని బిల్డింగులను తిరుమలై-తిరుపతి దేవస్థానం వారు ఇచ్చారు. అంతేకాక రిక్కరింగ్, నాన్ రిక్కరింగ్ ఖర్చులకై తగిన మొత్తాలను ఇస్తామని వాగ్దానం చేశారు. యీ విధంగా తిరుపతిలో యస్. వి. విశ్వ విద్యాలయాన్ని ప్రారంభించడం జరిగింది. 1954 వ సం॥ ఆంధ్ర శాసన చట్టంద్వారా దీనిని నెలకొల్పారు. ప్రారంభంలో ఇది బోధనా విశ్వ విద్యాలయంగా వ్యవహరించింది. 1956-57వ విద్యా సంవత్సరంనుంచి అఫిలియేటింగ్ విధులను చేపట్టింది.

మూడు విశ్వ విద్యాలయాలు ప్రారంభించిన ఫ్యాకల్టీలు, డిగ్రీ అవార్డులను దిగువ పట్టికద్వారా తెలుసుకొని ఇది సాధించిన అభివృద్ధిని అర్థం చేసుకోవచ్చు.

| ఫ్యాకల్టీ పేరు | ఉస్మానియా | ఆంధ్ర | వేంకటేశ్వర |
|---|---|---|---|
| ఆర్ట్సు | బి. ఎ., యం. ఎ., పి. హెచ్. డి. | బి. ఎ., బి. ఎ. (ఆనర్సు), యం. ఎ., యం. ఎ. (ఆనర్సు), పిహెచ్. డి., డి. లిట్ అంతర్జాతీయ సంబంధాలలో మాస్టర్ ఆఫ్ ఆర్ట్సు; యం. ఎ. (సోషల్ వర్కు రూరల్ స్టడీస్) కోఆపరేషన్‌లో పోస్టు గ్రాడ్యుయేటు డిప్లొమా. | బి. ఎ., బి. ఎ. (ఆనర్సు), యం. ఎ., యం. ఎ.(ఆనర్సు), యం. ఫిల్. |
| కామర్సు | బి. కాం.; యం. కాం. | బి. కాం. బి.కాం. (ఆనర్సు). యం.కాం. యం. కాం. (ఆనర్సు), పిహెచ్. డి. యం. బి. ఎ. | బి. కాం. |
| అగ్రికల్చర్ | బి. యస్‌సి. (అగ్రి), యం. యస్‌సి. (అగ్రి). | బి. యస్. సి. (అగ్రి), యం. యస్‌సి. (అగ్రి). | — |

| ఫ్యాకల్టీ పేరు | ఉస్మానియా | ఆంధ్ర | వేంకటేశ్వర |
| --- | --- | --- | --- |
| సైన్స్ | బి యస్‌సి , యం యస్‌సి , బి. యస్‌సి., యం. యస్‌సి., పిహెచ్. డి., బి. కెం. (టెక్), బి. కెం. (ఇంజ), యం. యస్‌సి, (గణాంకం). | బి యస్‌సి , బి యస్‌సి (ఆనర్స్) బి. ఫార్మ్., యం. యస్‌సి. యం. యస్‌సి. (మేథమెటికల్ ఫిజిక్స్) యం. యస్‌సి. (అప్లయిడ్ ఫిజిక్స్) యం. యస్‌సి. (జియో - ఫిజిక్స్) యం. యస్‌సి. (న్యూక్లియర్ ఫిజిక్స్) యం. యస్‌సి. (ఒరె_డ్రెసింగ్) యం. యస్‌సి. (స్టాటిస్టిక్స్) యం. యస్‌సి. (ఎలక్ట్రానిక్) యం. యస్‌సి. (అప్లయిడ్ జియోలజి) యం. ఫార్మ్, డి. యస్‌సి. | బి. యస్‌సి., బి. యస్‌సి. (ఆనర్స్) యం. యస్‌సి., యం. ఫిల్. |
| టీచింగ్ | బి. ఇడి., యం. ఇడి. | బి. ఇడి, యం; ఇడి. | బి. ఇడి. యం. ఇడి. |
| మెడిసిన్ | యం. బి. బి. యస్., యం. డి. యం. యస్. మెడికల్ సబ్జెక్టులలో పోస్ట్ గ్రాడ్యుయేటు డిప్లొమా. | యం. బి. బి. యస్. యం. డి.యం. యస్. బి. యస్‌సి., యం. యస్‌సి. మెడికల్ సబ్జెక్టులలో పోస్ట్ గ్రాడ్యేట్ డిప్లొమా | యం. బి. బి. యస్. |
| లా | యల్‌యల్. బి., యల్‌యల్. ఎం. | బి. యల్. యం. యల్., డి. యల్. | — |
| ఇంజనీరింగ్ టెక్నాలజి | బి. ఇ., స్ట్రిక్చరల్ ఇంజనీరింగ్‌లో మాస్టర్స్ డిగ్రీ. | బి. ఇ. | బి. ఇ. |
| వెటర్నరీ సైన్స్ | బి. వి. యస్‌సి., ఎ. హెచ్. | బి. వి. యస్‌సి. ఎ. హెచ్. | బి. వి. యస్‌సి. |
| ఆయుర్వేద | — | బి. ఎ. వి. | — |
| ఓరియంటల్ భాషలు | డిప్. ఒ. యల్., బి. ఒ. యల్. | విద్యాప్రవీణ, భాషా ప్రవీణ; పి. ఒ. యల్; యం. ఒ. యల్; కళాప్రపూర్ణ (గౌరవ డాక్టరేట్ డిగ్రీ), ఆలమ్_ఇ_ఫాజిల్, మున్షీ_ఇ_కామిల్, అదిబె_ఇ_ఫాజిల్; తబీబ్_ఇ_కామిల్, హిందీలో డిప్లొమా. | విద్యాప్రవీణ, భాషా ప్రవీణ; విద్వాన్; శిరోమణి; ఆదిబ్_ఇ_ఫాజిల్; అఫ్జుల్_ఉల్_ఉలేమా; మున్షీ_ఇ_ఫాజిల్. |

| ఫ్యాకల్టీ పేరు | ఉస్మానియా | ఆంధ్ర | వేంకటేశ్వర |
|---|---|---|---|
| లలిత కళలు | — | మ్యూజిక్‌లో డిప్లొమా | |
| ఇతరములు | ఫ్రెంచ్, జర్మన్‌లలో సీనియర్, జూనియర్ డిప్లొమాలు; రష్యన్‌లో డిప్లొమా కోర్సు; పబ్లిక్ ఎడ్మినిస్ట్రేషన్‌లో డిప్లొమా కోర్సు, జర్నలిజమ్‌లో డిప్లొమా, సర్టిఫికెటు కోర్సు; ఫిజికల్ ఎడిన్‌లో డిప్లొమా కోర్సు. | ఫ్రెంచ్, జర్మన్‌లో డిప్లొమా కోర్సు, లైబ్రేరియన్ షిప్‌లో డిప్లొమా, లైబ్రేరియన్ షిప్‌లో సర్టిఫికెటు కోర్సు; థియేటర్ ఆర్ట్సులో డిప్లొమా, సర్టిఫికెటు కోర్సులు | |

ఆంధ్రప్రదేశ్‌లో విశ్వవిద్యాలయ విద్యకు మంచి పోషణ ఉందని ఈ పై పట్టిక ద్వారాను ix వ పుటలోని పట్టిక ద్వారాను (చూ ix పుట) తెలుస్తుంది. అయితే మూడు విశ్వవిద్యాలయాలలోనూ ఫైన్ ఆర్ట్సును విస్మరించడం జరుగుతున్నది. ముఖ్యమైన ఇంజనీరింగ్, టెక్నాలజీల విషయంలో మనం చాలా వెనకబడి ఉన్నాం. వీటిని ఎంతో అభివృద్ధి పరచాల్సి ఉంది.

కళాశాల విద్యాస్థాయి, ఇతర విద్యా విషయాలను విశ్వవిద్యాలయాలు నిర్వహించడంలో నిమగ్నమయి ఉన్నాయి. సంస్థల నిర్వహణ, ఉన్నత విద్యా అవసరాలను ఆదుకోవడానికి క్రొత్త సంస్థలను ఏర్పాటు చేయడంలో రాష్ట్రప్రభుత్వం కృషిచేస్తూంది. కొన్ని ఆర్ట్సు, సైన్సు కళాశాలలనూ, ఉపాధ్యాయుల శిక్షణ (ఫిజికల్ విద్యతో సహా)నూ విద్యాశాఖ స్వయంగా నిర్వహిస్తున్నది. ఉపాధ్యాయుల శిక్షణ కళాశాలలు మినహా వృత్తికళాశాలలను ఆయా శాఖలు నిర్వహిస్తున్నాయి. ఉదాహరణకు సాంకేతిక విద్యాశాఖ (ఇంజనీరింగ్ కళాశాలలు), వైద్య సర్వీసులు (వైద్య కళాశాలలు), వ్యవసాయ శాఖ (వ్యవసాయ కళాశాలలు) పశుపోషణ శాఖ (పశువైద్య కళాశాలలు).

విశ్వవిద్యాలయాలు కొన్ని వృత్తి కళాశాలలను నిర్వహిస్తున్నాయి. కాకినాడ, వరంగల్లులలో రెండు వైద్యకళాశాలలను ప్రైవేటు సంస్థలు నిర్వహిస్తున్నాయి. ఆర్ట్సు, సైన్సు, వృత్తి కళాశాలలను అనధికార సంస్థలు నిర్వహించడానికి రాష్ట్ర ప్రభుత్వం ఆర్థిక సహాయం చేస్తూంది.

ప్రతి జిల్లాకు ఒక ఆర్ట్సు, సైన్సు కళాశాల ఉండడమే రాష్ట్ర ప్రభుత్వం విధానం. ఈ ఆశయాన్ని ఇప్పుడు నెరవేర్చడం జరిగింది. ప్రతి జిల్లాలో ప్రత్యేకంగా స్త్రీలకు ఒక ఆర్ట్సు, సైన్సు కళాశాల ఉండడమే భవిష్యత్ విధానమై ఉండాలి.

విశ్వవిద్యాలయం విద్యా విషయంలో రాధాకృష్ణన్ కమీషన్ సిఫారసులను జాతీయ విధానంగా అంగీకరించి, రెండవ ప్రణాళికా కాలంలో మూడు సంవత్సరాల డిగ్రీకోర్సును ప్రవేశపెట్టడానికి వీలుగా కేంద్ర సహాయక పథకాన్ని కేంద్రప్రభుత్వం అమలు జరిపింది. దేశంలోని అన్ని విశ్వవిద్యాలయాలు (బొంబాయి విశ్వవిద్యాలయం మినహా) యీ క్రొత్త సంస్కరణను అమలు జరిపాయి. ఆంధ్రప్రదేశ్‌లోని మూడు విశ్వవిద్యాలయాలు మూడు సంవత్సరాల డిగ్రీ కోర్సును ప్రవేశపెట్టాయి. 1956–57 సం॥ లో ప్రప్రథమంగా ఉస్మానియా విశ్వవిద్యాలయం యీ కోర్సును ప్రవేశపెట్టింది. ఆ తర్వాత 1957–58 వ సంవత్సరంలో మిగిలిన రెండు విశ్వవిద్యాలయాలు యీ కోర్సును ప్రవేశపెట్టాయి. పాత ఇంటర్మీడియట్ 2 సంవత్సరాల కోర్సు, ఒక సంవత్సరం పి. యు. సి. గానూ, పాత రెండు సంవత్సరాల డిగ్రీకోర్సు (బి. ఎ; బి. యస్‌సి; బి. కాం.)ను 3 సంవత్సరాల డిగ్రీ కోర్సుగానూ మార్చారు. ఉస్మానియా, ఆంధ్రవిశ్వవిద్యాలయాలు ఒకే పద్ధతిలో డిగ్రీ కోర్సును ప్రవేశపెట్టి సమాన ప్రాముఖ్యత గల మూడు సబ్జెక్టులను ఐచ్ఛిక విషయాలకు అనుమతిచ్చింది. శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం, ఒకే ప్రాముఖ్యత గల మూడు ఐచ్ఛిక సబ్జెక్టులతో సాధారణ డిగ్రీ కోర్సునూ, ఒక సబ్జెక్టు మెయిన్, రెండు అదనపు సబ్జెక్టులతో (సబ్సిడరీస్) స్పెషల్ (డిగ్రీ) కోర్సునూ, రెండు పద్ధతుల ప్రవేశపెట్టింది.

రాష్ట్రంలోని అన్ని విశ్వవిద్యాలయాలలో మూడు సంవత్సరాల డిగ్రీ కోర్సును అమలు జరిపిన తర్వాత పరిశోధన, పోస్ట్ గ్రాడ్యుయేటు కోర్సు, విజ్ఞాన శాస్త్రాల స్టడీలకు ఇతోధిక సౌకర్యాలు కల్పించే సమస్యను ఈ విశ్వవిద్యాలయాలు ఎదుర్కొంటున్నాయి. అభివృద్ధికి సంబంధించిన వివిధ ప్రణాళికా పథకాలకు అవసరమైన మానవశక్తిని తీర్చడానికై మన రాష్ట్రంలోనే కాక అన్ని

1961–62 వ సం॥ వరకు రాష్ట్రంలోని కళాశాలల సంఖ్య, విద్యార్థుల సంఖ్య దిగువ పట్టికలో ఇవ్వబడ్డాయి.

| విద్యా విషయం | ఉస్మానియా విశ్వ విద్యాలయం | | | | ఆంధ్ర విశ్వ విద్యాలయం | | | | శ్రీ వేంకటేశ్వర విశ్వ విద్యాలయం** | | | | మొత్తం | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | కళాశాలల సంఖ్య | విద్యార్థుల సంఖ్య | | | కళాశాలల | విద్యార్థుల సంఖ్య | | | కళాశాలల | విద్యార్థుల సంఖ్య | | | కళాశాలల | విద్యార్థుల సంఖ్య | | |
| | | బాలురు | బాలికలు | మొత్తం | సంఖ్య | బాలురు | బాలికలు | మొత్తం | సంఖ్య | బాలురు | బాలికలు | మొత్తం | సంఖ్య | బాలురు | బాలికలు | మొత్తం |
| సాధారణ విద్య | 29 | 10334 | 2914 | 13248 | 28 | 19359 | 2605 | 21964 | 11 | 5926 | 787 | 6713 | 68 | 35619 | 6306 | 41925 |
| వృత్తి విద్యా కళాశాలలు | | | | | | | | | | | | | | | | |
| అగ్రికల్చర్ | 1 | 352 | 28 | 380 | 1 | 391 | 3 | 394 | ... | 70@ | ... | 70@ | 2 | 743 | 31 | 774 |
| కామర్స్ | 2 | 1797 | 14 | 1811 | ప్రత్యేక కళాశాలలేదు | | | | ... | 186 | ... | 186 | 2 | 1983 | 14 | 1997 |
| విద్య | 3 | 266 | 156 | 422 | 4 | 206 | 118 | 324 | 2 | 207 | 25 | 232 | 9 | 679 | 299 | 978 |
| ఇంజనీరింగ్/టెక్నాలజీ | 2 | 1986 | 8 | 1994 | 3 | 1527 | 1 | 1528 | 2 | 749 | ... | 749 | 7 | 4262 | 9 | 4271 |
| న్యాయశాస్త్రం | 2 | 1405 | 25 | 1430 | 1 | 204 | 6 | 210 | ... | ... | ... | ... | 3 | 1609 | 31 | 1640 |
| వైద్యం | 3 | 1264 | 514 | 1778 | 3 | 1653 | 407 | 2060 | 2 | 410 | 69 | 479 | 8 | 3327 | 990 | 4317 |
| వెటర్నరీ సైన్స్ | 1 | 307 | 1 | 308 | ... | ... | ... | ... | 1 | 362 | 3 | 365 | 2 | 669 | 4 | 673 |
| ఇతరం | 2 | 73 | 45 | 118 | 15* | 361 | 98 | 459 | 4*(సాధారణవిద్యలో కలపడం జరిగింది) | | | | 21 | 434 | 143 | 577 |
| వృత్తి విద్య మొత్తం | 16 | 7450 | 791 | 8241 | 27 | 4342 | 633 | 4975 | 11 | 1984 | 97 | 2081 | 54 | 13776 | 1521 | 15297 |
| పూర్తి మొత్తం | 45 | 17784 | 3705 | 21489 | 55 | 23701 | 3238 | 26939 | 22 | 7910 | 884 | 8794 | 122 | 49395 | 7827 | 57222 |

* ఓరియంటల్ కళాశాలలను కలుపుకొని.

** 1960–61 సంవత్సరానికి సంబంధించిన అంకెలు.

@ ప్రి-ప్రొఫెషనల్ కోర్సులలో చదువుతున్నవారు.

రాష్ట్రాలలోనూ యీ సమస్యను పరిష్కరించాల్సి ఉంది. డిగ్రీ స్థాయిలో కళాశాలలలో విజ్ఞానశాస్త్రాల అధ్యయన సౌకర్యాలను విస్తరింప చేయడానికి విశ్వ విద్యాలయాలు, ప్రభుత్వం కృషి చేస్తున్నాయి. మూడవ ప్రణాళికా కాలంలో యీ సౌకర్యాన్ని పూర్తిగా కల్పింపచేయడం జరుగుతుందని భావించబడుతున్నది. పోస్ట్ గ్రాడ్యువేటు స్థాయిలో ఉన్నత విద్యా అవకాశాలను కల్పించడానికై మూడవ ప్రణాళిక కాలంలో క్రొత్త విశ్వవిద్యాలయాన్ని నెలకొల్పాలని ప్రభుత్వం యోచిస్తున్నది.

రాష్ట్రంలో ఉన్న కొన్ని కళాశాలలకు అదనపు వసతి సౌకర్యం, సామగ్రిని కేటాయించాల్సి ఉంది. అందులో చాలా వాటికి విద్యార్థులకై హాస్టల్ సౌకర్యాలు కావల్సి ఉన్నాయి. క్రొత్త కళాశాలలను ఏర్పాటు చేయడంతో పాటు ప్రస్తుతం ఉన్న కళాశాలల అవసరాలను తీర్చాలి.

దేశంలో అనేక విశ్వవిద్యాలయాలను ఏర్పాటు చేయడం దృష్ట్యా, విశ్వవిద్యాలయాల మధ్య సమన్వయాన్ని పెంపొందించడానికీ, ఉమ్మడి సమస్యలను గూర్చి చర్చించడానికీ వీలుగా భారత ప్రభుత్వం సూచనపై అంతర్విశ్వ విద్యాలయ బోర్డు (1924లో) ను నెలకొల్పారు. స్వతంత్ర భారత దేశంలో దిగువస్థాయి విద్యకు ఉన్న ప్రాధాన్యమే విశ్వ విద్యాలయ విద్యకు ఉంది. ప్రతి విశ్వవిద్యాలయం, తన అధికార పరిధిలో స్వతంత్ర సంస్థగా ఉంది. వయఃపరిమితి నిబంధనలు, పరీక్షలస్థాయి, విశ్వవిద్యాలయం పరీక్షలలో ప్రైవేటు అభ్యర్థులు పాల్గొనే నిబంధనలు మొదలైనవి వేర్వేరు విధాలుగా ఉన్నాయి. కొన్ని విశ్వవిద్యాలయాలు ఇతర విశ్వ విద్యాలయాలు ఇచ్చిన డిగ్రీ, డిప్లొమాల స్థాయిని గుర్తించవు. దేశంలోని అన్ని విశ్వవిద్యాలయాలలో జాతీయ విధానంగా ఒకే స్థాయిని ప్రవేశ పెట్టాలని వాదిస్తున్నారు.

ప్రతి విశ్వవిద్యాలయంలోను ఒకే విధానం, స్థాయి చాలా అవసరం. వివిధ విధానాలు, స్థాయిల కారణంగా ఒకే రాష్ట్రంలోని వివిధ విద్యాలయాలలో విద్యార్థుల ప్రవేశానికి అడ్డంకులు ఏర్పడుతున్నాయి. చాలా ఆలస్యంగానే అయినా యీ విషయాన్ని గుర్తించి విశ్వవిద్యాలయాల నిర్మాణం, వాటి విధానాల గురించి పునరాలోచన చేయడం జరుగుతున్నది. ఒకే రాష్ట్రంలో ఒకదాని కన్నా ఎక్కువ విశ్వవిద్యాలయాలు ఉంటే ఒకే ఒక విశ్వవిద్యాలయాన్ని రాష్ట్రానికంతా అఫిలియేటింగ్ విశ్వవిద్యాలయంగా ఏర్పాటు చేసి తక్కిన విశ్వవిద్యాలయాలను కేవలం బోధనా విశ్వ విద్యాలయాలుగా పునర్నిర్మాణం చేయాలనే భావం బలపడుతున్నది. ఉమ్మడి సమస్యలను చర్చించడానికి, పరిష్కరించడానికి అంతర్విశ్వ విద్యాలయం బోర్డు తగిన సంస్థగా ఉండవచ్చు. రాష్ట్ర, ప్రాంతీయ స్థాయిలో వైస్ చాన్సలర్లు తరుచు సమావేశాలు జరిపితే పరస్పర అవగాహన సమన్వయాన్ని పెంపొందించ వీలు కలుగుతుంది.

దేశంలోని విశ్వవిద్యాలయం విద్యను గూర్చి సమీక్షించి దిగువ తెల్పిన విషయాలపై ఖచ్చితమైన విధానాలను రూపొందించడానికి ఇదే మంచి తరుణం :

1. విశ్వవిద్యాలయాల ఆశయాలు, జాతీయ సంస్థలుగా వీటి నిర్వహణ.

2. ఫీజు రెగ్యులేషన్‌లో ఒకే విధానం, ఆర్థిక సహాయం, ఉపాధ్యాయుల వేతనాల స్కేళ్లు, సర్వీసు నిబంధనల సెక్యూరిటీ.

3. విశ్వవిద్యాలయం స్థాయిలో బోధనా భాష.

4. దేశంలోని అన్ని విశ్వవిద్యాలయాలలో ఒకే విధమైన స్థాయి, దేశం మొత్తంలో అన్ని డిగ్రీ, డిప్లొమాల పరిగణన.

5. అన్ని విశ్వవిద్యాలయ విద్యార్థులకు రెసిడెన్షియల్, సాంస్కృతిక సౌకర్యాలు.

6. ఎన్. సి. సి. లత్వరితగతి విస్తరణ, నిర్ణీత కాలంలో అన్ని కళాశాలలలోనూ, విశ్వవిద్యాలయాలలోను యీ కార్యక్రమాన్ని అమలు జరపడానికి తగిన చర్యలు తీసుకోవడం.

7. దేశంమొత్తంలో 4 సంవత్సరాల డిగ్రీ కోర్సు కళాశాలలను నెలకొల్పడం, సెకండరీ విద్యఆశయాలను పూర్తిచేయడానికి అవసరమైన అర్హతగల ఉపాధ్యాయులను చేకూర్చడానికి యీ కళాశాలలు ఎంతో అవసరం.

ఏ ప్రజాస్వామ్య దేశంలోనైనా స్వేచ్ఛాభావాలుగల వివేకవంతమైన నాయకత్వాన్ని సృష్టించడంలో విశ్వ విద్యాలయాలు ప్రధాన పాత్ర వహిస్తాయి. 1947 వ సం॥లో స్వాతంత్ర్యం పొందిన భారతదేశం సంక్షేమ రాజ్యానికి అవసరమైన అన్ని మంచి మార్గాలను ఎన్నుకుంది. సెక్యూలర్ రాష్ట్రం, రిపబ్లిక్ రాజ్యాంగం, ప్రజాస్వామ్య పద్ధతిలో ప్రభుత్వం వాటిలో ముఖ్యమైనవి. నిరక్షరాస్యత, బీదరికం, వ్యాధులు మొదలైన సమస్యలను ఎదుర్కొనే ఉత్తమ నాయకులు యీ ఉదాత్త మార్గాలు అవలంబించారు. నెమ్మది మార్గమే అయినా నమ్మకమైన మార్గాన శాంతి, అభివృద్ధికోసం ప్రతిజ్ఞ పూనినజాతి. నిర్మాణాత్మకమైన, నాయకత్వానికి యీ మహదాశయాలను అప్పగించాలి. పురోభివృద్ధి చెందుతున్న దేశ అవసరాలను తీర్చేవిధంగా విశ్వ విద్యాలయ విద్యాస్థాయిని సమీక్షించి పునర్నిర్మించాల్సిన అవసరం ఎంతో ఉంది.

యీ రీతిగా విజ్ఞానం మన పురోభివృద్ధికి తోడ్పడే విధంగా చేయడానికి విశ్వ విద్యాలయాలు పనికిరావచ్చు. జాతి పురోభివృద్ధికి నాయకత్వాన్ని తయారుచేసే ఉన్నత విద్యా అవసరమైన సంస్థలనూ, విశ్వ విద్యాలయాలను అభివృద్ధిచేయడంలో ఖర్చుకు వెనకాడ రాదు.



# మూడవ ప్రణాళికలో సాధారణవిద్య:

## 1962-63 వ సం॥ ప్రణాళికా కార్యక్రమ సమీక్ష-1963-64-కార్యక్రమం

కె. రంగారెడ్డి

### (అ) 1962 - 63 వ సం॥ ప్రణాళికా కార్యక్రమం సమీక్ష

ఈ సంవత్సరంలో విద్యాభివృద్ధి పథకాల అమలుకై రు. 268.24 లు కేటాయించారు. చైనా దురాక్రమణ కారణంగా ఆత్యయిక పరిస్థితి ఏర్పడిన దృష్ట్యా తక్షణావసరాలను ఆదుకోవడానికై ప్రణాళికా కార్యక్రమాన్ని సవరించి రు 228.79 లక్షలకు తగ్గించారు. దీని ఫలితంగా అమలు జరపబడుతున్న కొన్ని పథకాలను ఉపసంహరించుకొని, యన్.సి.సి. వ్యాయామ విద్యలకు అదనపు మొత్తాలను కేటాయించడం జరిగింది.

### 1. ఎలిమెంటరీ విద్య

(i) 1961 ఏప్రిల్ 10 వ తేదీ నుంచి నిర్బంధ ఉచిత ప్రాథమిక విద్యా పథకాన్ని ప్రవేశ పెట్టారు. మూడవ ప్రణాళిక మొదటి సంవత్సరంలో 6_7 సంవత్సరాల మధ్య వయస్సు గ్రూపు వారికి వర్తించే యీ పథకాన్ని 6_8 సంవత్సరాల వారికి కూడా విస్తరింప చేశారు. ప్రాథమిక పాఠశాలల్లో 3,500 మంది ఉపాధ్యాయులను నియమించారు. అయితే తగ్గించబడిన కేటాయింపు దృష్ట్యా 50 శాతం ఉపాధ్యాయులను ఉపసంహరించడం జరిగింది.

ప్రత్యేకంగా 1, 2 తరగతులను, అవసరమైతే ఇతర తరగతులను షిఫ్టులలో నడపాలని నిశ్చయించారు. 1 నుంచి 5 తరగతులలో 1,70,000 మంది బాల బాలికలను చేర్చుకోవాలనే లక్ష్యం సాధించబడుతుందని భావించబడుతున్నది

(ii) శ్రీకాకుళం, రాయలసీమ జిల్లాలలో ప్రభుత్వం, ఎయిడెడ్ సంస్థల క్రింద క్రొత్తగా 12 శిక్షణ తరగతులను ప్రారంభించింది. యీ శిక్షణ సంస్థలలో 480 మంది అభ్యర్థులను చేర్చుకోవడం జరిగింది.

(iii) 1962_63 వ సంవత్సరంలో 90 మాధ్యమిక పాఠశాలలను నెలకొల్పాలని నిర్దేశించబడినా 357 పాఠశాలలను నెలకొల్పారు. 6 నుంచి 8 తరగతులలో అదనంగా దాదాపు 46,000 మంది విద్యార్థులను చేర్చుకోవడం జరిగిందని ఆశిస్తున్నారు.

(iv) కేర్ సంస్థ సహాయంతో 2 లక్షల మంది బాలబాలికలకు మధ్యాహ్న భోజనాన్ని సరఫరా చేస్తున్నారు. 1.52 లక్షల మంది బాల బాలికలకు పాలు సరఫరా చేయడానికై యునిసెఫ్ పాల పొడిని మాత్రం సరఫరా చేస్తున్నది.

### 2. సెకండరీ విద్య

(i) 40 మాధ్యమిక పాఠశాలలను ఉన్నత పాఠశాలలుగా అప్‌గ్రేడ్ చేయాల్సి ఉండగా 216 పాఠశాలలను ఉన్నత పాఠశాలలుగా మార్చారు. 9 నుండి 11 తరగతులలో అదనంగా 10,000 మంది విద్యార్థులను చేర్చుకోవడం జరిగిందని అంచనా.

(ii) 8 ఉన్నత పాఠశాలలను హయ్యర్ సెకండరీ పాఠశాలలుగా మార్చడం జరిగింది.

(iii) 1961_62 వ సం॥ లో కోరుకొండ, (విజయనగరం) లోని సైనిక పాఠశాల ప్రథమ, ద్వితీయ దశల అభివృద్ధికై నిర్దేశించిన గ్రాంట్ల మిగులు మొత్తం రు 13.30 లక్షలను యీ సంవత్సరం చెల్లించడం జరిగింది. 200 మంది విద్యార్థులతో యీ పాఠశాలను ప్రారంభించారు. యీ ప్రవేశ సంఖ్యను 525 కు పెంచాలని ప్రతిపాదించారు. దీనికై రు 32.86 లక్షలు ఖర్చు అవుతవని అంచనా. ఈ సంవత్సరంలో దీనికై రు 4.79 లక్షలు గ్రాంటు చేయడం జరిగింది,

(iv) జాతీయ ఆత్యయిక పరిస్థితిదృష్ట్యా సెకండరీ పాఠశాలలలో ఖర్చుకాకుండా ఉన్న స్పెషల్ ఫీజుఫండును జాతీయ రక్షణనిధికి విరాళంగా ఇవ్వడానికి అనుమతి ఇచ్చారు.

(v) పట్టభద్రులై ఉండి సెకండరీ గ్రేడ్ శిక్షణ పొందిన ఉపాధ్యాయుల సౌకర్యార్థమై

హైద్రాబాదు, రాజమండ్రిలలోని ప్రభుత్వ శిక్షణ కళాశాలలలో తగ్గించబడిన బి. ఇడి. కోర్సును ప్రారంభించారు. ప్రస్తుతం ఉన్న ప్రభుత్వ శిక్షణ కళాశాలలలోని ప్రవేశ సంఖ్యను 130 సీట్లకు పెంచారు.

(vi) తెలంగాణా ప్రాంతంలోని జిల్లా పరిషత్తు సెకండరీ పాఠశాలలకు భవనాలను నిర్మించడానికీ, అభివృద్ధి చేయడానికై తెలంగాణా మిగులు నిధినుంచి రు 18.00 లక్షలు కేటాయించాలని నిశ్చయించారు. దీని నుంచి ప్రతి జిల్లా పరిషత్తుకు రు 2.00 లక్షల చొప్పున ఇస్తారు.

## 3. విశ్వవిద్యాలయం విద్య

(i) 1961-62 వ సంవత్సరంలో ప్రారంభించబడిన 7 ఎయిడెడ్ కళాశాలలకు సహాయం చేయాలని నిశ్చయించారు. యీ సంవత్సరంలో రాష్ట్రంలోని శ్రీ వెంకటేశ్వర, ఆంధ్ర విశ్వవిద్యాలయాలకు రు 3.00 లక్షల చొప్పున, ఉస్మానియా విశ్వవిద్యాలయానికి రు 5.00 లక్షలు, అడ్‌హాక్ అభివృద్ధి గ్రాంట్లు చెల్లించడం జరిగింది.

(ii) వాల్తేరులో న్యూక్లియర్ పరిశోధనా లెబొరెటరీని నెలకొల్పడానికై ఆంధ్ర విశ్వ విద్యాలయానికి రు 5.00 లక్షల గ్రాంటు మంజూరు చేశారు.

## 4. ఇతర విద్యా పథకాలు

(i) దేహదారుఢ్యం గల కళాశాల విద్యార్థులందరినీ యన్. సి. సి. లో చేర్చుకోవడానికి వీలుగా అదనంగా 148 యన్. సి. సి. రైఫిల్ క్వాడ్‌లను ఎక్కువ చేయడానికై ఒక పథకాన్ని మంజూరు చేశారు.

(ii) భారత ప్రభుత్వం ప్రవేశపెట్టిన జాతీయ క్రమశిక్ష పథకం క్రింద పంచకుల (అంబాలావద్ద), మీరట్‌లలోని ఇన్సర్వీసు శిక్షణకు పంపడానికై 16 మంది ఫిజికల్ ట్రేనింగ్ ఇన్‌స్ట్రక్టర్లను సెలక్టు చేయడం జరిగింది.

## (ఆ) 1963-64 సం॥పు కార్యక్రమం

1963 - 64 వ సం॥లో అభివృద్ధి పథకాలను అమలు చేయడానికై రు 287.10 లక్షల మొత్తాన్ని కేటాయించారు. తెలంగాణా ప్రాంతంలోని సెకండరీ పాఠశాలలకు భవనాలను నిర్మించడానికై ఆంధ్రప్రదేశ్ ప్రాంతీయ సంఘం తెలంగాణా మిగులు నిధి నుంచి కేటాయించిన రు. 18 లక్షలు కూడా ఇందులో చేరి ఉన్నాయి. యీ కార్యక్రమం వివరాలను దిగువ ఇవ్వడం జరిగింది.

(i) విద్యార్థులకుఇచ్చే మధ్యాహ్న భోజనము లేక పాల సరఫరా పథకాన్ని 9.25 లక్షల మంది విద్యార్థులకు వర్తింపచేసే విధంగా విస్తరింప చేయడం. దీనికై రు. 13.81 లక్షలు కేటాయించారు.

(ii) యీ సంవత్సరంలో 1 నుంచి 5 తరగతులలో అదనంగా 3,30,000 మంది విద్యార్థులను చేర్చుకోవాలని ప్రతిపాదించారు. అదనంగా ఉపాధ్యాయులను నియమించడం జరగదు.

(iii) 1963-64 సం॥లో అదనంగా ఉపాధ్యాయులను నియమించే ప్రతిపాదన లేని దృష్ట్యా కొన్ని శిక్షణ పాఠశాలలను తాత్కాలికంగా మూసివేయడం జరుగుతుంది.

(iv) క్రొత్తగా మాధ్యమిక పాఠశాలలను నెలకొల్పడం జరగదు. అయితే అసంపూర్తిగా ఉన్న మాధ్యమిక పాఠశాలలలో తర్వాతి ఉన్నత తరగతులను ప్రారంభించడం జరుగుతుంది. ప్రస్తుతం ఉన్న పాఠశాలలలోని 6 నుంచి 8 వ తరగతులలో అదనంగా 53000 మంది బాల బాలికలను చేర్చుకోవాలని ప్రతిపాదించారు.

## 2. సెకెండరీ విద్య

(i) ఈ సంవత్సరంలో మాధ్యమిక పాఠశాలలను ఉన్నత పాఠశాలలుగా మార్చే ప్రతిపాదన లేదు. ఇదేవిధంగా ఉన్నత పాఠశాలలను హయ్యర్ సెకండరీ పాఠశాలలుగా మార్చే ప్రతిపాదన లేదు. ప్రస్తుతం ఉన్న పాఠశాలలలోని 9 నుంచి 11 తరగతులలో అదనంగా 10,000 మంది బాల బాలికలను చేర్చుకోవాలని ప్రతిపాదించారు.

(ii) కోరుకొండలో ఉన్న సైనిక పాఠశాలలోని విద్యార్థులకు మెరిట్ స్కాలర్‌షిప్పులను ఇవ్వడానికై రు 2.50 లక్షలు కేటాయించారు.

(iii) తెలంగాణా ప్రాంతంలోని జిల్లా పరిషత్తు క్రింది సెకండరీ పాఠశాలల భవనాలు అభివృద్ధికై ప్రతిజిల్లాకు రు 2.00 లక్షల చొప్పున గ్రాంట్లు ఇవ్వడానికి 18.00 లక్షలు కేటాయించారు. తెలంగాణ మిగులు నిధినుంచి యీ మొత్తాన్ని ఇస్తారు.

(iv) ఆంధ్ర ప్రాంతములో ఇంగ్లీషు బోధనాభాషగల రెసిడెన్షియల్ పాఠశాలలను నెలకొల్పడానికి రు 2.00 లక్షలు కేటాయించారు.

(v) ఆంధ్ర ప్రాంతంలోని అన్ని పాఠశాలలలో 8 వ తరగతి వరకు ఉచిత విద్య ఉంది. తెలంగాణా ప్రాంతంలో 1 నుంచి 8 వ తరగతి వరకు దేనిలోనైనా సంవత్సరానికి రు. 35/- లకు మించకుండా ఫీజు వసూలు చేస్తున్న పాఠశాలలకు యీ ఉచిత

(తరువాయి xiv వ పేజీలో)

# ప్రాచీన పత్రాలు:

# పరిపాలనా నిర్వహణలో వాటి ఉపయోగం

ఆర్. విశ్వానాథరావు

ఏదైనా ఒక యదార్థ విషయాన్ని కానీ, సంఘటనను కానీ లేక వ్యవహారాన్ని కానీ జ్ఞప్తికుంచుకోవడానికై వ్రాసివుంచే దానిని 'రికార్డు' అంటారు. ఇలాంటి 'రికార్డులను' వ్యక్తులు, కుటుంబాలు, సంస్థలు, ప్రభుత్వాలు నిరంతరం సృష్టిస్తుంటాయి. కాగా వీటన్నింటిలోకీ ప్రభుత్వం అత్యధికంగా 'రికార్డుల'ను సృష్టిస్తుంది. తన దైనందిన వ్యవహారాల నిర్వహణలో ప్రభుత్వం వీటిని సృష్టిస్తుంది. పరిపాలన, న్యాయశాస్త్ర సంబంధమైన తన స్వంత అవసరాల నిమిత్తం ప్రధానంగా వీటిని భద్రపరుస్తుంది. ఈ విధంగా భద్రపరిచి వుంచిన 'రికార్డు' లలో అంటే ప్రాచీన పత్రాలలో కొన్ని కాలక్రమేణా చారిత్రకంగానూ, పరిశోధనరీత్యానూ విలువైనవిగా ప్రాధాన్యత వహిస్తాయి. కనుక వీటిని జాగ్రత్తపరచడం అవసర మవుతుంది. పరిపాలనా విషయకంగా కానీ, న్యాయశాస్త్రరీత్యాకానీ, చారిత్రకంగాకానీ శాశ్వతమైన విలువ కలిగి, తమను సృష్టించిన శాఖలకు తరచుగా అవసరంకాని రికార్డులన్నీ ప్రాచీన పత్రాలుగా రూపొందుతాయి. వీటిని రాష్ట్ర కేంద్ర ప్రాచీన పత్రాల భాండాగారంలో చేర్చి పదిలపరుస్తారు. హైద్రాబాదులోని రాష్ట్ర ప్రాచీన పత్రాల భాండాగారం ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వపు పురాతన పత్రాల కేంద్ర భాండాగారంగా వుంది.

ప్రాచీన పత్రాల విలువ, పరిపాలనా నిర్వహణలో వాటి ఉపయోగం తగువిధంగా గుర్తించబడలేదు. పరిపాలనా నిర్వాహకులు, న్యాయస్థానాలు, శాసన సభలు ప్రభుత్వానికి అవయవాలవంటివైతే, ప్రాచీనపత్రాలు దాని జ్ఞాపకశక్తి వంటివి. సక్రమంగా నడిచే ఏ ప్రభుత్వానికైనా, లోగడ జరిగిన నిర్ణయాలకు, శాసనాలకు నియమ నిబంధనలకు భిన్నంగా ఏమీ జరగకుండా నిరంతరం జాగ్రత్త వహించడం అవసర మవుతుంది. అలాంటి పరిస్థితి ఏర్పడినట్లయితే ఆ ప్రభుత్వం సంకట స్థితిని ఎదుర్కోవలసి వస్తుంది. ఇదివరకే పరిశీలించి నిర్ణయించినట్టి అంశాలనే మళ్ళీ శోధించవలసిన అవసరాన్ని నివారించి తద్వారా వ్యయ ప్రయాసలకు లోను కాకుండా చూసుకోవడం కూడ అవసరమే. కాగా పాత రికార్డులను తిరగవేయడమే వీటి సాధనకు ఏకైక మార్గం. లోగడ జరిగిన వాటన్నింటినీ గురించి జ్ఞాపకం వుంచుకోవడం ఎవ్వరికీ సాధ్యం కాదు. పాత రికార్డులను చూడడం ద్వారనే వాటిని తెలుసుకో కలుగుతాం. కనుకనే ఇవి ప్రభుత్వానికి జ్ఞాపకశక్తివంటివయ్యాయి.

ప్రభుత్వ వ్యవహారాల నిర్వాహణకు పబ్లిక్ రికార్డులు మూలాధారాల వంటివి. పరిపాలనా నిర్వాహకుల చర్యలకు పటిష్ఠతను చేకూర్చడానికై కావలసిన అధికారిక సంబంధమైన అనుభవ విశేషాలు కూడ వీటిలో విరివిగా వుంటాయి. ప్రభుత్వ సంబంధమైన సామర్థ్యం పెంపొందడానికి ఇవి తోడ్పడతాయి. అంతేకాక పరిపాలకులను బాధ్యతాయుతులను చేయడానికి ఇవి ఉత్తమ సాధనాలు.

ప్రభుత్వం, దాని హక్కులు మరియు పాలితుల హక్కుల రక్షణకై భద్రపరచవలసిన ఆర్థిక, న్యాయశాస్త్ర సంబంధమైన అంశాల నిదర్శనాలు కూడ వీటిలో వుంటాయి. ప్రభుత్వ విధానాన్ని రూపొందించడానికీ వ్యవస్థాగతమైన, కార్యాచరణ సంబంధమైన సమస్యలను పరిష్కరించడానికి కూడ ఇవి అవసరమే. నిజానికి ప్రాచీన పత్రాలు ప్రభుత్వమనే భవన నిర్మాణానికి పునాదుల వంటివి.

ప్రజాస్వామిక ప్రభుత్వానికి, వాదాలు, దృష్టాంతాలు ప్రధాన మైనవి కాబట్టి ఇలాంటి ప్రభుత్వానికి రికార్డులు అత్యావశ్యకమైనవి. ప్రభుత్వోద్యోగులు ప్రజలకు బాధ్యులై వుండటానికి ఇవి సాధనాలు, ప్రభుత్వాల పురావృత్తాంతాన్ని – వాటి కష్ఠనిష్ఠూరాలను, అదృష్ట దురదృష్టాలను, పురోభివృద్ధిని, వైభవాన్ని వెల్లడించే

నిష్పాక్షికమైన, విశ్వసనీయమైన, శాశ్వత మైన సాక్ష్యాలు ఇవి. గత అనుభవం, భవిష్యత్తుకు మార్గదర్శక మవుతుంది. పురాతన పత్రాలు వెనుకటి అనుభవాలను వెల్లడిస్తాయి. వర్తమాన పరిస్థితిని వివరి స్తాయి. భవిష్యత్తును గురించిన పరిజ్ఞానం కలిగిస్తాయి. కనుక ఇవి, వర్తమాన సమస్యలను, గత అనుభవాల దృష్ట్యా పరిష్కరించడంలోనూ, భవిష్యత్తులో సంభవించగల పరిణామాల విషయంలో ఒక అభిప్రాయానికి రావడంలోనూ పరిపాల కులకు సహాయపడతాయి.

ప్రాచీన పత్రాలలో వెనుకటి ప్రభుత్వాలు సాధించిన విజయాలను గురించీ, అవి చేసిన ప్రయోగాలను గురించీ వుంటుంది. అంతేకాక సంస్కరణకు ఉద్దేశించిన ఆర్థిక, సామాజిక, పరిపాలనా సంబంధమైన అనేక పథకాలపై ఎంతో సమాచారం ఇవి అందిస్తాయి. సంక్షేమ రాజ్యం చేపట్టే సమస్త కార్యకలాపాలలోనూ అనుసరించ దగిన సమర్థమైన ప్రణాళికా విధానానికి సంబంధించిన విషయాలను ఇవి తెలుపు తాయి. ఆసక్తిదాయకమైన అనేక ముఖ్య విషయాలపై, గత కాలానికి చెందిన అనుభవజ్ఞులైన శాసన సభ్యులు పరిపాలనా దక్షులు, రాజనీతిజ్ఞుల అభిప్రాయాలు వీటిలో పొందుపరిచి వుంటాయి. ప్రభుత్వం అప్పుడప్పుడు నియమించే సంఘాల నివేదికలు, ప్రత్యేకాధికార్ల నివేదికలు, ప్రభుత్వ శాఖాధిపతుల నివేదికలు, ప్రభుత్వ దృక్పథం, ఉత్తర్వులు వీటిలో వుంటాయి. ఇంతేకాక వేదికల మీద పత్రికా ముఖంగా జరిగిన విమర్శలు, వ్యాఖ్యలు, శాసన సభ్యుల చర్చలు, తీర్మానాలు కూడ వీటిలో వుంటాయి. చాలా సమస్యలు పూర్వకాలం నుంచి వారసత్వంగా ఉత్పన్నమైనవే కాబట్టి వీటిలో చాలా అంశాలు ఆసక్తి దాయకంగా వుంటాయి. వర్తమానం గతానికి శిశువు వంటిది కాగా భవిష్యత్తు వర్తమానానికి శిశువు లాంటిది. దాదాపు అన్ని ముఖ్య విషయాలపై కూడా ప్రాచీన పత్రాలు విలువైన సమాచారం అందిస్తాయి. ప్రభుత్వపు ప్రస్తుత వ్యవహారాలకు, గత వ్యవహారాలన్నింటికి కూడ సంబంధించి మిగిలివున్న అధికారిక పత్రాలు కావడం చేత పబ్లిక్ రికార్డులు పరిపాలనా విషయ కంగానూ, న్యాయశాస్త్రరీత్యానూ ఎనలేనివి. పరిపాలకుల అధికారిక చర్యలు విమర్శలకు గురైనప్పుడు వీటి ఉపయోగం వల్ల వారికి రక్షణ చేకూరుతుంది. వారి నిజాయితీ ప్రశ్నించబడినప్పుడు ఇవి వారిని ఆదుకుం టాయి. కాబట్టి ప్రాచీన పత్రాలు దృఢమైన ఆధారం వంటివి. కాగా ఎడతెగని ప్రభుత్వ వ్యవహారాల నిర్వహణ భారాన్ని వహిస్తూ పరిపాలనా నిర్వాహకులు వీటి ఆధారంగా సురక్షితంగా ముందుకు సాగగలుగుతారు. ప్రాచీన పత్రాలు తమ వినియోగార్థమే భద్రపరచబడినాయనీ, పరిపాలనా నిర్వహ ణలో ఇవి తమకు ఎంతగానో తోడ్పడతాయనే విషయాన్ని వారు విస్మరించకూడదు. ★



( X వ పేజీ తరువాయి )

విద్యా పథకాన్ని విస్తరింప చేయడం జరిగింది. తెలంగాణా ప్రాంతంలోని మరి కొన్ని పాఠశాలలకు యీ పథకాన్ని విస్తరింప చేయడానికై రు 5.00 లక్షలు కేటాయించారు. ఆంధ్ర ప్రాంతంలో సహాయక పాఠశాలలకు వర్తింపచేస్తున్న సహాయక గ్రాంట్ల నియమనిబంధనలను తెలంగాణా ప్రాంతంలోని సహాయక పాఠశాలలకు వర్తింపచేయాలని ప్రతిపాదించారు.

### 3. విశ్వవిద్యాలయం విద్య

(i) న్యూక్లియర్ పరిశోధనా లెబొరెటరీని నెలకొల్పడానికై ఆంధ్ర విశ్వవిద్యాలయానికి రు 3.00 లక్షలు గ్రాంటు ఇవ్వాలని ప్రతిపాదించారు.

(ii) రాష్ట్రంలోని మూడు విశ్వ విద్యా లయాలకు అడ్‌హాక్ అభివృద్ధి గ్రాంట్లను ఇవ్వాలని ప్రతిపాదించారు. శ్రీ వెంకటేశ్వర, ఆంధ్ర విశ్వవిద్యాలయా లకు రు 3.00 లక్షల చొప్పున, ఉస్మానియా విశ్వవిద్యాలయానికి రు 4.00 లక్షలు ఇవ్వడం జరుగుతుంది.

### 4. ఇతర విద్యా పథకాలు

(i) కళాశాలస్థాయిలో దేహదారుఢ్యం గల విద్యార్థులను అందరినీ యన్.సి.సి.లో చేర్చుకోడానికి వీలుగా అదనంగా రు 23.00 లక్షలు కేటాయించారు.

(ii) జాతీయ క్రమశిక్షణ పథకాన్ని అమలుచేయడానికై రు 2.00 లక్షలు కేటాయించారు.

(iii) హైద్రాబాదులో ఇండోర్ ఆటలకై స్టేడియంను నిర్మించడానికి ప్రతిపాదించారు.

దేశానికి తక్షణం కావలసిన రక్షణ అవసరాలను ముఖ్యంగా దృష్టిలో ఉంచుకొని 1963–64 వ సం॥ కార్యక్రమాన్ని రూపొందించడం జరిగింది. ★

# మూడవ ప్రణాళికలో సాంకేతిక విద్య:

## 1962-63వ సం॥ ప్రణాళికా కార్యక్రమం సమీక్ష - 1963-64 వ సం॥ కార్యక్రమ వివరణ

### మొదటి భాగం

1. సాంకేతిక విద్యా చరిత్రలో మూడవ ప్రణాళికలోని మూడవసంవత్సరం చాలా ముఖ్యమైంది. యీ సంవత్సరం సాంకేతిక విద్యలోని డిప్లొమా, సర్టిఫికెటు, డిగ్రీ స్థాయి లన్నిటిలోను కోర్సు విషయాలను, కాలపరిమితిని మొదలైన వాటినీ, పద్ధతినీ మార్చడం జరిగింది. ప్రస్తుత ఆత్యయిక పరిస్థితిదృష్ట్యా యీ పునర్వ్యవస్థీకరణ యెంతో అవసర మైంది. సాంకేతిక విద్యా కార్యక్రమాలకు యెక్కువ ప్రాధాన్యం ఇవ్వడమే కాక పరిశ్రమలు, రక్షణకు సంబంధించిన తక్షణ, దీర్ఘకాలిక అవసరాలను ఆదుకోడానికి వీలుగా సాంకేతిక సిబ్బందికి తగిన విధంగా త్వరితగతిని శిక్షణ ఇచ్చి ఏ విధంగా ఉపయోగించుకోవాలనే విషయాలను కూడా పరిశీలించడం జరుగుతున్నది. యీ విషయాలను దృష్టిలో ఉంచుకునే సాంకేతిక విద్యా విధానాలను రూపొందించడం జరిగింది. అయితే దీనిలో దుబారా జరగకుండా జాగ్రత్తలు తీసుకోవడం జరుగుతున్నది. రెండు అభివృద్ధి పద్దుల క్రింద యీ పథకాలను సాంకేతిక శాఖ నిర్వహిస్తున్నది. (1) సాంకేతిక విద్య (2) క్రాఫ్ట్సుమెన్ శిక్షణ. సాంకేతిక విద్యకై మొత్తం ఐదు సంవత్సరాల ప్రణాళికకు మొత్తం రు 295.00 లక్షలు, క్రాఫ్ట్సుమెన్ శిక్షణకు రు 80.00 లక్షలు కేటాయించారు. యీ మొత్తం ఖర్చులో 40 శాతం వాటా రాష్ట్ర ప్రభుత్వం భరిస్తుంది. అయితే సాంకేతిక విద్యాశాఖ అమలు జరిపే అన్ని పథకాలకు యీ మొత్తం సరిపోదు. రాష్ట్రప్రణాళికలో జరిగిన కొన్ని సవరింపుల కారణంగా సాంకేతిక విద్యకు ఎక్కువ మొత్తాలను కేటాయించలేక పోయారు.

### 1962 - 63 వ సం॥ సమీక్ష :

మూడవ ప్రణాళిక మొదటి రెండు సంవత్సరాలలో పబ్లిక్ రంగంలో శ్రీకాకుళంలో ఒక బాలల పాలిటెక్నిక్, కాకినాడలో ఒక బాలికల పాలిటెక్నిక్‌ను నెలకొల్పారు. ప్రైవేటు రంగంలో ప్రదర్శనా సంఘం అధ్వర్యాన హైద్రాబాదులో ఒక బాలికల పాలిటెక్నిక్‌ను నెలకొల్పారు. కాకినాడ, అనంతపురంలలోని ఇంజనీరింగ్ కళాశాలలో 30 సీట్ల చొప్పున పెంచారు. ఆంధ్ర, ఉస్మానియా విశ్వవిద్యాలయాలలోని కెమికల్ పాలిటెక్నాలజీ కోర్సులలో సీట్ల సంఖ్యను ప్రతిదానిలో 30 నుంచి 60 వరకు పెంచారు. మద్రాసులోని గిండీ ఇంజనీరింగ్ కళాశాలలో ఆంధ్ర విద్యార్థులకు పోస్టు గ్రాడ్యేట్ కోర్సులో సీట్లను రిజర్వు చేసే ఏర్పాటును ఉపసంహరించుకున్న కారణంగా మన రాష్ట్రంలోనే హైద్రాబాదులోని ఉస్మానియా విశ్వవిద్యాలయం క్రింద ఉస్మానియా ఇంజనీరింగ్ కళాశాలలోని హైడ్రాలిక్ ఇంజనీరింగ్‌లో పోస్టు గ్రాడ్యేట్ కోర్సును ప్రారంభించారు. యీ కోర్సులో సంవత్సరానికి 20 మంది విద్యార్థులకు ప్రవేశం కల్పిస్తారు. పాలిటెక్నిక్‌లకు అనుబంధంగా 1961-62వ సం॥లో విజయవాడ, వరంగల్లులలో రెండు జూనియర్ టెక్నికల్ పాఠశాలలను ప్రారంభించారు. ప్రతి దానిలో 60 మంది విద్యార్థులను చేర్చుకుంటారు.

పాలిటెక్నిక్ కోర్సులకు ఫీడర్ సంస్థలుగా వీటిని రూపొందించడం జరిగింది.

క్రాఫ్ట్సుమెన్ కార్యక్రమం క్రింద విశాఖపట్నం, విజయవాడ, కాకినాడ, నెల్లూరు, వరంగల్లులలోని ఐదు పారిశ్రామిక శిక్షణ సంస్థలలోనూ, మచిలీపట్నంలోని పారిశ్రామిక పాఠశాలలోనూ అదనంగా 1,008 సీట్లను ఎక్కువచేయడం ద్వారా విస్తరించడం జరిగింది. ప్రస్తుతం ఉన్న పారిశ్రామిక శిక్షణ సంస్థలను విస్తరింప చేయడమే కాక తెనాలి, ఏలూరు, క్రొత్తగూడెంలలో క్రొత్తగా మూడు పారిశ్రామిక శిక్షణ సంస్థలను ఏర్పాటు చేశారు.

1962 నవంబరు నుంచి యీ మూడు సంస్థలు పనిచేస్తున్నాయి.

1963 - 64 సం॥ పథకాలు :

1963 - 64 వ సంవత్సరంలో దిగువ క్రొత్త పథకాలను అమలు చేయడం జరుగుతుంది :

(i) హైద్రాబాదు, విశాఖపట్నం, విజయవాడలలోని ప్రభుత్వ పాలిటెక్నికుల లోనూ, కాకినాడలోని ఆంధ్ర పాలిటెక్నికు లోనూ, హైద్రాబాదు, తణుకులలోని ప్రైవేటు పాలిటెక్నికులలోనూ 2 సంవత్సరాల స్వల్పకాలిక కోర్సులను ప్రవేశ పెట్టడం.

(ii) ఇంజనీరింగ్ డిప్లొమా హోల్డర్స్ కోర్సులో పార్ట్ - టైం డిగ్రీకోర్సు ప్రవేశ పెట్టడం.

(iii) ఆంధ్ర ప్రాంతంలోని బొబ్బిలి, చిత్తూరు, ధోన్‌లలోనూ, తెలంగాణా ప్రాంతంలోని సంగారెడ్డి, నల్లగొండ, పెద్ద పెల్లి, మంచిర్యాలలోనూ ఒక్కొక్కటి చొప్పున మొత్తం 7 క్రొత్త పారిశ్రామిక శిక్షణ సంస్థలను నెలకొల్పడం.

1963 - 64 వ సం॥లో సాంకేతిక విద్య, క్రాఫ్ట్సుమెన్ శిక్షణ పథకాలకై దిగువ మొత్తాలను కేటాయించారు.

సాంకేతిక విద్య...రు 50.00 లక్షలు.

క్రాఫ్ట్సుమెన్ శిక్షణ పథకం...రు22.50 లక్షలు.

4. రక్షణ పథకాలు :

ప్రస్తుత అత్యయిక పరిస్థితి దృష్ట్యా సర్టిఫికెటు, డిప్లొమా స్థాయిలలో కొన్ని తర్విత గతిని ముగిసే కోర్సులను ప్రవేశ పెట్టాల్సిన అవసరం ఏర్పడింది. యీ కార్యక్రమాల విషయంలో భారత ప్రభుత్వం కొన్ని సూచనలను చేసింది. తదనుగుణంగా సంవత్సరానికి 4,176 మంది క్రాఫ్టుమెన్‌లకు శిక్షణ ఇవ్వడానికి ప్రతిపాదించారు. దీనికి సంవత్సరానికి రు 14.00 లక్షలు నాన్ రిక్కరింగ్ ఖర్చు, రు 8.00 లక్షలు రిక్కరింగ్ ఖర్చు జరుగుతుంది. 1963 ఫిబ్రవరి 1 వ తేదీ నుండి యీ శిక్షణను ప్రారంభించాలని ప్రతిపాదించారు. యీ పథకాన్ని అమలు జరపడానికి అవసరమైన చర్యలను తీసుకున్నారు. క్రాఫ్ట్సుమెన్‌లకు శిక్షణ ఇచ్చే పథకంతో పాటు, మోటారు ట్రక్ డ్రైవర్లకు, వైర్‌లెస్ ఆపరేటర్లకు, రేడియో మెకానికులకు శిక్షణ ఇచ్చే పథకాలను కూడా 1963 ఫిబ్రవరి నుంచి అమలు చేయాలని ప్రతిపాదించారు. రక్షణ అవసరాలను ఆదుకోవడానికి వీలుగా ప్రత్యేకంగా యీ పథకాలను అమలు జరుపుతారు.

ప్రతి సంవత్సరం దిగువ సంఖ్యలో అభ్యర్థులకు శిక్షణ ఇవ్వడం జరుగుతుంది.

(1) మోటారుట్రక్ డ్రైవర్లు, 3800; (2) వైర్‌లెస్ ఆపరేటర్లు, 224 (3) రేడియో మెకానిక్‌లు 64.

డిప్లొమా స్థాయిలో ఎక్కువ మంది సాంకేతిక సిబ్బందీ సభ్యులను తయారు చేయడానికి వీలుగా డిప్లొమా కోర్సు కాల పరిమితిని 3 సంవత్సరాల నుంచి 2 సంవత్సరాలకు తగ్గించడమే కాక యీ కోర్సులో ప్రవేశానికి విద్యార్హతను పి. యు. సి. కి బదులుగా మెట్రిక్యులేషన్‌ను నిర్ణయిస్తారు.

రాష్ట్రంలో 1963 - 64 వ సంవత్సరం నుంచి కొన్ని సెలక్టు చేయబడిన పాలిటెక్నికులలో యీ కోర్సును ప్రవేశ పెట్టాలని ప్రతిపాదించారు. యీ సంస్థలలో ప్రస్తుతం ఉన్న 3 సంవత్సరాల కోర్సు స్థానే రెండు సంవత్సరాల కోర్సును ప్రవేశ పెట్టడం జరుగుతుంది. ఇతర పాలిటెక్నికు సంస్థలలో 3 సంవత్సరాల కోర్సును కొనసాగిస్తారు.

ప్రస్తుత ప్రణాళిక మొదటి రెండు సంవత్సరాలలో అమలు జరిపిన పథకాలను మూడవ సంవత్సరంలో కొనసాగించడానికి అవసరమైన మొత్తాలను కేటాయించడమే కాక పై పథకాల అమలుకై అదనపు మొత్తాలను కూడా కేటాయించారు. సాంకేతిక సంస్థలకు క్రొత్తగా శాశ్వత భవనాలను నిర్మించడాన్ని ఆపుచేస్తూ తద్వారా సాంకేతిక శాఖ అవసరాలపై కనీస పరిమితిని విధించారు.

## రెండవ భాగం

సంగ్రహ చరిత్ర :

రాష్ట్రం (తెలంగాణా, ఆంధ్ర) లోని రెండు ప్రాంతాలలో సాంకేతిక విద్యాభివృద్ధి చరిత్ర వివిధ రకాలుగా ఉంది. 1890 వ సం॥లో తెలంగాణా ప్రాంతంలో ప్రప్రథమంగా ఒక పారిశ్రామిక పాఠశాలను నెలకొల్పారు. ఆ తర్వాత 1915 వ సం॥లో 6 పారిశ్రామిక పాఠశాలలను స్థాపించారు. 1922 వ సం॥లో మింట్ అప్రెంటిసెస్ అభ్యర్థుల సౌకర్యార్థమై కేంద్ర సాంకేతిక సంస్థను నెలకొల్పారు. దీనిని ఉస్మానియా కేంద్ర సాంకేతిక సంస్థగా పిలిచేవారు. ఆ తర్వాత ప్రస్తుతం ఉన్న ప్రభుత్వ పాలిటెక్నిక్‌గా అభివృద్ధి చేశారు.

ఆ తర్వాత కీ. శే. సర్ అక్బర్ హైదరీ నియమించిన మెకంజీ కమిటీ, మాధ్యమిక, ఉన్నత పాఠశాల దశల తర్వాతి విద్యార్థులకై వృత్తి, సాంకేతికసంస్థలను నెలకొల్పాలని సిఫారసు చేసింది. ఈ సిఫారసులను అమలు జరపడానికి వీలుగా 1937 మే

11 వ తేదీన సాంకేతిక, వృత్తి విద్యా శాఖను ఏర్పాటు చేశారు. హైద్రాబాద్ రాష్ట్రంలోని పారిశ్రామిక పరిస్థితులను పరిశీలించి, సాంకేతిక విద్యాభివృద్ధికై భవిష్యత్తులో తీసికోవలసిన చర్యల నిమిత్తం తగిన సిఫారసులు చేయడానికై అదే సంవత్సరంలో ఇంగ్లాండు విద్యాబోర్డుకు చెందిన నిపుణుడు శ్రీ ఎ. అబ్బోట్టును ఇక్కడికి ఆహ్వానించారు. అబ్బోట్టు నివేదిక సిఫారసులను అనుసరించి ప్రభుత్వ సాంకేతిక కళాశాలలో మరికొన్ని కోర్సులను ప్రవేశ పెట్టారు. బాలబాలికల కోసం 4 పోస్టు ప్రాథమిక పాఠశాలలను నెలకొల్పారు. హైద్రాబాదులో ఆర్ట్సు, క్రాఫ్టు కేంద్ర పాఠశాల (ఇప్పుడు దీనిని ఫైన్ ఆర్ట్సు, ఆర్కిటెక్చర్ కళాశాలని వ్యవహరిస్తున్నారు)ను నెలకొల్పారు.

1951 వ సంవత్సరం వరకు తెలంగాణా ప్రాంతంలో 15 సంస్థలను నెలకొల్పారు. వీటికి తోడు ప్రభుత్వం గుర్తించిన 12 సహాయక సంస్థలు కూడా పనిచేస్తున్నాయి. 1922 వ సం॥లో సివిల్ ఇంజనీరింగ్ కోర్సులో 12 మంది విద్యార్థులతో ఉస్మానియా విశ్వవిద్యాలయం ఇంజనీరింగ్ కళాశాలను స్థాపించారు.

ఆంధ్ర ప్రాంతంలో 1946 వ సంవత్సరం నుంచి మాత్రమే సాంకేతిక విద్య అభివృద్ధి చెందుతూ వచ్చింది. యీ సంవత్సరంలో కాకినాడ, అనంతపురంలలో రెండు ఇంజనీరింగ్ కళాశాలలను నెలకొల్పారు. అదే సంవత్సరంలో కాకినాడలో 120 మంది విద్యార్థులతో ఒక పాలిటెక్నిక్‌నూ, (ఆంధ్ర పాలిటెక్నిక్), ఉయ్యూరులో 60 మంది విద్యార్థులతో ఒక పాలిటెక్నిక్‌ను మొత్తం రెండు పాలిటెక్నికులను ప్రారంభించారు. వీటిలో ప్రాథమిక మూడు ఇంజనీరింగ్ కోర్సులను ప్రవేశ పెట్టారు.

కాకినాడలోని ఆంధ్ర పాలిటెక్నిక్‌లో సర్టిఫికెట్ స్థాయిలో ఒక పారిశ్రామిక విభాగాన్ని ప్రారంభించారు. 9 రకాలయిన ట్రేడ్‌లలో శిక్షణ ఇస్తారు. రెండవ ప్రపంచ యుద్ధం కాలంలో రక్షణ సంస్థల సాంకేతిక సిబ్బందికి శిక్షణ ఇవ్వడానికిగాను తెలంగాణా, ఆంధ్రప్రాంతాలలో — హైద్రాబాదులో ఒకటి, ఆంధ్రలో 3 పారిశ్రామిక శిక్షణ సంస్థలను నెలకొల్పారు.

ప్రథమ పంచవర్ష ప్రణాళిక :

గత పంచవర్ష ప్రణాళికాకాలంలో అనంతపురం, కాకినాడలలోని ఇంజనీరింగ్ కళాశాలలను అభివృద్ధి చేయడం జరిగింది. 1955 వ సం॥లో ఆంధ్ర విశ్వవిద్యాలయం ఆవరణలో క్రొత్తగా ఇంజనీరింగ్ కళాశాలను ప్రారభించారు. మూడు ప్రాథమిక కోర్సులలో 100 మంది విద్యార్థులను చేర్చుకొన్నారు. మొత్తం రు 14.00 లక్షల ఖర్చుతో కాకినాడలోని ఆంధ్ర పాలిటెక్నిక్ భవనాలను నిర్మించడం జరిగింది. 2 ఇంజనీరింగ్ కళాశాలలకు, పాలిటెక్నిక్‌లకు అవసరమైన పరికరాలను రు 38 లక్షల ఖర్చుతో కొనుగోలు చేశారు. పి.డబ్ల్యు.డి.కి అవసరమైన సూపర్‌వైజింగ్ సిబ్బందీ అవసరాలను ఆదుకోవడానికి కాకినాడ, అనంతపురంలలోని కళాశాలలలో మొత్తం రు 3.00 లక్షల ఖర్చుతో 2 1/2 సంవత్సరాల డిప్లొమా కోర్సును ప్రారంభించారు. ఒక్కొక్క కళాశాలలో యీ కోర్సుకై 100 మంది విద్యార్థులను చేర్చుకుంటారు.

1947 వ సం॥లో తెలంగాణా ప్రాంతంలోని సాంకేతిక, వృత్తి విద్యాశాఖను స్పెషల్ ఆఫీసర్ క్రింద ఉంచారు. మొత్తం రు 29.61 లక్షల రిక్కరింగ్, నాన్ రిక్కరింగ్ ఖర్చుతో 16 పథకాలను అమలు జరిపారు. ప్రథమ పంచవర్ష ప్రణాళికలోని ఆఖరు సంవత్సరంలో వరంగల్లులో ఒక పాలిటెక్నిక్‌ను ప్రారంభించారు. సివిల్ ఇంజనీరింగ్ కోర్సులో మాత్రమే ప్రవేశం లభిస్తుంది.

రెండవ పంచవర్ష ప్రణాళిక :

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ఏర్పడిన తర్వాత ఆంధ్రప్రదేశ్‌లో సాంకేతిక విద్యాభివృద్ధికై మొత్తం రు 374.00 లక్షల ఖర్చు అంచనాతో ఒక ప్రణాళికను తయారు చేశారు. ఇందులో ఆంధ్ర ప్రాంతానికై 254.00 లక్షలు, తెలంగాణా ప్రాంతానికై రు 40.00 లక్షలు కేటాయించారు. డిప్లొమా సంస్థలను నెలకొల్పడానికీ, అభివృద్ధి పరచడానికీ, రు 169 లక్షలు, క్రాఫ్ట్సుమెన్‌ల శిక్షణకై రు 113 లక్షలు, ఇతర వృత్తి విద్యా సంస్థలకై రు 51.00 లక్షలు కేటాయించారు.

1957–58వ సం॥లో ఆంధ్రప్రాంతంలో క్రొత్తగా 5 సంస్థలను నెలకొల్పారు. విశాఖపట్నంలోని హిందుస్తాన్ షిప్‌యార్డ్‌లో, నిపుణత గల పనివారల శిక్షణకై అప్రెంటెస్‌షిప్ పథకం కార్యక్రమాన్ని ప్రారంభించారు. దీనిలో 120 మంది విద్యార్థులను చేర్చుకుంటారు. 1958–59 సం॥లో కాకినాడలోని ఇంజనీరింగ్ కళాశాలలో డిగ్రీ స్థాయిలో టెలి-కమ్యూనికేషన్ కోర్సును ప్రారంభించారు. దీనిలో 30 మంది విద్యార్థులను చేర్చుకుంటారు. 1957–58 వ సం॥లో హైద్రాబాదులోని ప్రభుత్వ పాలిటెక్నిక్‌లో టెలి-కమ్యూనికేషన్ డిప్లొమా కోర్సును ప్రవేశ పెట్టారు. ఇందులో 30 మంది విద్యార్థులను చేర్చుకుంటారు.

సాంకేతిక విద్యా విస్తరణ పథకం క్రింద ఎక్కువమంది విద్యార్థులను చేర్చుకోడానికి వీలుగా కేంద్ర ప్రభుత్వం కొన్ని పాలిటెక్నిక్‌లను సెలక్టు చేసింది. అవి:— హైద్రాబాద్‌లోని ప్రభుత్వ పాలిటెక్నిక్, కాకినాడలోని ఆంధ్ర పాలిటెక్నిక్, విశాఖ పట్నంలోని పాలిటెక్నిక్. వీటిలో అదనంగా 250 మంది విద్యార్థులను చేర్చుకుంటారు. దీనికి రు 21.00 లక్షలు ఖర్చు అవుతుంది. కేంద్ర ప్రభుత్వం యీ ఖర్చు నంతా భరిస్తుంది. రెండవ పంచవర్ష ప్రణాళికా కాలంలో గూడూరు, కొత్తగూడెం లలో రెండు మైనింగ్ సంస్థలను నెలకొల్పారు. మైనింగ్ పరిశ్రమకు చెందిన సిబ్బందికి ఇందులో శిక్షణ ఇవ్వడం జరుగుతుంది.

హైద్రాబాద్, తణుకులలో రెండు పాలిటెక్నికులను ప్రైవేటు సంస్థలు స్థాపించాయి. మొత్తం 240 మంది విద్యార్థులను వీటిలో చేర్చుకుంటారు.

ప్రథమ పంచవర్ష ప్రణాళికకు పూర్వం ఆంధ్ర ప్రాంతంలో వివిధ పథకాల అమలుకై మొత్తం రు 22.36 లక్షలు (రికర్రింగ్) ఖర్చు చేశారు. రెండవ ప్రణాళిక ఆఖరు నాటికి మొత్తం ఆంధ్రప్రదేశ్‌లో దీని క్రింద రు 61.41 లక్షలు ఖర్చు చేశారు. విశ్వవిద్యాలయ ఇంజనీరింగ్ కళాశాలలకై ఖర్చు చేసిన మొత్తాలను ఇందులో పడం జరగలేదు. రెండవ ప్రణాళికా కాలంలో అభివృద్ధిపథకాలకై రు 3.74 కోట్లు కేటాయించారు. ప్రథమ పంచవర్ష ప్రణాళిక మొత్తాలకన్నా ఇది 5 రెట్లు ఎక్కువ.

1957 ఫిబ్రవరి 26 వ తేదీన రాష్ట్ర సాంకేతిక విద్య, శిక్షణ బోర్డును ఏర్పాటు చేశారు.

వివిధ స్థాయిలలో సాంకేతిక విద్యాభివృద్ధి పై ప్రభుత్వానికి యీ బోర్డు సలహాల నిస్తుంది.

తిరుపతిలోని శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం ఆవరణలో ఒక ఇంజనీరింగ్ కళాశాలనూ, భారత ప్రభుత్వ ఆధ్వర్యంలో వరంగల్లులో ఒక ప్రాంతీయ ఇంజనీరింగ్ కళాశాలనూ రెండు ప్రభుత్వ పాలిటెక్నికులనూ, వరంగల్లు పాలిటెక్నిక్ ట్రస్టు అధ్వర్యంలో ఒక పాలిటెక్నిక్‌నూ నెలకొల్పారు.

ఈ సంస్థల అన్నిటి ఖర్చు దాదాపు 150 లక్షలు.

## మూడవ పంచవర్ష ప్రణాళిక

రెండవ పంచవర్ష ప్రణాళికా కాలంలో నెలకొల్ప బడిన సంస్థలను అభివృద్ధి చేయడానికి మూడవ ప్రణాళికా కాలంలో కృషి చేయడం జరుగుతుంది. మూడవ ప్రణాళికా కాలంలో శ్రీకాకుళంలో ఒక పాలిటెక్నిక్‌ను ప్రారంభించాలని ప్రతిపాదించారు. సివిల్, ఎలక్ట్రికల్, మెకానికల్ మూడు బ్రాంచీలను ఇందులో ఏర్పాటు చేస్తారు. ప్రైవేటు రంగంలో ఒక ఇంజనీరింగ్ కళాశాలను నెలకొల్పడానికి ప్రోత్సహించడం జరుగుతుంది.

దేశంలో ప్రప్రథమంగా క్రొత్త కోర్సులను క్రొత్తసంస్థలను ఏర్పాటు చేయడం మూడవ ప్రణాళిక ముఖ్య ఉద్దేశ్యం. ప్రత్యేకంగా బాలికల పాలిటెక్నికులను నెలకొల్పడం జరుగు తుంది. వీటిలో డిప్లొమా స్థాయిలో ఇంజనీరింగ్ కోర్సులను ప్రవేశ పెడ్తారు. డిప్లొమాలు పొందిన వారు డిగ్రీలు పొందడానికి వీలుగా ఇంజనీరింగ్‌లో పార్ట్-టైం కోర్సులను ప్రవేశ పెటడం జరుగుతుంది. మెట్రిక్యులేషన్ తర్వాత చదివే డిప్లొమా కోర్సులను కూడా ప్రారంభిస్తారు.

రాష్ట్రంలోని ఇంజనీరింగ్ కళాశాలలలో పోస్టు-గ్రాడ్యేవేటు కోర్సులను ప్రవేశ పెట్టాల్సిన అవసరాన్ని గుర్తించారు. దీనికోసం కూడా ప్రణాళికలో తగిన మొత్తాలను కేటాయించారు.

రెండవ ప్రణాళికా కాలంలో జూనియర్ సాంకేతిక పాఠశాలలను నెలకొల్పే పథకాన్ని ప్రవేశ పెట్టారు. ఇవి పాలిటెక్నికులకు "ఫీడర్ సంస్థలు" గా పని చేస్తాయి. మూడవ ప్రణాళికా కాలంలో యీ పథకాన్ని అమలు జరుపుతారు. యీ కాలంలో మరో 4 సంస్థలను నెలకొల్పడం జరుగుతుంది.

హైదరాబాదులోని ప్రభుత్వ లలితకళలు, ఆర్కిటెక్చరు కళాశాలనూ, ఆర్కిటెక్చర్ శాఖనూ అభివృద్ధి చేయడానికి మూడవ ప్రణాళికలో తగిన మొత్తాలను కేటాయించారు. యీ కోర్సుల స్థాయిని జాతీయ డిప్లొమా స్థాయికి పెంచుతారు.

యీ ప్రణాళికా కాలంలో హైద్రాబాదు, విజయవాడలలోని రెండు సంగీత కళాశాలలను అభివృద్ధి చేయడం జరుగుతుంది. వీటికి శాశ్వత భవనాలు, అవసరమైన సాధన సామాగ్రిని సరఫరా చేయడం జరుగుతుంది. హైద్రాబాదులోని ప్రభుత్వ సంగీత, నృత్య కళాశాలలో బి. మ్యూజిక్ డిగ్రీ కోర్సును ప్రవేశ పెడ్తారు.

రాష్ట్రంలోని మూడు విశ్వవిద్యాలయాలు, మూడు ఇంజనీరింగ్ కళాశాలలను నిర్వహిస్తున్నాయి. యీ మూడు కళాశాలల కోర్సులను సాంకేతిక శాఖా డైరెక్టరు సమన్వయ పరుస్తారు. వీటి నిర్వహణకై రాష్ట్ర ప్రభుత్వం విశ్వవిద్యాలయాలకు డబ్బు చెల్లిస్తుంది. యీ విశ్వవిద్యాలయ ఇంజనీరింగ్ కళాశాలలలో 5 సంవత్సరాల సమీకృత కోర్సులను ప్రవేశ పెట్టడానికై

అవసరమైన నిధులను మూడవ ప్రణాళికలో కేటాయించారు.

మూడవ ప్రణాళికా కాలంలో వివిధ సాంకేతిక విద్యా పథకాల అమలుకై రు. 305 లక్షలు కేటాయించారు. రెండవ ప్రణాళికలో వీటికై రు. 262 లక్షలు మాత్రమే కేటాయించడం జరిగింది.

భారత ప్రభుత్వ కార్మిక మంత్రిత్వశాఖ అధ్వర్యంలోఉన్న పారిశ్రామిక శిక్షణసంస్థల నిర్వహణనూ, పరిపాలనా వ్యవహారాలనూ రాష్ట్ర సాంకేతిక విద్యాశాఖ నిర్వహిస్తున్నది. ప్రణాళికా కాలంలో రాష్ట్రంలో క్రొత్తగా 8 పారిశ్రామిక శిక్షణ సంస్థలను నెలకొల్పాలని ప్రతిపాదించారు. ప్రస్తుతం ఉన్న వాటిలో 5 సంస్థలను విస్తరింపచేయడం జరుగుతుంది. యీ ప్రణాళికా కాలంలో క్రాఫ్ట్సుమెన్ శిక్షణ కార్యక్రమం క్రింద అదనంగా 2,600 మందికి శిక్షణ సౌకర్యాలు కల్పించాలని ప్రతిపాదించారు. యీ ప్రణాళికలో కార్మిక మంత్రిత్వశాఖా పథకాలకై రు. 2.00 కోట్లు కేటాయించారు. సాంకేతిక విద్యా పథకాలకై మూడు ప్రణాళికలలోనూ దిగువ మొత్తాలను కేటాయించారు. వీటినిబట్టి సాంకేతిక విద్యాభివృద్ధిని అంచనా వేయవచ్చు.

సాంకేతిక విద్య (పారిశ్రామిక శిక్షణ సంస్థలతోసహా) మొదటి ప్రణాళికలో రు. 13.92 లక్షలు, రెండవ ప్రణాళికలో రు. 374.00 లక్షలు, మూడవ ప్రణాళికలో రు. 505.00 లక్షలు.

మొదటి రెండు ప్రణాళికలలో సాధించిన ప్రగతినీ, మూడవ ప్రణాళికలో సాధించదల్చిన అభివృద్ధినీ అంకెల వారీగా †ఈ దిగువ పట్టికలో ఇవ్వడం జరిగింది.

మూడవ ప్రణాళికా కాలంలో ప్రథమ ప్రణాళిక పూర్వంకన్నా, డిగ్రీస్థాయిలో నాల్గింతలు, డిప్లొమాస్థాయిలో పదింతలు సాంకేతిక విద్యాసౌకర్యాలు కల్పించాలని నిర్దేశించారు. క్రాఫ్ట్సుమెన్ల స్థాయిలో శిక్షణ సౌకర్యాలు ఎనిమిదింతలు ఎక్కువ చేయడం జరుగుతుంది. వీటికితోడు డిప్లొమా స్థాయిలో బాలికలకు, పోస్ట్ మిడిల్ స్థాయిలో బాలలకు సౌక్యరాలు కల్పించబడ్తాయి.

రాష్ట్ర ఆర్థిక ప్రగతిని సాధించడానికి అన్నిరంగాలలోనూ ఎంతో కృషి జరగాల్సి ఉంది. పారిశ్రామికాభివృద్ధి విస్తరణకై రాష్ట్ర ప్రభుత్వం అవసరమైన అదనపు సౌకర్యాలను కల్పించాల్సి ఉంది.

† ఆంధ్రప్రదేశ్‌లో సాంకేతిక విద్య, శిక్షణ

| సంస్థ పేరు | ప్రణాళికలకు పూర్వం | | మొదటి ప్రణాళిక ఆఖరువరకు | | రెండవ ప్రణాళిక ఆఖరువరకు | | మూడవ ప్రణాళిక ఆఖరువరకు | |
|---|---|---|---|---|---|---|---|---|
| | సంస్థల సంఖ్య | వార్షిక ప్రవేశాలు | సంస్థల సంఖ్య | వార్షిక ప్రవేశాలు | సంస్థల సంఖ్య | వార్షిక ప్రవేశాలు | సంస్థల సంఖ్య | వార్షిక ప్రవేశాలు |
| ఇంజనీరింగ్ కళాశాలలు | 3 | 290 | 4 | 390 | 6 | 1015 | 7 | 1135 |
| పాలిటెక్నిక్‌లు, మైనింగ్ సంస్థలు | 3 | 240 | 4 | 460 | 18 | 2450 | 19 | 2570 |
| పారిశ్రామిక శిక్షణ సంస్థలు | 4 | 664 | 6 | 1112 | 9 | 3182 | 17 | 5782 |
| బాలికల పాలిటెక్నిక్‌లు | — | — | — | — | — | — | 4 | 360 |
| జూనియర్ సాంకేతిక పాఠశాలలు | — | — | — | — | 3 | 180 | 7 | 420 |

సాధారణ మోడి లిపిలో వ్రాయబడిన

# మరాఠీ పత్రాలను భద్రపరచడంలో కొన్ని సమస్యలు

ఎ. ఎస్. బాజి

మరాఠీ చరిత్ర పరిశోధనలో ఆసక్తి గల పరిశోధకులు, హైద్రాబాదులో సెంట్రల్ రికార్డు ఆఫీసులోని చారిత్రక ప్రాముఖ్యంగల మరాఠీ పత్రాలతో సుపరిచితులే. ఇప్పటివరకు మూడు సంపుటాలలో ప్రచురించబడిన 'పూనాఅక్బార్లు' మరాఠీ పత్రాల సేకరణకు దృష్టాంతరాలుగా నిలుస్తాయి. ఇవి పానిపత్ కాలం తర్వాతినాటి మరాఠాల చరిత్రను తెలిపేవే కాక, ఆనాడు పూనాలో మరాఠా రాజులకు, హైద్రాబాదులోని నవాబ్ నాజిం అలీఖాన్ బహదూర్ రాజుల మధ్య ఉండే రాజకీయ సంబంధాలు, అప్పటి సాంఘిక జీవన స్థితిగతులు యీ పత్రాల ద్వారా మనకు విశదమవుతాయి.

ఈ పత్రాల చారిత్రక విలువనుగూర్చి ఇక్కడ చర్చించడం యీ వ్యాసం ఉద్దేశ్యం కాదు.

ఈ పత్రాలను భద్రపరచడంలో ఎదుర్కొనే సమస్యలను మాత్రమే ఇక్కడ పేర్కొనడం జరుగుతుంది.

ఈ భద్రతా సమస్య కేవలం పై పత్రాలకే కాక మొత్తం మరాఠీ పత్రాలకు కూడా వర్తిస్తుంది. కాబట్టి ఈ వ్యాసంలో చర్చించే విషయాలు, యీ పత్రాలకు సంబంధించిన ప్రత్యేక విషయంగా కాక మొత్తానికి సంబంధించినదిగా తీసుకోవాలి.

ఆధునిక పద్ధతులలో దస్తావేజులను భద్రపరిచే కొన్ని విషయాలలో సామ్యత ఉంది. ఉదాహరణకు :- దస్తావేజుల పత్రాల సైజు ఒకేరీతిగా ఉండడం వల్ల వాటిని సంపుటలుగా బైండింగ్ చేయడంలో ఎంతో సులువుఉంది. యూరపులో తయారయిన కాగితం, మిషిన్ ద్వారా తయారయిన కాగితాలు వివిధసైజులలో ఉంటున్నాయి. నేడు అధికారిక రికార్డులకు ఫుల్‌స్కేప్ సైజు కాగితాన్ని ఉపయోగిస్తున్నారు. అంతేగాక వ్రాసేటప్పుడు కాగితానికి ఒకవైపు మార్జిన్ ఉంచడం వల్ల వాటిని బైండింగ్ చేసే సౌకర్యం కూడా కలుగుతుంది. యీ విధంగా ఆధునిక రికార్డులను భద్రపరచడము యీ రోజుల్లో ఎంతో సులభం.

మారాఠీ పత్రాలను భద్రపరచడంలో ఇటువంటి సౌకర్యాలు లేవనీ ఈవ్యాసం వల్ల ముమ్ముందు తెలుస్తుంది.

అపూర్వమైన దస్తావేజు పత్రాలను తోలుకాగితాలపై భద్రపరచే ఆధునిక విధానాన్ని గురించి యూరోపియన్, అమెరికన్ రచయితలు ప్రస్తావించారు. కొందరు భారతీయ రచయితలు తాళపత్రాల పైనా, రావిపట్టాల పైనా వ్రాసేవారు. అయితే మరాఠీ పత్రాలను బాగుచేసే పద్ధతులను గురించి ఎవ్వరూ చర్చించలేదని చెప్పవచ్చు. ఇటువంటి పరిస్థితిలో ప్రస్తుత వ్యాసం సక్రమమైందనే భావించవచ్చు. మరాఠీ పత్రాలను భద్రపరచడంలో యెదుర్కొనే ప్రత్యేక పరిస్థితులను సవివరంగా చర్చించడం జరుగుతున్నది.

కొద్దిగా గోధుమవర్ణం మిశ్రితమైన చేతితో తయారైన దళసరి కాగితాలను మరాఠీ పత్రాలకు ఉపయోగించారు. యీ కాగితం ఎక్కువ పీల్చే శక్తిగలవి. దీపపు మసితో చేసిన కార్బన్ సిరాతో వ్రాత ఉంటుంది. కొన్ని పత్రాలు విశేషమైన మెరపుతోనూ, సులభమైన అంచులతోనూ ఉంటాయి. శంఖు చిప్పల వెనుక భాగంతో కాగితం రెండుకొనలనురుద్దడం ద్వారా యీ శ్రేష్ఠతను కలిగించేవారు. యీ విధానాన్ని ఘోటా అంటారు. కర్రనారతో చేసిన కాగితమే అయినా శ్రేష్ఠంగా ఉండేది. అయితే యీకాగితం ఎక్కువకాలంమనలేదు. నేటి హాడ్కిన్‌సన్ రకం చేతితో తయారైన కాగితంతో దీనిని పోల్చలేము. ఈ కాగితంలో ఉన్న విశేషమేమంటే ఇది సిరాను త్వరగా

ఆరేట్టు చేస్తుంది. కొన్ని వ్రాతలలో ఉపయోగించిన కార్బన్ సిరా జిగటుగా ఉండేది. అంతేగాక పీల్చే శక్తిగల కాగితంపై దీనితో వ్రాసినప్పుడు ప్రత్యేక ఆకర్షణీయంగా ఉండి, ప్రాచీన పత్రాల అభిమానుల దృష్టిని ఆకట్టుకునేట్టు ఉంటాయి. ఇక వీటి సమస్యల క్లిష్టాంశాలను గూర్చి తెలుసుకుందాం. యీ మరాఠీ పురాతన పత్రాలను బాగు చేయడంలో ప్రప్రథమంగా ఎదురయ్యే సమస్య యీ పత్రాల సైజు. పైన చెప్పినట్టు యూరోపియన్ రికార్డుల సైజు ఒక స్థాయిలో ఉంటాయి. సహజంగా గ్రూపుకు చెంది ప్రాచీన పత్రాలు ఒకే సైజులో ఉంటాయి. దీనివల్ల సంపుటలుగా బైండింగ్ చేయడంలో సౌకర్యం ఉంటుంది. సైజులో లేని విడిపత్రాలు ఉంటే వాటిని సంపుటలలో చేర్చవచ్చు. పత్రాలకు ఒకవైపు మార్జిన్‌గా విడిచిన స్థలాన్ని బైండింగ్ చేసేటప్పుడు కుట్టడానికి ఉపయోగించవచ్చు. మార్జిన్‌స్థలం కొద్దిగా ఉన్నా అతికించడానికి సౌకర్యం ఉంటుంది. అయితే మరాఠీ పత్రాల విషయంలో యీ సౌకర్యాలు లేవు. అవి ఒక కొననుంచి ఇంకో కొనవరకూ వ్రాసి ఉంటాయి. యీ పత్రాల రచయితలు ఏమాత్రం ఖాళీ స్థలాన్ని విడిచి ఉంచకుండా ఉపరిభాగంలో ఐమూలగా కూడా వ్రాసేవారు. ఇక సైజు విషయం. సాధారణంగా పొడుగు నిడివిగల కాగితాన్ని ఉపయోగించేవారు. యీ కాగితాలకు ఒక సైజంటూ లేదు. దేని సైజు దానిదే. కాగితం వెడల్పు కూడా వివిధ రకాలుగా ఉండేది. ఇవి మూడు అంగుళాలు మొదలు 9 అంగుళాల వెడల్పు వరకు ఉంటాయి. కాగితం నిడివికి నియమమంటూ లేదు. ఇది రెండు అంగుళాల నుంచి నూరు అడుగుల వరకూ ఉంటుంది. పొడుగు కాగితాలను అంటించి గుండ్రంగా చుట్టే వారు. హైద్రాబాదులోని సెంట్రల్ రికార్డు ఆఫీసులో భద్రపరచబడిన ఒక మహజర్నామా కాగితం చుట్ట 8"×129' పరిమాణంలో ఉంది. దీనికి విరుద్ధంగా అతి చిన్న కాగితంపై (ఆధునిక విజిటింగ్ కార్డు సైజులో) వ్రాసి వాటిని పత్రాలకు జతచేసిన ప్రాచీన పత్రాలు కూడా కన్పిస్తాయి.

ఒకే తరగతికిచెందిన ప్రాచీనపత్రాలు దేశంలోని అనేక రికార్డు ఆఫీసులలో లభిస్తాయి. అనేక విషయాలలో ఇవి మరాఠీ పత్రాలను పోలి ఉంటాయి. అయితే కొన్ని ఆఫీసులలో యీ పత్రాలను సూచీపత్రాల కవర్లలో ఉంచారు. పొడువుగా ఉండే పత్రాలను అవసరమైన విధంగా మల్చి సూచీ పత్రాల కవరు (Docket Cover) లోపలి భాగంలో యీ పత్రాల ఉపరిభాగంలో దోపేవారు. ఇటువంటి పత్రాలను భద్ర పరచడంలో యీ విధానం మంచిదికాదని ఎవరైనా అంటారు. యీ విధంగా భద్రపరచ బడిన పత్రాలను పరిశీలించేటప్పుడు చాలా జాగ్రత్తలు తీసుకోవాల్సి ఉంటుంది.

మరాఠీ పత్రాల విషయంలో మరో విశేషం ఉంది. పొడుగు పత్రాలను చదివేటప్పుడు క్రిందివరకు చదివిన తర్వాత షార్ట్‌హాండ్ నోటుబుక్కు పేజీలను త్రిప్పినట్టుగానే యీ పత్రాల రెండో పేజీని క్రిందినుంచి పైకి త్రిప్పాలి. కొద్ది అభ్యాసంతో దీనికి అలవాటు పడవచ్చు. దీనివల్ల ఒక పత్రం కొనను సూచీ పత్రాల కవరులో అంటించినప్పుడు వాటిని పరిశీలించడం కొద్దిగా కష్టమవుతుంది. ఇటువంటి పత్రాలను భద్రపరిచేందుకు ఉద్దేశించే పథకంలో యీ పత్రాలను సులభంగా పరిశీలించడానికి వీలుగా లంగరు త్రాళ్ళు లేకుండా ఉంచేలా చూడాలి. హైద్రాబాదులోని సెంట్రల్ రికార్డుఆఫీసులో యీ పత్రాలను ప్రత్యేకంగా ఉంచే పద్ధతిలోని కొన్ని విషయాలను తెల్పాల్సి ఉంది. ఒక డాక్యుమెంటు (దీనిని 'యూనిట్'గా పిలవవచ్చు.) లో ఒకటికన్నా ఎక్కువ కాగితాలు ఉంటాయి. 'యూనిట్'లోని ప్రతి కాగితాన్ని అనువైన విధంగా ఒక సైజులో అనేక మడతలుగా మడతబెట్టవచ్చు. యీ మడతలను ఒకదాని తర్వాత ఒకటిగా క్రమపద్ధతిలో పెట్టి మొత్తం యూనిట్‌ను తబ్లాక్ అనే కవర్ బ్యాండ్‌లో ఉంచాలి. యీ తబ్లాక్‌ను సాధారణంగా గోధుమవర్ణం కాగితంలో తయారుచేస్తారు. యీ విధంగా యూనిట్‌లోని అన్ని విభాగాలను కవర్ బాండ్‌లోని కవర్ల పాకెటులాగా ఒకే చోట ఉంచవచ్చు. యూనిట్లను యీ విధంగా ప్యాక్ చేయడం వల్ల వీటిని ఉపయోగించడంలో సౌలభ్యం ఉంది. అయితే పత్రాలనుభద్రపరచేవిషయంలో యీ పద్ధతి అంతగా ఉపయోగపడదు. నిడివిగల పత్రాలను అనువైన సైజులో మడతలుగా ఉంచడం వల్ల ప్రతి మడతలోని పంక్తులు మాసిపోయే ప్రమాదం ఉంది. ఫోల్డ్ న్యాపుల విషయంలో వలెనే యీ యూనిట్ల పానెల్స్‌ను విడి విడిగా సన్ననిదారంతో జతచేయాలి.

ఈ పత్రాల విశేష లక్షణాల దృష్ట్యా వీటి మెషిన్ లామినేషన్‌లో ఉండే ఇబ్బందులను కూడా సునాయాసంగా చూడవచ్చు. అయితే యీ విషయాన్ని సాంకేతిక నిపుణులు మాత్రమే పరిష్కరించాలి. మన దేశంలో విస్తారంగా మెషిన్ లామినేషన్‌కు ప్రవేశపెట్టాల్సిన దృష్ట్యా యీవిధంగా పరిశీలించాల్సిఉంది.

ఈ పత్రాలను బాగుచేయడంలో జపాన్ టిష్యూ పేపరుతో కవర్ చేసే విధానాన్ని మాత్రమే అమలుచేయాలి. పెళుసైన పత్రాలుకానీ, సిరా వ్రాత మాసిపోయే పత్రాలనుకానీ, చిఫన్ **(Chiffon)** తో కప్పాలి.

పైన చెప్పినట్టుగా యీ పత్రాల పరిమాణం వివిధ రకాలుగా ఉన్నా, వాటిలో ఎక్కువ పత్రాల సగటు వెడల్పు 7½ అంగుళాలు. వాటి పొడవుతో సంబంధం లేకుండానే 8 నుంచి 9 అంగుళాల పొడవు మడతలుగా వీటిని మడచవచ్చు. ప్రతి యూనిట్‌నూ క్రాఫ్టు పేపరు కవరులోగానీ, దళసరి మనిల్లా కవరులోగానీ ఉంచాలి. ప్రతి కవరు యొక్క మధ్య ఫ్లాప్‌పై సమకోణ చతురస్రంలో రెఫరెన్స్ నెంబరును ప్రచురించాలి. కవరు వెనుకభాగంలో పత్రానికి సంబంధించిన ఇతర వివరాలను రికార్డు చేయాలి. కవర్ల సైజులో ఉన్న కార్టన్‌బాక్స్‌లలో యీ కవర్లను ఉంచాలి. కాలికో అంచులుగల నిడుపాటి తొట్టి రూపంలో ఉన్న కార్డ్‌బోర్డు పెట్టెలలో యీ కవర్లను భద్రపరచాలి. ఇవి కార్టన్ బాక్స్‌లకన్నా చవుకయినవి. అయితే వీటిని నియమిత కాలంలో దులుపుతూ ఉండాలి. యూనిట్లను తీయడంలో సౌలభ్యం ఉండేట్లుగా కార్టన్ బాక్స్‌లలో వీటిని వదులుగా ఉంచాలి. ఇటువంటి కార్టన్‌బాక్స్‌లను ఓపెన్ షెల్పులలో ఉంచాలి. సైజులోలేని పత్రాలనూ, నిడివిగల రోల్సును విడిగా ఉంచాలి. చిన్న నిడివిగల రోల్సును మడతలుగా మార్చాలి. సీరియల్‌లో సైజులేని పత్రాలుగానీ, రోల్సుగా ఉండే వాటిని విడదీసి, ఆ వరుసలో విడదీసినట్టు తెల్పే కార్డులను ఉంచాలి. యీ సమస్యలను ఇక్కడ సుదీర్ఘంగా చర్చించాల్సిన అవసరం లేదు. శిక్షణ పొందిన ఆర్కీవ్‌లకు యీ విషయాలు తెలిసే ఉంటాయి.

మరాఠీ పత్రాలను భద్రపరచడంలో గల విశేషాలను తెల్పడానికి మాత్రమే యీ వ్యాసం ఉద్దేశించబడింది.

యీ పత్రాలను భద్రపరచడంలో అభిరుచి గలవారు సాంకేతికంగా క్రొత్త మార్గాలు ఏమైనా సూచిస్తే యీ రచయిత కృతజ్ఞతతో స్వీకరిస్తాడు.

# రాష్ట్ర పురాతన దస్తావేజుల శాఖా ప్రణాళికా పథకాలు

హెచ్. ఎ. హసన్మి

రాష్ట్ర పురాతన దస్తావేజుల సంగ్రహ చరిత్ర

ఆంధ్ర ప్రదేశ్‌లో రాష్ట్ర పురాతన దస్తావేజుల చరిత్ర క్రీ. శ. 1721 లో ప్రారంభమయింది. దక్కన్‌లో మొగల్ చక్రవర్తుల సుబేదారు మొదటి అసఫ్‌జా దఫ్తరే – దివానీని నెలకొల్పారు. ఆ తర్వాత క్రమానుగతంగా దఫ్తరే మాల్, దఫ్తరేదారుల్ ఇన్‌షా, దఫ్తరే–ఇస్తిఫా, దఫ్తరే పేష్కారీ, దఫ్తరే–ముల్కీ మొదలైన ఇతర అనేక దఫ్తరీలు నెలకొల్పబడ్డాయి. యీ దఫ్తరీలన్నీ కొన్ని పురాతన ఉన్నత కుటుంబాల వారి నిర్వహణలో ఉండేవి. వీటి అధిపతులు సరేదఫ్తర్ లేక దఫ్తర్‌దార్ అని పిలువబడేవారు. రికార్డులను నిర్వహించడానికి మీర్ మున్షీలనూ, ముతసాదిసులనూ దఫ్తర్‌దార్ నియమించేవారు. మొదటి సర్ సాలార్‌జంగ్ కాలంలో ఆయన రాష్ట్రాన్ని జిల్లాలుగా విభజించారు. 'జిల్లా బందీ' ల అవసరాలను తీర్చడానికి వీలుగా పూర్తి పరిపాలనా వ్యవహారాలను ఆయన పునర్వ్యవస్థీకరించారు. రెవిన్యూ, న్యాయ, పోలీసు మొదలైన క్రొత్తశాఖలను ఆయన ఏర్పాటు చేశారు. వీటికి కార్యదర్శులను కూడా నియమించారు. ఈ పునర్వ్యవస్థీకరణ ఫలితంగా పురాతన దఫ్తరు తమ అధికారాలనూ, కార్యనిర్వహణనూ కోల్పోయాయి. క్రీ.శ. 1894 లో రాయరాయాన్ కుటుంబం నుంచి దఫ్తరే దివానీని నిజాం ప్రభుత్వం వశపర్చుకొని ఆర్థికశాఖ నిర్వహణలో ఉంచింది. కొంతకాలం తర్వాత ఇతర దఫ్తర్లను దఫ్తరే–దివానీలో చేర్చడం జరిగింది. 1929 లో దఫ్తరే–దివానీని డైరెక్టరేటు స్థాయికి పెంచారు. క్రమపద్ధతిలో రికార్డులను భద్రపరచడానికి డైరెక్టరును నియమించారు. 1950 వ సంవత్సరంలో దఫ్తరే దివానీ పేరును సెంట్రల్ రికార్డు ఆఫీసుగా మార్చారు. ఆ తర్వాత 1962 జులైలో దీని పేరును స్టేట్‌ఆర్చివ్‌గా మార్చడం జరిగింది.

భారత దేశంలోని పెద్ద స్టేట్ ఆర్చివ్‌లలో ఆంధ్రప్రదేశ్ స్టేట్ ఆర్చివ్ ఒకటి. యీ పురాతన దస్తావేజుల శాఖలో ఆంధ్రప్రదేశ్ రాష్ట్రానికిచెందిన గత కొద్ది సంవత్సరాల పరిపాలనా రికార్డులే కాక, మొగల్ చక్రవర్తి షాజహాన్ కాలంనాటి దక్కన్ చరిత్రకు సంబంధించిన పరిషియన్, మరాఠీ భాషల రికార్డులు కూడా ఇందులో ఉన్నాయి.

శాస్త్రీయ పద్ధతిలో రికార్డుల నిర్వహణావశ్యకత

సంక్షేమ రాజ్యంలో పటిష్ఠమైన, సమర్థవంత మైన పరిపాలన ఎంతో అవసరం. పరిపాలనా వ్యవహారాలను పటిష్ఠమైన మార్గాలలో నిర్వహించడానికి రాష్ట్ర రికార్డులను సక్రమ పద్ధతిలో ఉంచడం చాలా ముఖ్యం. సభ్యతా సంస్కృతుల పెంపుదలకు అతి ముఖ్యంగా కావలసిన జాతీయ చరిత్ర చెప్పుడు మాటలపైనా, వ్యక్తిగత భావాలపైనా ఆధారపడి ఉండదు. పబ్లిక్ రికార్డులను సక్రమ పద్ధతిలో నిశితంగా పరిశీలించి నిజానిజాలను సేకరించిన విషయాలపై మాత్రమే జాతి నిజచరిత్ర తెలుస్తుంది. అందుకే పబ్లిక్ రికార్డుల శాస్త్రీయ నిర్వహణ యెంతో అవసరం. రాష్ట్ర పురాతన దస్తావేజుల భద్రతకూ, నిర్వహణకూ ఉన్న ప్రస్తుత ఏర్పాట్లు యెంతో అసంతృప్తికరంగా ఉన్నాయి. అందుకే తృతీయ ప్రణాళికా కాలంలో రాష్ట్ర పురాతన దస్తావేజుల శాఖను అభివృద్ధి పరచడానికి పథకం తయారుచేశారు. యీ పథకాన్ని

ప్రభుత్వం ఆమోదించి మూడవ ప్రణాళికా పథకాలలో చేర్చింది.

రాష్ట్ర పురాతన దస్తావేజుల శాఖ అభివృద్ధి ప్రణాళికలో రెండు పథకాలు ఉన్నాయి: (1) పురాతన దస్తావేజుల శాఖకు క్రొత్త భవనం, (2) పురాతన దస్తావేజుల అభివృద్ధి భవనానికి రు. 15 లక్షలు, అభివృద్ధికి రు. 4 లక్షలు, మొత్తం రు. 19 లక్షలు ప్రభుత్వం కేటాయించింది. అభివృద్ధి పథకంలో 5 అంశాలు ఉన్నాయి. (1) సిబ్బంది పునర్వ్యవస్థీకరణ (2) సిబ్బందికి శిక్షణ (3) భద్రతకు కావలసిన సామగ్రి (4) భద్రతకు కావలసిన పరికరాలు (5) రెఫరెన్సు పుస్తకాల ప్రచురణ. ఈ పథకాల వివరాలను దిగువ చర్చించడం జరిగింది.

*1. క్రొత్తభవనం :—* ఎర్రంమంజిల్‌లో పురాతన నివాస గృహంలోని ఒక భాగంలో రాష్ట్ర పురాతన దస్తావేజుల శాఖ ప్రస్తుతం ఉంది. యీ భవనంలోని ప్రధాన భాగంలో పి. డబ్ల్యు. డి. కార్యాలయాలు ఉన్నాయి. రాష్ట్ర పురాతన దస్తావేజుల శాఖ ఉన్న భాగాన్ని రెండు వేర్వేరువిభాగాలుగా విభజించారు. యీ భవనంలో ఎక్కువ భాగం కలపతో నిర్మించబడిన కారణంగా అగ్ని ప్రమాదాల భయం ఎప్పుడూ ఉంటుంది. ప్రస్తుతం ఉన్న రికార్డులకూ, సిబ్బందికీ తగినంతగా స్థలం లేకపోవడమే కాక విస్తరణకు కూడా అవకాశం లేదు. స్థలం పరిమితంగా ఉన్నందు వల్ల రికార్డులు, సిబ్బంది సాంద్రత ఎక్కువయింది. ఉన్న రికార్డులుకూడా రెండు విభాగాలలోని అనేక గదులలో ఉన్నాయి. కొన్ని లక్షల సెక్రటరియేటు రికార్డులు కొన్ని సంవత్సరాల నుంచీ రాష్ట్ర పురాతన దస్తావేజుల శాఖకు మార్చబడకుండా ఉన్నాయి. రికార్డులన్నింటినీ శాస్త్రీయ పద్ధతిలో సక్రమంగా భద్రపరచడానికి వీలుగా తగిన పెద్ద భవనం యీ శాఖకు యెంతో అవసరం.

ఈ శాఖ అవసరాలకు అనుగుణంగా క్రొత్త భవనాన్ని నిర్మించాలని నిశ్చయించి తార్నాక సమీపాన ఉస్మానియా విశ్వవిద్యాలయం ఆవరణలో భారత ప్రభుత్వ ప్రాంతీయ పరిశోధనా లెబొరేటరీ వద్ద స్థలాన్ని సెలక్టు చేశారు. యీ భవన నిర్మాణానికై 5 ఎకరాల భూమిని విశ్వవిద్యాలయం కేటాయించింది.

1962 సెప్టెంబరు 13 వ తేదీన కేంద్ర ప్రభుత్వ శాస్త్రీయ పరిశోధన, సాంస్కృతిక వ్యవహారాల మంత్రి ప్రొఫెసర్ హుమాయూన్ కబీర్ యీ భవనానికి పునాది రాయివేశారు.

ప్రభుత్వం నియమించిన సలహా కమిటీ సలహా సంప్రదింపులతో స్టేట్ ఆర్కిటెక్ట్ శాఖ యీ భవనానికి సంబంధించిన ప్రణాళికలను తుదిసారిగారూపొందిస్తున్నది. ప్రతిపాదిత క్రొత్త భవనం వివరాలు దిగువ ఇవ్వబడ్డాయి.

రికార్డులు ఉంచే ప్రాంతం
(—స్టాక్ ఏరియా)

ఈ భవనంలో రికార్డులు భద్రపరచే ప్రాంతం అతి ముఖ్యమైన విభాగం. యీ భవనం వెనుక ఒకే బ్లాకుగా యీ భాగం నిర్మింపబడుతుంది. ప్రథమంలో దీనిని రెండు అంతస్థులుగా నిర్మిస్తారు. ప్రతి అంతస్థు దాదాపు $200' \times 75'$ కొలతలో ఉంటుంది. ప్రస్తుతం ఉన్న రికార్డులనూ, సెక్రెటరియేటు నుంచి మార్చబడే రికార్డులను శాస్త్రీయ పద్ధతిలో సక్రమంగా అమర్చడానికి సరిపోతుంది. అగ్ని ప్రమాదం లేకుండా ఉండేందుకు వీలుగా మిగతా భవనానికి దూరంగా దీనిని నిర్మించడం జరుగుతుంది. అన్ని అంతస్థులలో స్టీల్‌ర్యాకులను నెలకొల్పుతారు. ఆఖరు షెల్ఫులోని రికార్డులు అందేటట్లు దుమ్ము వగైరా దులుపడానికి వీలుగా ర్యాకుల యెత్తు 8′ ఉంటుంది. ఇక్కడ లిఫ్టులను కూడా ఏర్పాటు చేస్తారు. అగ్నిప్రమాదం సంభవించిన పక్షంలో రికార్డులను భద్రంగా యీవలకు తీయడానికి వీలుగా యీ అంతస్థులలో అత్యవసరదారులు కూడా ఉంటాయి.

పరిపాలన విభాగం

దిగువ సర్వీసులకు అవసరమైన తగినంతస్థలాన్ని ఏర్పాటు చేయడం జరుగుతుంది.

1. విజిటర్లకు, దర్యాప్తు, రెసిప్షన్, తపాలులకు గదులు.

2. సమావేశాలకు, ఉపన్యాసాలకు సమావేశంహాలు.

3. అపూర్వ వస్తువుల ప్రదర్శనకు మ్యూజియం.

4. మైక్రో ఫిల్ముల పఠనా సౌకర్యంతో సహా లైబ్రరీ.

5. రెఫరెన్సు పుస్తకాలను అమర్చడానికీ, రీసర్చి వర్కర్సుకు అవసరమైన తగిన స్థలాన్ని కేటాయించబడిన రీసర్చి గది,

6. రికార్డుల స్వీకారానికి, వాటిని వేర్వేరుగా సార్టింగ్ చేయడానికి, శుభ్రపరచడానికీ, పత్రాల పేర్లు మొదలైన వాటికి అవసరమైన గదులు.

7. డార్కురూం, ప్రోసెస్‌రూంలతో సహా ఫోటో డూప్లికేషన్ విభాగం.

8. పరిశోధన, కమిటీలు, ఎస్టాబ్లిష్

మెంటు, స్టోర్స్, ఆఫీసు సెక్షన్లు మొదలైన వాటికి అవసరమైన గదులు,

ఎక్కువకాలం మనగలిగే ఉత్తమమైన సామగ్రితో యీ భవనం నిర్మింపబడుతుంది. అగ్నిభయం ఉండదు.

రికార్డులు ఉంచే ప్రాంతాన్ని (స్టాక్ ఏరియా) అవసరమైనప్పుడు విస్తరింపజేయడానికి వీలుగా పునాదులను పటిష్ఠంగా నిర్మిస్తారు.

పురాతన దస్తావేజుల అభివృద్ధి

లోగా తెల్పినట్టు యీ పథకంలో ఐదు అంశాలు ఉన్నాయి. వివరాలు దిగువ ఇవ్వబడ్డాయి :—

(1) సిబ్బంది పునర్వ్యవస్థీకరణ :— ఒక శాఖ లేక సంస్థ యొక్క సమర్థత ఆ శాఖ లేక సంస్థలో పనిచేసే వ్యక్తుల సమర్థతపై ఆధారపడి ఉంటుంది. వివిధ సాంకేతిక, పరిపాలనా నిర్వహణకై తగిన సిబ్బందిని ఏర్పాటు చేయడం యెంతో అవసరం. ఇతర శాఖల మాదిరిగా కాక యీ శాఖను 3 వేర్వేరు యూనిట్లుగా విభజించబడింది — రిపాజిటరీ, పరిశోధన, పరిపాలన. మొదటి రెండు యూనిట్ల పని సాంకేతికమైంది. ఇతర శాఖల మాదిరిగానే రిపాజిటరీ, పరిశోధనల సెక్షనులను నిర్వహించే నాన్-గజిటెడ్ పనివారు మినిస్టీరియల్ సిబ్బందిగా ఇంతవరకూ ఉండేవారు. రికార్డులనూ, పుస్తకాలనూ శాస్త్రీయ పద్ధతిలో భద్రపర్చడం గైడ్లు, క్యాలండర్లు, సూచికలు మొదలైన వాటిని తయారు చేయడంవంటి రోజువారీ పనులను సమర్థవంతంగా నిర్వహించడానికి ఆర్చివిస్టు, అసిస్టెంట్ ఆర్చివిస్టులు, లైబ్రేరియన్, అసిస్టెంట్ లైబ్రేరియన్ వంటి సాంకేతిక సిబ్బంది ఉండడం యెంతో అవసరం. అందుకై రాష్ట్ర పురాతన దస్తావేజుల శాఖ ప్రతిపాదనలపై దిగువ వర్గాల ఉద్యోగాలను ప్రభుత్వం మంజూరు చేసింది.

1. ఆర్చివిస్టు
2. అసిస్టెంట్ ఆర్చివిస్టు
3. కెమిస్టు
4. లైబ్రేరియన్
5. అసిస్టెంట్ లైబ్రేరియన్

ఈ ఉద్యోగాలలో నియామకాలు జరిగాయి. పునర్వ్యవస్థీకరించబడిన ఈ కార్యలయంలోని వివిధ బ్రాంచీలలో సిబ్బందీ నియామకం కూడా జరిగింది. యీ రాష్ట్ర పురాతన దస్తావేజులను అభివృద్ధి పరచడంలోనూ, రికార్డులను శాస్త్రీయ పద్ధతిలో నిర్వహించడానికి అవసరమైన ఆర్చివల్ ఏర్పాటు చేయడంలోనూ భారత దేశానికి ఆంధ్రప్రదేశ్ మార్గదర్శక మైంది.

(2) పురాతన దస్తావేజులను భద్రపరచడంలో సిబ్బందికి శిక్షణ

రికార్డుల నిర్వహణ వ్యవహారాలు ప్రత్యేక రకానికి చెందినవి. వీటి నిర్వహణకై ప్రత్యేక శిక్షణ పొందిన సిబ్బందీ సర్వీసులు యెంతో అవసరం

విద్యా విషయక రంగంలో ఆర్చివిస్ట్ సాధారణ శిక్షణ పొంది ఉండడం యెంతో అవసరం. దస్తావేజుల నిర్వహణకు సంబంధించిన సాంకేతిక విషయాలలోనూ, సిద్ధాంతాలలోను ప్రత్యేక శిక్షణ పొంది ఉండాలి. యూరప్‌లో పురాతన దస్తావేజుల నిర్వహణలో ప్రత్యేక శిక్షణ యిచ్చే పాఠశాలలో ప్రవేశం లభించే వారికి విస్తృత సాధారణ విద్యా పరిజ్ఞానం ముఖ్యావసరం. శిక్షణ కాలం మూడు సంవత్సరాలు. పాలియోగ్రఫీ, బిబిలాగ్రఫీ, శబ్దవ్యుత్పత్తి శాస్త్రం, డిప్లొమాటిక్స్, చరిత్ర, అర్చిన్స్, న్యాయ విషయక చరిత్ర, సాహిత్యం శిక్షణ ఇస్తారు. అమెరికాలోని విశ్వవిద్యాలయాలలో పురాతన దస్తావేజుల నిర్వహణలో విద్యార్థులకు శిక్షణ ఏర్పాట్లు కల్గించారు. భారతదేశంలో జాతీయ పురాతన దస్తావేజుల శాఖలోని సిబ్బందికి ఆ శాఖ శిక్షణ ఇస్తుంది. భారత దేశంలో దస్తావేజుల నిర్వహణలో జాతీయ దస్తావేజుల శాఖ ఒక సంవత్సరం శిక్షణ కోర్సును నిర్వహిస్తున్నది. చరిత్ర సబ్జెక్టుగా ఉండి యం. ఎ. ఉత్తీర్ణులయిన అభ్యర్థులు యీ కోర్సులో చేర్చుకోబడతారు. రాష్ట్ర రికార్డు కార్యాలయాల సిబ్బందీ సభ్యులకు కూడా యీ కోర్సులో ప్రవేశం లభిస్తుంది. వారి విషయంలో విద్యార్హతల మినహాయింపులు ఉంటాయి. 1961 సంవత్సరం నుంచి రాష్ట్ర పురాతన దస్తావేజుల శాఖ సిబ్బంది సభ్యులను శిక్షణకై భారత జాతీయ పురాతన దస్తావేజుల శాఖకు డిప్యూట్ చేయడం జరుగుతున్నది. రాష్ట్ర పురాతన దస్తావేజుల కార్యాలయాల సిబ్బందీ సభ్యులకై భారత జాతీయ పురాతన దస్తావేజుల శాఖ 3 నెలల, ఒక నెల స్వల్పకాలిక ప్రత్యేక శిక్షణ కోర్సులను కూడా నిర్వహిస్తున్నది. దీర్ఘకాలిక, స్వల్పకాలిక శిక్షణ కోర్సులలో ఇంతవరకు ముగ్గురు ఆర్చివిస్టులకూ, ముగ్గురు అసిస్టెంట్ ఆర్చివిస్టులకూ శిక్షణ ఇవ్వడం జరిగింది. ఒక అసిస్టెంట్ ఆర్చివిస్టు ఒక సంవత్సరం డిప్లొమా కోర్సులో ప్రస్తుతం శిక్షణ పొందుతున్నాడు. వచ్చే సంవత్సరాలలో కూడా ఈ శిక్షణ కార్యక్రమం నిర్వహింపబడుతుందని భావించబడుతున్నది.

(3) రికార్డు సంరక్షణకు అవసరమైన పరికరాలకై కేటాయింపు

రాష్ట్ర పురాతన దస్తావేజు శాఖ అధీనంలో ఉన్న రికార్డుల సంరక్షణకూ, మరమ్మతులకూ ముమ్ముందు స్వీకరించే

రికార్డులకూ అవసరమైన కేటాయింపులు జరిగాయి. ముమ్మందు స్వీకరించే రికార్డులు రెండు రకాలుగా ఉంటాయి. (i) సెక్రెటరియేటు, ఇతర వివిధ శాఖల నుంచి స్వీకరించే ప్రభుత్వ రికార్డులు. (ii) రికార్డుల సర్వే పథకం క్రింద ప్రైవేటు వ్యక్తుల నుంచీ, అనధికారిక సంస్థల నుంచీ సేకరించే రికార్డులు. రెండవ అంశానికి చెందిన రికార్డులు సాధారణంగా మంచి స్థితిలో ఉండవు. వీటిని చాలా బాగు చేయడం, జాగ్రత్తగా నిర్వహించడం యెంతో అవసరం.

రికార్డులను శాస్త్రీయ పద్ధతిలో సక్రమంగా భద్రపరచడానికీ, ఫోటో డుప్లికేట్ల సౌకర్యాలను అభివృద్ధిపరచడానికి అభివృద్ధి కార్యక్రమంలో తగిన మొత్తాలను కేటాయించడం జరిగింది. రాష్ట్ర పురాతన దస్తావేజుల శాఖకు అత్యవసరంగా కావలసిన దిగువ సామగ్రినీ† వార్షిక కార్యక్రమాల ద్వారా దశల వారీగా సమకూర్చడం జరుగుతుంది.

1961 - 62 వ సంవత్సరంలో పశ్చిమ జర్మనీ, యు. కె. ల నుంచి మైక్రోఫిల్మ సామగ్రిని కొనుగోలు చెయాల్సి ఉంది. 1962 - 63 వ సం॥లో ఏర్‌క్లీనర్ హ్యూమిడిఫర్ పరికరాలను కొనుగోలు చేయాలి. అయితే విదేశీ మారకద్రవ్యం కొరత కారణంగా వీటిని ఇంతవరకూ కొనుగోలు చేయడం జరగలేదు.

### (4) రికార్డుల భద్రతకు అవసరమైన సామగ్రి

రికార్డుల భద్రతకు అవసరమైన జపానీ టిష్యూ పేపర్, సెలూలోస్ అసిటేట్, ఎసిటోన్ ముడి ఫిల్మ, ఫోటో పేపర్, ఫొటోగ్రాఫిక్ రసాయనాలు మొదలైనవాటి కొనుగోలుకై అభివృద్ధి పథకంలో అవసరమైన మొత్తాలను కేటాయించడం జరిగింది.

### (5) రెఫరెన్స్ మిడియా ప్రచురణ

రాష్ట్ర పురాతన దస్తావేజుల శాఖ, రికార్డులను సేకరించి, వర్గీకరించి భద్రపరచడమే కాక రీసర్చి స్కాలర్లకూ, ప్రభుత్వ శాఖలకూ, ఆసక్తి గల ప్రైవేటు పార్టీలకు కావల్సిన రెఫరెన్స్ మిడియా ('ఫైండింగ్ ఏడ్స్') ను తయారు చేయాల్సి ఉంటుంది. ఇటువంటి మార్గదర్శిని లేకుంటే పై సంస్థలకు అవసరమైన రికార్డులను వెతికి ఇవ్వడంలో యెంతో కాలహరణ జరుగుతుంది. అందువల్ల భారత జాతీయ పురాతన దస్తావేజుల సంస్థ సిఫార్సు చేసిన విధంగా హేండ్ బుక్కును తయారు చేయడానికి నిశ్చయించింది. దానిలో దిగువ అంశాలు ఉంటాయి.

1. రాష్ట్ర పరిపాలనకు సంబంధించిన చరిత్ర.
2. రాష్ట్రంలో పురాతన దస్తావేజుల సంస్థ.
3. రికార్డుల వివరణ.
4. రెఫరెన్స్ మిడియా.
5. పరిశోధన సౌకర్యాలు.
6. ఇతర అంశాలు.

1961 - 62 వ సం॥లో యీ హేండ్ బుక్కును ప్రచురించాలని అనుకున్నారు, అయితే కొన్ని అనివార్య పరిస్థితుల వల్ల దీనిని ఇంతవరకు ప్రచురించడం జరగలేదు.

ప్రణాళికా కాలంలో దస్తావేజుల పాత సేకరణల పట్టికలను ప్రచురించాలని ప్రతిపాదించారు. ప్రతి వర్గానికి చెందిన రికార్డుల సవివరమైన క్యాట్లాగులను కూడా ప్రచురించాలని ప్రతిపాదించారు.

| † సామగ్రి వివరాలు | | వాటి ఉపయోగం |
|---|---|---|
| 1. మెకానికల్ ఏర్ క్లీనర్ | ... | రికార్డులను, ఫైళ్లను శుభ్రంచేయడానికి. |
| 2. వాక్యూం ఫ్యూ మిగటోరియం దాని అనుబంధపరికరాలు | ... | రికార్డులనుధ్వంసం చేసే పురుగులను, వాటి గ్రుడ్లను, నిర్మూలించడానికి. |
| 3. మెకానికల్ హ్యూమిడిఫర్ | ... | పత్రాలు మడతలు పడకుండా, కుట్టడానికి వీలుగా ఉంచి తేమ చేరకుండా భద్రపరచడానికి. |
| 4. (ఎ) లుమో ప్రింట్ కెమెరా రి-ఎన్ లార్జింగ్ పరికరాలు | ... | ప్రస్తుతం యీ శాఖ అధీనంలో ఉన్న సర్వే శాఖకు సంబంధించిన రికార్డులు, ఇతర పత్రాలు అధ్వాన్న స్థితిలో ఉన్నాయి. మైక్రో ఫిల్మ ద్వారా వాటి ప్రతులను తీసి భద్రపరచడం యెంతో అవసరం. |
| (బి) మైక్రో ఫిల్మ రీడర్స్. | | |
| (సి) లుమో ఫిల్మకు అభివృద్ధి చేసే యంత్రం | ... | మైక్రో ఫిల్మ తీయడం ఎంతో చవుక. దీనివల్ల స్థలం మిగుల్తుంది. |

# 'సెకండరీ స్కూల్ లీవింగ్ సర్టిఫికెట్' పథకం

బి. వేంకటరమణప్ప

1911 వ సంవత్సరంనుంచీ మెట్రిక్యులేషన్ పరీక్షస్థానే యస్. యస్. యల్. సి. పబ్లిక్ పరీక్ష ప్రవేశ పెట్టబడింది. మెట్రిక్యులేషన్ 'పద్ధతి మాదిరి కాక యస్. యస్. యల్. సి. పథకం క్లాసు వారీలకు ప్రాధాన్యత యిస్తున్నది. హెడ్మాష్టరుకు సంతృప్తి కలిగించే విధంగా సెకండరీ స్కూలుకోర్సు చదివిన విద్యార్థి యెవరైనా సర్టిఫికేటును పొందవచ్చు. వాస్తవిక జీవితంలో ఉపయోగపడటానికి ఈ సర్టిఫికెట్‌ను, నిర్ణీత యోగ్యతగల వ్యక్తి యెవరైనా ఆమోదించవచ్చు. సర్టిఫికెట్‌లో గత మూడుసంవత్సరాలలో విద్యార్థి విద్యాభ్యాసం, నడవడిక, పబ్లిక్‌పరీక్ష ఫలితం వివరాలు అన్నీ పొందుపరచబడివుంటాయి. మెట్రిక్యులేషన్ పరీక్షకంటే,ఎక్కువ పాత్యాంశాలు వుండే విధంగా ఈ నూతన పరీక్ష విధానం తయారు చేయబడింది. అంతేగాక విద్యార్థి కేవలం నిర్ణీత పరీక్షలో ఉత్తీర్ణుడు అయినాడని తెలపడమే గాక గుర్తింపబడిన స్కూలులో కొన్ని నిర్దుష్టమైన కోర్సులు చదివినాడనీ, ఈ కాలంలో అతని ప్రవర్తన సక్రమంగా, సంతృప్తికరంగా వుండిందనీ కూడా దీనివల్ల తెలుస్తుంది. అందుకని స్కూళ్ళు ఈ పథకంపట్ల పమ ఆమోదాన్ని తెలిపాయి. ఈ పథకం నియమిత రంగంలో పరిపూర్ణమైంది. దానిపైన యూనివర్శిటీ పెత్తనం అంటూ లేదు. ఇందులో అనేక రకాల సబ్జెక్టులు వున్నాయి. వీటిల్లో అతి ముఖ్యమైనవీ, కొద్దిగా ముఖ్యమైనవీ, అనే విచక్షణవున్నట్లు స్పష్టంగా తెలుస్తుంది. స్కూలులో బోధన, శిక్షణల విషయమై శ్రద్ధ చూపబడింది. పబ్లిక్ పరీక్ష అనేది ఈ పథకంలో నామమాత్రంగానే వుండింది. క్లాసు పర్కుకు అత్యంత ప్రాధాన్యత ఇవ్వబడింది. మెట్రిక్యులేషను పరీక్షలో ఈ అవకాశం లేదు. పరీక్షకుని కంటే చాలా కాలం నుంచీ తనవద్ద చదివిన విద్యార్థిని గురించి ఉపాధ్యాయునికే బాగా తెలుసుననే విషయానికి ప్రాముఖ్యత ఇవ్వబడింది. చదువవలసిన కోర్సులనూ, ఉపయోగించవలసిన సర్టిఫికెటు రూపాన్ని 1910 మే నెలలో తయారు చేయడం జరిగింది. తొలి పరీక్ష 1911 మార్చి నెలలో జరిగింది.

విద్యార్థులు చదువవలసిన సబ్జెక్టులు దిగువ చూపిన విధంగా ఎ, బి, సి గ్రూపులలో చేర్చబడినాయి.

'ఎ' గ్రూపు

సామాన్య గణిత శాస్త్రము
ఇంగ్లీషు
ప్రాంతీయభాషలో వ్యాసములు, అనువాదము.

'బి' గ్రూపు

సైన్సు
జాగ్రఫీ
భారతదేశ చరిత్ర
డ్రాయింగు
ఫిజికల్ ట్రైనింగు
గృహ ఆర్థిక శాస్త్రము, కుట్టుపని (బాలికల కొరకు)

'సి' గ్రూపు

ఈ క్రింది భాషలలో ఏదైనా ఒకటి.

(అ) ప్రాచీనభాష :

| | |
|---|---|
| సంస్కృతం | అరబ్బీ |
| గ్రీకు | పర్షియన్ |
| ల్యాటిన్ | హెబ్రూ |

(ఆ) విదేశ భాషలు :

| | |
|---|---|
| ఫ్రెంచి | జర్మన్ |
| ఉర్దు(హిందుస్తానీ) | మరాటి |
| కన్నడం | ఒరియా |
| తెలుగు | బర్మీస్ |
| మళయాళం | సింహాళభాషలు |

ఇంగ్లండు దేశచరిత్ర
బీజగణితము, రేఖాగణితము
ప్రయోగాత్మక గణితము
ట్రిగ్నామెట్రీ
వృక్షశాస్త్రము
భౌతికశాస్త్రము
రసాయనిక శాస్త్రము

1912 సం. నుంచీ భౌతిక, రసాయనిక, శాస్త్రాల్లో ప్రాక్టికల్ పరీక్షలు నిర్వహించబడుతూ వచ్చాయి. అయితే 1950 నుంచీ ఇవి విరమించబడ్డాయి.

సంగీతం.

వ్యవసాయం.

కమర్షియల్ ప్రాక్టీసు, జాగ్రఫీ.

బుక్-కీపింగ్, కమర్షియల్ అరిథ్మెటిక్

షార్టుహాండు, టైపురైటింగ్.

ప్రెసీరైటింగ్, ఇండెక్సింగ్

అల్లకపుపని, దుస్తులతయారీ.

లేసుపని.

సెకండరీస్కూలు కోర్సులో వున్న ఇతర సబ్జెక్టు.

"దస్తూరీకి, స్పెల్లింగ్, సులభమైన, స్పష్టమైన భావప్రకటనకు అధిక ప్రాధాన్యత ఇవ్వబడింది".

'బి' గ్రూపు సబ్జెక్టులలో పబ్లిక్ పరీక్ష వుండేదికాదు.

1917 సం॥లో గ్రూపు 'ఎ' క్రిందవున్న ప్రాంతీయ భాషలో వ్యాసములు, అనువాదం సబ్జెక్టులో పాఠ్యపుస్తకాలపైన ఒక ప్రశ్నాపత్రం, 'బి' గ్రూపు క్రిందవున్న కోర్సు అంతటికీ భారతదేశ భూగోళం, చరిత్ర స్థానే 4వ ఫారానికి భారతదేశ భూగోళం, చరిత్ర, 5వ 6 వ ఫారాలకు బ్రిటిష్ సామ్రాజ్య చరిత్ర, తత్సంబంధ భూగోళశాస్త్రము, 'సి' గ్రూపు క్రింద ఇంగ్లండు, భారతదేశ చరిత్రస్థానే ఇంగ్లండు చరిత్ర చేర్చాలనీ ప్రభుత్వం ఆదేశించింది. అంతేగాక గ్రూపు 'ఎ' క్రింద ప్రాంతీయ భాషలో వ్యాసములు, అనువాదం క్రింద ఎంట్రీలేని కారణాన గ్రూపు 'సి' క్రింద సంస్కృతం లేక ఏదైనా ప్రాచీనభాష లేక విదేశీభాషలు తీసుకొన్న అభ్యర్థుల సర్టిఫికెట్లు అసంపూర్ణమైనవిగా భావించకూడదనికూడా ప్రభుత్వం ఆదేశించింది. అయితే 1919 సం.లో ఇది కొంత సవరించబడింది. గ్రూపు 'ఎ' క్రింద ప్రాంతీయ భాషలో ప్రాంతీయ భాష వ్యాసములు, అనువాదం, సబ్జెక్టుకాక ఎన్నుకోబడిన కొన్ని పాఠ్యపుస్తకాలు చేరివుండాలనీ, అభ్యర్థి తన అభిరుచి ప్రకారం ఇది ప్రాంతీయ భాషకు బదులు ప్రాచీన లేక విదేశీభాషను ఎన్నుకోవచ్చుననీ, ప్రభుత్వం సూచించింది.

1913 సం॥ లో భారత ప్రభుత్వం (విద్యా విధానంపైన చేసిన ఒక తీర్మానంలో) ఈ పథకాన్ని ప్రస్తుతిస్తూ, మద్రాసులోని యస్. యస్. యల్. సి. పద్ధతి తలపెట్టబడిన సంస్కరణకు కావలసిన వాటిని చాలావరకు పూర్తి చేసిందని పేర్కొనింది. అప్పటికి కాలేజీలలో ప్రవేశించడానికి అర్హతా (ఎలిజిబిలిటీ) నియమావళి, అంటూ ఏదీ లేకుండా వుండింది. సర్టిఫికెటు విలువనుబట్టి యస్. యస్. యల్. సి. పూర్తిచేసిన విద్యార్థులను, వారు పబ్లిక్ పరీక్షలో సంపాదించిన మార్కులను కూడా విస్మరిస్తూ, చేర్చుకోవడానికి ప్రిన్సిపాలురకు సంపూర్ణ స్వేచ్ఛ వుండేది. మద్రాసు యూనివర్సిటీ ఈ క్రింది ఉత్తర్వులను జారీ చేసింది :

"సిండికేటు ఎప్పటి కప్పుడు జారీ చేయు నియమావళి ఉత్తర్వులకు లోబడి, మద్రాసు ప్రభుత్వం అధికారం క్రింద లేక సిండికేటు ఆమోదించిన ఇతర అధికారం క్రింద జారీ అయిన సెకండరీ స్కూలు లీవింగ్ సర్టిఫికేటు పొందిన అభ్యర్థులను అనుబంధకళాశాలాధిపతి చేర్చుకోవచ్చు. అయితే, యూనివర్సిటీ విద్యాభ్యాసానికి ఆ అభ్యర్థులు యోగ్యులని ఆయనకు సంతృప్తి కలగాలి. ఈ విధంగా ప్రవేశం లభించిన విద్యార్థులు యూనివర్సిటీ మెట్రిక్యులేట్లుగా నమోదు చేయబడాలి."

పూర్తి చేసిన యస్. యస్. యల్. సి. అభ్యర్థులను చేర్చుకోవడానికి కాలేజీ ప్రిన్సిపాలురకు పరిపూర్ణమైన స్వేచ్ఛ వున్న కారణాన, ఈ పథకం ఆశయం ప్రశంసనీయమైనప్పటికీ, అది, సక్రమంగా పని చేయలేదు. అనేక విధాలుగా దుర్వినియోగానికి దారితీసింది. ఈ పరిస్థితిని యూనివర్సిటీ పునఃపరిశీలించాల్సి వచ్చింది.

సెనెట్ కమిటీ విద్యార్థులను ఇంటర్మీడియెట్ కోర్సుకు చేర్చుకొనే విషయమై పరిశీలిస్తూ "యస్. యస్. యల్. సి. పూర్తి చేసిన అభ్యర్థిని, కొన్ని సబ్జక్టులలో కనీస శాతం మార్కులు వస్తేతప్ప యూనివర్శిటీలో చేర్చుకోరాదు. సిండికేటు ఎప్పటి కప్పుడు మార్కుల శాతాన్నీ, సబ్జెక్టులనూ నిర్ణయిస్తుంది. మార్కుల కనీస పరిమితిని పబ్లిక్ పరీక్ష, స్కూలు మార్కుల ప్రాతిపదికపైన నిర్ణయించ బడుతుంది. స్కూలు మార్కులు, అన్ని సందర్భాలలో పబ్లిక్ పరీక్షలో స్కూలు సగటు వివరాలను బట్టి నిర్ణయించడం జరుగుతుంద"ని 1914 అక్టోబరులో సూచించింది. ఈ సూచన ప్రకారం సిండికేటు ఒక సర్క్యులర్‌ను అనుబంధ కళాశాల లన్నింటికీ జారీచేస్తూ యస్. యస్. యల్. సి. అభ్యర్థుల ప్రవేశం విషయమై ఈ నూతన నియమావళి 1916 నుంచీ అమల్లోకి వస్తాయని ఆదేశించింది. అయితే కొంత కాలం వరకు స్త్రీలు ఈ నియమావళి వర్తింపునుంచి మినహాయించ బడ్డారు. అర్హత నియమావళి కనీస మార్కుల, అర్హత జాబితా 1916 నుంచి అమల్లోకి వచ్చింది. తొలి జాబితా అదే సంవత్సరం జూన్ నెలలో కళాశాలలకు పంపబడింది.

## 1929 సం॥ పు పథకం

గ్రూపు 'బి' లో చేరివున్న సబ్జెక్టులలో పబ్లిక్ పరీక్షలు జరుగక పోవడం వల్ల, ఇవి స్కూళ్ళలో ఉపేక్షించ బడ్డాయి. ఈ విషయాన్నీ, తత్సంబంధమైన ఇతర అంశాలనూ పరిశీలింపవలసిందిగా ప్రభుత్వం సెకండరీ

ఎడ్యుకేషన్ బోర్డును కోరింది. ఈ బోర్డు చేసిన సిఫార్సులను ప్రభుత్వం ఆమోదించింది. మూడు రకాలుగా వున్న గ్రూపు సబ్జెక్టులను యథావిధిగా వుంచింది. అయితే పబ్లిక్ పరీక్షలు జరిగే విధంగా గ్రూపు 'బి' నుంచి గ్రూపు 'ఎ' కు సబ్జెక్టులను మార్చి వేయడం జరిగింది. మార్పు చేయబడిన పథకం ప్రకారం గ్రూపు 'సి' క్రింద ఐచ్ఛిక విషయం కాగా ఏదో ఒక సబ్జెక్టును మాత్రమే తీసుకోవాలి. చరిత్ర, భూగోళం, సామాన్య విజ్ఞానశాస్త్రాలను చేర్చుకోవడం ద్వారా గ్రూపు 'ఎ'లో వున్న సబ్జెక్టుల సంఖ్యను ఐదు వరకు పెంచడం జరిగింది. (ట్రిగ్నామెట్రీ) ప్రయోగాత్మక గణితము, ప్రెసీరైటింగ్ మున్నగుసబ్జెక్టులు బాగా ప్రచారంలో లేక పోవడంవల్ల, వాటిని గ్రూపు 'సి' నుంచి తొలగించడం జరిగింది. 1929 సం॥ పు పథకం క్రింద దిగువ పేర్కొనబడిన గ్రూపులు 'ఎ', 'బి' లో వున్న సబ్జెక్టులు గ్రూపు 'సి' లో వున్న ఏదేని ఒక సబ్జెక్టు పాఠ్యాంశాలుగా వుంటాయి.

### గ్రూపు 'ఎ'

1. ఇంగ్లీషు.
2. క్రింది వాటిలో ఏదైనా ఒక భాష.

| | | |
|---|---|---|
| తమిళం | ఒరియా | సంస్కృతం |
| తెలుగు | ఉర్దూ | పర్షియన్ |
| మళయాళం | మరాఠీ | అరబ్బీ |
| కన్నడం | | |

విద్యార్థి క్రొత్తగా చేరిన స్కూలులో, తాను లోగడ చదువుకున్న మాతృభాష, ప్రాంతీయ భాష లేక ఏ యితర భాషాబోధనకు ముఖ్యసౌకర్యాలు లేనట్లయితే, ల్యాటిన్, ఫ్రెంచి, హిందీభాషలలో దేనినైనా ఎన్నుకోవచ్చు. హిందీ మాతృభాషగా గలవారు ఆ సబ్జెక్టును తీసుకోవచ్చు.

3. సామాన్య గణిత శాస్త్రము.
4. సామాన్య విజ్ఞాన శాస్త్రము.
5. ఆధునిక చరిత్ర, భారతదేశ చరిత్ర, భూగోళం.

గమనిక : విద్యార్థులు చేరిన స్కూలులో వారికినచ్చిన ఏదైనా ఒక భాషను చదువుకోవడానికి సౌకర్యాలు లేనట్లయితే, విద్యాశాఖ డైరెక్టరు నుంచి అనుమతి పొంది వారు ఆ భాషను ప్రయివేటుగా చదువుకో వచ్చు.

### గ్రూపు 'బి'

4 వ ఫారానికి డ్రాయింగు
ఫిజికల్ ట్రెయినింగు
మాన్యుయల్ ట్రెయినింగు (బాలురకు)
చేతి పనులు.

### గ్రూపు 'సి'

క్రింది భాషలలో ఏదైనా ఒకటి :

(అ) ప్రాచీన భాష : గ్రీకు, ల్యాటిన్, హెబ్రూ, సంస్కృతం, పర్షియన్, అరబిక్.
(ఆ) విదేశ భాష : ఫ్రెంచి, జర్మన్.
(ఇ) భారతదేశ భాషలు : తమిళం, తెలుగు, మళయాళం, ఉర్దు, మరాఠీ, బర్మీభాష, కన్నడం, ఒరియా. సింహళ భాష, హిందీ.

గమనిక : గ్రూపు 'ఎ' లో తీసుకున్న భాషనే గ్రూపు 'సి' లో తీసుకోకూడదు.

క్రొత్తగా తయారైన కోర్సులూ, పాఠ్యప్రణాళికలూ 1929 జూన్‌నుంచీ 4 వ ఫారంలో ప్రవేశపెట్టబడ్డాయి. ఈ పథకం క్రింద తొలిసారిగా పబ్లిక్ పరీక్ష 1932 మార్చి నెలలో జరిగింది. 1930-31 సం॥ లో 6 వ ఫారం చదువుకున్న అభ్యర్థులకూ, 1931 సం॥ లేక అంతకుముందు జరిగిన పబ్లిక్ పరీక్షలకు కూర్చున్న అభ్యర్థులకూ పాత పథకం వర్తిస్తూ వచ్చింది.

## 1934 సం॥పు పథకం

1929 సం॥పు పథకం ఆరంభమైనప్పటి నుంచీ కొంత ప్రతిఘటనకును గురిఅయింది. 1930 సం॥లో ఆంధ్ర యూనివర్శిటీ కొన్ని సవరణలు, సిఫార్సులు చేస్తూ, గ్రూపు 'సి'ని రద్దుచేసి గ్రూపు 'ఏ' క్రిందవున్న సామాన్య గణిత శాస్త్రంలో బీజగణితము, రేఖాగణితము చేర్చుకోవాలని సూచించింది. యస్.యస్.యల్.సి. బోర్డు ఈ సూచనను పరిశీలించింది. ఈ పథకం పనిచేయడానికి కొంత కాలమైనా కాకముందే మధ్యలో మార్చడం భావ్యం కాదని ఆంధ్ర యూనివర్సిటీకి తెల్పింది. 1931 సం॥లో మద్రాసు యూనివర్శిటీయొక్క అకాడమిక్ కౌన్సిల్ కొత్త పథకం క్రింద అర్హతా నియమావళిని పరిశీలిస్తూ, గ్రూపు 'సి' క్రింద రెండు ఐచ్ఛిక పాఠ్యాంశాలుండాలనీ, క్రొత్తగా రూపొందిన గ్రూపు 'బి' క్రిందవున్న సబ్జెక్టుల ప్రాధాన్యతను గుర్తించాలనీ సూచించింది.

అంతేగాక భూగోళం, సామాన్య విజ్ఞాన శాస్త్రాలలోని పాఠ్యాంశాలు చాలా యెక్కువగా వున్నందువల్ల వాటిని హైస్కూలు కోర్సులో పూర్తిచేయడం సాధ్యంకాదనీ, అందువలన వాటిని సవరించి, క్లుప్తీకరించవలసిన అవసరం ఏర్పడిందనీ భావించబడింది. యస్.యస్.యల్.సి. పథకాన్ని, పాఠ్య ప్రణాళికనూ పరిశీలించేందుకు మద్రాసు యూనివర్శిటీ సిండికేట్ మద్రాసు విద్యాశాఖ డైరెక్టరు, యస్.యస్.యల్.సి. బోర్డుతో ఒక కమిటీని నియమించింది.

యస్. యస్. యల్. సి. బోర్డు, యూనివర్శిటీ రివిజన్ కమిటీ చర్చల ఫలితంగా క్రొత్తపథకంలో ఈ క్రింది విధంగా సబ్జెక్టులు వుండాలని అంతిమ నిర్ణయం తీసుకోవడం జరిగింది :—

గ్రూపు 'ఎ' (కంపల్సరీ) (1) ఇంగ్లీషు (2) రెండవ భాష (3) గణితం (బీజ, రేఖాగణితాల్లోని కొన్ని భాగాలతో కలుపుకొని)

గ్రూపు 'బి' (4వ ఫారం మాత్రమే) డ్రాయింగు, ఇంగ్లాండు, భారతదేశ చరిత్ర, భూగోళం, సామాన్య విజ్ఞాన శాస్త్రం. 4వ ఫారంనుంచి 6వ ఫారం వరకు ఫిజికల్ ట్రెయినింగు,మాన్యుయల్ ట్రెయినింగు (బాలురకొరకు) చేతిపనులు (బాలికలకొరకు)

గ్రూపు 'సి' (గమనిక :— అభ్యర్థి రెండు సబ్జెక్టులు తీసుకోవాలి. అయితే ఏవైనా ఒక భాగంనుంచి ఒకటి మించి యెక్కువ సబ్జెక్టులు తీసుకోరాదు).

(1) హ్యూమానిటీస్ - ఇంగ్లాండు చరిత్ర, భారతదేశ చరిత్ర, భూగోళం, ప్రాచీన, విదేశీ లేక భారతదేశ భాషల్లో ఏదైనా ఒకటి.

(2) సైన్సు సబ్జెక్టులు : భౌతికశాస్త్రం, రసాయనికశాస్త్రం, వృక్షశాస్త్రం, శరీర శాస్త్రం.

(3) నాన్–అకాడమిక్ సబ్జెక్టులు - బుక్ - కీపింగ్ ; టైపురైటింగ్ ; షార్టుహాండు (ఇంగ్లీషు లేక వెర్నాక్యులర్) కమర్షియల్ ప్రాక్టీసు ; ప్రెసీ రైటింగు, ఇండెక్సింగు ; వ్యవసాయం ; ప్రాక్టికల్ టెలిగ్రాఫ్ ; ఎలిమెంటరీ మెకానికల్, ఎలక్ట్రికల్ టెక్నాలజీ, దేశీయ సంగీతం; పాశ్చాత్య సంగీతం; గృహ విజ్ఞాన శాస్త్రం; కుట్టుపని; అప్లైడ్ ఆర్ట్.

ఈవిధంగా 1929 సం॥పు పథకంలో చేయబడిన ప్రధానమైన మార్పులు ఇవి :

(1) గ్రూపు 'ఎ' క్రింద గణిత శాస్త్రములో కొంత బీజగణితం, రేఖాగణితం భాగాలుచేర్చడం, గ్రూపు 'సి' క్రింద బీజగణితం, రేఖాగణితాలను రద్దు చేయడం.

(2) గ్రూపు 'ఎ' నుంచి చరిత్ర, భూగోళం, ఎలిమెంటరీ సైన్సు సబ్జెక్టులను గ్రూపు 'బి'కి మార్చడం (4వ ఫారంకొరకు)

(3) ఇంగ్లాండు, భారతదేశచరిత్రలను వేరుపరచి, ప్రత్యేక కాలవిభాగాలు లేకుండా రెంటినీ ఐచ్ఛిక సబ్జెక్టులుగా చేయడం.

(4) గ్రూపు 'సి' క్రింద ప్రెసీ రైటింగు, ఇండెక్సింగు సబ్జెక్టులను తిరిగి చేర్చడం.

(5) గ్రూపు 'సి' క్రింద క్రొత్తగా ఎలిమెంటరీ మెకానికల్, ఎలక్ట్రికల్ టెక్నాలజీ సబ్జెక్టును చేర్చడం.

ఈ క్రొత్త పథకం 1934–35 సం॥ లో ప్రవేశపెట్టబడింది. 1937 సం॥ లో తొలిసారిగా పబ్లిక్ పరీక్ష జరిగింది. 1934 సం॥పు పథకం ప్రవేశపెట్టి ఒక సంవత్సరమైనా పూర్తికాకముందే దాన్ని ఇదివరకటి పథకాని కంటె కూడా ముఖ్యంగా ఉపాధ్యాయులు తీవ్రంగా ప్రతిఘటించారు. తత్ఫలితంగా 1934 సం॥పు పథకం మరు సంవత్సరం జూన్ నెలలో రద్దుచేయబడింది. 1935–36 విద్యా సంవత్సరం నుంచి 4,5 ఫారాలకొరకు 1929 సం॥పు పథకం తిరిగి అమల్లో పెట్టబడింది. 1934 సం॥పు పథకం క్రింద 4వ ఫారం చదువుకొన్న విద్యార్థుల సౌకర్యార్థం 1937వ సం॥పు పబ్లిక్ పరీక్ష కొరకై (1) ఇంగ్లాండు, భారతదేశాల చరిత్ర, భూగోళం (2) ఎలిమెంటరీ సైన్సు సబ్జెక్టులలోని పాఠ్యాంశాలు కొన్ని తగ్గించబడ్డాయి. ఈ విధంగా తగ్గించకపోయినట్లయితే అభ్యర్థులు రెండేండ్ల కాలంలో నిర్ణీత పాఠ్య ప్రణాళికను పూర్తిచేయడం అసాధ్యమై వుండేది. గ్రూపు 'ఎ' క్రింద హిందీని రెండవ భాషగా చేర్చడం పాఠ్య ప్రణాళికలో ముఖ్యమైన మార్పు.

గత కొన్ని సంవత్సరాలలో గడించిన అనుభవం ఫలితంగా (1) ఇంగ్లాండు, భారత దేశాలచరిత్ర భూగోళం (2) ఎలిమెంటరీ సైన్సు సబ్జెక్టులలో పాఠ్యాంశాలను తగ్గిస్తూ, సెకండరీ విద్యా సంస్కరణ విషయమై ఒక నిర్ణయం తీసుకొనేంతవరకు 1929వ సం॥ పు పథకాన్ని కొనసాగించడానికి 1937 సంవత్సరాంభంలో నిర్ణయం తీసుకోవడం జరిగింది. ఈ సబ్జెక్టులలో తగ్గించబడిన పాఠ్య ప్రణాళికలు 1937 జూలై నెలలో 4వ ఫారంలో ప్రవేశపెట్టబడ్డాయి. ఈ సబ్జెక్టులలో 5.6 ఫారాలలో అభ్యర్థులు చేసిన కృషిని మాత్రమే పరీక్షచేయాలని కూడా నిర్ణయించడం జరిగింది. మార్పుచేయబడిన ఈ పద్ధతి ప్రకారం 1940 సం॥ లో తొలిసారిగా పరీక్ష జరిగింది. 1929 వ సం॥ పు పథకం ప్రకారం, ఈ సబ్జెక్టులలో పాఠ్యాంశాలు అతి భారంగా వున్నాయని ఫిర్యాదులు రావడంతో ఈ మార్పుచేయడం అవసరమని భావించబడింది.

అనేక స్కూళ్ళు స్కౌటింగు, గైడింగుతో పాటు ఆటలు మున్నగు ఇతర కార్యకలాపాల్ని ప్రోత్సహించాయి.

## బోధనా భాష

1948 సం॥ పు పథకం అమల్లోకి వచ్చే పూర్వం, భాషేతర పాఠ్యాంశాల విషయమై బోధనా భాషలో మార్పు వచ్చింది. చాలా కాలంగా ఇంగ్లీషు బోధనా భాషగా కొనసాగుతూ వచ్చింది. బోధనా భాషగా భారత దేశభాషలు ప్రవేశపెట్టి, పరీక్ష నిర్వహించేట్లయితే సామర్థ్యం హెచ్చడానికి తోడ్పడుతుందని భావించబడింది. ఈ విషయం 1921 లో శాసన సభలో చర్చకు వచ్చింది కూడా. విద్యార్థులు ప్రాంతీయ భాషలలో విద్యాభ్యాసం కొనసాగించడానికి ఎలాంటి నిబంధనకూడా అడ్డులేదని ప్రభుత్వం సమాధానమిచ్చింది ప్రభుత్వం జారీ చేసిన 1925 అక్టోబరు 27 వ తేదీనాటి నెం. 1851 చట్టం (విద్య) ఉత్తర్వులో, సెకండరీ స్కూళ్ళలో ఉన్నత తరగతులలో వాటిని బోధనా భాషలుగా వుపయోగించడానికి ఆ భాషలలోనే పరీక్షలు యివ్వడానికి అనుమతించింది. 1938-39 సం॥ నుంచి తప్పనిసరిగా మాతృభాష బోధనా భాషగా వుండాలనీ, ఆ భాషలోనే పరీక్ష జరగాలనీ ప్రభుత్వం 1938 మార్చి 5 వ తేదీన జారీ చేసిన ఉత్తర్వు నెం. 562 (విద్య)లో ఆదేశించింది. స్థానికంగా రెండు, మూడు భాషలు వాడుకలో వున్న ప్రాంతాలలో ఇబ్బందుల్ని తొలగించడానికి తాత్కాలికంగా సహాయింపు ఇవ్వడానికి సౌకర్యం కల్పించబడింది.

## 1918 సం॥ పు పథకం

ఇప్పటికి సర్. ఆర్. వెంకటరత్నం నాయుడు అధ్యక్షతన కలకత్తా యూనివర్శిటీ కమిషన్ నివేదిక కీ. శే. సర్. యెవెరెల్ స్టాట్ హామ్ సెకండరీ విద్యను గూర్చి పంపిన నివేదిక. 1939 సం॥ లో విద్యామంత్రి శ్రీ సి. జె. వార్కే అధ్యక్షతన ఏర్పడిన కమిటీ నివేదిక, యుద్ధానంతరకాలంలో విద్యా పునర్నిర్మాణ పరిస్థితిని గూర్చి విద్యాశాఖ డైరెక్టరు పంపిన నివేదికలు అన్నీ ప్రభుత్వ పరిశీలనకు వచ్చాయి. 1947 సం॥లో స్వాతంత్ర్యం వచ్చాక చరిత్ర, భూగోళం సబ్జెక్టులలో నేర్చుకోవలసిన విషయాలకంటే, బోధనా పద్ధతికి ప్రాధాన్యత యివ్వబడింది. ప్రపంచ పరిణామాలను గురించి తెలుసుకోవడం అవసరమైంది. చరిత్ర, భూగోళాలకు బదులు "సోషియల్ స్టడీస్" ప్రవేశపెట్టడం జరిగింది. పిల్లలకు వాస్తవిక విషయాలను, మానవజాతి చేసిన శ్రమ, సాధించిన ప్రగతి, ప్రదర్శించిన సాహస కృత్యాలు తెలుసుకోవాలని దాని ఆశయం. వివిధ కోర్సులకు పాఠ్యప్రణాళిక ఇంకా రూపొందించ బడవలసి వుండింది. అందుకని 1947-48 సం॥ లో రాష్ట్రంలోని 50 స్కూళ్ళలో, అంటే ప్రతి జిల్లాలో రెండు స్కూళ్ళల్లోను, మద్రాసు నగరంలో రెండు స్కూళ్ళల్లోనూ ఈ పథకాన్ని ప్రవేశపెట్టాలని ప్రభుత్వం ఆదేశించింది. ఆ తరువాత 1948-49 విద్యా సంవత్సరం నుంచి, ఈ పథకం మిగతా స్కూళ్ళన్నింటికీ విస్తృత పరచబడింది. కోర్సులు, సబ్జెక్టులు దిగువ చూప బడినవి :

## పునర్వ్యవస్థీకరించబడిన సెకండరీ విద్యాపథకం (1918-సం॥ పథకం)

చదువవలసిన కోర్సులు, సబ్జెక్టులు

చదువవలసిన కోర్సులు: (1) అకాడమిక్ కోర్సులూ (2) విభజింపబడినకోర్సులూ అని రెండు విధాలుగా వుంటాయి.

సబ్జెక్టుల వివరాలు ఇవి :

విద్యా సంబంధమైనవి

1. ఫస్టులాంగ్వేజి-పార్టు 1. ప్రాంతీయ భాష లేక మాతృభాష. పార్టు 2. ఫస్టు లాంగ్వేజి లేక ప్రాచీన లేక ఏ యితర భాషలోనైనా తీవ్ర పరిశ్రమ.
2. రెండవభాష-ఇంగ్లీషు
3. కళలు, హాబీలు, ప్రత్యక్ష కార్య కలాపాలు.
4. గణితం-జనరల్ లేక కంపోజిట్.
5. సామాన్య విజ్ఞానశాస్త్రము.
6. సాంఘిక శాస్త్రములు
7. పౌర శిక్షణ.
8. వ్యాయామ విద్య
9. నీతి శాస్త్రము.

10 మూడవభాష — హిందీ — ఐచ్ఛికం లేక చేతి పని లేక ఆమోదించబడిన పని. పబ్లిక్ పరీక్షపైన పేర్కొన్న 1,2,4,5,6,10 (హిందీలో మాత్రమే) అంశాలలో వుంటుంది.

## విభజింపబడిన కోర్సులు

*1. సెక్రేటేరియట్ కోర్సు :*

1. ఫస్టులాంగ్వేజి-పార్టు 1. ప్రాంతీయ భాష లేక మాతృ భాష.

2. ఫస్టులాంగ్వేజి-పార్టు 2. ఫస్టులాంగ్వేజి., లేక ప్రాచీన లేక ఏ యితర భాషలోనైనా తీవ్ర పరిశ్రమ.

లేక

రెండవ భాష — ఇంగ్లీషు—

3. వాణిజ్య గణితం

4. సాంఘిక శాస్త్రములు

5. పౌర శిక్షణ

6. వ్యాయామ విద్య

7. నీతి శాస్త్రము

8. డాఫ్టింగు, ప్రెస్సీ రైటింగ్

9. పైపు రైటింగ్

10. ఈ క్రింది వాటిలో ఏవైనా రెండు సబ్జెక్టులు.

బుక్ కీపింగు, కమర్షియల్ ప్రాక్టీసు, షార్టుహాండు

పబ్లిక్‌పరీక్ష పైన పేర్కొన్న 1,2,3,4 8,9,10 అంశాలలో జరుగుతుంది.

## 2. ప్రీ-టెక్నలాజికల్ కోర్సు

1. ఫస్టులాంగ్వేజి-పార్టు1- ప్రాంతీయ భాష లేక మాతృభాష.

2. ఫస్టులాంగ్వేజి - పార్టు2- ఫస్టులాంగ్వేజి లేక ప్రాచీన లేక ఏ యితర భాషలోనైనా తీవ్రపరిశ్రమ.

లేక

రెండవభాష—ఇంగ్లీషు

3 గణితం - జనరల్ లేక కంపోజిట్

4. సాంఘిక శాస్త్రములు

5. పౌరశిక్షణ

6. వ్యాయామవిద్య

7. నీతి శాస్త్రము

8. ఈ క్రింది వాటిలో ఏదైనా ఒక సబ్జెక్టు.

వ్యవసాయం

ఇంజనీరింగు

టెక్స్‌టైల్ టెక్నాలజీ

ఫిషరీస్ టెక్నాలజీ

కెమికల్ టెక్నాలజీ

ప్రింటింగు టెక్నాలజీ

పైన పేర్కొన్న 1,2,3,4,8 సబ్జెక్టులలో పబ్లిక్ పరీక్ష జరుగుతుంది.

## 3. గృహాలంకరణ శాస్త్రము

*(అస్థెటిక్, డొమెస్టిక్ కోర్సు)*

### పార్టు 1

1. ఫస్టులాంగ్వేజి-పార్టు1- ప్రాంతీయ భాష లేక మాతృభాష

2. ఇంగ్లీషు

3. వ్యాయామవిద్య

4. నీతి శాస్త్రము

5. పౌరశిక్షణ

### పార్టు 2

6. అదనపుభాష (అకాడమిక్ కోర్సులో పార్టు 2 లోని ఫస్టు లాంగ్వేజి మాదిరిగనే వుంటుంది. పార్టు 2 హిందీతో సహా)

7. రెండవభాష—ఇంగ్లీషు

8. గణితం-జనరల్ లేక కంపోజిట్

9. సామాన్య విజ్ఞానశాస్త్రము

10. సాంఘికశాస్త్రములు

11. గృహ విజ్ఞానశాస్త్రము-జనరల్

12. డ్రాయింగ్ పెయింటింగ్-జనరల్.

బాలికల స్కూళ్ళలో 3వ పార్టు క్రింద గృహ విజ్ఞానశాస్త్రమును తీసుకొని బాలికలు ఈ పార్టు క్రింద మూడు సబ్జెక్టులు తీసుకోవాలి. అందులో ఒకటి గృహవిజ్ఞాన శాస్త్రము చేరివుండాలి. అయితే 3వ పార్టు క్రింద వున్న సబ్జెక్టులూ, ఇవీ ఒకటే అయి వుండకూడదు.

13. ఈ క్రింది వాటిలో ఏదైనా ఒకటి

(అ) గృహ విజ్ఞానశాస్త్రము, ప్రత్యేకం.

(ఆ) డ్రాయింగు, పెయింటింగు, ప్రత్యేకం,

(ఇ) సంగీతం

(ఈ) నాట్యం.

పైన పేర్కొన్న 1,6 నుంచి 13 వరకు గల అంశాలలో పబ్లిక్ పరీక్ష వుంటుంది.

1. ఫస్టులాంగ్వేజి-పార్టు1- ప్రాంతీయ భాష లేక మాతృభాష. ఫస్టు లాంగ్వేజి-పార్టు2- ఫస్టులాంగ్వేజి, లేక ప్రాచీన లేక ఇతర భాషలోనైనా తీవ్రపరిశ్రమ.

2. ఇంగ్లీషు,

3. గణితము-జనరల్ లేక కంపోజిట్

4. సామాన్య విజ్ఞానశాస్త్రము

5. సాంఘికశాస్త్రములు

6. వ్యాయామవిద్య

7. నీతిశాస్త్రము

8. పౌరశిక్షణ

9 టీచింగ్‌ప్రాక్టీసు

పైన తెలిపిన 1,2,3,4,5,9 అంశాలలో పబ్లిక్ పరీక్ష వుంటుంది.

గమనిగ : 1956 లో జరిగిన యస్. యస్. యల్. సి. పబ్లిక్ పరీక్ష నుంచీ, టీచింగ్ ప్రాక్టీసు తీసుకున్న విద్యార్థులు పార్టు 2 క్రింద ఎన్నుకొన్నభాష, పార్టు 1 లో తీసుకున్న భాష రెండూ ఒకటే అయివుండాలి.

పునర్వ్యవస్థీకరించబడిన ఈ పథకం ప్రకారం తొల పరీక్ష 1951 మార్చి నెలలో జరిగింది.

ఇందులోని కొన్ని ముఖ్యాంశాలు దిగువ పేర్కొన బడినాయి :

1909 సం॥లో ఆమోదించబడిన యస్. యస్. యల్. సి. పథకంలో పబ్లిక్ పరీక్షకు హాజరయ్యే విద్యార్థుల కనీస వయస్సు 15 సంవత్సరాలుండాలని నిర్ణయించబడింది. 1916 నుంచీ విద్యార్థుల హాజరీ తక్కువ వున్నట్లయితే దానిని మాఫ్ చేయడానికి ఇన్స్పెక్టింగ్ ఆఫీసర్లకు అధికార మివ్వబడింది.

1931 సం॥లో అభ్యర్థి పరీక్ష వ్రాయడం మూడు పర్యాయాలకు మాత్రమే పరిమితం చేయబడింది. 1948 నుంచీ సప్లిమెంటరీ పరీక్ష ప్రవేశపెట్టబడడంతో పరీక్షకు కూర్చొనే ఛాన్సులను 4 వరకు పెంచడం జరిగింది. ప్రస్తుతం ఈ విధమైన నిర్బంధన ఏదీలేదు.

1948 సం॥పు పరీక్షనుంచి ప్రాంతీయ భాషను ఫస్టులాంగ్వేజి గానూ, ఇంగ్లీషును రెండవ భాషగానూ వర్గీకరించడం జరిగింది.

1949 మే 13 వ తేదీనాటి జి. ఓ. నెం. 5131 లో, 1945-50 నుంచీ ఆంగ్లభాషా బోధన 1 వ ఫారం నుంచీ జరగాలని ప్రభుత్వం ఆదేశించింది.

1 వ ఫారం నుంచి 6 వ ఫారం వరకు ఇంగ్లీషులో సవరించబడిన పాఠ్య ప్రణాళిక ప్రవేశపెట్టబడింది. ఇంగ్లీషులో 2000 పదజాలాన్నీ, వాడుక భాషలో వాటికి సంబంధించిన శబ్దసముదాయాన్నీ, భాషా శైలినీ విద్యార్థులు ఆకళింపుచేసుకోవాలని, ఈపథకం ఆశయం

1952 లో యస్. యస్. యల్. సి. పబ్లిక్ పరీక్షలో తొలిసారిగా కంపోజిట్ గణితం సబ్జెక్టులో పరీక్ష జరిగింది.

1951 లో క్రొత్త తరహాలో టెస్టులకు ప్రశ్నలు తయారు చేయడం జరిగింది. వాటికి 100 మార్కులలో 40 మార్కులు (విజ్ఞాన శాస్త్రం, సాంఘిక శాస్త్రములలో 50 మార్కులు) కేటాయించబడ్డాయి. 1956 మార్చినుంచి జరిగిన పరీక్షకు ఈ రకం ప్రశ్నలకు అన్ని సబ్జెక్టులలో 100 కి 30 మార్కులు కేటాయించడం జరిగింది.

భాషా పఠనానికి 1 వ ఫారం నుంచి 4 వ ఫారం వరకు క్రొత్త పథకం 1951-52 లో అమల్లో పెట్టబడింది. (దీన్ని 1950 జూలై 27 వ తేదీనాటి విద్యాశాఖ జి. ఓ. నెం. 2121 లో ప్రభుత్వం ఆమోదించింది.)

ఈ పథకం ప్రకారం ఫస్టు లాంగ్వేజి ప్రాంతీయ భాషకానీ లేక విద్యార్థి మాతృభాషకానీ అయివుంటుంది. ఇందులో రెండు పార్టులు వుంటాయి. పార్టు 1 తప్పని సరిగా వుంటుంది. పార్టు 2 క్రింద, విద్యార్థులు పార్టు 1 లో చదివిన ప్రాంతీయ భాష లేక మాతృభాష లేక హిందీ మినహా యితర భారతదేశ భాషలలో ఏదైనా ఒక దానిలో ఇంకా ముందు చదవడానికి వారికి అనుమతి ఇవ్వబడింది. పార్టు 1 క్రింద మాతృభాషగా హిందీని చదువుతున్న విద్యార్థి ఆ భాషను పార్టు 2 లో కూడా తీసుకోవడానికి అతనికి అనుమతి ఇవ్వబడింది. పార్టు 2 లో తీసుకున్న భాష పార్టు 1 లో వున్న భాష కానీ లేక ప్రాచీన లేక, విదేశభాష కానీ కానట్లయితే, 8 వ తరగతి పబ్లిక్ పరీక్షకు ఆ యా భాషలలో నిర్ణయించ బడిన పాఠ్య పుస్తకాలనే చదువవలసి వుంటుంది. ఈ భాషలలో పశ్నా పత్రాలు 8 వ తరగతి పబ్లిక్ పరీక్షకు నిర్ణయించే నమూనా లోనే వుంటాయి.

1959 మార్చిలో ప్రథమ పర్యాయం పరీక్షకు కూర్చొన్న విద్యార్థులందరికీ హిందీ సబ్జెక్టు నిర్బంధం చేయబడింది. అయితే ఉత్తీర్ణత కావడానికి నూటికి 15 మార్కులు నిర్ణయించబడ్డాయి. ప్రత్యేక కమిటీ దాన్ని తిరిగి మాడరేట్ చేయ వచ్చు.

## ఓ. యస్. యస్. యల్. సి. పథకం

యస్. యస్. యల్. సి. పథకం నిస్సందేహంగా బాగా ప్రచారంలోకి వచ్చింది. ఇలాంటిదే ఓ. యస్. యస్. యల్. సి. అనే మరొక పథకం (ఓరియంటల్ హైస్కూళ్ళకు) 1952 లో రూపొందించబడింది. ఇతర హైస్కూళ్ళల్లో విద్యార్థులు సముపార్జించుకొనే ఆధునిక విజ్ఞానాన్నే, సాధ్యమైనంతవరకు ఈ స్కూలు విద్యార్థులు కూడా సంపాదించుకొనే సౌకర్యం కల్గించాలనేది ఈ పథకం వుద్దేశం. దీనితో పాటు, యూనివర్శిటీల ఓరియంటల్ ఫేకల్టీస్‌లో చేరి, విద్యార్థులు ప్రత్యేక కోర్సులు తీసుకోవడానికి వీలుగా భారతదేశ భాషలలో తీవ్ర పరిశ్రమ చేయడానికి తగిన అవకాశం కూడా కల్పించబడుతుంది. చదువ వలసిన సబ్జెక్టుల వివరాలు :

1. (అ) ప్రధానమైన భాష.
   (1) ప్రాచీన — సంస్కృతం, అరబ్బీ లేక పర్షియన్.
   (2) ప్రాచీనం కానివి-తెగులు, ఉర్దు.
2. ఫస్టు లాంగ్వేజి — ప్రాంతీయ భాష పార్టు 1, తెలుగు లేక ఉర్దు యస్.యస్.యల్.సి. పథకంలోవలెనే.
3. రెండవ భాష-ఇంగ్లీషు.
4. జనరల్ లేక కంపోజిట్ గణితం.
5. సామాన్య విజ్ఞాన శాస్త్రము.
6. సాంఘిక శాస్త్రములు.
7. హిందీ.

గమనిక : పైన పేర్కొన్న 4 నుంచి 6 వరకు గల సబ్జెక్టులలో అభ్యర్థి రెండింటిని తీసుకోవాలి. ఇందులో

ఏ ఒక దానిలోనైనా అతనికి ఎలిజిబిలిటీ వస్తేచాలు

## పోస్టు బేసిక్ స్కూళ్ళు

పోస్టు బేసిక్ స్కూళ్ళు యస్. యస్. యల్. సి. కోర్సు పాఠ్యప్రణాళికనే అనుసరించి వుంటాయి. దానికి తోడుగా అభ్యర్థులు, 1960 మార్చి 4వ తేదీనాటి విద్యాశాఖ జి. ఓ. నెం. 639 లో నిర్ణయించబడిన కొన్ని ప్రత్యక్ష కార్యకలాపాలకు కూడా హాజరు కావాల్సి వుంటుంది యస్ యస్ యల్ సి పథకం క్రిందవున్న అకాడమిక్ కోర్సు సబ్జెక్టులే వీరికీ వుంటాయి. అయితే ఈ స్కూళ్ళ విషయంలో క్లాసు రికార్డుకు మార్కులలో 25% వెయిటేజి యివ్వబడుతుంది. యస్. యస్. యల్. సి. కి సమానమైనదిగానే పోస్టు బేసిక్ పబ్లిక్ పరీక్ష గుర్తించబడింది.

ఈ పథకం క్రింద మొదటిసారిగా 1962 మార్చిలో పరీక్ష జరిగింది ఈ వర్గం క్రింద ప్రస్తుతం 2 స్కూళ్ళు వున్నాయి :

(1) పశ్చిమ గోదావరి జిల్లా పెంటపాడులో పోస్టు బేసిక్ స్కూలు.

(2) కృష్ణా జిల్లా తిరువూరు తాలూకాలో శ్రీ నికేతన్, పోస్టు బేసిక్ స్కూలు.

1962 మార్చిలో జరిగిన పబ్లిక్ పరీక్షకు 712 స్కూళ్ళు విద్యార్థులను పంపినాయి. వివరాలు ఇవి :

### స్కూళ్ళ సంఖ్య

| యూనివర్శిటీ ప్రాంతం | అకాడమిక్ కోర్సులకు విద్యార్థులను పంపే సాధారణ హైస్కూళ్లు | | (1)వ కాలంలో పేర్కొన్న స్కూళ్ళలోనుంచి విభజింపబడ కోర్సుల క్రింద వున్న సబ్జెక్టులకు విద్యార్థులను పంపే స్కూళ్ల సంఖ్య | ఓ. యస్. యస్. యల్. సి. స్కూళ్లలో పోస్టు బేసిక్ స్కూళ్ళు | మొత్తం |
|---|---|---|---|---|---|
| | 1 | 2 | 3 | 4 | 5 |
| 1. ఆంధ్ర యూనివర్శిటీ | 468 | (35) | 9 | 2 | 479 |
| 2. శ్రీ వేంకటేశ్వర యూనివర్శిటీ | 226 | (19) | 7 | — | 233 |
| మొత్తం. | 694 | *(54) | 16 | 2 | 712 |

* 2వ కాలంలో పేరొన్న స్కూళను మినహాయించి.

ఈ పథకం క్రింద, ఒకే పర్యాయం అన్ని సబ్జెక్టులలో పరీక్ష ఇచ్చిన అభ్యర్థులు, ప్రతి కోర్సుకూ సూచించిన ప్రకారం మార్కులు తెచ్చుకున్నట్లయితే, వారు అర్హులైనట్లుగా ప్రకటించబడుతారు.

## అకాడమిక్ కోర్సు

అభ్యరులు పార్టు 1, పారు 2 క్రింద ఎన్నుకున్న భాష లేక భాషలలో మొత్తం 200 మార్కులలో 80 కి తక్కువ కాకుండా మార్కులు తెచ్చుకొని వుండాలి. ఇంగ్లీషుతోపాటు దిగువ పేర్కొన్న మూడు సబ్జెక్టులలో నూటికి 40 మార్కులు తెచ్చుకోవాలి,

(1) గణితం, (2) సాంఘిక శాస్త్రములు, (3) సామాన్య విజ్ఞాన శాస్త్రము, ఇందులో ఏ రెండింటిలోనైనా 35 శాతానికి తక్కువ కాకుండానూ, మూడవ సబ్జెక్టులో 30 శాతానికి తక్కువ కాకుండానూ మార్కులు తెచ్చుకొని వుండాలి.

అయితే మొత్తంమీద 225 కు తక్కువ కాకుండా మార్కులు తెచ్చుకున్న అభ్యర్థుల విషయంలో ఒకటి లేక అంతకన్నా ఎక్కువ సబ్జెక్టులలో మార్కులు తక్కువ వచ్చినట్లయితే అంతా కలిపి 5 మార్కులకు మించకుండా రియాయతీ ఇవ్వవచ్చు.

అంతేకాక, అకాడమిక్ కోర్సులలో ఒకటి లేక అంతకన్న యెక్కువ సబ్జెక్టులలో మార్కులు తక్కువ వచ్చినట్లయితే ఈ దిగువ పేర్కొన్న ప్రకారం గ్రేడువారీగా రియాయతీ ఇవ్వబడుతుంది. అయితే, ఏ సబ్జెక్టులోకూడా రియాయతీ 5 మార్కులకు మించకూడదు.

## అకాడమిక్ కోర్సులు

మొత్తం 235 నుంచి 244 వరకు 6 మార్కులు.
మొత్తం 245 నుంచి 254 వరకు 7 మార్కులు.
మొత్తం 255 నుంచి 264 వరకు 8 మార్కులు.
మొత్తం 265 నుంచి 274 వరకు 9 మార్కులు.
మొత్తం 275 అంతకు మించన వాటికి 10 మార్కులు.

## విభజింపబడిన కోర్సు

విభజింపబడిన కోర్సులను ఎన్నుకొని పార్టు 1 లో ఫస్టు లాంగ్వేజిలో 40%, ఇంగ్లీషు, మిగిలిన నాల్గు సబ్జెక్టులలో (లేక నిర్ణీత సబ్జెక్టులలో) 40% కి తక్కువకాకుండాను, నాలుగు సబ్జెక్టులలో ఏ రెండింటిలోనైనా 35% కి తక్కువ కాకుండాను, మిగిలిన రెండు సబ్జెక్టులలో 30% కి తక్కువ కాకుండాను మార్కులు తెచ్చుకున్న అభ్యర్థులు.

అయితే మొత్తంమీద 220 కి తక్కువ కాకుండా మార్కులు తెచ్చుకొన్న అభ్యర్థుల విషయంలో ఒకటి లేక అంతకన్నా ఎక్కువ సబ్జెక్టులలో మార్కులు తక్కువ వచ్చినట్లయితే అంతా కలిపి 5 మార్కులకు మించకుండా రియాయతీ ఇవ్వవచ్చు.

అంతేగాక విభజింపబడిన కోర్సులలో ఒకటి లేక అంతకన్న యెక్కువ సబ్జెక్టులలో మార్కులు తక్కువ వచ్చినట్లయితే దిగువ పేర్కొన్న ప్రకారం గ్రేడువారీగా రియాయతీ ఇవ్వబడుతుంది. అయితే ఏ సబ్జెక్టులో కూడా రియాయతీ 5 మార్కులకు మించకూడదు :—

## విభజింపబడిన కోర్సు

మొత్తం 230 నుంచి 239 వరకు 6 మార్కులు
మొత్తం 240 నుంచి 249 వరకు 7 మార్కులు
మొత్తం 250 నుంచి 259 వరకు 8 మార్కులు
మొత్తం 260 నుంచి 269 వరకు 9 మార్కులు
మొత్తం 270, అంతకు మించిన వాటికి 10 మార్కులు.

పైన పేర్కొన్న నియమావళిని పాటించడమేగాక, అకాడమిక్ కోర్సును ఎన్నుకొన్న అభ్యర్థులు మూడవభాష క్రింద హిందీలో 15 వ శాతానికి తక్కువ కాకుండా మార్కులు తెచ్చుకొన్నట్లయితేనే యూనివర్శిటీ కోర్సులలో చేరడానికి అర్హులుగా ప్రకటించబడుతారు

1959 మార్చిలో మొదటి సారిగానూ, ఆ తరువాతనూ. యస్. యస్. యల్. సి. పరీక్షకు కూర్చొన్న అభ్యర్థుల విషయంలో మాత్రమే ఈ నిబంధన (మూడవ భాషలో 15 శాతం మార్కులు తెచ్చుకోవాలనేది) వర్తిస్తుంది.

## ఓ. యస్. యస్. యల్. సి. పథకం

పార్టు 1 లోని ప్రాంతీయ భాషలో 40% రెండవ భాష ఇంగ్లీషులో 40% ఎన్నుకున్న ప్రధానమైన భాషలో మొత్తం 200 మార్కులలో 70 మార్కులు, ఐచ్ఛిక సబ్జెక్టులలో అంటే జనరల్ లేక కంపోజిట్ గణితము, లేక సామాన్య విజ్ఞానశాస్త్రము లేక సాంఘిక శాస్త్రములలో దేనిలో ఒక దానిలో 35% మార్కులు తెచ్చుకున్న అభ్యర్థులు.

అయితే మొత్తం మీద 185 మార్కులు తెచ్చుకున్న అభ్యర్థుల విషయంలో ఒకటి లేక అంతకన్నా యెక్కువ సబ్జెక్టులలో మార్కులు తక్కువ వచ్చినట్లయితే అంతా కలిపి 5 మార్కులకు మించకుండా రియాయతీ ఇవ్వ వచ్చు.

అంతేగాక ఒకటి లేక అంతకన్న యెక్కువ సబ్జెక్టులలో మార్కులు తక్కువ వచ్చినట్లయితే దిగువ పేర్కొన్న గ్రేడు వారీగా రియాయతీ ఇవ్వ బడుతుంది. అయితే ఏ సబ్జెక్టులో కూడా రియాయతీ 5 మార్కులకు మించకూడదు.

మొత్తం 195 నుంచి 204 వరకు 6 మార్కులు
మొత్తం 205 నుంచి 214 వరకు 7 మార్కులు
మొత్తం 215 నుంచి 224 వరకు 8 మార్కులు
మొత్తం 225 నుంచి 234 వరకు 9 మార్కులు
మొత్తం 235, అంతకు మించిన వాటికి 10 మార్కులు

పై నియమావళిని పాటించడమే గాక అభ్యర్థులు పబ్లిక్ పరీక్షలో మూడవభాష-హిందీలో 15% తక్కువ కాకుండా మార్కులు తెచ్చుకొన్నట్లయితేనే యూనివర్శిటీ కోర్సులో చేరడానికి అర్హులుగా ప్రకటించ బడుతారు.

గమనిక : హిందీలో మార్కులు మాడరేషన్ కమిటీని నియమించబడినట్లయితే, దాని పరిశీలనకు లోబడి వుంటాయి.

## ముగింపు

యస్. యస్. యల్. సి. పథకంలో స్కూలు వర్కుకు అత్యంత ప్రాధాన్యమిస్తుంది. కోర్సు అంతమైన తరువాత సర్టిఫికెట్‌లో దీనికి ప్రముఖస్థాన మివ్వబడుతుంది. దీనిలో వుండే ముఖ్యాంశం యిదే. సర్టిఫికెటు పొందిన అభ్యర్థులూ, ఉద్యోగమిచ్చే యజమానీ, కాలేజీ ప్రిన్సిపాలు దృష్ట్యా ఇది జనబాహుళ్యమైనది. 1946 సం॥ నాటికి ప్రతి తాలూకాలో ఒక హైస్కూలు వుండాలనే ఆదర్శం ఇంచుమించు సాధించబడింది. అప్పటినుంచీ క్రొత్తగా అనేక స్కూళ్ళు తెరువబడ్డాయి. విద్యార్థి యొక్క సర్వతోముఖాభివృద్ధికి దోహదం కల్పించి, అతను సమర్థవంతుడైన ఉత్తమ పౌరుడుగా రూపొందుటకు కావలసిన సౌకర్యాలు కల్పించే నిమిత్తం చదువవలసిన పాఠ్యాంశాలలో అనేక సబ్జెక్టులు చేర్చడమేగాక, వ్యాయామ శిక్షణ, ఆటలు, వృత్తిపనులు, స్కౌటింగు, ఎన్. సి. సి. కోర్సులు, దృశ్యశ్రవణ విద్యా, నీతిశాస్త్రము, బాలికల కొరకు గృహకళలు, పౌరశిక్షణ మున్నగు ఇతర అనేక కార్యకలాపాలు కూడా చేర్చబడినాయి. ★

# జాతీయ రక్షణ కృషికి మీ పొదుపు ధనం అవసరం

మీరు ఎంత పొదుపు చేయగలిగితే అంత చేయండి. ఆ విధంగా పొదుపుచేసిన మొత్తాలను

దిగువ సెక్యూరిటీలలో దేనికైనా పెట్టుబడి పెట్టండి.

*12 సంవత్సరాల జాతీయ రక్షణ సర్టిఫికెట్లు :*

సంవత్సరానికి 6¼ శాతం సాధారణ వడ్డీ లేక 4¾ శాతం చక్రవడ్డీ. రూ. 5 మొదలు రూ. 25,000 ల వరకు వివిధ డినామినేషన్లలో లభ్యమవుతాయి. విడిగా ఒక వ్యక్తి అయితే రూ. 35,000 ల వరకూ, ఇద్దరు వ్యక్తులు కలిసి అయితే రూ. 70,000 ల వరకు పెట్టుబడి పెట్టవచ్చు. (పోస్టల్ సేవింగ్స్ సర్టిఫికెట్లకు లోగడ ఏమైనా పెట్టుబడి పెట్టివుంటే దానితో కలుపుకొని).

*10 సంవత్సరాల రక్షణ డిపాజిటు సర్టిఫికెట్లు :*

ఏటా 4½ శాతం వడ్డీ చెల్లించబడుతుంది. రూ. 50 ల గుణిజములలో లభ్యమవుతాయి. విడిగా ఒక వ్యక్తి అయితే రూ. 35,000 ల వరకూ, ఇద్దరు వ్యక్తులు కలిసి అయితే రూ. 70,000 ల వరకూ ఎక్కువలో ఎక్కువ పెట్టుబడి పెట్టవచ్చు. (3½ శాతం. 4 శాతం ట్రెజరీ సేవింగ్స్ డిపాజిటు సర్టిఫికెట్లకు లోగడ ఏమైనా పెట్టుబడి పెట్టివుంటే దానితో కలుపుకొని).

*కుమ్యులేటివ్ టైమ్ డిపాజిటు పథకం :*

5, 10 లేక 15 సంవత్సరాలవరకు ప్రతినెలా రూ. 5, 10, 20, 50, 100, 200 లేక 300 చొప్పున డిపాజిటు చేసినట్లయితే తరువాత చక్రవడ్డీతోసహా పెట్టుబడి అధిక మొత్తంగా తిరిగి చెల్లించబడుతుంది.

*పోస్టాఫీసు సేవింగ్సు బ్యాంకు అక్కౌంట్లు :*

రూ. 25 లు మొదలు రూ. 20,000 ల వరకు నిలువవుంచే మొత్తాలకు 3 శాతం చొప్పునా, రూ. 20,000 లకు మించి నిలువవుంచే మొత్తాలకు 2½ శాతం చొప్పునా వడ్డీ చెల్లించబడుతుంది. ఒక వ్యక్తి రూ. 15,000 ల వరకూ నిలువ చేయవచ్చు.

*15 సంవత్సరాల అన్యూటీ సర్టిఫికెటు :*

జారీచేసే ధర : రూ. 1,330, రూ. 3,325, రూ. 6,650, రూ. 13,300, రూ. 26,600. సంవత్సరానికి 4.25 శాతం చక్రవడ్డీ చొప్పున, 15 సంవత్సరాలలో నెలవారీ చెల్లింపుల రూపంలో డబ్బు తిరిగి ఇవ్వబడుతుంది. ఒక వ్యక్తి రూ. 26,600 ల వరకు పెట్టుబడి పెట్టవచ్చు.

చిన్న మొత్తాల పొదుపు పత్రాలకు పెట్టిన పెట్టుబడులపై లభించే వడ్డీకి

ఆదాయపు పన్ను, సూపర్ టాక్సులు వుండవు.

"మీరు చేసే పొదుపుమీదనే మీ భద్రత, మీ పిల్లల శ్రేయస్సు ఆధారపడి వుంది."

ఇతర వివరాలకొరకు, హైద్రాబాదు 10—2—2, ఏ. సి. గార్డ్సు రోడ్డులోని ఆంధ్రప్రదేశ్ నేషనల్ సేవింగ్స్ ప్రాంతీయ డైరెక్టరు (భారత ప్రభుత్వం)ను కానీ లేక మీ కలెక్టరేటులోని జిల్లా ఆర్గనైజరునుకానీ లేదా మీ సమీపంలోని తపాలా కార్యాలయాన్నికానీ దయచేసి సంప్రదించండి.

# అత్యవసర పరిస్థితిలో
# లైబ్రేరియనుల ప్రముఖపాత్ర

కె. రాఘవరెడ్డి

దేశాన్ని ఎదుర్కొంటున్న ప్రస్తుత విషమ పరిస్థితిలో ప్రతి పౌరుడూ తన శాయశక్తులా కృషి చేయడం అవసరం. భారతదేశానికి చైనా కల్గించిన పరాభవాన్ని వెంటనే తుడిచివేయాలి. దురాక్రమణను పూర్తిగా పారద్రోలి, భవిష్యత్తులో ఇలాంటి దురాక్రమణ మరోసారి జరగకుండా వుండేందుకై మనం కొన్ని సంవత్సరాలపాటు కృషి చేయాలి. లైబ్రేరియన్లకు అన్ని వర్గాల ప్రజలతోనూ పనికలుగుతూ వుంటుంది. ఇలాంటి సమయంలో యథాశక్తి సాయపడటానికి వారికి మంచి అవకాశాలున్నాయి. ప్రజల్లో చైతన్యం కల్గించడం తక్షణ కర్తవ్యం. ఇందుకు లైబ్రేరియన్లు బాగా ఉపకరిస్తారు. రక్షణ కృషినిగూర్చి, దైనందిన పరిణామాలను గూర్చి వారు ప్రజలకు తెలియజేయాలి.

విజ్ఞాన విషయాలను ప్రజలకు తెలియపరచడంలో గ్రంథాలయాలు కీలకపాత్ర వహిస్తాయి. పుస్తకాలు, కరపత్రాలు, వ్రాతప్రతులు, అచ్చుప్రతులను, సేకరించి, వాటిని పదిలపరచి లైబ్రేరియనులు మన నాగరికతా సౌధానికి పునాదులు వేశారు. భావి సౌధ నిర్మాణానికి నేడు వారు అనేక విధాలుగా తోడ్పడగలరు. రక్షణ కృషిని గూర్చి ప్రజలకు వివరంగా తెలియజేయడం వారి తక్షణ కర్తవ్యం. అదనపు ఖర్చు లేకుండానే తన గ్రంథాలయంలో వున్న పుస్తకాలు, కరపత్రాలు, చిత్రపటాలు, స్లైడ్సు మున్నగు వాటి సహాయంతో ప్రజలకు అన్ని విషయాలు తెలియచేయడానికి అతనికి సులభసాధ్యమవుతుంది.

లైబ్రేరియనులు రక్షణ కృషినిగూర్చి తెలిపే పుస్తకాలను, తత్సంబంధమైన ఇతర సాహిత్యాన్ని సేకరించి, సాధ్యమైనంత మందికి వాటిని లభింపజేయాలి. ఇలాంటి పుస్తకాలకూ, ప్రజలకూ మధ్య వారు సంధాన కర్తలుగా వ్యవహరించాలి. స్వయంగా గ్రంథాలయానికి వచ్చి పుస్తకాలు తీసుకునే వీలులేని వారికి ఇలాంటి పుస్తకాలను అందజేస్తే, వారి కార్యదీక్ష ప్రశంసాపాత్రమవుతుంది.

ఇంతవరకూ యుద్ధాన్నిగురించి యుద్ధకృషిని గురించిన పుస్తకాలు చాలా పరిమితంగా వున్నాయి. కనుక, యుద్ధకృషికి తోడ్పడగలందులకై అనువైన సాహిత్య రచన కొనసాగించడానికి లైబ్రేరియనులు రచయితలను ప్రోత్సహించాలి. యుద్ధ కృషిని గూర్చి యిం వరకు వెలువడిన పుస్తకాల జాబితాను తయారుచేసి, దానిని గ్రంథాలయంలో ప్రదర్శించాలి. అయితే కేవలం ఇలాంట జాబితా పదిమందిదృష్టిలో పడకపోవచ్చు కనుక తత్సంబంధమైన యితర విషయాలపై వున్న పుస్తకాలను అంటే వ్య సాయ వుత్పత్తి, నేషనల్ సేవింగ్సు మున్నగు వివిధ సబ్జెక్టులపైన పుస్తకా జాబితాలను కూడా తయారుచేసి ప్రజ లకు అందుబాటులో వుంచినట్లయితే, వారికి ఈ విషయాలపైన ఆసక్తి కలుగుతుంది.

గ్రంథాలయభవనాలలో ఇలాంటి పుస్తకాలను అందరికీ కనబడేటట్లు ప్రదర్శించినట్లయితే, గ్రంథాలయానికి అరుదుగావచ్చే చదువరులకుకూడా ఈ ప్రదర్శనలో గల ఉద్దేశం అవగతమవుతుంది. చదువరుల దృష్టిని ఆకర్షించడమే వీటి ఉద్దేశం. వీటిని గ్రంథాలయం ఆవరణం బైటకూడా తరచుగా ప్రదర్శించడం అవసరం.

రాష్ట్రంలోని కొన్ని గ్రంథాలయాలలో 16 యం.యం. ఫిల్ము ప్రొజెక్టర్లు, 35 యం.యం. ఫిల్ము స్ట్రిప్ ప్రొజెక్టర్లు,

రేడియోలు, టేప్-రికార్డర్లు మున్నగు ఆధునిక దృక్-శ్రవణ పరికరాలు కూడా వున్నాయి. ఇవేగాక స్లైడ్సు, పోస్టర్లు, చిత్రపటాలు కూడా వున్నాయి. ఆత్యయిక పరిస్థితిలో ఇవన్నీ అవసర మవుతాయి కనుక వీటి నన్నింటినీ తరచుగా ఉపయోగిస్తూ వుండాలి.

భారత ప్రభుత్వం యుద్ధాన్నిగురించి, యుద్ధకృషినిగురించి కొన్ని 16యం.యం ఫిల్ములు తయారుచేసింది. వాటిని అప్పుడప్పుడూ ప్రదర్శించినట్లయితే, ఇవి యుద్ధ కృషికి తోడ్పడుతాయి. యుద్ధం వల్ల కలిగే కష్టనష్టాలు, సైనికుల వీరోచిత కృత్యాలు, యుద్ధానికి సంబంధించిన యితర విషయాల్ని గూర్చిన సందేశాన్ని ప్రజలకు తెలియజేసేందుకై ఉన్నత ప్రమాణంగల చలనచిత్రాలు కూడా నిర్మించబడుతున్నాయి. దేశంలో ప్రజల నైతికస్థాయికి ఉత్తేజం కల్గించి, యుద్ధకాల ఆర్థిక పరిస్థితికి సంబంధించిన సమస్యల్ని వివరిస్తూ కొన్ని చిత్రాలు యిదివరకే తయారైనాయి. 16 యం. యం. ప్రొజెక్టర్లుగల గ్రంథాలయాలు తరచుగా ఇలాంటి చిత్రాలను అరువుకు తెచ్చుకొని ప్రజలకు చూపించాలి. హైద్రాబాదు ఖైరతాబాదులోని భారత ప్రభుత్వ సమాచార బ్రాడ్కాస్టింగు మంత్రిత్వ శాఖ తాలూకు ఫిల్ము డివిజనులో ఈ చలనచిత్రాలు లభిస్తాయి. ప్రదర్శనకై ఉచితంగా వీటిని అరువుకు తీసుకోవచ్చు. ఈ విషయంలో ఇతర వివరాలను సమాచార, పౌర సంబంధాల శాఖ డైరెక్టరు నుంచి పొందవచ్చు. వ్యాయామం, యన్.సి.సి., ఎ. సి. సి. వగైరా విషయాలను గూర్చి కూడా అనేక చలనచిత్రాలు వున్నాయి. విద్యార్థులకోరకై గ్రంథాలయాలలో వీటిని తరచుగా ప్రదర్శించవచ్చు.

16 యం. యం. ఫిల్ములకంటే గాజు స్లైడ్సు, ఫిల్ము స్లైడ్సులకు ఖర్చు తక్కువవుతుంది. చలనచిత్ర ప్రదర్శనల్లో వీటిని ఉపయోగించడం సులభం. "తక్కువ మాట్లాడండి, ఎక్కువ కృషి చేయండి". "పుకార్లు వినవద్దు, పుకార్లను వ్యాపింప చేయవద్దు". "వస్తువులను అధికంగా ఉత్పత్తి చేసి అవసరాలను తగ్గించుకోండి" మున్నగు నినాదాలను గాజు స్లైడ్సుపైన ఫిల్ము స్లైడ్సుపైన రంగు రంగుల సిరాతో వ్రాసి, వాటిని ప్రొజెక్టరు ద్వారా ప్రదర్శించేట్లయితే ప్రేక్షకులకు ఆకర్షణీయంగా వుంటుంది. వీటి సహాయంతో "సెప్టెంబరు 8వ తేదీ నాటి రేఖ", "ప్రత్యక్ష అధీన రేఖ" మున్నగు విషయాలనుగూర్చి గల సందేశాలను నివృత్తి చేయవచ్చు.

ప్రజల దృష్టిని ఆకర్షించేందుకు సాధ్యమయిన చోట్లలో సచిత్ర ప్రదర్శనాలను ఏర్పాటు చేయడం మంచిది. సచిత్ర ప్రదర్శనాలకు ఒక ప్రత్యేకతవుంది. వీటిపట్ల ప్రజలకు మోజుకలుగుతుంది. యుద్ధకృషిని గూర్చి ప్రజలకు నచ్చచెప్పడానికి జాగ్రత్తగా ఎన్నుకోబడిన వివిధ సచిత్ర పటాలు ఎంతగానో తోడ్పడుతాయి.

మానవ శక్తికి మించిన సాహస కృత్యాలను మన జవానులు ప్రదర్శించారనేది అందరికీ తెలిసినదే. ఇలాంటి సాహసకృత్యాలను చిత్రీకరించే పటాలను యుద్ధకృషికి సంబంధించిన వాటినీ తప్పకుండా వుపయోగించాలి. ఇవి మన అభిప్రాయాలకు ఒక స్వరూపం కలిగిస్తాయి. ఆలోచనా శక్తికి ప్రాతిపదిక కలిగిస్తాయి. గ్రామీణ ప్రాంతాలలో యుద్ధ చిత్రాలను తరుచుగా ప్రదర్శిస్తూ వుండాలి.

ప్రజలకు వాస్తవికవిషయాలు తెలియ చేయడానికి మ్యాపులు చాల సహాయపడుతాయి. 1959 సం॥లో భారత, చైనాదేశాల అధీనంలోగల రేఖల విషయమై చాలామంది ప్రజలకు సరిగా తెలియదు. 1962 సెప్టెంబరు 8వ తేదీ నాటి రేఖ సుస్పష్టంగావుంది. చైనా వారి "ప్రత్యక్ష అధీనరేఖ" ముందుకూ వెనక్కూ జరిగేవిధంగా వుంది. చైనా వారి "ప్రత్యక్ష అధీనరేఖ" వాస్తవికంగాచూస్తే చాలా గందరగోళంగా వుంది. మ్యాపుల సహాయంతో ప్రజలకు ఈ విషయాన్నిగూర్చి సులభంగా అర్థమయ్యేట్లు తెలుపవచ్చు.

ఆత్యయిక పరిస్థితిలో పోస్టర్లు విరివిగా వాడవచ్చు. ప్రజలదృష్టిని ఆకర్షించడానికీ, క్షణిక కాలంలో ఏదైనా ఒక సందేశాన్ని తెలపడానికి పోస్టర్లు వుద్దేశింపబడ్డాయి. ఒకసారి చూస్తే దాని భావమేమిటో నిక్కచ్చిగా తెలపడమే పోస్టర్ల ప్రధానోద్దేశం. ప్రభుత్వం యుద్ధ కృషిని తెలిపే పోస్టర్లను భారీ సంఖ్యలో పంపిణీ చేస్తున్నది. గ్రంథాలయాల్లో వీటిని ప్రముఖంగా ప్రదర్శించాలి.

నల్లబల్లను సక్రమంగా ఉపయోగించేట్లయితే ఎన్నో విషయాలను సులభంగా తెలుపవచ్చు. తాజా వార్తలు వ్రాయడానికి నల్లబల్లను ఉపయోగించవచ్చు.

రాష్ట్రంలో అనేక గ్రంథాలయాలలో రేడియోలు వున్నాయి. ప్రజలు ఆలిండియా రేడియో ప్రసార కార్యక్రమాలు

వినేందుకు వీలుగా, గ్రంథాలయాలు అవసరమైన ఏర్పాట్లు చేయాలి. వీటిలో ముఖ్యమైన కార్యక్రమాల్ని రికార్డుచేసి, అవసరమైనపుడు తిరిగి వీటిని వుపయోగించవచ్చు. ఈ కార్యక్రమాల్ని సక్రమంగా ఉపయోగించేట్లయితే, ప్రజలకు సరిహద్దు పరిణామాలు, తదితర విషయాలను గూర్చి తాజా సమాచారం తెలుస్తుంది.

గ్రంథాలయంలో జాతీయ ఆత్యయిక పరిస్థితినిగూర్చి, తత్సంబంధమైన విషయాలను గూర్చి, ఉపన్యాసాలు ఏర్పాటు చేయాలి. ఈ ఉపన్యాసాలు వినడానికి స్కూలు పిల్లలు, ఇతరులను ఆహ్వానించవచ్చు. గ్రంథాలయంలోనే గాక వెలుపల కూడా ఇలాంటి ఉపన్యాసాల్ని ఏర్పాటు చేయాలి. ఇట్టి సమావేశాల్లో కొన్ని సలహాలివ్వడం జరుగుతుంది. ఇట్టి సందర్భాలు లేకపోతే, ఇవి వినే అవకాశం లేకపోవచ్చు. లైబ్రేరియనుకూ, ప్రజలకూ మధ్య వ్యక్తిగతమైన సంబంధానికి అధిక ప్రాధాన్యత వుండాలి. ప్రస్తుత క్లిష్టపరిస్థితిలో ఇది మరీ అవసరం. యుద్ధ కృషిని, వ్యవసాయోత్పత్తి, రక్షణనిధికి విరాళం, నేషనల్ సేవింగ్సు మున్నగు విషయాలను గూర్చి ఉపన్యాసాలివ్వవలసిందిగా నిపుణులను ఆహ్వానించవచ్చు.

పబ్లిక్ లైబ్రరీ ఒక సమాచార కేంద్రంవంటిది. ప్రస్తుత ఆత్యయిక పరిస్థితినిగూర్చి ప్రజలు అడిగే విచారణలకు సమాధానాలు యివ్వాలి. ఇలా జరగటం మంచి ఫలితాలకు దారితీస్తుంది. ఈ విధంగావచ్చే విచారణలన్నింటినీ సేకరించి వాటిని పరిశీలించాలి. జాతీయ పరిస్థితిమూలకంగా ఉత్పన్నమయ్యే ప్రత్యేక విచారణలకు సరియైన సమాధానాలివ్వడానికి గ్రంథాలయాలు కృషిచేయాల్సి వుంటాయి. లైబ్రేరియన్ చాలా జాగ్రత్తగా వచ్చే ప్రశ్నలకు సమాధానాలివ్వాలి.

సరిహద్దు పరిణామాలు, చైనాయుద్ధ విరమణ ప్రతిపాదనలు మున్నగువాటిని గూర్చి ఇంతవరకు చేసిన ప్రచారం తగినంతగా లేదని చెప్పబడుతున్నది. నేడు లైబ్రేరియన్ నిర్వర్తించవలసిన వృత్తిధర్మాలలో ప్రచారమనేది కూడావుంది. అతను యుద్ధకృషికి ప్రచారంతో పాటు అన్నివిధాలుగా తన విస్తృయ విధులను సక్రమంగా నిర్వహించాలి. "ప్రచారం వల్ల లాభముంది" అనేది ఇంచుమించు ఒక సామెత అయింది. ప్రచారం సక్రమ మార్గంలో కొనసాగునంత వరకు దాన్ని యెవరూ కాదనలేరు. పోస్టర్లు, కరపత్రాలు, మ్యాగజైనులు మున్నగువాటి ద్వారా సరిహద్దు సమస్యలను గూర్చి ఇతరులకు నేరుగ నచ్చచెప్పే విధంగా ప్రసారాన్ని కొనసాగించాలి. చేసే ప్రచారం నిర్దుష్టంగా వుండాలి. ఒక ప్రత్యేకమైన వర్గం కాక సంఘానికి ఉపకరించే విధంగా వుండాలి.

యుద్ధకృషినిగూర్చి ప్రజలకు తెలియచేయడం, ప్రచారం కొనసాగించడానికి తోడుగా, ప్రజల రక్షణకై ప్రతి పౌరుడూ కృషిచేయడం, ఈ ఆత్యయిక పరిస్థితిలో చాలా అవసరం. సైనికుల కుటుంబాలు, పిల్లల యోగక్షేమాలు విచారించేందుకు లైబ్రేరియన్‌లూ, గ్రంథాలయోద్యోగులూ కలసి గ్రంథాలయోద్యోగుల రక్షణ సంక్షేమ సంఘాలుగా యేర్పడవచ్చు. వారు సైనికుల ఇండ్లను అప్పుడప్పుడూ జట్లు జట్లుగా సందర్శించి, సైనికుల కుటుంబాల సంక్షేమ కార్యకలాపాలను కొనసాగించవచ్చు. సాంస్కృతిక కార్యక్రమాలు యేర్పాటు చేయబడినపుడు సైనికుల పిల్లలనూ, వారిపైన ఆధారపడిన వారిని గ్రంథాలయాలకు రమ్మని ఆహ్వానించవచ్చు. వారికి అనువైన పుస్తకాలను సకాలంలో సరఫరా చేయాలి. యుద్ధరంగంలో పాల్గొంటున్న సైనికుల ఉపయోగార్థం ప్రజలనుంచి పుస్తకాలూ, వారపత్రికలూ వగైరా సేకరించాలి. జవానుల కొరకు రక్తదానం చేయవలసిందిగా ప్రజలను ప్రోత్సహించాలి.

ట్రాఫిక్, సాయుధపోలీసు దళాల విధులను నిర్వర్తించేందుకు ప్రతి పట్టణంలో హోంగార్డులను ఏర్పాటు చేయాలని భారతప్రభుత్వం సంకల్పిస్తున్నది. ప్రభుత్వంనుంచి పిలుపు వచ్చినట్లయితే, ఈ సంస్థల్లో చేరడానికి లైబ్రేరియనులు సిద్ధంగా వుండాలి. అవసరమైతే రైఫిల్ కాల్చడం, ప్రథమచికిత్స, అగ్నిమాపకం, విమానదాడినుంచి రక్షణ మున్నగు విషయాలలో వారు శిక్షణ పొందాలి.

లైబ్రేరియనులకు ప్రజలతో అనుదినం ప్రత్యక్ష సంబంధముంటుంది. కనుక జాతీయ రక్షణనిధికి ఉదారంగా విరాళాలివ్వవలసిందని వారిని ప్రోత్సాహించవచ్చు. రక్షణనిధి సేకరణకై బహుళ ప్రచారంలో వారు జిల్లాలో కలెక్టర్లకూ, ఇతర అధికారులకు సాయపడాలి. తమ జీతంలో కొంతశాతం ప్రతి నెలా రక్షణనిధికై ప్రత్యేకించి, తద్వారా కూడా వారు ప్రభుత్వానికి తోడ్పడవచ్చు. కొంతమంది లైబ్రేరియనులు ఇదివరకే రక్షణనిధికై విరాళాలిచ్చారు.

(మిగతా xli వ పేజీలో)

# రక్షణకృషిలో పాఠశాలల పాత్ర

ఆత్యయిక పరిస్థితిలో సక్రమమైన సమాచారాన్ని సేకరించి, ప్రజలు సరియైన దృక్పథం అవలంబించడానికి చేయగల కృషిలో పాఠశాలలు వహించే పాత్ర చాలా గురుతరమైనది. ప్రస్తుత సమస్యలనూ సంఘటనలనూ సరియైన రీతిలో అర్థం చేసుకోవడానికి ప్రజలకు ముఖ్యంగా విద్యార్థులకు అవి మార్గం చూపాలి. ఎంతో కష్టపడి సముపార్జించుకొన్న స్వాతంత్ర్యాన్ని పరిరక్షించుకోవడానికి ప్రజలపైన వ్యక్తిగతంగానూ, సామూహికంగానూ గురుతరమైన బాధ్యత వుంది అనే విషయాన్ని తెలియజేయాలంటే, పాఠశాలలకు మించిన సంస్థ మరొకటి లేదని చెప్పవచ్చు. అత్యయిక పరిస్థితి ఏర్పడినప్పటినుంచీ జాతీయ రక్షణ కృషిద్వారా ఇతోధికంగా సేవ చేయడానికి రాష్ట్రమంతటా పాఠశాలలు అనేక విధాలుగా పనిచేస్తున్నాయి. పాఠశాలలు ఈ విషయంలో తీసుకొన్న ఇక ముందు తీసుకోవలసిన చర్యలు దిగువ ప్రస్తావించబడ్డాయి.

## సరియైన, వాస్తవికమైన సమాచారాన్ని అందజేయటం

విద్యాసంస్థలు నిర్వహించే దైనందిన కార్యకలాపాలు ఉపాధ్యాయులూ, విద్యార్థులూ కలసి ఒకచోట సమావేశం కావడంతో ఆరంభమవుతాయి. జాతీయ గీతాలాపన తరువాత ప్రస్తుతాంశాల్ని గూర్చి క్లుప్తంగా వివరించడం జరుగుతుంది. ఈ సందర్భంలో ప్రముఖ వార్తా విశేషాలను, దేశరక్షణకై జవానులు ప్రదర్శిస్తున్న సాహసకృత్యాలను ధన వస్తురూపాల్లో వ్యక్తులు ఉదారంగా ఇస్తున్న విరాళాలనుగూర్చి ప్రస్తావించడం జరుగుతుంది. ఉపాధ్యాయులు, విద్యార్థుల కొరకై ఆకాశవాణి హైద్రాబాదు చేస్తున్న స్కూలు ప్రసారాలలో ప్రత్యేకంగా ఈ వార్తలు చేరివుంటాయి. ఈ విషయమై ఎప్పటికప్పుడు విడుదల అయ్యే పత్రికా ప్రకటనలు, కరపత్రాలు ఉపాధ్యాయులకు సహాయకారిగా వుంటున్నాయి. ఆధారంలేని పుకార్లనూ, బూటకపు ప్రచారాలనూ అరికట్టి ప్రజల ధైర్య స్థైర్యాలను ఉన్నత స్థాయిలో వుంచడానికి పాఠశాలలు యథోచితంగా తోడ్పడుతున్నాయి.

## విద్యార్థుల దేహదార్ఢ్యతను పెంపొందించడం

ప్రస్తుత జాతీయ క్లిష్టపరిస్థితిలో యువకుల దేహపాటవాన్ని పెంపొందించవలసిన అవసరాన్ని పాఠశాలలు గుర్తించాయి. విద్యార్థుల దేహదార్ఢ్యాన్ని పెంపొందించే దృష్టితో ప్రతిరోజూ ఒకగంటవరకు వారికి వ్యాయామ శిక్షణ యిస్తున్నాయి. శనివారాలయందు స్కూళ్ళు మధ్యాహ్నంవరకే వుంటాయి కనుక ఆదివారాలలో మాత్రం ఈ శిక్షణ వుండదు. ఎన్.సి.సి.,ఎ.సి.సి. కార్యకలాపాలు ఉధృతంగా కొనసాగుతున్నాయి. కాలేజీస్థాయిలో దేహదార్ఢ్యం గల విద్యార్థులందరినీ ఎన్. సి. సి. లో చేర్చుకోవడానికి వీలుగా క్రొత్తగా 148 ఎన్. సి. సి. రైఫిల్ కాయ్స్ మంజూరు చేయబడ్డాయి. వచ్చే విద్యాసంవత్సరారంభం నుంచీ వీటిని నిర్వహించడానికి ప్రాథమిక ఏర్పాట్లు చురుకుగా కొనసాగుతున్నాయి. కాలేజీ స్థాయిలో ఎన్. సి. సి. శిక్షణను నిర్బంధం చేసే విషయమై రాష్ట్రంలోని విశ్వవిద్యాలయాలు తీవ్రంగా పరిశీలిస్తున్నాయి.

భారత ప్రభుత్వం తలపెట్టిన, జాతీయ క్రమశిక్షణ, వ్యాయామ విద్యను సెకండరీ స్కూళ్ళలో ప్రవేశపెట్టడానికి కూడా తలపెట్టబడింది. తదనుగుణంగా 60 మందిగల ఫిజికల్ ట్రెయినింగ్ ఇన్‌స్ట్రక్టర్ల జట్టును 3 నెలలవరకు నిర్ణీత శిక్షణ పొందడానికి పంచకూల (పంజాబులోని అంబాలాకు సమీపంలో) మీరట్‌కు పంపడం జరిగింది.

యువకులకు మానసికోల్లాసం కల్గించడానికి స్పోర్ట్సు, ఇతర వినోద కార్యకలాపాలు నిర్వహించడానికి భారీయెత్తున కృషి జరుగుతున్నది.

## జాతీయ రక్షణనిధికి విరాళాలు

జాతీయ రక్షణ నిధికి విద్యాసంస్థల విరాళాలు ప్రోత్సాహజనకంగా

వున్నాయి. ఉపాధ్యాయులూ, చిన్న పిల్లలూ తమ అవసరాల్ని తగ్గించుకొని నిధికి విరాళమిచ్చారు. స్కూళ్ళలో ఖర్చుకాకుండా నిలవవున్న ప్రత్యేక ఫీజు డబ్బునంతటినీ జాతీయ రక్షణ నిధికి విద్యార్థుల సంఘాలు హృదయపూర్వకంగా సమర్పించాయి.

### పౌరశిక్షణ పొందినవారు

స్కూళ్ళలో పౌరశిక్షణ యిచ్చే విషయానికి అత్యంత ప్రాధాన్యత యివ్వబడుతున్నది. ఆరోగ్యం, విద్య, పౌర బాధ్యత మున్నగు విషయాలనుగూర్చి క్రమం తప్పకుండా పాఠాలు చెప్పడం జరుగుతున్నది. నీతి, నిజాయితీ, సామర్థ్యంవంటి గుణగణాలను విద్యార్థులు అలవరచుకొనడానికి కృషి జరుగుతున్నది. జాతిని పటిష్ఠంచేయడానికి ఇవి దోహదం కల్గిస్తాయి. దేశానికి సేవ చేయడమంటే త్యాగం చేయడం వంటిది కాదనీ, సేవచేయడం మన హక్కు అనీ వారికి బోధించడం జరుగుతున్నది. విద్యార్థులకు పౌరరక్షణ, ప్రథమచికిత్స, అగ్నిమాపకం వగైరా పద్ధతులలో పాఠాలు చెప్పడం జరుగుతున్నది.

### జవానుల కుటుంబాలకు సహాయం

యుద్ధంలో పాల్గొన్న జవానుల కుటుంబాలకు సహాయం చేయడానికి, జవానుల పిల్లలకు ఫీజుమాఫ్, పుస్తకాల అలవెన్సులు ఇవ్వడం జరుగుతున్నది. స్టయిఫెండులు, బర్సరీలు, స్కాలర్‌షిప్‌లు యిచ్చేవిషయంలో కూడా వారికి, ప్రాధాన్యత వుంటుంది. యుద్ధంచేస్తున్న సైనికుల పిల్లలను వారి తలిదండ్రుల ఆదాయ పరిమితులతో నిమిత్తంలేకుండా బోర్డింగ్ గృహాలలో ఉచితంగా చేర్చుకోవడానికి కూడా ప్రభుత్వం అనుమతి ఇచ్చింది.

---

( xxxix వ పేజీ తరువాయి )

యుద్ధకాలంలో ప్రజల ధైర్యస్థాయిని నిలబెట్టడం చాలా ముఖ్యమైన విషయమని వారు గ్రహించాలి. ఈ విధంగా వారు ప్రజలను ప్రోత్సహించేట్లయితే, గణనీయమైన కృషి చేసినవారు అవుతారు. తప్పుడు వార్తలనూ, పుకార్లనూ విశ్వశించకూడదని వారు ప్రజలను హెచ్చరిస్తూ వుండాలి.

లైబ్రేరియనులు ధరల స్థిరీకరణకు, వ్యవసాయ, పారిశ్రామిక ఉత్పత్తులు అధికంచేయడం ఒకటే మార్గమని ప్రజలు గ్రహించేట్లు చేయాలి. ప్రజలు పొదుపరితనాన్ని అలవాటు చేసుకొని దుబారా ఖర్చును తగ్గించడానికి వారిని ప్రోత్సహించవచ్చు. దేహదార్ఢ్యంగల వారందరూ సైన్యంలో చేరాలని పోత్సహించవచ్చు. రైతులు అధికోత్పత్తి సాధించడానికిగాను వారికి అనువైన సాహిత్యాన్ని అందచేయాలి. ప్రతి యింటిలో కూరగాయలు పండించాలని వారు ప్రజలకు నచ్చచెప్పాలి.

ఆత్యయిక పరిస్థితిలో లైబ్రేరియనులు తమవిధులు నిర్వహించడానికి ఇవి కొన్ని సలహాలు మాత్రమే. లైబ్రేరియన్ తన గ్రంథాలయంలో వున్న సాధన సంపత్తిని సక్రమంగా వినియోగించుకొని యుద్ధాన్నిగూర్చి వివిధ పద్ధతులను వివిధ విషయాలనుగూర్చి ప్రజలకు తెలియజేయగలడు. గ్రంథాలయం చేసే సేవనూ, కలిగించే సౌకర్యాలనూ బట్టి దానిపట్ల ప్రజలకు అభిరుచి ఏర్పడుతుంది. కనుక లైబ్రేరియనులు ఈ క్లిష్టపరిస్థితిలో, తమ అధీనంలోవున్న వసతి సౌకర్యాలను ఆకళింపు చేసుకొని వాటిని ప్రజోపయోగార్థం వినియోగించడానికి యథాశక్తి కృషిచేయాలి. యుద్ధకాలంలో ప్రజలతో సహకరించి తమ విద్యుక్తధర్మాలను సమర్థవంతంగా నిర్వహించాలి. లైబ్రేరియనులు ఈ రోజులలో ప్రజల మిత్రునిగాను, వేదాంతి, మార్గదర్శకునిగాను వ్యవహరించాలని వారు గుర్తు వుంచుకోవాలి.



# ఆంధ్రప్రదేశ్‌లో అరబిక్, పర్షియన్, ఉర్దూ భాషల అభివృద్ధి

అబ్దుల్ మూయీద్ ఖాన్

వివిధ రూపాలలో రాష్ట్ర ప్రభుత్వమిస్తున్న ప్రోత్సాహంవల్ల ఆంధ్రప్రదేశ్‌లో అరబిక్, పర్షియన్, ఉర్దుభాషలు చెప్పుకోదగినంతగా అభివృద్ధి చెందాయి. ఈ విషయంలో ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం ఇతర రాష్ట్రాలకన్న ముందంజవేస్తున్న దనటంలో అతిశయోక్తి లేదు.

ఈ ప్రోత్సాహం రాష్ట్ర ముఖ్యమంత్రి డాక్టర్ సంజీవరెడ్డి పటుత్వపు నాయకత్వాన మరింత విశేషంగా లభిస్తోంది. శ్రీ సంజీవరెడ్డి గారు ఉర్దుభాషను రాష్ట్రపు ప్రాంతీయ భాషగా ప్రకటించి, దానికి సముచిత స్థానమివ్వడంతో ఇతర రాష్ట్రాలకు మార్గదర్శకులయ్యారు. ప్రభుత్వ సహాయ, సహకారాలవల్లనే అనేక అధికార, అనధికార సంస్థలు ఆంధ్ర ప్రదేశ్‌లో దిన దినాభివృద్ధి చెందుతున్నాయి. వీటిలో హెచ్చుభాగం హైదరాబాదులోనే నెలకొల్పబడ్డాయి. వీటి ప్రగతిని తెలిపేముందు ముఖ్యమైన సంస్థల పేర్లు తెలుపుతాను. దైరాతుల్-మా-అరిఫ్-ఇల్-ఉస్మానియా లేక ఉస్మానియా ప్రాచ్య ప్రచురణ విభాగం, జామియానిజామియా, ఉర్దు కళాశాల, ఉర్దు లైబ్రరీ, పఠన మందిరం, శాస్త్ర, చారిత్రక తెలుగు - ఉర్దు అకాడమీ మొదలైనవి కొన్ని ప్రముఖమైనవి. అరబిక్, పర్షియన్, ఉర్దుభాషలు ప్రత్యేకమైన ఇబ్బందులు గలచోట్లతప్ప అన్ని ప్రభుత్వ, ప్రైవేటు పాఠశాలలు, కళాశాలలు, ఇతర సంస్థలలో బోధింపబడుతున్నాయి.

## సంగ్రహ చరిత్ర

క్రీ. శ. 800 ప్రాంతంలో అరబ్ నావికులు, వర్తకులు మొదలైనవారు దక్షిణాదివారితో సంబంధం ఏర్పరచుకోవడంతో పర్షియన్ భాషకంటె అరబిక్ భాష దక్షిణ దేశంలో ముందు ప్రవేశించినప్పటికీ బహ్మనీరాజ్య స్థాపనవరకు ఈ రెండు భాషలకు తగిన ప్రాముఖ్యం రాలేదు.

బహ్మనీ రాజులు పర్షియన్‌ను ప్రభుత్వ భాషగా గుర్తించారు. వారు తగిన శ్రద్ధాసక్తులు చూపడంవల్ల ఆ భాష త్వరితగతిని అభివృద్ధి చెందింది. పర్షియన్ అధికార భాషగాను, కోర్టులలోను వ్యాప్తి గావడంతో, సంఘంలో ఆ భాష నేర్చినవారికి ప్రత్యేక గౌరవం లభించేది. ఆ నాటి ప్రముఖులు, పండితులు దానిని నేర్చుకోవడం పర్షియన్ వ్యాప్తికి ఎంతో దోహదం చేసింది.

బహ్మనీ సామ్రాజ్యానంతరం కుతుబ్‌షాహీల కాలంలో కూడా పర్షియన్ అధికార భాషగా వుంది. కుతుబ్‌షాహీ రాజులు చూపిన ఆదర్శాలవల్ల పర్షియన్ భాష ఆటంకంలేకుండా అభివృద్ధి చెందింది.

మొదటి నిజాముల్క్ అసఫ్‌జా దక్కను కేంద్రంగా ఆసఫియా సామ్రాజ్యాన్ని స్థాపించినపుడు కూడ పర్షియన్ అధికంగా ఆదరణపొంది పూర్వంకన్న పురోభివృద్ధి చెందింది. కోర్టులలోను, అధికార భాషగానేగాక సాహితీ పరంగాకూడ అది ప్రాముఖ్యం గడించింది. ఈ పురోభివృది ఈ శతాబ్దపు మధ్యవరకు కొనసాగుతూనే వచ్చింది.

శాస్త్రీయ, సాంకేతిక విజ్ఞానం ప్రధానంగా ఆధునిక విద్య ఆవిర్భవించడంతో అరబిక్, పర్షియన్ భాషలపై ఆసక్తి తగ్గ నారంభించింది. పర్షియన్ భాష కోర్టులలోను, అధికార భాషగాను ప్రాముఖ్యం పొందినప్పటికీ. ఉత్తర, దక్షిణ దేశాలలో మత విద్యా బోధనకు అరబిక్ ఉపయోగింపబడేది. మహమ్మద్ గవాన్, బీదర్ మొదలైన మత విషయిక కళాశాలలు అరబిక్ భాష, సాహిత్యం పెంపొందడానికి ఎంతో కృషి చేశాయి.

దక్షిణ ప్రాంతంలో పండితులు, రచయితలు వ్రాసిన వివిధరకాల అరబిక్, పర్షియన్ సాహిత్యం అరేబియా, ఈజిప్ట్, ఇరాన్ దేశాల సాహిత్యానికి ఏమాత్రం తీసిపోకుండా వుండేది. దీనిని బట్టి దక్షిణాదిని

ఈ భాషలు ఎంతగా వృద్ధి చెందాయో వూహించవచ్చు.

నిజాం ప్రభుత్వంలో కూడ అరబిక్, పర్షియన్ భాషలకు ఆదరణ లభించేది. ఆతర్వాత ఈ ఆదరణవుంటూ ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఏర్పడ్డాక మరింత ఇనుమడించింది.

## బోధనా సౌకర్యాలు

పైన చెప్పినట్లు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం అరబిక్, పర్షియన్, ఉర్దూభాషల అభివృద్ధికి తగిన శ్రద్ధాసక్తులు చూపుతోంది. అరబిక్ భాష, సాహిత్యం నేర్చుకొనేటందుకు ఉస్మానియా విశ్వవిద్యాలయంలో మంచి ఏర్పాట్లు వున్నాయి. అరబిక్ శాఖలో బి.ఎ., యం.ఎ., పిహెచ్.డి. తరగతులు చదువవచ్చు. పోస్టు గ్రాడ్యేటు విద్యార్థులకు రిసెర్చి ఫెలోషిప్‌లు ఇవ్వబడతాయి. ఈ శాఖలోగల గ్రంథాలయంలో విద్యార్థులకు, పండితులకు కావలసిన పుస్తకాలన్నీ దొరుకుతాయి. ఇదికాక విద్యార్థిసంఘం ("అల్-లజనల్ – అల్ అరబియా") కూడ ఈ శాఖకు అనుబంధంగా పని చేస్తుంది. ఉపన్యాసాలు, చర్చలు మొదలైన కార్యక్రమాలను యిది నిర్వహిస్తుంది. అంతేగాక ఉపన్యాసాల నిచ్చేటందుకు ప్రసిద్ధులైన పండితులను ఆహ్వానిస్తుంది. అరబిక్ సాహిత్యంపై "అల్ – తన్ వీర్" అనే పత్రికను ప్రచురిస్తుంది.

విద్యలోవచ్చిన ఆధునిక పరిణామాలు పర్షియన్ భాష అభివృద్ధిని కొంత కుంటుపరచాయి. ఉస్మానియా యూనివర్శిటీలోగల పర్షియన్ విభాగంలో అన్ని వసతులు వున్నాయి. పర్షియన్ భాషలో బి. ఎ., యం. ఎ., తరగతులను ఆర్ట్సు కళాశాలలోను, స్త్రీల కళాశాలలోను చదువవచ్చు. ఆర్ట్సు కళాశాలలో రిసెర్చి అవకాశాలుకూడ వున్నాయి. ఇవిగాక పర్షియన్ వ్రాతప్రతుల సంఘం వారు విలువైన పర్షియన్ వ్రాత ప్రతులను ప్రచురించారు. ధనాభావంచేత ప్రస్తుతం ఈ సంఘం పని చేయడంలేదు.

హైదరాబాదులోని 11 హైస్కూళ్ళలోను, తెలంగాణా జిల్లాలలోని 8 హైస్కూళ్ళలోను ఉర్దు బోధనా భాషగావుంది. హైదరాబాదులోను, పరిసరాలలోనుగల 5 మాధ్యమిక పాఠశాలల్లో ఉర్దు బోధనా భాషగావుంది. హైదరాబాదులోని 3 హైస్కూళ్ళలో ఉర్దు, తెలుగుకూడ బోధింప బడుతున్నాయి. ఒక హైస్కూలులో ఉర్దు, మరాఠీలు బోధనా భాషలు.

స్త్రీల కళాశాల, ఉస్మానియా యూనివర్శిటీలోని మరికొన్ని కళాశాలల్లో ఉర్దు, ఇంగ్లీషు బోధింప బడుతాయి. 'అంజుమానా తరక్కీ–ఉర్దు' వారు నిర్వహించే ఉర్దు ఆర్ట్సు కళాశాలలో ప్రాచ్య పరీక్షలకు తర్ఫీదు ఇవ్వబడుతుంది. ఈ కళాశాల ఇటీవల యూనివర్సిటీకి అనుబంధం చేయబడింది. అనేక సంస్థలలో ఉర్దు బోధనకు ఏర్పాట్లు వున్నాయి.

## ఉర్దూ లైబ్రరీ పఠన మందిరం

హైద్రాబాదులోని ఉర్దు లైబ్రరీ, పఠన మందిరం ప్రభుత్వ యాజమాన్యంతో నడుపబడుతోంది. విద్యాశాఖ అజమాయిషీలో ఒక సంఘం దీనిని నడుపుతుంది. ఇది మంచి పేరు, ప్రఖ్యాతులను గడించింది. దీనిని స్థాపించి, నిర్వహిస్తున్నందుకు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వాన్ని అభినందించాలి.

ఉర్దుభాష, సాహిత్యాన్ని వ్యాప్తి చేయడానికి అనేక సంస్థలు ప్రభుత్వ సహాయంతోను, వ్యక్తిగతంగాను కృషిచేస్తున్నాయి. మౌలానా అజాద్ పరిశోధనాసంస్థ, మజలీస్ అదబియత్-ఎ-ఉర్దు మొదలైనవి ఇందులో కొన్ని. అలాగే అరబిక్, పర్షియన్ భాషలలో ఉన్నత విద్యకు వసతులుగల పెద్ద ప్రైవేటు సంస్థలలో 'జామియా నిజామియా' పేర్కొనదగింది.

## జామియా నిజామియా

జామియా నిజామియా ముస్లిం మతపరమైన విద్యాలయం. భారత దేశంలో ముఖ్యంగా దక్షిణాదినగల ప్రఖ్యాతసంస్థలలో ఒకటి. దీనిని 1874 లో మౌల్వి అన్వరుల్లా ఖాన్ (ఫజిలత్‌జంగ్ నవాబు) స్థాపించారు. ఇస్లాం మతంలోని వివిధ అంశాలను బోధించేటందుకు ఇది ఉద్దేశింపబడింది. నిజాం, తరువాతి రాష్ట్ర ప్రభుత్వాల ఆదరణ, ఆర్థిక సహాయంవల్లనే జామియా అభివృద్ధి చెందిందని చెప్పాలి. సుమారు రు 4 లక్షల ఖర్చుతో ప్రభుత్వం నిర్మించిన భవనంలో జామియా నెలకొల్పబడింది. పోలీసుచర్య తరువాత ఈ సంస్థ ఆర్థిక ఇబ్బందులకు లోనైంది. ఐతే ప్రభుత్వం వెంటనే తగు సహాయం చేయడంవల్ల పరిస్థితి చక్కబడింది.

జామియా నిర్వహణబోర్డు కోరికపై నిజాం ఈ సంస్థను తిరిగి తన అధీనంలోనికి తీసికొన్నారు. నిర్వహణ సంఘం కూడ మార్చబడింది. నిజాం కార్యదర్శి శ్రీ మౌల్వి అబ్దుస్ సత్తార్ సాహిబ్ దీనికి అధ్యక్షులు. రాష్ట్ర ప్రభుత్వ ఆర్థికశాఖ కార్యదర్శి శ్రీ ఎం. ఎ అబ్బాసి ఉపాధ్యక్షులు.

బోధనావళిలో ఖురాను, తఫ్‌సీర్, హదిత్, ఇస్లమిక్ న్యాయశాస్త్రం, కలాం, అక్వీద్, అరబ్ సాహిత్యం, వేదాంతం, గణితం, భౌతిక శాస్త్రం, మొదలైన విషయాలుంటాయి. విషయాలన్నీ సున్నీ హసాఫి సిద్ధాంతాలకే పరిమితమై వుంటాయి. అవసరాన్నిబట్టి సున్నీలోని మిగిలిన

3 విధానాలను కూడ అనుమతించవచ్చు. క్రింది తరగతులలో ఉర్దు, పైతరగతులలో అరబిక్ బోధనా భాషలుగా వుంటాయి. అనుభవజ్ఞులైన ఉపాధ్యాయులు ఇందులో పని చేస్తున్నారు. హాస్టలులో వుండేవారికి తిండి, గృహవసతి ఉచితంగా ఇవ్వడం దీనిలో ప్రత్యేకత. బోధన, శిక్షణేగాక 'జామియా' ఇస్లామిక్ న్యాయ శాస్త్రంలో నిర్ణయాలను కూడ ఇస్తుంది. జామియాతోపాటు అరబిక్‌లో ఇస్లామిక్ అధ్యయనానికి కృషిచేసే మరో 2 సంస్థలున్నాయి. అందులో ఒకటి "ఇస్ హాత్-వుల్-ఉలూమ్." ఇస్లామిక్ మతం, వేదాంతాలపై కొన్ని అరబిక్ పుస్తకాలను ఈ సంస్థ ప్రచురించింది. రెండవది "ఇహయావ్ మా రి ఫా ల్ ను మ న్య." జామియా నిజామియాలో పనిచేసి రిటైరైన ఆచార్య మౌలానా అబుల్‌వాఫా దీనిలో పని చేస్తున్నారు. హనాఫి సిద్ధాంతంపై అరబిక్ వ్రాత ప్రతులను సేకరించి ఈ సంస్థ ప్రచురిస్తుంది.

ఇంతేగాక లతీఫియా అరబిక్ కళాశాల యిటీవల స్థాపింపబడింది. ఇందులో సాయంత్రపు తరగతులుంటాయి. అరబిక్‌లో ఓరియంటల్ టైటిల్ పరీక్షలకు ఇచ్చట తర్ఫీదు యివ్వబడుతుంది.

## దైరాతుల్-మా-అరిఫ్

అరబిక్ సంస్థలలో ప్రపంచ విఖ్యాతి గాంచినది దైరాతుల్-మా-అరిఫ్-ఉస్మానియా లేక ఉస్మానియా ప్రాచ్య ప్రచురణ విభాగం. ఈ సంస్థ ఆంధ్రప్రదేశ్‌కే గాక యావత్తు భారత దేశానికే కీర్తి తెచ్చింది. అరబిక్ ప్రచురణలలో పరిశోధనలు జరుపుతూ అంతర్జాతీయ ఖ్యాతి నార్జించింది. ఇప్పటికి ఈ సంస్థ 400 అరబ్ వ్రాతప్రతి సంపుటాలను ప్రచురించింది. వైద్యం, ఖగోళశాస్త్రం, చరిత్ర, భూగోళం, భాషాశాస్త్రం, సాహిత్యం మున్నగు 180 వివిధ విషయాలకు సంబంధించిన ప్రచురణలు ఇందులో వున్నాయి. ఈ ప్రచురణలు మౌలానా అబుల్ కలామ్ ఆజాద్, అరబిక్ పండితుల, ఐరోపావాసుల ప్రశంసలను పొందాయి. శిథిలదశలో అరబిక్ వ్రాతప్రతులను సేకరించి, ప్రచురించడం ద్వారా ఆసియా భాషల అభివృద్ధికి ఈ సంస్థ ఎంతో దోహదంచేసింది. భారతీయ చరిత్ర, సంస్కృతిపై అల్-బిరూని వ్రాసిన 'ఇతల్,' ఖగోళశాస్త్రంపై అల్-సూఫి వ్రాసిన 'సువరుల్‌కవాకిబ్' (చూ. పక్కనున్న చిత్రం) వైద్యశాస్త్రంపై అర్-రజీ వ్రాసిన 'అల్-హవిల్-కబీర్, మొదలైన కొన్ని ముఖ్య గ్రంథాలను 'దైరా' ప్రచురించింది దైరా గీత అరబ్ అనువాదాన్ని కూడ ప్రచురించింది. పిక్‌థాల్ ఖురాను అనువాదాన్ని అరబిక్‌తో పాటు ప్రచురించాలన్న ప్రతిపాదనకూడ వుంది. ఈ సందర్భంలో గవర్నమెంటు ప్రెస్‌లో వున్న పిక్‌థాల్ అనువాద విషయాన్ని ఇచ్చిన శ్రీ సంజీవరెడ్డిగారి ప్రభుత్వానికి కృతజ్ఞత తెలపాలి. ఈ సేకరణలో ఆర్థికశాఖ కార్యదర్శి శ్రీ అబ్బాసి-వాణిజ్య, పారిశ్రామిక శాఖ కార్యదర్శి ఉపకార్యదర్శులు ఎంతగానో తోడ్పడ్డారు. దైరా దేశంలోని సాహిత్యాభివృద్ధికే గాక, విదేశాలలో కూడ సంస్కృతిని పెంపొందించేటందుకు కృషి చేస్తోంది. ఉస్మానియా ప్రాచ్యప్రచురణ విభాగం విదేశ గ్రంథాలయాలు, వస్తుప్రదర్శన శాలలు, సాంస్కృతిక సంఘాలు, ఈజిప్టులోని అయూర్ యూనివర్శిటీ, డెమాస్కస్‌లోని 'అకాడమిక్ అరబె' మొదలైన వాటితో సంబంధాలను నెలకొల్పింది. అరబిక్ 'తక్ఫాతుల్-హింద్' 'ఇండో-ఆసియన్ జర్నల్,' 'ఇసామిక్ కల్చర్' మొదలైన ప్రముఖ పత్రికలు దైరా




† పేద్వఘూశ్వం - (పెగసస్ - PEGASUS) ["సువరుల్ కవాకిబ్" అనే ఖగోళశాస్త్ర విషయిక గ్రంథంలో చిత్రం]

†పూర్వప్రోష్ఠపద – ఉత్తర ప్రోష్ఠపదలుగా తొలుత వ్యవహరింపబడిన పూర్వాభాద్ర – ఉత్తరాభాద్ర నక్షత్రాలను వాటికి సంబంధించిన యితర నక్షత్రాలతో కలిపి "పేద్వఘూశ్వ" మని ఋగ్వేద ఋషులు పేర్కొన్నారు. ఈ "పేద్వఘూశ్వ" శబ్దమే ఇంగ్లీషులో పెగాసస్ — PEGASUS గా పరిణామంచెందింది. అయితే "యదక్రందః ప్రథమం జాయమానఽ ఉద్యన్త్సముద్రాదుత వాపురీషాత్, శ్యేనస్య పక్షాహరిణస్యబాహూఽ ఉపస్తుత్యం మహిజాతంతేఽ అర్వన్"–(ఋగ్వేదం. ప్ర. మం. 163 సూ. 1 ఋక్కు.) అని డేగ రెక్కలవంటి రెక్కలు లేడి కాళ్ళవంటి కాళ్ళు ఉన్న అశ్వంవలే వుంటుందని "పేద్వఘూశ్వ" ఖగోళ చిత్రరూపాన్ని వేదఋషులు భిన్నంగా వర్ణించారు. అతి ప్రాచీనమైన వేదఋషుల "పేద్వఘూశ్వ" రూప చిత్రణకు, – అల్ – సూఫి యిచ్చిన చిత్రానికి రెక్కల సంబంధమైన భిన్నత్వం వున్నది — ఎడిటర్ (తెలుగు)

కృషిని ప్రశంశించడమే గాక, ప్రచురణలను **ఎంతగానో** పొగడాయి. దైరా ప్రచురణలు అరబ్ దేశాలనుండి ఎంత ఆదరణ పొందా యంటే వాటికోసం అధికసంఖ్యలో కోరడమే గాక దైరా కృషితో సహకరించేటందుకు కొంత మంది పండితులను పంపేటందుకు ఐక్య అరబ్ దేశం భారతదేశంతో సంప్రదింపులు జరుపుతోంది.

మరుగు పడిన ఈ ప్రాక్ దేశపు సాహితీ సంపదను వెదకి, సమీకరించి, ప్రచురించడం అంత సులభమైన పనికాదు. దీని కెంతో కృషి, ఆర్థిక సహాయం కావలసివుంది. ఇందుకు కావలసిన ఆధునిక పరికరాలన్నీ సమకూర్చ బడ్డాయి. వ్రాతప్రతి తేవడానికి వీలులేనిచోట మైక్రోఫిల్ములు, ఫోటోస్టాట్ కాపీలు తీస్తారు. ఇలాంటి వాటిని దైరా ఫ్రాన్సు, ఇంగ్లండు, స్పెయిను, జర్మనీ, ఇటలీ, టర్కీ, రష్యా, ఇరాన్, ఇరాక్, సిరియా, సౌదీ అరేబియా మున్నగు దేశాల లోని గ్రంథాలయాలనుండి సేకరించింది. అలాగే అవసరమైన దేశాలకు ఇలాంటి కాపీలను అందజేసింది. ప్రతులను, పుస్తకాలను నిల్వచేసే ఆధునిక వసతులన్నీ దైరాలో వున్నాయి. వ్రాతప్రతులను, పుస్తకాలను ఆంగ్ల, అరబిక్ భాషలలో ప్రచురించే టందుకు కావలసిన అధునాతన ముద్రణాలయం వుంది. ఇటీవలినుండి 'ఇస్లామిక్ కల్చర్'అనే త్రైమాసిక జర్నల్ కూడ ఇక్కడే ముద్రింప బడుతోంది. ఈ కృషి రాష్ట్ర ప్రభుత్వం, భారత ప్రభుత్వ శాస్త్రీయ పరిశోధన, సాంస్కృతిక విషయాల శాఖ వారి సహాయ, సహకారంవల్లనే సాధ్యమౌతోంది. దైరా ఎలా పురోభివృద్ధి చెందిందో ఈ క్రింది చరిత్రవల్ల తెలుస్తుంది.

## దైరాతుల్-మా-అరిఫ్ చరిత్ర

1888 లో నవాబు ఇమాదుల్ ముల్క్ నాయకత్వాన కొంతమంది పండితులు దీనిని స్థాపించారు. 7-15 శతాబ్దాలలోని మతం, శాస్త్రం, కళలు మున్నగు రంగాలలో అరబ్ లోని ప్రముఖ గ్రంథాలను సేకరించి-ప్రచురించడం దీని లక్ష్యం. ఐతే ఇలాంటి సంస్థ ఒంటరిగా పనిచేయడం కష్టం. కొద్దికాలానికి దీని స్థాపకులు ఆర్థిక సహాయం పొందవలసివచ్చింది. నిజాం వంశీయులు, ముఖ్యంగా ఇప్పటి నిజాం దైరాకు ఆది నుండి ఎంతో ఆర్థిక సహాయం చేశారు. 1944 దైరా ఉస్మానియా విశ్వవిద్యాలయానికి అనుబంధం చేయబడి, అభివృద్ధికి అనుగుణంగా నియమావళి రూపొందించబడింది.

హైదరాబాదు రాష్ట్రం భారత యూనియన్‌లో విలీనమైనప్పటినుండీ అలాగే కొనసాగుతూ స్వర్గీయ మౌలానా అబుల్ కలామ్ అజాద్, ప్రొఫెసర్ హుమాయూన్ కబీర్ మున్నగు ప్రముఖుల ఆదరాభిమానాలతో పెంపొందుతూ వచ్చింది. సవరింపబడిన నియమావళి ననుసరించి ఈ సంస్థ క్రింది రెండు సంఘాల యాజమాన్యాన పనిచేస్తుంది.

## కార్యనిర్వాహక వర్గం

1. డా. నీలం సంజీవరెడ్డి, ఆంధ్ర ప్రదేశ్ ముఖ్యమంత్రి-అధ్యక్షులు; 2. డా. డి. యస్. రెడ్డి, వైస్ ఛాన్సలర్, ఉస్మానియా యూనివర్సిటీ-ఉపాధ్యక్షులు; 3. శ్రీ మహమ్మద్ అలీ అబ్బాసి, రాష్ట్ర ఆర్థికశాఖ కార్యదర్శి-సభ్యులు; 4. శ్రీ యల్. యన్. గుప్త, విద్యాశాఖ కార్యదర్శి-సభ్యులు; 5. డా. మొహమ్మద్ అబ్దుల్ మూయీద్ ఖాన్ - కార్యదర్శి.

## సాహిత్య సంఘం

1. డా. డి. యస్. రెడ్డి, వైస్ ఛాన్సలర్, ఉస్మానియా యూనివర్సిటీ-అధ్యక్షులు; 2. Prof. క్వారి ఖ్వాజా కుతుబుద్దీన్, అరబిక్ రిటైర్డు ప్రొఫెసరు-సభ్యులు; 3. డా. క్వారి కలిముల్లా, రిటైర్డు ప్రొఫెసరు ఆఫ్ పర్షియన్, ఉస్మానియా యూనివర్సిటీ-సభ్యులు; 4. శ్రీ సయ్యద్ నాబి, రిటైర్డు రీడరు-సభ్యులు; 5. డా. అబుల్ ఫజల్, రీడర్ అరబిక్ శాఖ, ఉ. వి. సభ్యులు; 6. డా॥ మొహమ్మద్ అబ్దుల్ మూయీద్ ఖాన్, డైరెక్టర్, దైరాతుల్ — మా — అరిఫ్ — కార్యదర్శి.

ఆంధ్రప్రదేశ్ ఏర్పడి ముఖ్యమంత్రి శ్రీ సంజీవరెడ్డి కార్యనిర్వాహక వర్గానికి అధ్యక్షులయ్యాక ఎంతో అభివృద్ధి సాధింప బడింది. డా. డి. యస్. రెడ్డిగారు యూనివర్సిటీకి వైస్-ఛాన్సలరై కార్యనిర్వాహక వర్గానికి ఉపాధ్యక్షులు గావడంతో ఈ ప్రగతి మరింత ఇనుమడించింది. ఆర్థికంగా సంస్థ బలపడటమే గాక అనేక కార్యక్రమాలు విస్తృతం చేయబడ్డాయి. అన్నిటికన్న పేర్కొనదగింది రెండు లక్షల ఖరీదుగల భవనం దైరాకు నిర్మింపబడింది. ఆంధ్ర ప్రదేశ్ తొలి ముఖ్యమంత్రిగా శ్రీ సంజీవ రెడ్డిగారు చూపిన శ్రద్ధాశక్తులవల్ల, డా. డి. యస్. రెడ్డిగారి ప్రోత్సాహంవల్లనే ఈ పని సాధ్యమైంది. ఈ భవన నిర్మాణంలో శాస్త్రీయ పరిశోధన-సాంస్కృతిక వ్యవహారాల మంత్రిత్వ శాఖ, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, నిజాం ధర్మకర్తృత్వ సంస్థ ఆర్థికంగా తోడ్పడ్డాయి.

దైరా కొత్త భవనంలోనికి ఈ సంవత్సరారంభంలో మార్చ బడింది. ఐతే భవనం సరిపోలేదు. కొత్తగా కావలసిన భవన నిర్మాణానికి సాయపడ వలసిందిగా పై మూడు సంస్థలు కోరబడ్డాయి.

దైరాకు కొంత ఆదాయం వున్నప్పటికీ, భారత ప్రభుత్వం, రాష్ట్ర ప్రభుత్వం, ఉస్మానియా యూనివర్సిటీ యిచ్చే వార్షిక గ్రాంటులపైనే ఆధారపడివుంది. ఈ గ్రాంటు పెరుగుతున్న కార్యకలాపాలదృష్ట్యా అధికం కావలసివుంది.

విలువయిన వ్రాత ప్రతులను అరబిక్‌లోనే గాక, వాటి సంగ్రహ అనువాదాలను ఇంగ్లీషు, ఇతర భారతీయ భాషలలోను ప్రచురించాలని అనేక మంది అభిప్రాయం. ఇందుకు అదనంగా సిబ్బంది, ధనం కావాలి. దైరా కార్య నిర్వాహక వర్గం ఈ విషయాన్ని పరిశీలిస్తోంది. దైరాతుల్—మా—అరిఫ్ కార్య కలాపాలను విస్తృతం చేసే టందుకు సాధ్యమైన ప్రయత్నమంతా జరుగుతోంది.



# ఏలేశ్వరం త్రవ్వకాలు

మొహమ్మద్ అబ్దుల్ వహీద్ ఖాన్

† గత వ్యాసంలో ఏలేశ్వరం త్రవ్వకాలలో వెలువడిన క్రీ. పూ. 2, 3 శతాబ్దాలనాటి పురాతత్వ వస్తువులను గురించి వ్రాశాను. చారిత్రక, మధ్యయుగంనాటి నిర్మాణపు పనులను గురించీ, ఈ కాలంలో వివిధ స్థాయిలలో వెలువడిన ఇతర వస్తు పరికరాలకు గురించీ ఇప్పుడు ప్రస్తావిస్తున్నాను.

## రెండవ యుగం

ఈ యుగంలో అనేక కట్టడాలు వుండినట్లు చాలా నిదర్శనాలు వున్నాయి. కృష్ణానదివరకు మెట్లతో కట్టిన స్నానఘట్టం ఒకటి బయటపడింది. మెట్లు నల్ల కడప రాళ్ళతో కట్టబడినాయి. ఒక్కొక్క మెట్టు వెడల్పు 1½ అడుగులు. ఈ స్నానఘట్టం నిర్మించబడిన కాలానికి చెందిన ఒక పెద్ద మండపం వుంది. దీని నిర్మాణానికి సున్నపు రాళ్ళు వుపయోగించబడ్డాయి. అవి ఇప్పటికీ చెక్కుచెదరకుండా వున్నాయి. మండపం పొడవు 500 అడుగులు, వెడల్పు 125 అడుగులు. నాగార్జునకొండ, శాలిహుండం, జగ్గయ్యపేట మొదలగు చోట్లలో వున్న శంఖ లిపిని పోలిన అక్షరాలు ఇనుప స్తంభాలపైన చెక్కబడివున్నాయి. అయితే అవి ఇప్పుడు సమసిపోయి వున్నాయి. నదీతీరం ప్రక్కన పదిమంది కలిసి సమావేశమవడానికి ఈ మండపం వుపయోగించబడి వుండవచ్చు. ఇది ప్రార్థనాస్థలమైనా కానీ లేక ఆచార్యులు వుపన్యాసాలు ఇచ్చే స్థలమైనాకానీ అయి వుండవచ్చు. ఇక్కడ లభించిన తొండము చెంబునుపోలిన ఎర్ర మట్టి వస్తు పరికరాలనుబట్టి, ఇవి రెండవ యుగానికి చెంది యుండవచ్చునని ఊహించవచ్చు. ఇలాంటి వస్తువులే పశ్చిమ భారతంలోను, మధ్యభారత ప్రాంతంలోను విరివిగా లభించాయి. ఈ తొండముచెంబు తునకలకూ, బర్మాలో లభించిన రంగెమహల్, కెత్తామెమ్యో పాత్రలకూ దగ్గరి పోలికలున్నాయి. ఒక దేశానికీ, మరొక దేశానికీ మధ్య సాంస్కృతిక సంబంధాలున్నట్లు ఈరకం వస్తువులవల్ల రూఢి అవుతున్నది.

ఇదే కాలానికి చెందిన పూసలు, శాతవాహన నాణెములు, పెర్రకోట బొమ్మలు, గాజుతో తయారైన నీలివర్ణపు చేతిగాజులు, శంకువుతో తయారైన వస్తువులు, మొదలగు అనేక వస్తువులు దొరికినాయి. పెర్రకోట బొమ్మలు కేవలం మతానికి చెందినవీ, అలంకరణకు చెందినవీ మాత్రమేకాక, మనుష్యులు, జంతువులు మొదలగు రూపాలలోకూడా వున్నాయి. ఇక్కడ లభించిన స్త్రీమూర్తులు చాలా వరకు భగవన్మాతల ప్రతిమలని చెప్పవచ్చు. క్రీ. శ. మొదటి శతాబ్దంలో రోమను దేశంతో సంబంధాలు వుండి నందువల్ల, భారత దేశంలో ఇవి వ్యాప్తిలోకి వచ్చినట్లు తెలుస్తున్నది. మనుష్య ఆకారంలోవున్న పెర్రకోట బొమ్మలు అండాకారంలో వున్నాయి. ఈ స్థలంలో లభించిన శాతవాహన పెర్రకోట బొమ్మలు, కొండాపూరు, నాగార్జున కొండలలో లభించిన బొమ్మలు చతురస్రాకారంలో వున్నాయి. బొమ్మలలో రోమన్ పోలికలు వున్నందున ఇవి క్రీ. శ. మొదటి శతాబ్దానికి చెందినవని నిస్సందేహంగా చెప్పవచ్చు. ఈ బొమ్మల ముఖకవళికలల్లో ప్రశాంతత, మానసిక శాంతి ప్రస్ఫుటం చేయడంలో కళాకారులు తమ నైపుణ్యాన్ని ప్రదర్శించారు. అంతర్గతమైన ఆనందంలో పెదవులపైన చిరునవ్వుకూడా గోచరిస్తుంది. ఈ బొమ్మలలో లభించిన వాటిల్లో గ్రీసు-రోమన్ ఆరాధ్య దైవమైన ఒక నగ్న దేవతవుంది. ఇలాంటి ప్రతిమలు పెల్, కొండాపూరు, నాగార్జునకొండ మున్నగు చోట్లలోకూడా దొరికాయి. ఇవి క్రైస్తవ మతారంభకాలంనాటివి. ఆకాలంలో భారతదేశానికి మధ్యధరాసముద్ర దేశాలకూ మధ్య హెచ్చుగా వాణిజ్య వ్యాపార సంబంధాలు వుండినాయి.

గాజుతో తయారైనచేతి గాజులను గూర్చి

† "ఆంధ్రప్రదేశ్" 1962 నవంబరు సంచిక.

ఒకమాట. శతపథ బ్రాహ్మణుల కాలంనుంచీ భారత దేశంలో గాజు వస్తువులు వాడుకలో వున్నాయని నిదర్శనాలు వున్నాయి. హస్తినాపురం, ఆలంగీర్‌పూర్‌లలో దొరికిన పురాతత్వ వస్తువులనుబట్టి, ఇవి క్రీ. పూ. మొదటి శతాబ్దానికి చెందినాయని తెలుస్తున్నది. శ్రీ యస్. బి. దేవ్ చెప్పినట్లుగా భారతీయ కళాకారులు గాజును అనేక రీతులలో వుపయోగించారు. రోమన్ గాజు భారతదేశంలో ప్రవేశింప బడిందని చెప్పబడుతున్న కాలంలో భారతీయ గాజు పరిశ్రమను గురించి శ్రీ ప్లీనీ చాలా గొప్పగా కొనియాడారు. భారతీయ గాజు శ్రేష్ఠముగా వుండడానికి స్ఫటికములు వుపయోగించడమే కారణమని ఆయన అభిప్రాయం. ఈ అభిప్రాయాన్ని ఆధారంగా తీసుకొని, భారతదేశంలో శ్రేష్ఠమైన గాజు తయారు కావడానికి రోమన్ ప్రభావమే కారణమన్న వాదనను పునః పరిశీలించవలసి వున్నదని శ్రీ యస్. బి. దేవ్ చెబుతున్నారు. ఇది ఇక్ష్వాకుల పూర్వీకుల కాలం నాటికి చెందినది. అంటే క్రీ. శ. మొదటి రెండవ శతాబ్దాలన్నమాట.

## మూడవ యుగం

ఈ యుగంలో బౌద్ధుల ప్రభావం యెక్కువగా వుంది. చైత్యస్తూపాలను, మందిరాలను బట్టి ఇది రుజువు అవుతున్నది. ముఖ్యస్థానాల్లో రెండు స్తూపాలున్నాయి. ఒకదానికి ఆయక వేదిక వుంది. ఇక్కడ లభించిన స్తూపానికీ, నాగార్జున కొండలో లభించిన వాటికీ యెక్కడా పోలికలు లేవు. నిర్మాణంలో చక్రం లేదు. చక్రంలోని కడ్డీలు, మధ్యభాగం అసలే కనిపించవు. ఊర్ధ్వరేఖా సమన్వితమైన చైత్య మందిరం బౌద్ధమతాన్ని సూచించడం అనుమానాస్పదమని కొంతమంది పండితుల అభిప్రాయం. ఈ పద్ధతి ప్రకారమే కొన్ని హైందవ దేవాలయాలు వుండడం క్రొత్త విషయమేమీ కాదు. ఉదాహరణకు చేజెర్లలోని కపోతీశ్వర దేవాలయం, నాగార్జున కొండ వద్దవున్న పుష్ప భద్రస్వామి దేవాలయం, తీసుకోండి. ఈ రకపు దేవాలయ శిల్ప నిర్మాణాన్ని గజ పుష్పాకారం అని అంటారు. వెనుకవైపులోవున్న భాగం ఏనుగ వీపును పోలివుంటుంది గనుక దీనికి ఈ పేరు వచ్చింది. ఇక్కడ వున్న రెండుస్తూపాలు సర్వతోభద్ర నమూనాపైన కట్టబడిన శివాలయానికి చెందాయని ఈ పండితుల అభిప్రాయం. ఈ స్తూపాలు శైవమతానికి చెందినట్లయితే వాటిపైన మరొకస్తూపం నిర్మించవలసిన అవసరం లేదని నా వాదన.

అసలు విషయమేమంటే, ఇవి బౌద్ధ స్తూపాలేనని, ఇవి శిథిలమైన తరువాత కొంత కాలానికి ఆ ప్రాంతంలో శైవ మతావలంబకులైన సన్యాసులు లింగ స్వరూపుడైన భగవంతుని ఆరాధించడానికి దేవాలయాలు నిర్మించారు. ఇందులో అపచారమేమీలేదు. ఎందుకంటే ఏ రూపంలోనైనా భగవంతుని ప్రార్థించి నప్పటికీ, ఆ స్థలంయొక్క గొప్పతనం, పవిత్రత అలాగే వుంటాయి. ఈ కాలంలోని కట్టడాలకు బట్టీలలో కాల్చిన ఇటుకలు ఉపయోగించబడ్డాయి. ఒక్కొక్క ఇటుక పొడవు 20 నుంచి 21 అంగుళాల వరకు వుంటుంది, ఇదే కాలంలో దేవాలయానికి ఉత్తర భాగంలో ప్రాకారపుగోడ నిర్మించబడింది. ఇందులోని 28 దళలు ఇప్పుడు లేవు. ప్రాక్పశ్చిమ ముఖంగావున్న ఈ గోడ 40 నుంచి 45 అడుగుల వరకు కృష్ణానది వరదల మూలకంగా కొట్టుకొనిపోయి వుండవచ్చు. కొంతకాలం తరువాత గోడ దెబ్బ తిన్న తరువాత అదే స్థానంలో అదే ప్రకారం మరొకగోడ నిర్మించబడింది. ప్రాకారపు గోడలో ఒక చిన్న తూమువుంది. ఇందులో ఒక కొయ్యతలుపును అమర్చారు. నీటిని బయటికి త్రోలడానికై ఈ తూము వుపయోగపడి వుండవచ్చు. ఇక్కడ దిగువ భాగంలో ఈ గోడలో ఒక ద్వారం వుంది. లోపలికి రావడానికీ బయటికి పోవడానికీ ఇరువైపులా రెండుదార్లు వున్నాయి. బహుశా ఇవి కాపలా గదులై వుండవచ్చు. ఉత్తర దిశనుంచి వున్న మెట్లు ఇటుకలతో కట్టబడినాయి. వాటిపైన రాతిబండలు పరచబడి వున్నాయి. ఈ యుగానికి చెందిన కాలంలో పారిశుద్ధ్యపు ఏర్పాట్లు చక్కగా వుండినట్లు అనేక నిదర్శనాలవల్ల తెలుస్తున్నది. మూసివున్న మురుగు కాలువలు, స్నానాల గదులు, గుంటలు గల కక్కసులు వున్నాయి.

ఈ కాలంలో పట్టణం ఒక ప్లాను ప్రకారం నిర్మించబడి వుండడం గమనార్హమైన విషయం. ఆ తరువాత ఈ పద్ధతి పూర్తిగా అంతరించింది. ఇండ్లు ఒక క్రమంలో లేవు. చిందర వందరగా మురుగు కాలువలు నిర్మించబడ్డాయి. ఎరుపు, నలుపు వర్ణములలో పాత్రలు, తేలికైన ఎరుపు రంగు పాత్రలపైన రావి ఆకులు, చేపలు మొదలగు చిత్రాలు వుండడాన్ని బట్టి ఆ కాలపు సాంస్కృతిక పరిస్థితిని తెలుసుకోవచ్చు. నాగార్జున కొండ, శిశుపాల్‌ఘర్ మున్నగు చారిత్రక స్థలాలలో కనిపించిన కుండలకూ వీటికి సన్నిహితమైన పోలికలు వున్నాయి. ఇక్కడ కాళ్ళువున్న గిన్నెలు, తొర్రతో కూడిన పిడిగల మూకుళ్ళు, మొనదేలిన గిండి చెంబు లభించాయి. మహేశ్వర, నేదాటోలి, హరప్పా, మొహంజదారో మున్నగు చోట్లలో లభించిన కుండపాత్రలు కూడా ఆకారంలో కొద్దిగా భిన్నంగా వున్నా మొత్తం మీద ఇదే విధంగా వున్నాయి. ఇదేచోట బూడిద రంగుగల రెండు కుండల

తునకలు కనిపించాయి. కొటోడేగి, నివాసాలలో కూడా ఇదే రకం వస్తువులు లభించాయి. ఏలేశ్వరానికీ హరప్పాకు సంబంధాలున్నాయనేది సందేహాస్పదమైన విషయమైనప్పటికీ వస్తువుల రకాలు, డిజైనులు సంబంధించినంత వరకూ ఒకే సంప్రదాయం వుండడం గమనార్హమైన విషయం. ఈ తరహా కుండలు చేసినవారు హరప్పా నుంచి ఏలేశ్వరానికి తరలి వచ్చారని సూచించడం సాహసమే అవుతుంది. సింధులోయ నాగరికత దక్షిణం నుంచి పశ్చిమ తీరం, సౌరాష్ట్ర, సింధు, పంజాబు ప్రాంతాలకు వ్యాపించిందనీ, అక్కడినుంచి క్రీట్, మధ్యధరాసముద్ర దేశాలవరకు గల పశ్చిమ ఆసియా అంతటా వ్యాపించిందని ఫాదర్ హెరాస్ అభిప్రాయం. ఈయన అభిప్రాయం సరియైనది కావచ్చునని తోస్తున్నది. అయితే, దక్షిణ దేశంలో ఈ నాగరికత అవతరించి క్రమేణా ఉత్తర దిశకు వ్యాపించిందని నిరూపించాలంటే, దక్షిణ భారతంలో అంతకు పూర్వం వున్న సంస్కృతికీ, సింధు నాగరికతకూ సన్నిహిత సంబంధం వుండినట్లు ఆధారాలు లభించాలని డా. శంకాలియా అభిప్రాయం. శుంగులు వచ్చాక అచ్చులలో ఎర్రకోట బొమ్మలు తయారు చేయడం వాడుకలోకి వచ్చింది. సాగదీసిన పూసలు, గీతలు గీచిన పూసలు, కురువింద గింజలు, చెక్కని పూసలు చాలా ముఖ్యమైనవి. సాగదీసిన పూసలు, గీతలు గీచిన పూసలు, చంద్రవల్లి, శిశుపాల్ ఘర్, కౌశాంబి, బోస్‌నగర్, అరికమేడు ప్రాంతాలలో లభించాయి. శాతవాహనుల కాలంలో భారతదేశమంతటా ఈ రకం పూసలు విరివిగా ప్రచారంలో వుండినాయి. సాగదీసిన పూసలకంటే, గీతలుగల పూసలు ముందు కాలానికి చెందినవని డా॥ వీలర్ అభిప్రాయం. ఈ కాలం లోనే కురువింద గింజలు చెక్కడం వుపయోగంలోకి వచ్చింది. పైభాగాన్నంతా తెల్లగా చెక్కి వేసి వాటిపైన నల్లగీతలు చెక్కడం జరిగేది. ఈ పద్ధతి మొహంజదారోవద్ద లభించిన సమకాలీన ఇండో-సమరిన్ పూసలలో ద్యోతకమవుతుంది. ఈజిప్టులో ఈ పద్ధతి అసలే లేదు. అయితే క్రిమియా, రష్యాలోని కొన్ని చోట్లలో ఇది అవలంబించబడింది. నాణెములు, ఇతర పురాతత్వ వస్తువులను బట్టి, ఈ మూడవ యుగం ఆంధ్రదేశంలో ఇక్ష్వాకుల కాలానికి అంటే క్రీ. శ. మూడవశతాబ్దారంభానికి చెందినదని చెప్పవచ్చు. వీరి రాజధాని విజయపురి. ఇది నాగార్జునకొండ లోయలో వున్నది. రెండవ, మూడవ యుగాలలో రోమన్ దేశస్థులతో సంబంధాలుండేవి. సముద్ర మార్గాన వాణిజ్యాలు వుండేవి. ఎర్రకోట బొమ్మలకు అచ్చుల సహాయంతో పోత పోసేవారు. రెండవ శతాబ్దిలో రోమన్ సామ్రాజ్యాన్ని పరిపాలించిన ప్రఖ్యాత ఆగస్టస్, సెప్టికస్, సెర్వియస్ బొమ్మగల బంగారు నాణెము ఆధారంతో తయారైన అచ్చులతో కూడా బొమ్మలు తయారయ్యేవి.

ఈ కాలంలో ప్రజా జీవితం చాలా సుఖవంతంగా వుండేదని చెప్పవచ్చు. అయితే దురదృష్టవశాత్తు, కృష్ణానది వరదల మూలకంగా ఆస్తిపాస్తులకు విపరీతనష్టం వాటిల్లింది. మట్టికొట్టుకొని దట్టంగా ఈ చోట పేరుకొని పోయింది. ఇక్కడ వరదల వరవడివల్ల నష్టం కలిగినట్లుగా అనేక చిహ్నాలున్నాయి.

## నాల్గవ యుగం

ఇక్కడ పై పొరక్రింద మాధవస్వామి దేవాలయపు స్థూపం 4½ అడుగుల లోతులో కనుగొనబడింది. (చూ. అనుబంధం కవరు 2 వ పేజీ) దీనిని బహుశా మాచెర్లకు చెందిన హైహయులు కానీ విజయనగరరాజు కానీ కట్టించి వుండవచ్చు. ఇందులో రెండు దశలు స్పష్టంగా కనిపిస్తాయి. ఈ స్తూపం క్రింద మరొక స్తూపం వున్న చిహ్నాలున్నాయి. దాని సమీపంలో విష్ణుకుండినుల వంశానికి చెందిన 49 నాణెములుగల ఒక చిన్న కుండ కనపడింది. దానికి ఒక వైపు సింహంబొమ్మ మరొక వైపు వ్రేలాడుతున్న రెండు దీపముల బొమ్మలు కనిపించాయి. పల్లవుల తరువాత విష్ణుకుండినులు రాజ్యమేలినారని దీనివల్ల స్పష్టంగా తెలుస్తున్నది. ఈ స్తూపము క్రీ. శ. 4 లేక 5 వ శతాబ్దానికి చెందినదని చెప్పవచ్చు. తూర్పు చాళుక్యులు, తరువాతి చాళుక్యులు, కాకతీయులు ఈ ప్రాంతాన్ని ఒకరి తరువాత ఒకరు క్రీ.శ.11 వ శతాబ్దం వరకు పరిపాలించారు. ఈ యుగంలో, అంటే క్రీ.శ.సుమారు 4వ శతాబ్దం వరకు తేలికైన ఎరుపురంగు వస్తువులు తయారయ్యేవి. అయితే ఈ వస్తు పరికరాలు చేయడానికి ప్రధానంగా బూడిదరంగు బహుళ ప్రచారంలో వుండేది. శిరస్సు, పాదములు విరిగిపోయిన విష్ణు విగ్రహం ఒకటి కనిపించింది. దీని ఆకృతి చూడముచ్చటగా వుంది. దక్షిణ హస్తములో దండము, వామ హస్తములో శంకువు ధరించిన విష్ణువిగ్రహమిది. ఇది క్రీ.శ. 4 లేక 5వ శతాబ్దానికి చెందినదని చెప్పవచ్చు. అమరావతీ శిల్పములకూ, దీనికీ దగ్గర పోలికలున్నాయి. ఇది ఆది పల్లవుల కాలానికి చెంది వుంటుంది. వీరి శాసనాలన్నీ ప్రాకృత భాషలో వుండేవి. వీరి రాజ్యము కృష్ణానదిలోయ వరకు వ్యాపించిందని చెప్పడంలో ఆశ్చర్యమేమీలేదు. ఏలేశ్వరం కూడా ఇందులోనే చేరింది.

## ఐదవ యుగం

68 అడుగుల పొడవు 45 అడుగుల వెడల్పుగల ఏలేశ్వరం దేవాలయానికి ప్రక్కన వివిధ రీతులతో కట్టబడిన అనేక ఇతర దేవాలయాలున్నాయి. ఈ దేవాలయాలలోపల కొన్నిటిలో యోనిలో బాణ లింగాలు ప్రతిష్ఠాపించబడి వున్నాయి. మరి కొన్నిటిలో యోనిలేకుండానే లింగాలు ప్రతిష్ఠాపించబడి వున్నాయి. మ్రొక్కులు చెల్లించడానికిగాను ఇవి ఉద్దేశించినట్లు తెలుస్తున్నది. వీటికి ముఖ్యద్వారాలు పశ్చిమదిశన వున్నాయి. మెట్లకు ముందు చంద్రశిల వుంది. ఆ కాలంలో భక్తులు మ్రొక్కుబడి చెల్లిస్తు శివలింగాలను ప్రతిష్ఠచేసే ఆచారం వుండి వుండవచ్చని పురాతత్వ శాఖ మాజీ డైరెక్టరు శ్రీ యన్. రమేశన్‌గారి అభిప్రాయం. ఇది ''ఎలవాలుక లింగేన నష్టంమే తామ్ర భజనం'' అనే ప్రఖ్యాత హితోపదేశ సూక్తిని స్ఫురింప జేస్తున్నదని ఆయన చెబుతున్నారు. ఈ సందర్భంలో ముచ్చటైన చిన్నకథ ఒకటి చెప్పాల్సివుంది. ఒక బ్రాహ్మణుడు ఒక రాగి కుండను, ఇసుకతో శివలింగాకారము పోలిన దిబ్బను తయారుచేసి దానిక్రింద పూడ్చిపెట్టాడు. అతను స్నానం చేసిన తరువాత వచ్చి అక్కడ చూశాడు. ఈలోగా వాన్ని చూసిన ప్రజలు, ఆ విధంగా శివలింగాల్ని తయారు చేయడం ప్రతిభా విశేషమైన పని యని భావించి ఇసుకతో అనేక లింగాలను తయారు చేశారు. అందులో తానుపూడ్చి పెట్టిన కుండ ఏదో ఆ పేద బ్రాహ్మణుడు గుర్తుపట్టుకోలేక పోయాడట. ఈ కాలంలో తయారైన కుండలకు ఎక్కువగా బూడిద రంగు వుపయోగించ బడేది. ఇనుప వస్తువులు, గాజువస్తువులు, కౌచిప్పలతో గాజులు, పూసలు, టెర్రకోట బొమ్మలు మొదలైనవి కూడా తయారు చేయబడేవి. ఇవి 9 లేక 10వ శతాబ్దంనాటివని చెప్పవచ్చు. ఏలేశ్వరం దేవాలయం 10వ శతాబ్దం అంతంలోనో లేక 11వ శతాబ్ద ఆరంభంలోనో, తొలికాకతీయ రాజుల కాలంలో నిర్మించబడి వుండవచ్చు. చుట్టూ దశావతారాలు గల విష్ణు విగ్రహం ఒకటి, ఈ కాలానికి చెందినది దొరికింది. ఇందులో మయూరభంజ్ లక్షణాలు కొన్ని వున్నాయి. ఇది ఒరిస్సాకళ భంజ్‌లు దానిని పోషించారు. కిచ్చింగ్ మ్యూజియంలో ఇలాంటివి చాలా వున్నాయి. నారాయణుడు, మత్స్య, కూర్మ, వరాహ, నారసింహ, వామన రామావతారాలలో వ్యక్తం అవుతున్నదని భావించి కళాకారుడు ఈ రూపాలలో విగ్రహాల్ని మలిచాడు. విష్ణు విగ్రహానికి చతుర్భుజాలున్నాయి. దక్షిణ హస్తములో చక్రము, వామ హస్తములో శంఖము వున్నాయి. మిగిలిన హస్తాలలో ఒకటి వరద ముద్రాంకితమైనవి. రెండవ హస్తములో గదాధరుడై వుంటాడు. ఈ కాలానికి చెందినవి బంగారు పూసలు, బంగారు నాణెములు, యాదవులకు చెందిన పద్మ టంకలు, ఒకచిన్న కిరీటం, సువర్ణపుష్పాలు వృషభ ముద్రలు మొదలగునవి కనిపించాయి. హిమాలయ పర్వత రాజ్యాలలో ముఖ్యంగా లధక్ ప్రాంతంలో నగలపైన బొమ్మలు ముద్రించే సాంప్రదాయం వుండి వుండటం గమనార్హమైన విషయం. ఆ కాలంలో ఏలేశ్వరంలో నివసించిన వారికి ఇనుము తయారు చేయడం తెలుసు. అందుకు, ఇక్కడ వివిధ దేశాలలో లభించిన ఇనుప వస్తువులే సాక్ష్యాధారాలు. దేవాలయానికి ఉత్తర దిశన నివాస స్థలానికి ఉత్తర దిశన ఒక ఫర్లాంగు దూరంలో ఇనుము కరగించే కర్మాగార స్థలం కనుగొన బడింది. ఇక్కడ వర్తులాకారంలో వున్న రెండు మట్టిబొయ్యిలు కనిపించాయి. గాలి కొటడానికి వీలుగా వీటికి ఒకవైపు రంధ్రం ఒకటి వుంది. ఈ కాలంలో లోహ పరిశ్రమ బాగా అభివృద్ధి చెందినదని చెప్పడానికి ఇది నిదర్శనం. లోహాన్ని కరిగించడానికి సున్నం వుపయోగించ బడేది. దొరికిన లోహపు వస్తువులలో బాణం మొనలు, చీలలు వగైరా వున్నాయి. ఈ కాలంనాటివే గాజుతో తయారై పూత పూయబడిన చేతి గాజులుకూడా లభించాయి. దాన్ని పర్షియన్ ముస్లింలు మన దేశంలో ప్రవేశపెట్టారని ఒక అభిప్రాయంవుంది. అయితే మధ్య యుగానికంటే ఇవి పూర్వకమైనవని త్రవ్వకాల వల్ల రుజువవుతున్నది. ఈ కాలానికి చెందినవి లక్ష్మీ విగ్రహం, ఒక శూరుని విగ్రహం, మ్రొక్కుబడి తీర్చడానికి కత్తితో తనకుత్తుకను కోసు కుంటున్నట్లు వున్న ఒక సైనికుని విగ్రహం, వీరభద్రుడు, గణేశుడు ఇరుప్రక్కలా పరివేష్టించి వున్న సప్తమాతృకల విగ్రహం లభించాయి. కుమారగుప్తుని కాలంలోని గాంధార శాసనంలో తాంత్రపు పనితోపాటు మాంత్రిక అనే పదం చేరియుండడం విశేషమైనది. ఇందులో పేర్కొన్న మాంత్రిక దేవాలయం ఢాకినీలతో పరివేష్టితమై భయోత్పాతకమైనదని వర్ణించబడింది.

## ఆరవ యుగం

ఈ కాలంలో నిర్మితమైన కట్టడాలకు గట్టి పునాదులు లేనట్లు తెలుస్తున్నది. ఏలేశ్వరం శోభ పతనావస్థలో వుండినదని దీని వల్ల తెలుస్తున్నది. ఉపరితలంలో లోతైన పెద్ద పెద్ద గుంటలు అగుపించాయి. ఇందులో చెత్త చెదారం ఉండటంచూస్తే ఇవి శ్మశానాలుగా వుపయోగించ బడేవని చెప్పడానికి ఆస్కారంలేదు. కొన్ని గుంటలలో పై భాగంలో గవాక్షలలాంటి రంధ్రాలు కనిపించాయి. ఇవి ఇంటిపై కప్పుగా వుండేవని భావించడానికి వీలువుంది. ఇది నివాస స్థాన

మనీ, ఇండ్లు కట్టడానికి వుపయోగపడే వస్తు సామాగ్రిని వెలికితీయడానికి వీటిని త్రవ్వడం జరిగిందని భావించవచ్చు. ఈ కాలంలో ఘోరమైన అగ్ని ప్రమాదం సంభవించి విపరీతనష్టం కలిగిందని తెలుస్తున్నది. కాలి పోయిన బంకమట్టి పొర కనిపించింది. పైగా, ఈ ప్రాంతం వరదలకు కొట్టుకొని పోయి, ఇసుక, బురద పేరుకుని పోయినట్లు తెలుస్తున్నది. ఈ స్థాయినుంచీ బహమనీ రాజుల కాలానికి చెందిన ముస్లిం నాణాలు, పూతపూసిన గాజులు, గణేశుని మూర్తిగల ఫలకం, బూడిదవర్ణపు మట్టి పాత్రలు, కనిపించాయి. ఇక్కడ నివసించిన ప్రజలు బహమనీ లేక విజయనగర కాలానికి చెందినవారని వూహించ వచ్చు. త్రవ్వకాల సమయంలో నదీలోయ నాగరికత స్వభావాన్ని తెలుసుకోవడానికి దేవాలయం ప్రక్కన వున్న రెండు దిబ్బలను ఎన్నుకొని అక్కడ లోతుగా గుంటలు త్రవ్వబడినాయి. ఉపరితల భాగంలో ఇండ్లు ఒకదానికొకటి చాల దగ్గరగా చదరంగం నమూనాలో వున్నాయి. ఇండ్లమధ్య దార్లు చాల ఇరుకుగా వున్నాయి. వీటికి ఇంకా దిగువ భాగంలో ఇక్ష్వాకులు, వారికి పూర్వీకుల కాలానికీ చెందిన మట్టిపాత్రలు లభించాయి. ఇక్కడ ఖననం చేయబడిన మూడు శవాల అస్థి పంజరాలు దొరికాలు. వీటిలో రెండు మధ్య యుగానికి ముందు కాలానికి చెందినవి. ఒకటి మధ్య యుగానికి చెందినది. ఒక అస్థి పంజరం కూర్చొన్న స్థితిలో వుంది. (చూ. అనుబంధం కవరు 2 వ పేజీ ) మరొక దానికి కాళ్ళు చాచుకొని వున్నాయి. దాని కుడిచెయ్యి రాతితో తయారు చేయబడిన నీటి పాత్రమీద వుంది. చేతికి రాగితో తయారైన మణికంకణం, చిటికిన వ్రేలికి రాగి వుంగరం వున్నాయి. ఎడమకాలు కనిపించలేదు. బహుశా విరిగిపోయి వుండవచ్చు. మూడవది స్మారకార్థం నిర్మించినదై వుండవచ్చు. ఈ గోరీలో 7 స్తంభాలు వున్నాయి. ఒక్కొక్క దాని పొడవు 5అ.3 అంగుళాలు. ఇరు ప్రక్కలా మూడేసి స్తంభాలు, మధ్యలో ఒకటి వున్నాయి. ఇవన్నీ దీర్ఘచతురస్రాకారంలో అమర్చబడి వున్నాయి. ఇందులో అస్థిపంజరం ఏదీ కనిపించలేదు. కానీ ఒక బూడిద వర్ణపు మట్టిపాత్రలో ఎముకలు కాల్చిన మట్టి, బూడిద కనిపించాయి. దహనం చేసిన తరువాత అస్థికలను పూడ్చిపెట్టి వుండవచ్చు. ఇలాంటివే కౌశాంబిలో బౌద్ధమతాల ప్రక్కన కూడా కనిపించాయి. ఇక్ష్వాకుల కాలం నాటికి చెందిన రంగులు వేసిన మృణ్మయ పాత్రలు లభించాయి. త్రవ్వ కాలలో మధ్య యుగం తరువాతి కాలానికి చెందినవి తప్ప ఇతర నీటిపాత్ర లేవీ లభించలేదు. దొరికిన కొన్ని పాత్రలు పసుపు, ఎరుపు రంగులలో వున్నాయి. బహుశా ఇవి పూజాదులకొరకు వుపయోగించబడేవి అయి వుండవచ్చు. ఇక్ష్వాకుల కాలంలో తేలికైన ఎరుపురంగు పాత్రలు విరివిగా వుండేవి. పెంకులు కూడా కొన్ని లభించాయి. వర్షపునీరు నిలవకుండా వెంటనే దొర్లిపోవడానికి వీలుగా ఇవి ఉబ్బెత్తుగా వున్నాయి. రాగి, యినుముతో చేయబడిన ప్రమిదలు, బంగారుపూలు, రజిత పతకాలు, రుద్రాక్ష మాలికలు స్త్రీ పురుష చిత్రాలుగల టెర్రకోట బొమ్మలు లభించాయి. ఒక టెర్రకోట బొమ్మలో నందీశ్వరునిపై కూర్చొని ఒడిలో కుమారిని లేక సుతుని ఎత్తుకునివున్న పార్వతీదేవి వుంది. బంకమట్టితో తయారైన బొమ్మలు, బండ్లు, జంతువులు, పక్షులు లభించాయి. ఇక్ష్వాకుల తరువాతి కాలంనాటివి రాతితో చేయబడిన మూకుళ్ళు, భోజనపాత్రలు, కుండలు వగైరా లభించాయి. ఏలేశ్వరం దేవాలయం వద్ద గ్రానైట్ రాయిని తొలిగించిన తరువాత అక్కడి ప్రాంతమంతా ఏవిధంగా వుండినది సరిగా తెలుసు కోవడానికి అవకాశం లభించింది. ఉత్తరదిశలోని ప్రాకారపు గోడ ప్రాంతాన్ని పరిశీలించడానికి గాను అక్కడి రాళ్ళను తొలగించగా ఒక మండపం కనిపించింది. ఏలేశ్వరం దేవాలయం క్రింద వున్న ఈ మండపానికి ఆధారంగా సున్నపు రాళ్ళతో నిర్మించబడిన 48 స్తంభాలున్నాయి. ఒకదానిపైన బ్రహ్మలిపిలో ఒక శాసనం వ్రాయబడి వుంది. దాన్ని బట్టి ఇది క్రీ. శ. 3 లేక 4 వ శతాబ్దానికి చెందినదై వుండవచ్చని తెలుస్తున్నది. దీనికి కొద్దిగా పైన మూసివేయబడిన మురుగు కాలవ ప్రాక్పశ్చిమదిశగా వుండినట్లు అనుపించింది. దీనికి దిగువ భాగంలో పైన వివరించిన విధంగా ఉత్తర దక్షిణాలుగా ఒక సమాధి కనిపించింది. ఇది చరిత్రాత్పూర్వపు కాలానికి చెందినది

ఏలేశ్వరం త్రవ్వకాలలో శాతవాహన, ఇక్ష్వాకులు, తూర్పు చాళుక్యులు, విజయనగరం, బహమనీ, కుతుబ్ షాహీ, మొగలులు, ఆసిఫ్‌జాహి రాజుల కాలానికి చెందిన నాణాలు లభించాయి. ఏలేశ్వరంలో లభించిన శిలా శాసనాలనుబట్టి ఆంధ్రదేశపు పూర్వచరిత్ర, సంస్కృతులను గురించికొంత తెలుస్తుంది. మొత్తంమీద వివిధ రాజుల పరిపాలనకు చెందిన శిలాశాసనాలు 40 లభించాయి. ఇవి బ్రహ్మ, తెలుగు, కన్నడ లిపులలో వున్నాయి.

ఈ ప్రాంతం ఎప్పుడూ నిర్మానుష్యం కాలేదని చెప్పవచ్చు. ఒక్కొక్క యుగానికి దానికి తగిన ప్రత్యేకత వుంది. ఎప్పుడూ ఆవాసయోగ్యంగానే వుండింది. ఇదివరకు

నిర్మించిన గోడలను, తరువాత కాలం ప్రజలు తిరిగి వుపయోగించినట్లు నిదర్శనాలున్నాయి. శిథిలమైపోయిన గోడలపై భాగాలను, తిరిగి ఎత్తుగా, అదే పద్ధతితో క్రొత్తగా నిర్మించడం జరిగింది.

ఏలేశ్వరంలో 6 నెలలు త్రవ్వగా వెలువడిన వస్తు పరికరాలనుగూర్చి సాధ్యమైనంత వరకు వివరంగా పాఠకులకు తెలియజేయడమైనది. ఇంతవరకు సాధించిన ఫలితం అత్యల్పమైనది. మనకు, తెలియని యుగాన్ని గూర్చి పూర్తిగా తెలుసుకోవాలంటే ఇంకా చాలాకృషి చేయవలసివుంది. రేఖా మాత్రంగానే వివరించడం జరిగింది. పూర్తి చిత్రం తయారు కావాలంటే ఇంకా వివరాలు సేకరించవలసి వుంది.

ఇంతవరకు నిలువుగా త్రవ్వడమే జరిగింది. ఇంకా అడ్డంగాకూడా త్రవ్వవలసి వుంది.

## ప్రచురణలు

త్రవ్వకాలలో వెలువడిన పురాతత్వ వస్తువులు, శాసనాలను గూర్చి సాహిత్యాన్ని ప్రచురించడం ఆర్షశాఖ సాధారణంగా నిర్వహించే విధి. త్రవ్వకాలలో లభించిన వస్తువులను గూర్చి సక్రమ ప్రచురణలు లేనట్లయితే, ఇలాంటి త్రవ్వకాలవల్ల ఫలితాలేమీ వుండవు. గత కొన్ని ఏండ్లలో ఈ రాష్ట్రపు ఆర్షశాఖ అజంతా సంపుటి, బీదర్, దిక్కన్ పూర్వ చరిత్ర, దక్కన్ చరిత్ర, సంపుటి 1. VIII లలితకళలు, మౌలాలా రూమీ యొక్క మథ్నవీ, దక్కన్‌లో పెయింటింగ్ సర్వే, శృంగార మంజరి, వేములవాడ చాళుక్యులు, హైద్రాబాదు రాష్ట్రంలో పురాతత్వవస్తువులు, మ.ఘ.వ. నిజాం రాష్ట్రపు తెలుగు శాసనాలు (1వ, 2వ భాగాలు) హైద్రాబాదు ఆర్ట్ అండ్ ఆర్కియాలజీ, చేతిపనులు, ఎల్లోరా గుహలకు గైడ్, రామప్ప దేవాలయం, పాలంపేటలో యితర దేవాలయాలు మున్నగు పుస్తకాలు అచ్చు వేయబడినాయి. ఇవి ముఖ్యంగా 1959-60, 1960-61, 1961-62 సం॥లలో ఎక్కువగా అచ్చువేయబడినాయి. ఈ శాఖ అచ్చువేసిన పుస్తకాలు ఇవి :

1. పిక్లీహాల్ త్రవ్వకాలు, డా. ఎఫ్. ఆర్. ఆల్షిన్ యం. ఎ., పిహెచ్. డి., యఫ్. యస్. ఎ. (లండన్).
2. ఆంధ్ర ప్రదేశ్‌లో కన్నడ శాసనాలు; డా. పి. శ్రీనివాసాచారి, యం. ఎ., పిహెచ్. డి. (లండన్) ప్రొఫెసర్ ఆఫ్ హిస్టరీ, ఉస్మానియా యూనివర్శిటీ, హైద్రాబాదు — దక్కన్. ప్రొఫెసర్.పి.బి. దేశాయ్, యం. ఎ. కర్నాటక్‌లో పురాతన చరిత్ర సంస్కృతిలో రీడర్, కలిసి వ్రాసిన పుస్తకం ఇది.
3. గ్లింప్సెస్ ఆఫ్ బుద్ధిజం, శ్రీ యన్, రమేశన్, యం. ఏ., ఐ. ఎ. యస్., ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వ ఆర్షశాఖ డైరెక్టరు హైద్రాబాదు (10 వర్ణ చిత్రములు 62 హాఫ్-టోన్ చిత్రములలో)
4. ఆంధ్రప్రదేశ్ గవర్నమెంటు మ్యూజియంలో పంచ్‌మార్కు గల నాణెములు డా. పరమేశ్వరీ లాల్‌గుప్త. ఎం. ఏ., పిహెచ్. డి. ప్రిన్స్ ఆఫ్ వేల్స్ మ్యూజియం, బొంబాయి.
5. ఆంధ్ర ప్రదేశ్ గవర్నమెంటు మ్యూజియంలో శాతవాహన నాణెములు. డా. రామారావు, యం. ఎ., పిహెచ్. డి. ప్రొఫెసర్ ఆఫ్ హిస్టరీ, తిరుపతి.
6. ఆంధ్రప్రదేశ్ గవర్నమెంటు మ్యూజియంలో కుతుబ్‌షాహి నాణెములు. శ్రీ అబ్దుల్‌వలీఖాన్ గవర్నమెంటు మ్యూజియం, హైద్రాబాదు.
7. ఆంధ్రప్రదేశ్ గవర్నమెంటు యొక్క విజయనగరం నాణెముల కేటలాగ్. యన్. రమేశన్, ఎం.ఎ.,ఐ.ఎ.ఎస్., ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ఆర్షశాఖ డైరెక్టరు, హైద్రాబాదు (సుమారు 20 హాఫ్-టోన్ చిత్రములతో సహా)
8. రామచంద్రలోని నూర్గాంవు శాసనములు. ఆర్షశాఖ ప్రచురణ నెం. 4. డా. పి. శ్రీనివాసాచారి, ఎం, ఎ., పిహెచ్. డి. (లండన్)
9. ఉట్నూరు త్రవ్వకాలు, డా. ఎఫ్.ఆర్. అల్లాషిన్, యం. ఎ., పిహెచ్. డి., (యఫ్. యస్. ఎ.) (లండన్)
10. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ మ్యూజియంలోని తామ్రశాసనములు. సంపుటి. శ్రీ యన్. రమేశన్, యం. ఎ., ఐ. ఎ. యస్. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ఆర్షశాఖ డైరెక్టరు, హైద్రాబాదు.
(ఆంధ్రప్రదేశ్‌లో సుమారు 1000 ఏండ్ల వరకటివరకు చెందినవి. 33 హాఫ్-టోన్ సచిత్రములతో సహా)
11. లేపాక్షి కళామండపం (తెలుగు) శ్రీ యస్. గోపాలకృష్ణమూర్తి, ప్రిన్సిపాల్, ప్రభుత్వ ట్రెయినింగు కాలేజి, నెల్లూరు.
12. విష్ణుకుండినరాజు విక్రమహేంద్రవర్మ ప్రసాదించిన తుండి తామ్రశాసనం. డా. ఆర్. సుబ్రహ్మణ్యం, యం. ఏ., పిహెచ్. డి ; ఆర్కెలాజికల్ సర్వే ఆఫ్ ఇండియా, సూపరింటెండెంటు.
13. ఆంధ్రప్రభుత్వ మ్యూజియంలో ఎన్నుకోబడిన శాసనములు.
ప్రొఫెసర్ పి. బి. దేశాయ్, యం.ఎ., ధార్వాడ్, కర్నాటక యూనివర్శిటీలో

ప్రాచీన చరిత్ర సంస్కృతిలో రీడర్.

14. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ మ్యూజియంలో ఇక్ష్వాకుల నాణెములు.

డా. ఆర్. సుబ్రమణ్యం, యం. ఏ. పిహెచ్. డి., ఆర్కెలాజికల్ సర్వే ఆఫ్ ఇండియా సూపరింటెండెంటు.

ఈ పైన పేర్కొన్న ప్రచురణలేగాక, 1965–66 సం॥ల వరకు దిగువ పేర్కొన్న జాబితా ప్రకారం మరికొన్ని పుస్తకాలను కూడా ప్రచురించడానికి ఆర్షశాఖ పూను కొన్నది.

1. యాదవులు, మధ్యయుగంనాటి నాణెముల కేటలాగ్.

—డా. ఆర్. సుబ్రహ్మణ్యం

2. కంచువిగ్రహాల కేటలాగ్.

—డా. పి. శ్రీనివాసాచారి

3. హైద్రాబాదు మ్యూజియంలోని శాసనాల కేటలాగ్. —డా. పి. శ్రీనివాసాచారి

4. హైదరాబాదుమ్యూజియంలోనికొన్ని అపూర్వ శాసనాలు—శ్రీ యన్. రమేశన్

5. హైద్రాబాదు మ్యూజియంలోని తామ్రశాసనములు.

—శ్రీ ఎన్. రమేశన్.

6. దక్కన్ పెయింటింగ్స్‌ను గూర్చి సమీక్ష. —శ్రీ జగదీష్ మితాల్

7. హైద్రాబాదు మ్యూజియంలోని మొగల్ చిత్రాల సమీక్ష.

—శ్రీ ప్రమోదచంద్ర

8. అరబ్బీ, ఉర్దూ, పారశీక భాషల్లోని వ్రాతప్రతుల సమీక్ష. —డా. నిజాముద్దీన్

9. చుగ్తాయ్ పెయింటింగ్స్‌ను గూర్చి సమీక్ష. —శ్రీ పి. ఆర్. రామచంద్రరావు

10. హైద్రాబాదు మ్యూజియంలో ఆయుధాల కేటలాగ్.

—శ్రీ ఖాజా మొహమ్మద్ అహమద్.

11. హైద్రాబాదు మ్యూజియంలో బిద్రీ పాత్రలు, నవరత్నాల కేటలాగ్.

—శ్రీ ఖాజా మొహమ్మద్ అహమద్

12. ఆసఫ్‌జాహి నాణెముల కేటలాగ్.

—శ్రీ అబ్దుల్‌వలీఖాన్

13. అలంపూరు దేవాలయాల శిల్పకళ.

—డా. పి. శ్రీనివాసాచారి

14. ఆంధ్రప్రదేశ్‌లో పురాతన హిందూ దేవాలయాల శిల్పకళ.

—శ్రీ పి. ఆర్. రామచంద్రరావు

15. హైద్రాబాదు మ్యూజియం, అజంతా పెవిలియన్ గైడ్‌బుక్.

—డా. పి. శ్రీనివాసాచారి

16. కే. బి. మ్యూజియం, ఏలేశ్వరం పెవిలియన్‌కు గైడ్‌బుక్.

—శ్రీ అబ్దుల్ వహీద్‌ఖాన్

17. విష్ణుకుండిన నాణెములు.

—డా. యన్. రామారావు

18. హైద్రాబాదు మ్యూజియంలోని ఇతర నాణెములు (ఎన్నుకోబడిన బంగారు వెండినాణెములు.)

—డా. యం. రామారావు

19. క్షత్రపనాణెములు.

—శ్రీ హెచ్. వి. త్రివేదీ

20. బహమనీ నాణెములు.

—శ్రీ అబ్దుల్‌వహీద్‌ఖాన్

21. ఎన్నుకోబడిన శిలా శాసనములు.

—శ్రీ పి. బి. దేశాయ్

22. ఆంధ్రప్రదేశ్‌లోజైనదేవాలయాలు.

—శ్రీ యస్. గోపాలకృష్ణమూర్తి

23. కాకతీయ శిల్పములు.

—శ్రీ యస్. గోపాలకృష్ణమూర్తి

24. తూర్పుచాళుక్యుల దేవాలయాలు.

—డా॥ యం. రామారావు

25. తొలి చాళుక్య దేవాలయాలు.

—డా. యం. రామారావు

26. ఆంధ్ర విగ్రహాల పరిశీలన.

—డా॥ యం. రామారావు

27. తూర్పు చాళుక్యుల తామ్ర శాసనములు.

—శ్రీ యం. వెంకటరామయ్య

28. ఆంధ్ర ప్రభుత్వ మ్యూజియంలో కొన్ని అపూర్వ శాసనములు.

—శ్రీ యం. సోమశేఖరశర్మ

29. అమరావతిలోని పంచమార్కు నాణెముల కేటలాగ్.

—పరమేశ్వరీలాల్ గుప్త

30. ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వమ్యూజియంలో రోమన్ నాణెముల కేటలాగ్.

—రచయితనుఎన్నుకోబడవలసివున్నది

31. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ మ్యూజియంలో ఇతర అన్ని చిల్లర నాణెముల కేటలాగ్.

—రచయితనుఎన్నుకోబడవలసివున్నది

32. విజయనగర నాణెముల కేటలాగ్.

—శ్రీ యన్. రమేశన్

33. ఆర్కెలాజికల్ బులెటిన్ 2.

—డా. పి. శ్రీనివాసాచారి

34. ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వ మూజియంలో చరిత్రాత్పూర్వక కాలంనాటి పరికరాల వివరణ తెలుపు కేటలాగ్.

—మొహమ్మద్ అబ్దుల్‌వలీ ఖాన్

35. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ మ్యూజియంలో శాతవాహన టెర్రకోటబొమ్మల కేటలాగ్.

—మొహమ్మద్ అబ్దుల్‌వలీ ఖాన్

36. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ మ్యూజియంలో కుతుబ్‌షాహి ఆభరణాల కేటలాగ్.

—శ్రీ ఖాజా మొహమ్మద్ అహమద్,
శ్రీ యం. ఎ. వహీద్‌ఖాన్.

37. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంలో తెలుగు, సంస్కృతంలో గల పాత తాటియాకు గ్రంథాల కేటలాగ్.

—శ్రీ కె. లక్ష్మణశాస్త్రి.

పైన వివరించిన జాబితాలుగల కేటలాగ్‌లను తయారుచేయడానికి ప్రముఖులైన పండితులు కృషిచేస్తున్నారు. ఇదివరకే కొన్ని వ్రాత ప్రతులు ఆర్షశాఖకు అందినాయి. అవి త్వరలోనే ప్రచురింపబడతాయి. 1959-60, 1961-62 సం॥ వరకు ప్రచురించిన గ్రంథాలు విద్యావిషయకంగా చాలా ముఖ్యమైనవి. వివిధ సంస్థలు, పండితులు, పరిశోధకులలో వీటికి చాలా గిరాకీవుంది.

## నాణెములు (నిక్షేపాలు)

హైద్రాబాదు మ్యూజియం 1340 ఫసలీలో అంటే క్రీ. శ. 1930-31 లో స్థాపించబడింది. ఈ మ్యూజియంలో ప్రజలకు, పండితులకొరకు పురాతత్వవస్తువులన్నీ ప్రదర్శించబడివున్నాయి. కేటలాగ్‌లను తయారుచేసి, నిధినిక్షేపాలు, పురాతత్వ వస్తువులు, వర్ణచిత్రములు, శాసనాలు, వ్రాతప్రతులు, చారిత్రక ప్రాముఖ్యంగల ఇతర వస్తువులను గూర్చిన శాస్త్రీయ పరిశోధనా ఫలితాలను ప్రచురించడం ఈ మ్యూజియం యొక్క ముఖ్య కార్య కలాపమై వున్నది.

హైద్రాబాదులోని ప్రధాన మ్యూజియం ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ మ్యూజియంగా ప్రకటించబడింది. ఆంధ్రప్రదేశ్‌లోని 20 జిల్లాల్లో కనుగొనబడిన నిక్షేపాలు చారిత్రక ప్రాముఖ్యంగలవి. మాత్రమే ఇందులో పరిరక్షించ బడుతున్నాయి.

ఆర్షశాఖ డైరెక్టరు, నిధి నిక్షేపాల చట్టం క్రింద ఈ నిక్షేపాలకు అధికారిగా వ్యవహరిస్తారు. ఈ చట్టంలోని 19వ సెక్షన్ క్రింద నిధులను క్రమబద్ధం చేయడానికి రాష్ట్ర ప్రభుత్వం కొన్ని నిబంధనలను రూపొందించింది. ఈ చట్టం ప్రకారం, నిధి నిక్షేపాలు మొదట, వాటి పరిశీలనకొరకు నిధి నిక్షేపాల అధికారికి పంపబడతాయి. శాస్త్రీయ పరిశోధనానంతరం అవి చారిత్రక ప్రాముఖ్యం గలవని నిర్ణయించబడితే, వాటిని రాష్ట్ర మ్యూజియానికి తరలించడం జరుగుతుంది. రాష్ట్ర ప్రభుత్వం తరఫున, ఇందుకొరకై ఏర్పడిన నియమావళి ననుసరించి రాష్ట్ర మ్యూజియానికి పంపేందుకు రెవిన్యూశాఖ ఈ నిక్షేపాలను స్వాధీన పరచుకోవడానికి చర్యలు గైకొంటుంది. వీటి పరిశీలనా ఫలితాలను ఆర్షశాఖను మిస్‌మేటిక్ సీరీస్, కేటలాగ్‌ల రూపంలో ప్రచురిస్తుంది.

హైద్రాబాదు మ్యూజియంలో అపారమైన నాణెములు వున్నాయి. ఒక్కొక్క లోహంలో (అంటే బంగారు, వెండి, రాగి, యిత్తడి, మిశ్రమ లోహములు, సీసము, నికెల్ ధాతువులలో) సుమారు రెండు లక్షల వరకు నాణెములు సేకరించబడి వున్నాయి. మౌర్యులు. అంతకు పూర్వీకులు, ఆంధ్ర శాతవాహనులనుంచి ఆసఫ్ జాహి రాజుల వరకు గల దక్షిణ భారత నాణెములన్నీ ఇందులో వున్నాయి.

దిగువ తెల్పిన విధంగా నాణాల కేటలాగుల, సీరీస్ రూపంలో ఫలితాలను అప్పుడప్పుడూ ప్రచురించడం జరిగింది :

1. నాణాల సీరీస్ : బారామతిలోని క్రొత్త మొగల్ మింటు.
2. నాణాల సీరీస్ : శాతవాహనరాజు యొక్క క్రొత్త నాణెం.
3. నాణాల సీరీస్ : మహిశా రాజ్యానికి చెందిన మరికొన్ని నాణాలు.
4. నాణాల సీరీస్ : కొండాపూర్ త్రవ్వకాలలో లభించిన సీసపురేకు నాణాలు.
5. నాణాల సీరీస్ : రాష్ట్ర మ్యూజియంలోని అపూర్వమైన నాణాలు.
6. నాణాల సీరీస్ : రాష్ట్ర మ్యూజియంలోని కొన్ని అపూర్వమైన మొగల్ నాణాలు.
7. నాణాల సీరీస్ : సుమహగ్రామక రాజుకు చెందిన నాణాలు.
8. నాణాల సీరీస్ : కొండాపూర్ త్రవ్వకాలలో లభించిన మరికొన్ని మహిశా నాణాలు.
9. నాణాల సీరీస్ : హైదరాబాదు రాష్ట్రం లోని వివిధ త్రవ్వకాలలో లభించిన శక(ం) క్షత్రపా, త్రికూటక నాణాలు.

## కేటలాగులు

1. హైదరాబాదు రాష్ట్ర మ్యూజియంలోని రంధ్రాలు గల నాణాలు.
2. హైదరాబాదు రాష్ట్ర మ్యూజియంలోని శాతవాహన నాణాలు.
3. హైదరాబాదు రాష్ట్ర మ్యూజియంలోని కుతుబుషాహి రాజ్యానికి చెందిన నాణాలు.
4. హైదాబ్రాదు రాష్ట్ర మ్యూజియంలోని విజయనగరం రాజ్యానికి చెందిన నాణాలు.
5. హైదరాబాదు రాష్ట్ర మ్యూజియంలోని ఇక్ష్వాకుల కాలానికి చెందిన నాణాలు.

యీ నాణాల సీరీస్, కేటలాగులకుతోడు, తూర్పుచాళుక్యులకు, క్షత్రపలకు, బహమని రాజ్యానికి చెందిన నాణాల ఫలితాలకు సంబంధించిన వివరాలను యీ శాఖ యీసంవత్సరంలో ప్రచురించుతుంది.

## మ్యూజియంలు

మన ప్రాచీనులకు సంబంధించిన వివిధ జీవిత మార్గాలను తెల్పే వివరాలను స్కాలర్లకూ, నిరక్షరాస్యులకూ అందజేయడమే మ్యూజియంల ప్రాథమిక ఉద్దేశ్యం. గతానికి చెందిన ప్రాచీనుల జీవిత విధానాలను నిరక్షరాస్యులు, బాలలు సుళువుగా అర్థంచేసుకోవాలనే ముఖ్య విషయాన్ని గుర్తించిన నేటిరోజులలో మ్యూజియంల ప్రాధాన్యం ఇంకా హెచ్చింది. ఊహాజనితవిద్యా విధానం కన్నా దృశ్య విద్యావిధానం ద్వారా శాశ్వత విజ్ఞానాన్ని సంపాదించవచ్చుననే విషయాన్ని ప్రపంచంలోని విద్యావేత్తలందరూ గుర్తించారు. ఇటీవలి కాలంలో మ్యూజియంల ప్రాముఖ్యాన్ని గుర్తించడం జరిగింది.

యీ దృష్ట్యా పైలక్ష్యాలను సాధించడానికై పూర్వీకుల కాలంలో జరిగిన అన్ని విషయాలను సబబైన విధంగా సవిస్తరంగా వివరణంతో కూడా ప్రదర్శించడమే మ్యూజియంలముఖ్య ఉద్దేశమై ఉండాలి.

ఇదే దృష్టితో 1930 సం॥లో పూర్వపు

హైద్రాబాదు ప్రభుత్వ పురాతత్వ శాఖ, పురాతన వస్తుప్రదర్శనశాల(మ్యూజియం)ను ఏర్పాటు చేసింది. త్రవ్వకాల ద్వారాను ఇతర విధాల ఈశాఖ సేకరించిన అనేక పురాతన వస్తువులను యీ మ్యూజియంలో ఉంచారు. యీ రాష్ట్రమ్యూజియం, క్రమాను గతంగా అభివృద్ధి చెందుతూ వచ్చింది. అభివృద్ధి చెందిన మ్యూజియంలో ఉండాల్సిన అన్నిగ్యాలరీల సెక్షన్లు యీ రాష్ట్ర మ్యూజియంలో కూడఉన్నాయి.ప్రస్తుతం యీ రాష్ట్ర మ్యూజియంలో 15విభాగాలుఉన్నాయి. ఇతర మ్యూజియంలో లేనివిధంగా మన మ్యూజియంలో నిక్షేపాలనుంచీ సేకరించిన వస్తువులనూ,ప్రభుత్వం సేకరించిన వస్తువులనూ ప్రదర్శించడం సంతోషకరమైన విషయం. పురాతత్వ శాఖలో ఇది అతి ముఖ్యమైన విభాగం. అధికారులు యీ విభాగాన్ని అధిక శ్రద్ధతో నిర్వహిస్తున్నారు. మన రాష్ట్ర మ్యూజియంలోఉన్న అపూర్వమైన పురాతన నాణాలు ఇతర మ్యూజియంలలో చాలా అరుదుగా కనిపిస్తాయి. క్రీ. పూర్వం 4వ శతాబ్దానికి చెందిన రంధ్రాలుగల నాణాలు మొదలుకొని ఆసఫ్‌జాహి నాణాల వరకు ఇక్కడ వున్నాయి.

యీ శాఖ నిర్వహించిన వివిధ త్రవ్వకాలలో లభించిన అపూర్వమైన పురాతన వస్తుసముదాయాన్ని రాష్ట్ర మ్యూజియంలో ఉంచారు. ఇటీవల ఏలేశ్వరంత్రవ్వకాలలో లభించిన ముఖ్యమైన వస్తువులను రాష్ట్ర మ్యూజియంకు అనుబంధంగావున్న క్రొత్త పెవిలియన్‌లో శాస్త్రీయపద్ధతిలోఅమర్చారు. మాస్కి కొండాపూర్, రాజన్‌కల్లూలు, ఫణిగిరి, పటంచెర్వు మొదలయిన ప్రఖ్యాత ప్రదేశాలలో త్రవ్వకాల ద్వారా సేకరించిన వస్తువులను కూడా ప్రదర్శిస్తున్నారు. చరిత్రకు అందని కాలానికి చెందిన వస్తువుల విభాగంలో 1, 2, 3 సీరీల పరికరాలు రాతియుగానికి చెందిన నునుపైన చేతి గొడ్డళ్లు 3వ గ్రూపులోనికత్తులు, ట్రిపజీలు, బినేట్సు మొదలైనవి ఉన్నాయి. 'క్రెస్టెడ్ గైడింగ్‌రిడ్జి' అనే ప్రత్యేక పద్ధతికి చెందిన కటార్లు కూడా ఉన్నాయి.

యీ ఉపకరణాలు చిన్న పరిమాణంలో ఉన్న కారణంగా వీటిని ఉపయోగించే అప్పటి మనుష్యులు కూడా చిన్నవారుగా ఉండేవారేమోనని పురాతత్వ శాస్త్రజ్ఞులు భావిస్తున్నారు. అయితే దీనికి సంబంధించిన మానవకళేబరాల వంటి పురాతనవస్తు శాస్త్రసాక్షిధారాలేవీ ఇంతవరకూ లభించలేదు. యీ దశలో మానవులు చెప్పుకోదగిన అభివృద్ధి సాధించికొయ్యకొడవళ్ళను పంటకోతలకు ఉపయోగించేవారు. యీ కొడవళ్ళకు మొనగల రాతి కత్తులను అమర్చేవారు.

మానవులు అంత వరకూ రాతిని ఉపయోగించేవారు. లోహాల విషయం వారికి తెలియదు. దాదాపు క్రీ.పూ. 500 సం॥లోని మిక్రొలిథిక్ కాలంలోని దక్కన్ ప్రాంతం విషయంలో యిది యదార్థమైంది. లోహయుగం అప్పుడే ప్రారంభమైంది. రాతి, లోహయుగాల మధ్యకాలంలో రాగి, కంచు ఉపయోగించేవారు. హరప్పా, మొహంజదారో ప్రాంతాలు యీ విషయాన్ని ధ్రువపరుస్తాయి. అదృష్టవశాత్తు రాజన్ కల్లూరు త్రవ్వకాలలో రాగితోచేసిన మూడు ఖడ్గాలు కనుగొబడాయి. గంగానది లోయలో సర్ జాన్‌మార్షల్ కనుగొనమూడు రాగిఖడ్గాల్ల మాదిరిగానే ఇవి ఉన్నాయి. బ్రహ్మగిరి త్రవ్వకాలలో దొరికిన కంచుదిమ్మెల వల్ల కూడ దక్కన్ ప్రాంతంలో చాల్కొలిథిక్ (Chalcolithic) సంస్కృతి వ్యాపించునట్లు ధ్రువపడుతుంది. యీ దృష్ట్యా మ్యూజియంలో ప్రదర్శించబడిన యీ మూడు ఖడ్గాలు ఇతర పురాతన వస్తువులకన్నా ఎక్కువ ప్రాముఖ్యత వహించాయి.

పై యుగానికి చెందిన ఉపకరణాల తర్వాత మెగాలిథిక్ యుగం సంస్కృతికి చెందిన మృణ్మయ పాత్రలను యీ ప్రదర్శనలో చూడవచ్చు. ఇటీవలివ రకు యీ వస్తువులు భూస్థాపితమై ఉన్నాయి. మహేశ్వర్, నూదతోలి నెవాసబాహల్‌నగ్గా మొదలైన ప్రాంతాలతో కనుగొనబడిన ఇదే రకమైన మృణ్మయ పాత్రలవల్ల యీ సంస్కృతికి సంబంధించిన మన విజ్ఞానం విస్తరించింది. యీసంస్కృతితో చరిత్రకు పూర్వపుయుగం అంతమైంది. ఆతర్వాత ప్రసిద్ధి కెక్కిన ఆంధ్రసంస్కృతి ప్రారంభ మవుతుంది. కొండాపూర్ ఎర్రమన్ను, ఉపకరణాలు అమరావతి శిల్పాలు, వివిధ రాజవంశీయులకు చెందిన నాణాలను మనమ్యూజియంలో ఉంచడంద్వారా అప్పటి ఆంధ్ర సంస్కృతిని ప్రదర్శించడం జరుగుతున్నది. క్రీ. శ. మొదటి శతాబ్దానికి చెందిన కొండాపూర్ ఎర్రమన్ను పాత్రలు ఆంధ్ర శాతవాహనుల నాటి కళాభిజ్ఞతను చాటుతాయి. అనేక రకాల శిరోజాలంకరణ ఆభరణాలు, మత విషయక ఆభరణాలు శాతవాహన కాలం నాటి బౌద్ధమత జీవితాన్ని అప్పటి సాంఘిక జీవితాన్ని తెలియజేస్తాయి.

ఈ మ్యూజియంలోని ఇతర ముఖ్యమైన విభాగాలలో శిల్పగ్యాలరీ ఒకటి. క్రీ. శ. ఒకటి లేక రెండవ శతాబ్దం మొదలు క్రీ.శ. 16వ శతాబ్దం వరకుగల ఆ కాలానికి చెందిన వివిధ రకాల శిల్పాలు ఇందులో ఉన్నాయి, స్వాతిలోయకు (యూసుఫ్‌జాహీ) చెందిన మొత్తం గాంధార శిల్పాల విభాగం గ్యాలరీ ప్రత్యేకంగా ఉంది. ఇందులో ఋష్కించిన బుద్ధవిగ్రహం (క్రీ. పూ. రెండవ శతాబ్దం) ఒక స్తంభంలోని 5 గురు ధ్యాన బుద్ధులలో 4 చిత్రాలు పురాతత్వ దృష్టిలో అపూర్వమైనవని చెప్ప వచ్చు. కొన్ని బోధిసత్వ శిల్పాలు కూడా చాలాముఖ్యమైనవి. అదే కాలానికి చెందిన చక్కని ఇండో కార్నీథియన్ శిల్పస్తంభాన్ని గూర్చి కూడా పేర్కొనవచ్చు. ఆ తర్వాత అమరావతీ శిల్పాలు చాలా ఉన్నాయి. గ్రీకో-గాంధారీపద్ధతి శిల్పం చాలా మందిని ఆకర్షించడమేకాక ప్రపంచంలోని ఎంతో మంది శిల్ప కళా విమర్శకుల మన్ననలందింది. ఇది క్రీ. శ. మొదటి శతాబ్దానికి

చెందిన శిల్పం. మరో ముఖ్యమైన పద్ధతి శిల్పం ఇక్ష్వాకులది. నౌనటిపై తిలకం ఉంచి మౌనముద్రలో ఉన్నబుద్ధుని పూర్తి విగ్రహం క్రీ. శ. 3 లేక 4వ శతాబ్దానికి చెందినదిగా చెప్పవచ్చు. చాళుక్య వరానికి చెందిన శిల్పాలు కూడా మన గ్యాలరీలో ఉన్నాయి. వీటిలో చాలా వరకు పటం చర్వులో దొరికినవి. మిగిలినవి ఇతర ప్రదేశాలలో లభించినవి ఉన్నాయి. చాళుక్య శిల్పాలన్నీ క్రీ. శ. 12వ శతాబ్దానికి చెందినవి. ఇవి నునుపుగానూ, సుందరంగానూ ఉన్నాయి. మెరుగైన నల్లనిరాతిపై సుందరాకృతిలో చెక్కబడిన జైనసరస్వతీ విగ్రహం చెప్పు కోదగినది. క్రీ. శ. 12వ శతాబ్దానికి (క్రీ శ. 1178) చెందిన శాసనం కూడా దీనిపై చెక్కబడింది. కొన్ని జైన తీర్థాంకరులు కూడా ముఖ్యమైనవి ఉన్నాయి. రాష్ట్రకూట రీతిలోఉన్న మహిషాసురమర్దనీ శిల్పం కూడా ప్రత్యేకంగా పేర్కొనదగింది. ఇది 9వ శతాబ్దానికి చెందినది.

కాకతీయ శిల్పపద్ధతిలో ఉన్నశిల్పాలకు చెందిన ప్రత్యేక గ్యాలరీకూడా ఇందులో ఉంది త్రిభంగ భంగిమలో వున్న రెండు ద్వారపాలికా శిల్పాలు, రెండు డమరుక శిల్పాలు వీటిలో చెప్పుకో దగినవి.

మ్యూజియంలోని మరొక ముఖ్య విభాగం కంచువిగ్రహాలది. వీటిలో బాపట్ల తో దొరికిన జైనవిగ్రహాలు, అంబిక విగ్రహం మెరపుదనానికి చెప్పుకోదగినవి. ఇవి క్రీ. శ. 9వ శతాబ్దానికి చెందినవి. నల్లగొండజిల్లా కొల్లిపాకలో సేకరించిన మూడుగంటలుకూడా ముఖ్యమైనవి. వీటిపై వున్న శాసనాలు చోళచరిత్రకు సంబంధించిన విషయాలను తెల్పుతాయి. ప్రతిమావర్ణనలదృష్ట్యా కూడా ఇవి ముఖ్యమైనవి.

మరోముఖ్యమైనది బీద్రిపాత్రల విభాగం. తుతునాగం, సీసం, తగరంతో తయారైన బీద్రిపాత్రలను యీ మ్యూజియంలో వుంచారు. మొదట యీ పరిశ్రమ గుల్బర్గాలో ప్రారంభించబడింది. ఆతర్వాత బహమనీ రాజ్యంలో బీదర్‌లో యీ పరిశ్రమ అభివృద్ధి చెందింది.

మరో రెండు విభాగాల గురించి ముఖ్యంగా చెప్పుకోవాల్సివుంది. మొదటిది వ్రాతప్రతాలది. ఇందులో షాహజహాన్ పెద్దకొడుకు దారాశికోహ్ వ్రాతప్రతం, ఔరంగజేబు వ్రాతప్రతాలు, చెప్పుకోదగినవి. పుస్తకాలు ఆయావ్యక్తుల మనస్తత్వాలను తెలియజేస్తాయి. దారా వ్రాసిన సర్వజన సమ్మతమైనభావాలనూ కళాత్మక మనస్సును వ్యక్తం చేస్తుంది. ఔరంగజేబు వ్రాత ఆయన నిష్ఠగలస్వభావాన్నివ్యక్తంచేస్తుంది.

భారతదేశం వివిధ దశలలో సాధించిన కళాభివృద్ధి అజంతా గుహలలోని పెయింటింగ్‌లద్వారా వెల్లడి అవుతుంది. యీ చిత్రాలను యీ పెవిలియన్‌లో శాస్త్రీయ పద్ధతిలో ప్రదర్శించడం జరిగింది. చిత్రకళా విమర్శకులు ఎంతోమంది వీటిని ప్రశంసించారు. అజంతా గుహలను దర్శించగోరే వారికి యీపెవిలియన్ యెంతో విజ్ఞానాన్ని అందజేస్తుందని కూడా వారు నుడివారు. యీ మ్యూజియంలోని ఆర్ట్ గ్యాలరీలో మొగల్, రాజ్‌పుత్, గుజరాత్ పద్ధతులకు చెందిన ఎన్నో పెయింటింగులను వుంచారు.

## నాణాలు

ప్రతిలోహానికి చెందిన (బంగారం, తక్కువరకం బంగారం, వెండి, రాగి, కంచు, నిక్కల్, వగైరా) 2 లక్షల నాణాలు సేకరించడం జరిగింది. మౌర్య, మౌర్యులకు పూర్వం, ఆంధ్ర శాతవాహన కాలం నుంచి ఆసఫ్‌జాహి వరకుగల దక్షిణ భారత నాణాలను సేకరించారు. (ఈ సేకరణకు సంబంధించిన నాణాల కేటలాగుల సిరీస్ వివరాలు liii వ పేజీలో చూడవచ్చును)

## అజంతా పెవిలియన్ (మ్యూజియం)

రాష్ట్ర మ్యూజియానికి అనుబంధంగా అజంతా పెవిలియన్ నెలకొల్పబడింది. హైదరాబాదులోని పబ్లిక్‌గార్డెన్‌లో హెల్త్ మ్యూజియంకు ఎదురుగావుంది. అజంతా ఎల్లోరా గుహలలో చిత్రాల ప్రతిరూపాల పెయింటింగులను యీ పెవిలియన్‌లో వుంచడం జరిగింది. యీ పెవిలియన్‌చాలా ప్రసిద్ధి కెక్కింది. దేశవిదేశాల ప్రముఖులందరూ యీ పెవిలియన్‌ను దర్శించారు. యీ ప్రదర్శనలలోని అజంతా, ఎల్లోరా ప్రతిరూపాలను చూచినవారెంతో మెచ్చుకున్నారు.

## ఏలేశ్వరం పెవిలియన్ (అనుబంధ మ్యూజియం)

యీశాఖ కార్యాలయం ఆవరణలోని రేకులషెడ్‌లో ఇతర వస్తువులతోపాటు ముఖ్యమైన పురాతన వస్తువులను కూడా కలగా పులగంగా పడవేసి వుంచారు. యీ రేకులషెడ్ ఆకృతిని సుందరంగా ఉంచటానికి వీలుగా రాతి ప్యానల్స్‌ను నిర్మించి, చుట్టూ అద్దాలను అమర్చి పునర్నిర్మించారు. ఇనుపకంబాలను అజంతా స్తంభాలమాదిరిగా అలంకరించడం జరిగింది. షో కేసులను ఏర్పాటుచేసి, ఏలేశ్వరం త్రవ్వకాలలో లభించిన పురాతన వస్తువులను సక్రమంగా ఉంచడం జరిగింది. విద్యుచ్ఛక్తి ఏర్పాట్లను కూడా అభివృద్ధి చేశారు. ఇప్పుడు అన్ని వస్తువులను సక్రమంగా అమర్చడం జరిగింది. విజిటర్లు అన్నివస్తువులను సావకాశంగా చూడవచ్చు. ముందుభాగంలో ఒక ఉద్యానవనాన్నికూడా వేశారు. ప్రక్కగోడలను సుందరంగా అలంకరించి ఆగ్రాలోని అహెమద్‌దౌలా జాలీల మాదిరిగా చేశారు. ప్రవేశద్వారంవద్ద రాతితో మలచిన మకరతోరణంగల కమాన్‌కూడ అమర్చారు.

## ఖజానాభవనం (అనుబంధ మ్యూజియం)

కుతుబ్‌షాహి కాలంలో యీ భవనాన్ని నిర్మించారు. ఆకాలంలో బహుశా దీనిని టంకశాలగా ఉపయోగించారనుకోవచ్చు. ఆ తర్వాత దీనిని మ్యూజియంగా మార్చడం జరిగింది. రాష్ట్రంలోని వివిధ ప్రదేశాలలో లభించిన మధ్యయుగానికి చెందిన శిల్పాలను ఇందులో ఉంచారు. ఇందులో కొన్నిశిల్పాలు శిల్పుల ప్రతిభను చాటుతాయి. యీ శిల్పాలకుతోడు ఏలేశ్వరం, ఇతర ప్రాంతాలలో లభించిన శాసనాలను కూడా ఇందులో ఉంచారు. ఆంధ్రదేశ చరిత్రకు సంబంధించిన ముఖ్యవిషయాలు వీటిద్వారా తెలుస్తాయి.

# ఆంధ్రప్రదేశ్ ప్రాచీన పత్రాలు, వాటి పరిశోధన

ఆర్. యం. వి. రాఘవేంద్రరావు

వ్రాత నేర్వడంతో మానవుడు నాగరికతా సౌధంలో మొదటిమెట్టు నెక్కాడు. వ్రాయడమనేది మానవుని ఆలోచనను ప్రత్యక్షంగా చూపడమన్నమాట. అందువల్ల వ్రాత - అది ఏరూపంలోవున్నా 'రికార్డు' అనబడుతుంది. పుస్తకాలు, వ్రాతప్రతులు, కాగితాలు, పటాలు మొదలైనవన్నీ రికార్డులక్రిందికి వస్తాయి.

రికార్డులను వ్యక్తులు తయారుచేయవచ్చు; లేదా కుటుంబాలు, సంస్థలు, ప్రభుత్వాలు తయారుచేయవచ్చు. అట్టి రికార్డులు విషయాలు, సంఘటనలు, అభిప్రాయాలు, సిద్ధాంతాలు, ఆలోచనలను భద్రపరుస్తాయి. రికార్డులు తయారుచేసే సాధనాలలో ప్రభుత్వం లేక రాష్ట్రం ముఖ్యమైనది. ప్రభుత్వ కార్యకలాపాలు సాధారణంగా జీవితంలోని అన్ని కార్యకలాపాలకు వర్తిస్తాయి. కాబట్టి ప్రభుత్వ రికార్డులకు ఎంతో ప్రాముఖ్యంవుంది.

'రికార్డు' అనేపదం ప్రభుత్వానికి సంబంధించిన రికార్డులకు వాడటం పూర్తిగా సమర్థనీయంకాదు. ప్రభుత్వ విధులు అనేక శాఖలచే దశలవారీగా నిర్వహింపబడటం వల్ల ప్రభుత్వ రికార్డులు వివిధ కార్యకలాపాలలోని భిన్నదశలను తెలియజేస్తాయి. అందుచేత అలాంటివాటికి 'ఆర్కైవ్స్' అన్నపదం బాగా వర్తిస్తుంది.

'ఆర్కైవ్స్' పదం గ్రీకునుండి ఆవిర్భవించింది. 'ఆర్కే' అనే పదం నుండి యిది వచ్చింది. 'ఆర్కే' అనగా అధికారయుతమైన అర్థంవస్తుంది. అందుచేత 'ఆర్కైవ్స్' అనేసరికి ఆఫీసు ప్రాముఖ్యం గలదని భావించవచ్చు.

ప్రాచీనపత్ర శాస్త్రంలో నిపుణుడైన శ్రీ హిల్లరీ 'జెంకింసన్' ప్రకారం ఈ ప్రాచీన పత్రాలు ప్రభుత్వంచేగాని ప్రైవేటు వ్యక్తులచే గాని ఒకపనికోసం వ్రాయబడి తమ తరువాతవారికోసం భద్రపరచబడి వారిదగ్గరనే వుంచబడేది.

ఒకరు తయారుచేసిన పత్రాలను మరొకరు తయారుచేసిన పత్రాలతో జతపరచరాదు. ఒక ప్రత్యేక పనికోసం తయారుచేయబడినట్లు తగిన ఆధారం లభించాలి.

ప్రభుత్వ పత్రాలవల్లలేదా రాష్ట్రపత్రాలవల్ల ఈ క్రింది ప్రయోజనాలు కల్గుతాయి :-

(1) పరిపాలనా విభాగంచూచే శాఖలకు ఒక నిర్ణయం ఏదృష్ట్యా తీసికొన్నది లేదా ఒక విషయానికి వెనుకనున్న చరిత్ర వీటివల్ల తెలుస్తుంది.

(2) ప్రభుత్వ కార్యకలాపాలలోని ప్రతి అంశానికి కావలసిన ఆర్థిక, సాంఘిక విధానం పత్రాల పరిశీలనవల్ల తెలుస్తుంది.

(3) మన న్యాయసంబంధమైన అంశాలన్నింటికీ కావలసిన సమాచారం వీటిద్వారా లభిస్తుంది.

(4) చరిత్రకు సంబంధించిన రాజకీయ, సాంఘిక, ఆర్థిక, సాంస్కృతిక సమాచార మంతా వీటినుండి పొందవచ్చు.

ప్రాచీన పత్రాలు ముఖ్యంగా రెండు విధాల ఉపయోగమైనవి. మొదటిది పరిపాలనకు అనేక విధాలుగా ఉపకరించడం. చరిత్రకారునకు కావలసిన సమాచారాన్నంతా అందజేస్తారు. జాతిస్వరూపాన్ని రూపొందించడంలో చరిత్ర మూలాధారం కాగా అందుకు కావలసిన ముడిపదార్థాన్ని ప్రాచీన పత్రాలు అందజేస్తాయి.

చారిత్రక రికార్డుల సేకరణలో ఉత్సాహంగల అనేక ప్రైవేటు సంస్థలు ఆంధ్రప్రదేశ్‌లో వున్నాయి. వ్రాతప్రతులు, విడిపత్రాలు, తాటాకులు, రాగిమీద వ్రాసినవి యిందులోకొన్ని. అలాంటి వాటిని గట్టిగా ప్రాచీన పత్రాలని చెప్పలేము. యూనివర్సిటీలు ఈ సేకరణకు బాగా తోడ్పడి పరిశోధనలు జరుపవచ్చు.

రాష్ట్ర ప్రాచీన పత్రాలలో చరిత్రకు సంబంధించిన అధికార సమాచారం తగినంతగావుంది. హైదరాబాదులోగల రాష్ట్ర ప్రభుత్వ ప్రాచీన పత్రశాఖలో వివిధ రకాలకు చెందిన రికార్డులు వున్నాయి. పరిశోధనావకాశాలను పెంపొందించేటందుకు కావలసిన ప్రయత్నం అచట జరుగుతోంది.

రాష్ట్ర ప్రాచీన పత్రశాఖలో నిపుణుల పర్యవేక్షణక్రింద ప్రత్యేకంగా పరిశోధనా విభాగం పనిచేస్తోంది. కావలసిన రికార్డులను సులభంగా పొందవచ్చు. 1900 కు పూర్వపు రికార్డులన్నీ పరిశోధన జరిపే వారికి అందుబాటులో వుంచబడినవి. 1900కు తరువాత రికార్డుల విషయంలో రాష్ట్రపురా వస్తుశాఖ డైరెక్టరు అనుమతి పొందవలసి వుంది.

ఈ వసతులను యూనివర్సిటీలు, ప్రభుత్వశాఖలు, ప్రైవేటు సంస్థలలో పని చేసే వారు వినియోగించుకొంటున్నారు. పరిశోధన శాఖలో కావలసినపుడు చూసేటందుకు చాలా సమాచారం వుంచబడింది. ప్రత్యేక పటాలు, క్యాటలాగులు మున్నగునవి కూడ లభ్యమౌతాయి.

చరిత్ర, తదితర విషయాలకు సంబంధించిన అనేక పుస్తకాలుగల లైబ్రరీకూడ వుంది. ఇంగ్లీషు పుస్తకాలు అత్యధిక సంఖ్యలోవున్నాయి. ఉర్దూ, మరాఠీ, ఫ్రెంచి, కొద్ది తెలుగు పుస్తకాలుకూడ వున్నాయి. పర్షియన్, ఉర్దూ మూల వ్రాతప్రతులు సేకరించబడ్డాయి. వాటిలో కొన్ని చాల అరుదుగా మాత్రమే దొరుకుతాయి.

ఫొటోలకు సంబంధించిన విభాగంలో ప్రభుత్వం ఆమోదించిన పత్రాల నకళ్ళను తగిన ధర చెల్లించి పొందవచ్చు.

గత కొద్ది సంవత్సరాలలో అనేక పర్షియన్, మరాఠి, పుస్తకాలు ప్రచురింపబడ్డాయి. ఆంగ్లంలో వీటి సంగ్రహ చరిత్ర, వివరణలుకూడ చేర్చబడినవి. రాష్ట్ర ప్రాచీనపత్ర శాఖలోని ప్రచురణల జాబితా ఈ క్రింద యివ్వబడింది.

## పర్షియన్ ప్రచురణలు

(1) "కితాబ్-ఎ-దఫ్తర్ వా మలావా ముల్కీ":- భూములు, ధనం మంజూరుకు సంబంధించిన ప్రాచీన పత్రాలనుగూర్చి ఇందులో వ్రాయబడింది.

(2) షాజహాన్ పరిపాలనకు సంబంధించిన కొన్ని పత్రాలు:- ఔరంగజీబు యాజమాన్యాన దక్కను మొగలాయీల నాల్గు సుభాలకు సంబంధించిన వివిధ పత్రాలు ఇందులో తెలియజేయబడ్డాయి.

(3) దక్కను వార్తావళి:- (1660-1671) ఎన్నిక చేయబడిన వార్తలేఖలు, దైనందిన వార్తలు ఇందులో చేర్చబడ్డాయి. ఔరంగజీబు పరిపాలననాటి సాంఘిక, రాజకీయ, ఆర్థిక పరిస్థితులు వివరంగా వున్నాయి. ఆంగ్లంలో వివరణగాకూడ వుంది.

(4) హైదరాబాదు వంశావళి:- (1720-1819 A. D) పర్షియన్ మూలం నుండి ఆంగ్లంలోనికి తర్జుమా చేయబడింది. హైదరాబాదు నిజాములు, ప్రధానమంత్రులు, తదితర ప్రముఖుల వంశవృక్షం పేర్కొనబడింది. ఆనాటి దర్బారులు, రాజలాంఛనాలు, సాంఘిక, ఆర్థిక పరిస్థితులేగాక రాజకీయ విషయాలుకూడ వివరింపబడ్డాయి.

(5) నిజాం అలీఖాన్ పరిపాలన వార్తాలేఖలు:- (1767 to 1799 A. D ఆ కాలంలోవున్న సాధారణ పరిస్థితులు, రాజకీయ సంఘటనలు వివరింప బడ్డాయి.

(6) నిజాం అలీఖాన్, గవర్నరు జనరల్ తదితరుల మధ్య దౌత్య ఉత్తర ప్రత్యుత్తరాలు:-(1780-1798A.D) భారతదేశపు రాజులు, ముఖ్యంగా నిజాంపట్ల బ్రిటిష్ ప్రభుత్వం అవలంభించిన తటస్థ విధానంపట్ల కల్గిన వైఖరి ఇందు చర్చించబడింది. పర్షియన్ మూలంనుండి ఆంగ్లంలోనికి తర్జుమా చేయబడింది.

(7) ఔరంగజీబు పరిపాలనలో ఎన్నిక చేయబడిన పత్రాలు:- (1659-1709 A.D) పర్షియన్‌లో వ్రాయబడి ఆంగ్లంలో పాఠాంశం ఇవ్వబడింది. సైనిక సమాచారం, సైనిక గౌరవ ప్రదానాలు, గోల్కొండ ముట్టడి మొదలైన విషయాలు ఇందులో వున్నాయి.

## మరాఠీ ప్రచురణలు

(1) 'సన్‌పూరీ బఖర్':- ఇది మరాఠీ పత్రిక. 1689 నుండి మరాఠీ చరిత్ర ఇందులో చర్చించబడింది. హైదరాబాదు నిజాముతో మరాఠీలకుగల సంబంధాలుకూడ వ్రాయబడినవి. నవాబ్ నిజాం అలీఖాన్ బహదూర్ (రెండవ అసఫ్‌ఝా) పేష్వా రెండవ మాధవరావుకుబహుమతులు, ఆభరణాలు పంపినట్లు పేర్కొనబడింది. వ్రాసినవాటిలో అదే ఆఖరి చారిత్రిక సంఘటన. రచయిత ఎవరో తెలియదు. విషయం ఆంగ్లంలోకూడ సంగ్రహంగా వ్రాయబడింది.

(2) పూనా అక్బారులు (మొదటి సంపుటి):- 1773-1781 మధ్య కాలంలో 98 వార్తాలేఖల సంకలనమిది. మరాఠాకోర్టులోను, పురందర్, పూనామొదలైనచోట్ల జరిగిన ప్రముఖ సంఘటనలు పేర్కొనబడినవి. ఆనాటి సాంఘిక చరిత్రకు సంబంధించిన అంశాలు కూడా వున్నాయి.

(3) పూనా అక్బారులు (రెండవ సంపుటి) :– దీనిలో 64 వార్తా లేఖలకు సంబంధించిన విషయాలున్నాయి.

(4) పూనా అక్బారులు (3వ సంపుటి):– 61 వార్తా లేఖల అంశాలు ఇందులో చర్చించబడ్డాయి.

ఆంధ్రప్రదేశ్ చరిత్ర, రాష్ట్రంలో ప్రాచీన పత్రశాఖ అభివృద్ధి, వివిధరకాల రికార్డులు, పరిశోధనావకాశాలు మున్నగు విషయాలపై, రాష్ట్ర ప్రాచీనపత్రశాఖ ప్రచురణలను తయారు చేస్తున్నది.

రాష్ట్ర పురావస్తు శాఖలో వుంచబడిన రికార్డులలో ముఖ్య తరగతులివి :–

(1) పర్షియన్, అరబిక్, ఉర్దూమూలంలో కూర్చబడిన వ్రాతప్రతులు, వీటి సంఖ్య 574. వాటిలో ముఖ్యంగా చారిత్రక, సాహిత్య అంశాలు పేర్కొనబడినవి.

(2) రాష్ట్ర పురావస్తుశాఖ కుటుంబాల నుండి సేకరించిన గంగఖేడ్, సాలార్‌జంగ్ మున్నగు కుటుంబ పత్రాలు.

(3) వ్యక్తులకు సంబంధించిన పర్షియన్ పత్రాలు. ఇవి క్రమపద్ధతినిలేవు. సుమారు 100 వరకు వున్నాయి. బహ్మనీలు, కుతుబ్‌షాహీలు, ఆదిల్‌షాహీలు, మొగలులు, నిజాముల ఫర్మానాలకు సంబంధించిన విషయాలు అందులో వున్నాయి.

(4) ఆఫీసులకు సంబంధించిన పత్రాలు. పూర్వం ఆఫీసులలో పనిచేసిన వారి వారసులనుండి సేకరించబడినవి.

(5) 1853లో సాలార్‌జంగ్ సంస్కరణల తరువాత హైదరాబాదు రాష్ట్రానికి సంబంధించిన సచివాలయం, ఇతర శాఖలకు సంబంధించిన రికార్డులు. 1853–1931 మధ్యకాలానికి సంబంధించినవి.

(6) అవిభక్త మద్రాసు రాష్ట్రంలో 1920 నుండి 1952 వరకు ఆంధ్ర జిల్లాలకు సంబంధించిన సచివాలయ రికార్డులు. 1947 ఆగష్టు 15 నుండి 1952 వరకు మద్రాసు, ఆంధ్ర రాష్ట్రాలకు సంబంధించిన రికార్డుల నకళ్లుకూడ వున్నాయి.

పర్షియన్, మారాఠీ భాషలలో మధ్యకాలపు దక్కను చారిత్రక రికార్డులు, అసాఫియా, మొగల్, తదితర రాజులకు సంబంధించిన అనేక రికార్డులు రాష్ట్ర చరిత్రలోని వివిధ అంశాలపై విశేషమైన సమాచారాన్ని అందజేస్తాయి.

రికార్డులనుండి రాజకీయ, రాజ్యాంగాలకు సంబంధించిన ఈ క్రింది విషయాలు తెలుస్తాయి.

మొగల్, ఆసఫ్‌జాహీల కాలంలోని ప్రభుత్వ స్వరూపం, భూములు, ఇనాములు, జాగీరులు మొదలైనవి మంజూరు చేయడం, పాలకులు, అధికారులు, చిన్న ఉద్యోగినుండి ప్రధానమంత్రివరకు బదిలీ, నిర్మూలన విషయాలు, సైనికులపై పాలకుల ఆధిపత్యం, ఆసఫియా సామ్రాజ్యంలోని వివిధ దశలు రికార్డులనుబట్టి తెలిసికొనవచ్చును.

గంగఖేడ్‌రాణి సీతాబాయ్ సాహెబ నుండి సేకరించిన గంగఖేడ్ పత్రం చాల ముఖ్యమైనది. పేష్వాల పరిపాలనకు సంబంధించిన అనేకఅంశాలు ఇందులో వున్నాయి. ఈ పత్రాలలో చాల భాగం మరాఠీబాషలో (మోడీలిపి) వ్రాయబడినవి. వార్తాలేఖలు, దౌత్య ఉత్తర ప్రత్యుత్తరాలు రాజకీయ అంశాలు, సంధులు, కార్యక్రమాలు, దినచర్యలు, సైనిక విషయాలు మొదలైనవి వీటిలో పేర్కొనబడినవి.

గంగఖేడ్ పత్రాలలోని పర్షియన్ ప్రతులుకూడ మరాఠీ పత్రాలవలెనే వున్నాయి. మరాఠీ చరిత్రలోని అంతిమదశలో నిజామ్–మరాఠీలమధ్యగల సంబంధాలు వివరింపబడినవి.

హిందీ పద్యాలు, సంస్కృతంలో సాహిత్యానికి సంబంధించిన వ్రాత పతులుకూడ వున్నాయి.

1956 లో పురావస్తుశాఖ సేకరించిన సాలార్‌జంగ్ పత్రాలలో 1853 నుండి 1883 వరకు హైదరాబాద్ ప్రధానమంత్రిగా వున్న సాలార్‌జంగ్ కాలంలోని రాష్ట్ర, కుటుంబ విషయాలు పేర్కొనబడినవి. వీటిలో ఆసఫ్‌జాహీ పాలనకు సంబంధించిన కాగితాలు, గవర్నరు జనరలు, బ్రిటిష్ ప్రభుత్వం, హైదరాబాదు రాష్ట్రానికిచెందిన ప్రముఖులకు వ్రాసిన లేఖలుకూడవున్నాయి. ఆనాటి అధికార భాష అయిన పర్షియన్‌లోనే ఎక్కువ పత్రాలు వ్రాయబడ్డాయి. బీరారు విషయంలో సాలార్‌జంగ్, బ్రిటిష్‌పాలకులు, బ్రిటిష్ పార్లమెంటు సభ్యులమధ్య జరిగినఉత్తరప్రత్యుత్తరాలు ఉర్దూ, ఇంగ్లీషు భాషలలో వున్నవి. భారత దేశంలోగల ఫ్రెంచివారితో ఇంగ్లీషువారి సంబంధాలు, హైదరాబాదు, మైసూరు, కర్నాటక – మరాఠీలమధ్య సంధులు, టిప్పుసుల్తానుతో గల సంబంధం, రిసెడెంట్ల నియామకం, హైదరాబాదు సైన్యం మొదలైన అనేక ముఖ్య చారిత్రక విషయాలు ఉదహరింపబడ్డాయి.

1902–47 మధ్య పూర్వపు నిజాం, ఇప్పటి నిజాముల ఫర్మానాలకు సంబం

# ర చ యి త లు

శ్రీ లంకపల్లి బుల్లయ్య, జాయింట్ డైరెక్టర్, విద్యాశాఖ ఆంధ్రప్రదేశ్.

శ్రీ కె. రంగారెడ్డి, స్టాటిస్టికల్ ఆఫీసర్ డైరెక్టరేట్ – పబ్లిక్ ఇన్‌స్ట్రక్షన్స్, హైదరాబాదు.

శ్రీ ఆర్. విశ్వనాధరావు, ఆర్చివిస్టు, స్టేట్ ఆర్చివ్స్, హైదరాబాదు.

శ్రీ ఎ. ఎన్. దాజి, అసిస్టెంటు డైరెక్టరు, స్టేట్ ఆర్చివ్స్, హైదరాబాదు.

శ్రీ హెచ్. ఎ. హసన్మి, బి. ఎ., యల్‌యల్. బి. ఆర్చివిస్ట్, స్టేట్ ఆర్చీవ్స్, హైదరాబాద్.

శ్రీ బి. వెంకటరమణప్ప, బి. ఎ., బి. యిడి, సెక్రటరీ, బోర్డ్ ఆఫ్ సెకండరీ ఎడ్యుకేషన్, హైదరాబాద్.

శ్రీ కె. రాఘవరెడ్డి, బి. ఎ., బి. యస్‌సి., బి. యల్. డిప్లొమా ఎడ్యు (లీడ్స్) డి. యల్. యస్‌సి, డిప్యూటీ డైరెక్టర్ ఆఫ్ పబ్లిక్ లైబ్రరీస్, హైదరాబాద్.

శ్రీ అబ్దుల్ మూయీద్ ఖాన్, పి. హెచ్‌డి. (కెంటబ్) డి.లిట్ (కైరో) ప్రొఫెసర్, హెడ్ ఆఫ్ అరబిక్ డిపార్ట్‌మెంట్ ఉస్మానియా యూనివర్శిటీ, హైదరాబాద్.

శ్రీ అబ్దుల్ వహీద్ ఖాద్, డైరెక్టర్ ఆర్క్యాలజీ డిపార్ట్‌మెంట్ హైద్రాబాద్.

శ్రీ ఆర్. యం. వి. రాఘవేంద్రరావు, ఆర్చివిస్టు, స్టేట్ ఆర్చివ్స్, హైదరాబాద్.

---

ధించిన పత్రాలుకూడ సేకరించబడినవి. ఆ కాలంలోని రాజకీయ, పరిపాలన విషయాలకు సంబంధించిన అనేక అంశాలపై సమాచారం వీటిలో వుంది. రాష్ట్ర పరిపాలనా పద్ధతి, సుభాలు, జిల్లాలు, తాలూకాల విభజన, ఆదాయ వ్యయాలు, వివిధ రకాల నాణాలు వాటి మారకపు విలువ, ముద్రణాలయాలు, వస్తువుల ధరలు, వాటిని క్రమబద్ధంచేయడం, తూకాలు-కొలతలు, శాంతి భద్రతలను ఉల్లంఘించిన వారికి శిక్ష, జిల్లాలు, గ్రామాలలో సారవంతమైన భూముల విస్తీర్ణం, సాగు, బంజరుభూముల విస్తీర్ణం, నీటిసాగు వివరాలు, ప్రజల వృత్తులు మొదలైన ప్రధానాంశాలు పేర్కొనబడ్డాయి.

ఇక అప్పటి చరిత్రలోని సాంఘిక, సాంస్కృతిక విషయాలలో దక్కనుప్రజల సాంఘికాచారాలు మొగల్, ఆసఫ్‌జాహీ కాలంలోని రికార్డులలో ఉదహరింపబడినవి. అప్పటి దర్బారులు, విందులు, వినోదాలు, వేట, బహుమతులు, పాలకులు, సైనిక సిబ్బంది ధరించే దుస్తులు, ఊరేగింపులు మున్నగునవి కూడ వర్ణింపబడ్డాయి.

ప్రాచీన పత్రాలు ఒక జాతియొక్క గత చరిత్ర, సాంప్రదాయాలను తెలుపడమేగాక ప్రజల భవిష్యత్తును సరైన పద్ధతిని తీర్చి దిద్దుకోవడానికి కూడ తోడ్పడగలవు. ★

## ర చ యి త ల కు మ న వి

నేటి అత్యవసర పరిస్థితిని పురస్కరించుకొని ఉదాత్తస్థాయిలో మౌలికమైన ఉత్తమ నాటికలు-కథానికలు 'ఆంధ్రప్రదేశ్' లో ప్రచురణార్థం పంపవలసిందిగా రచయితలకు విజ్ఞప్తి చేస్తున్నాము. ప్రచురితమైన ప్రతి రచనకూ తగు పారితోషికం యివ్వడం జరుగుతుంది. —ఎడిటర్ (తెలుగు)

Statement about ownership and other particulars about newspaper "Andhra Pradesh" to be published in the first issue every year after the last day of February

FORM - IV

(See rule 8)

| | | | |
|---|---|---|---|
| 1 | Place of publication | .. | Hyderabad |
| 2 | Periodicity of the Publication | | Monthly |
| *3 | Printer's name | .. | Sri A. Sudhakar Rao |
| | Nationality | | Indian |
| | Address | | 5-9-88, Public Garden Road, Hyderabad-1 |
| 4 | Publisher's Name | . | Director of Information & Public Relations |
| | Nationality | | Indian |
| | Address | | Mukarramjahi Road, Hyderabad |
| 5 | Editor's name | | Narendra Luther, IAS |
| | Nationality | | Indian |
| | Address | | Director of Information & Public Relations, Hyderabad |
| 6. | Name and addresses of Individuals who own the Newspaper and partners or share holders holding more than one percent of total Capital | | |

I, Narendra Luther, Director of Information & Public Relations of Andhra Pradesh, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

**Sd/- Narendra Luther**
*Signature of Publisher*

---

* The Director, Government Printing Press, Hyderabad-24 is the official printer but he may name any other printer when the Government Press cannot undertake printing of this Journal

Edited & Published by the Director of Information and Public Relations, Andhra Pradesh, Hyderabad-1
Printed at Yuva Press, Public Garden Road, Hyderabad

# ఆంధ్రప్రదేశ్

| | | |
|---|---|---|
| విస్తీర్ణం | ... | 1,05,858 చదరపు మైళ్లు. |
| జిల్లాలు | ... | 20 |
| తాలూకాలు | ... | 189 |
| 20 వేలు, అంతకుమించిన జనాభాగల పట్టణాలు, నగరాలు | ... | 223 |
| గ్రామాలు | ... | 28,997 |
| పూర్తి జనాభా (1961) | ... | 359.78 లక్షలు |
| జన సాంద్రత | ... | ఒక చదరపుమైలుకు 339 |
| అక్షరాస్యులు (1961) | ... | 74.90 లక్షలు |
| నికర సాగుభూమి (1959-60) | ... | 10,889,000 హెక్టర్లు |
| పశువులు (1961) | ... | 327 లక్షలు |
| నమోదైన ఫ్యాక్టరీలు (1959) | ... | 4083 |
| విద్యుదుత్పాదన (1961) | ... | 1,026.072 మిలియన్ కె డబ్ల్యు హెచ్ |
| విద్యుత్ సౌకర్యాలుగల పట్టణాలు, గ్రామాలు (1961-62) | ... | 4084 |
| విశ్వవిద్యాలయాలు | ... | 3 |
| కళాశాలలు (1960-61) | ... | 119 |
| ఉన్నత పాఠశాలలు (1960-61) | ... | 1224 |
| వృత్తివిద్యా పాఠశాలలు | ... | 431 |
| పంచాయతీలు (1959-60) | ... | 14,552 |
| అభివృద్ధి మండలాలు (1-4-1962 నాటికి) | ... | 378 |
| 1960-61 లో అప్పటి ధరలనుబట్టి రాష్ట్రాదాయం అంచనా | ... | రూ. 1007.51 కోట్లు |
| పార్లమెంటు సభ్యులు | ... | 61 |
| శాసన సభ సభ్యులు | ... | 301 |
| శాసన మండలి సభ్యులు | ... | 90 |

